# ప్రాచీనాంధ్ర
# చారిత్రక భూగోళము



రచయిత
కుందూరి ఈశ్వరదత్తు బి. ఎ.,




ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి
కళాభవన్, సైఫాబాద్, హైదరాబాదు-500004.

PRACHEENANDHRA CHARITHRAKA BHOOGOLAMU.
(Ancient Historical Geography of Andhra)
An identification and demarcation of the ancient geographical and administrative divisions of Andhra Pradesh
by Kunduri Iswara Dutt

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, హైద్రాబాదు-500004.

ప్రచురణ : 295.

ప్రథమ ముద్రణ - జనవరి 1963 - 1,000.

ద్వితీయ ముద్రణ - అక్టోబరు, 1979, ప్రతులు 2,000.

వెల. రూ॥ 12-00

ప్రతులకు.
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి,
కళాభవన్, సైఫాబాద్, హైదరాబాదు - 500004.

ముద్రణ.
తరణి ప్రెస్,
సికిందరాబాదు.

---

Paper used for the printing of this book was made available by the Government of India at concessional rate.

# ద్వితీయ ముద్రణ తొలిపలుకు

కీర్తిశేషులైన శ్రీ కుందూరి ఈశ్వరదత్తుగారు, సుప్రసిద్ధ రచయితలు. ప్రామాణికులైన చారిత్రికులు. దాదాపు నాల్గు దశాబ్దాలు ఆయన తమ అరుదైన వైదుష్యంతో పరిశోధనా పటిమతో, తెలుగు పఠితృలోకానికి ఆదరపాత్రులైనారు. ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము ఆయన బహుముఖీన ప్రజ్ఞాపాటవాలకు ప్రతీక. ఆంధ్రచరిత్రకారులు, ఆంధ్రేతరులైన చరిత్రకారులు వ్రాసిన ప్రామాణిక గ్రంథాలను, పురాణేతిహాసాలను, తెలుగుదేశములోని శాసనాలను, పరిశీలించి శ్రీ ఈశ్వరదత్తుగారు ఈ గ్రంథరచనకు పూనుకున్నారు. ఆంధ్రేతిహాసాన్ని, తలస్పర్శిగా అవగాహన చేసుకోవడానికి తెలుగు చరిత్రలో తారసిల్లే నాడులను, నదులను, కొండలను, నగరాలను, గ్రామాలను విశేషించి ఇప్పుడు మృగ్యమైపోయిన వాటిని ఆయన ఎంతో పరిశ్రమకోర్చి సప్రమాణంగా వివరించడానికి ప్రయత్నించినారు. ఆంధ్రేతిహాస మణిహారంలో విడిపోయి కనుమరుగైన మణివంటిది ఈ గ్రంథం. ఈ గ్రంథాధ్యయనం చేయనిదే ఆంధ్రేతిహాసం విశదంగా బోధపడదు. సమగ్రం కాదు. చరిత్రకు సంబంధించిన వివరణాత్మకమైన నిఘంటు వన్నను అత్యుక్తి కాదు. సాహిత్య ఇతిహాస పరిశోధకులకు ఈ గ్రంథం కరదీపిక.

తొలిముద్రణ వేయిప్రతులను తెలుగుపాఠకులు సమాదరంతో అందుకొని, రెండవముద్రణకు అనువైన అవకాశాలను కలిగించినారు. ఇంత ప్రామాణిక గ్రంథాన్ని రెండవసారి ముద్రించ గలుగుతున్నందుకు అకాడమీకి ఎంతో సంతోషంగా ఉన్నది.

శ్రీ కుందూరి ఈశ్వరదత్తుగారు ఈ ఉత్తమ గ్రంథాన్ని ప్రచురించే అవకాశం ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీకి కల్పించినందుకు వారికి మా కృతజ్ఞతాభివందనాలు.

హైదరాబాదు
1-10-1979

ఇరివెంటి కృష్ణమూర్తి
కార్యదర్శి

# అంకితము...

జననిని మించిన దైవము లేదనియు, జనని జనకునకన్న దశగుణము లెక్కుడనియు నేర్చి, శ్రీ చిలుకూరి వంశ వననిధి లక్ష్మియు, వనితామతల్లియు, పతిదేవతా లలామయు, సుగుణ నికురంబయు నగు

**మాయమ్మ సుబ్బమాంబను దలచి**

షట్సహస్రకుల శీతమయూఖుడు, సాంఖ్యాయన గోత్ర సంభవుడు పితామహి పితామహులగు శేషమాంబా సూర్యనారాయణల పురాకృత పుణ్యతపః ఫలము, పూజ్యుడునగు

**మజ్జనకు నారాయణమూర్తిని గొలిచి**

ఆంధ్ర చారిత్ర చతురాననాంకితుడు, దండి చిలుకూరి వీరభద్రుడు మాతులుండని ప్రాభవము నెంచి, యీ కృతిని నా మాతాపితల కంకితము నిచ్చి, ధన్యుడనైతిని.

—కుందూరి ఈశ్వరదత్తు.

# FOREWORD...

Sri K. Isvara Dutt is a well-known writer, who needs no introduction to the Andhra Public. An erudite scholar, a discerning critic and a historian of rare merit, he acquired by his numerous publications, during the last three decades and more an important place in the realm of Telugu letters. Though by profession a government servant engaged in the fascinating pursuit of scrutinising ledger books in the Audit and Accounts Deparment, he could not resist the lure of history to which he devoted, in spite of his official duties, much of his time and enriched history and literature by his contributions. His publications are too well - known to need enumeration. In the present work, Sri Isvara Dutt has struck a new path in the field of historical research. A work on the ancient political geography of Andhra had been a desideratum for a long time. Though sporadic attempts have been made by scholars to identify and demarcate ancient geographical and administrative divisions in the ccuntry here and there in learned journals and periodicals, none has undertaken so far a systematic study of the subject. The credit for opening this fresh line of research belongs to Sri Isvara Dutt, who has patiently collected all the available information from the epigraphical and literary sources, examined it with scrupulous care, and embodied the results of his investigations in the present publication. It must, however, be kept in mind that it is neither exhaustive nor complete. This is as it should be. The epigraphical survey is far from complete. Large tracts of the country, known to contain inscriptions, have not yet been trodden by the epigraphists nor have all the inscriptions copied already by them been published yet, Under these circumstances the compilation of a complete and exhaustive work on the subject is hardly possible.

Nevertheless, the usefulness of the work to all engaged in the field of historical research cannot easily be overestimated.

The opening three chapters, which serve as an introduction to the book, are devoted to a description of the Puranic Geography of Bharata-khanda and Andhra and the administrative nomenclature that was in vogue in the latter under various dynasties that ruled over it. The mountains, rivers, tirthas, important towns and cities and the administrative divisions, hara, patha, rattha (Rashtra), vishaya, padi, rajya Etc., are dealt with in the main body of work in alphabetical order. The book is very well documented, and will serve as a valuable guide to researchers pursuing the same line of investigation.

Vidyanagar *N. Venkataramanaiah*

HYDERABAD.

# INTRODUCTION...

Though professionally, I grew at the desk and bore the stress and strain of the Audit and Accounts Department, I literally stole into the sacred precincts of Historical and Literary research, more than a quarter of a century ago. This was to run from frying pan to fire, but the work though taxing was more exhilarative. My ambition was to present to Andhra Public something new and original to the already existing contributions in the field by eminent Andhra Historians both in English and Telugu. My contributions were few and far between, but were oft-quoted. Having been inspired by the labours of the late lamented premier Andhra Historian Sri Ch. Veerabhadra Rao, my maternal uncle, and those of the equally eminent living Historians like Dr. N. Venkataramanaiah and Sri M. Somasekhara Sarma by their valuable, varied, and voluminous contributions, I determined to plough a new and uncultivated field of Historical Research. As a student I read the books by Cunningham, and Nandalal Dev on the Ancient Geography of India and then I contemplated to work at it with special reference to Andhra Pradesh. Presumably this is a work of its kind in Southern Languages.

The Ancient Historical Geography of Andhra in Telugu, the publication of which is kindly sponsored by the Andhra Pradesh Sahitya Akademy is the result of my humble endeavour from the last five years. This is in three parts. The first part deals with Puranic, Literary, and Physical Geography of Andhra and the influence of the Physical Geography on the History of Andhra Pradesh. The second part including the supplement contains the alphabetical list of many important Ancient Geographical Divisions. This list is more enumerative than exhaustive and many more items could have been brought into this part.

Evidence from the contemporary Sanskrit and Telugu Literatures in support of the various Divisions has been liberally utilised to give literary flesh and marrow to the dry bones of epigraphical authority. Many Sanskrit and Telugu poets have furnished descriptive accounts of the Historical Divisions in which they lived and laboured, or over which their patrons ruled of reigned. In fact the introductory portions of their works form an authoritative source of Andhra History. My sincere thanks are due to the President of the Andhra Pradesh Sahitya Akademy Dr. B. Gopala Reddi, and the Secretary Sri D. Ramanuja Rao and other members of the Executive Committee, who readily agreed to publish the work. In this connection I have to specially mention Dr. B. Ramaraju Reader in Telugu in the Osmania University and Sri Adiruaj Veerabhadra Rao Pantulu garu who took active interest from the beginning to get the work published by the Akademy.

I feel indebted to Dr. N. Venkataramanaiah the Doyen of of living Andhra Historians, the erstwhile Reader in Indian History and Archealogy of the Madras University, and the Assistant Editor, District Gazetteers, Andhra Pradesh, who readily agreed to write a foreword to the book, and there-by

hangs a tale behind it. The last but not the least, I must thank Sri N. S. Sundareswara Rao, who undertook the laborious task of proof-reading and helped me in giving a few fine touches here and there.

I thank also the Proprietors of Shivaji Press who have done a fine job in bringing out a decent edition.

GANDHINAGAR,
KAKINADA—1.
19—12—1962

*K. Iswara Dutt*

# తొలిపలుకు

కులదేవతలవోలె కొలువదగిన ఆంధ్ర, ఆంధ్రేతర, ఆంగ్ల, సనాతన అధునాతన ప్రాచ్య ప్రతీచీ చరిత్రకారులకు అంజలి యొనర్చి, నేనీ గ్రంథ రచనమును సలిపియున్నాను. కొండలవంటి ఆంధ్ర చారిత్రక పరిశోధక ప్రకాండులుండగా, తగుదునమ్మా, యని యీపని కేల పూనుకొంటివని యడిగినచో, కాళిదాసు రఘు వంశ కావ్య రచనా ప్రారంభమున చెప్పిన సమాధానమే నాకు శరణ్యము.

మన్దః కవియశః ప్రార్థీగమిష్యా మ్యుపహాస్యతామ్
ప్రాంశులభ్యే ఫలేలోభా దుద్బాహురివ వామనః॥

ఆంధ్ర చరిత్ర చతురాననుడును, మాతులుడును, కీర్తి శేషు డునగు శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారి యొక్కయు, సమకాలిక ఆంధ్ర చారిత్ర పరిశోధక శిఖామణులగు డాక్టరు నేలటూరి వేంకట రమణయ్యగారి యొక్కయు, శాసన పరిశోధక శేఖరులగు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి యొక్కయు, అమూల్యమును, అనేకమును, అపారమునగు రచనా ప్రాగల్భ్యమే ఉద్బోధకమై, నన్నీ గ్రంథ నిబంధమునకు బురికొల్పెను.

కన్నింగుహామ్, నందాలాల్ దేవ్, బి. సి. లా. పణిక్కర్ మొదలగువారు ఆంగ్లమున హైందవ చారిత్ర భూగోళముపై వ్రాసిన గ్రంథములను జదివి, వానిలో ఆంధ్రప్రదేశమునకు సంబంధించిన విషయమత్యల్పముగుటను గమనించి, ఆంధ్ర భాషలో ఆంధ్రప్రదేశమును గూర్చి యొక ప్రత్యేక గ్రంథ మొకటి వ్రాయ సమకట్టితిని. దాదాపు నైదేండ్ల పరిశ్రమ ఫలితమే యీ కృతి. దీనిలోని కొన్ని విషయములు రెండు మూడేండ్ల క్రిందట ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో బ్రకటితము లయ్యెను. ఈ వ్యాసములు ఉస్మానియా విశ్వవిద్యాలయ ఆంధ్రోపన్యాసకులైన డాక్టరు బిరుదురాజు రామరాజుగారు జదివి వీనినొక గ్రంథరూపముగా ప్రకటించిన బహుళ వ్యాప్తి నొందునని యెంచి, నా కోర్కెపై, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు గ్రంథమును బ్రకటించుటకు సహాయపడి కృతకృత్యులైరి. మరియు నా మేనమామ చిలుకూరి వీరభద్రరావునకు ఆప్తమిత్రులును, హైదరాబాదు లక్ష్మణరాయ పరిశోధక మండలి కార్యదర్శులు, పూజ్యులు పెద్దలును అయన శ్రీ ఆదిరాజు వీరభద్రరావు పంతులుగారు ప్రోత్సాహము నాకండదండ అయినది. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అధ్యక్షులు, భారత ప్రభుత్వ కేంద్ర సమాచార శాఖా మంత్రులునైన డాక్టరు బెజవాడ గోపాలరెడ్డిగారికిని కార్యనిర్వాహకులగు శ్రీ దేవులపల్లి రామానుజ రావుగారికిని, తదితర కార్యనిర్వాహక సభ్యులకును నా నమోవాకము ములు.

గ్రంథము సమగ్రముకాదు. ప్రమాదము పురుషలక్షణము. ఎన్నియో నూతన విషయములు దెలిసియు దెలియకయు, గ్రంథ విస్తర భీతిచే వదలివేసితిని. సాధ్యమైనంత వఱకు విషయములు సప్రమాణములుగ నొనరించితిని. ప్రాచీన సంస్కృతాంధ్ర కవులు వారి గ్రంథారంభమున వారి నివాసస్థానములు, వారి పోషకులు పాలించిన సీమలు రాజ్యములు వర్ణించిన విషయములు నిరివిగ నుదాహరించితిని. ఈ గ్రంథ రచనమునకు తోడ్పడిన గ్రంథ

కర్తల యొక్కయు, వారి గ్రంథముల యొక్కయు పట్టిక నిచ్చి యున్నాను. వారెల్లరకు వందనములు. నాకు ఒకటి రెండు విషయములు విశదీకరించుటకు సాయపడిన తెలుగు తెంక, అభినవ తిక్కన తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారికి నా నమస్కృతులు. గ్రంథమునకు పీఠిక వ్రాయ సమ్మతించిన డా. నేలటూరి వేంకటరమణయ్యగారికి కేలుమోడ్పు. గ్రంథ ముద్రణమునందు ప్రూఫ్‌లను జదివి, దిద్ది, వెతలనొందిన శ్రీ నిడుదవోలు శివసుందరేశ్వరరావునకు నా మనఃపూర్వకమైన ఆశీర్వచనములు.

గ్రంథమును సుందరముగా ముద్రించి వెల్వరించిన శ్రీ శివాజీ ముద్రణాలయమువారు ప్రశంసార్హులు.

కాకినాడ
21-12-1962

కుందూరి ఈశ్వరదత్తు

# BIBLIOGRAPHY

**Books Consulted :**


| | |
|---|---|
| *Altekar* | The Rashtrakutas and their times. |
| *Burgess* | Amaravati and Jaggayyapeta Stupas. |
| *B. C. Law* | 1. Historical Geography of Ancient India.<br>2. Geography of Early Buddhism.<br>3. India as described in early texts of Buddhism and Jainism.<br>4. Geographical Essays-1. |
| *Butterworth and Venugopala Chetti* | Inscriptions of Nellore District. |
| *Dubreil* | Ancient History of Deccan. |
| *Gopalachari* | Early History of Andhra Country. |
| *Krishnaswami Ayyanagar* | History of Tirupathi, 2 Volumes. |
| *Maclean* | Administration of Madras Presidency, 3 Volumes. |
| *Mecrindle* | Ancient India as described by Megasthanes. |
| *Nandalal Dev* | Geographical Dictionary of Ancient and Medieval India. |
| *Neelakanta Sastri* | 1. Cholas,<br>2. History of South India. |
| *Neelakanta Sastri and Venkataramanayya* | Further Sources of Vijayanagar History. |

| | |
|---|---|
| *Pannikar* | Geographical Factions in Indian History. |
| *Rice* | Mysore and Coorg from Inscriptions. |
| *Rangachari* | A topographical list of Inscriptions of Madras Presidency, 3 Volumes. |
| *Rangaswami Saraswati* | Sources of Vijayanagar History. |
| *Sarkar D. C.* | Successors of Satavahanas in the lower Deccan. |
| *Sewell* | Historical Inscriptions of South India. |
| *Somasekharasarma* | The History of Reddi Kingdoms. |
| *Subrahmanyam* | Buddhist Remains in the Andhra Country. |
| *Thomas Watters* | Yuan Chwang, Volume-II |
| *Venkataramanayya* | 1. Studies in the History of the Third Dynasty of Vijayanagar<br>2. Early Muslim expansion in South India.<br>3. Vijayanagar – Origin of the city and the Empire. |

# GENERAL REFERENCE BOOKS...

1. Journal of the Andhra Historical Research Society.
2. Journal of the Oriental Research.
3. Journal of the Bihar and Orissa Research Institute.
4. Journal of the Bhandarkar Institute.
5. Journal of the Royal Asiatic Society of Bombay.
6. District Gazetteers (Andhra Pradesh).
7. Imperial Gazetteers of India-Hyderabad.
8. Indian Antiquary Volumes.
9. Epigraphia Indica Volumes.
10. Epigraphia Carnatica Volumes.
11. South Indian inscriptions, Volumes.
12. Madras and Mysore Epigraphical Reports
13. Mysore Archaeological Reports.
14. Inscriptions of Tirupati Devasthanam and Report.
15. List of Villages in the Madras Presidency.
16. List of villagas in Hyderabad State.
17. Hyderabad Archaeological Series.
18. List of Manuscripts in the Oriental Library.
19. Triennial Catalogues of Telugu Manu-scripts.

ఆంధ్రుల చరిత్రము — చిలుకూరి వీరభద్రరావు.

1, 2, 3, 4, 5 సంపుటములు.

ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక - కాకినాడ.

భారతి - మదరాసు

తెలంగాణా శాసన సంపుటములు.

స్కాంద, బ్రహ్మాండ, మత్స్య, వామన, విష్ణు, మార్కండేయ

పురాణములు — (సంస్కృతము - ఆంధ్రము).

కుమారికా ఖండము — జనమంచి శేషాద్రిశర్మ.

కావ్యమీమాంస.

రామాయణ, మహాభారతములు (సంస్కృతము - ఆంధ్రము).

కళింగ సంచిక.

కాకతీయ సంచిక.

రెడ్డి సంచిక.

ఆంధ్ర కవితరంగిణీ సంపుటములు - శేషయ్య

ఆంధ్ర కవి చరిత్రము - వీరేశలింగము.

## ABBREVIATIONS...

| | |
|---|---|
| *I. A.* | Indian Antiquary. |
| *E. I.* | Epigraphia Indica. |
| *S. I. I.* | South Indian Incriptionss. |
| *M. E. R.* | Madras Epigraphical Reports. |
| *J. O. R.* | Journal of the Oriental Research. |
| *J. A. H. R. S.* | Journal of the Andhra Historical Research Society. |
| *E. C.* | Epigraphia Carnatica. |

# విషయసూచిక

## ప్రథమ భాగము



## ద్వితీయ భాగము


ఒరిస్సా
మధ్యప్రదేశ్
శ్రీకాకుళము
విశాఖపట్టణము
కాకినాడ
మచిలీపట్టణము
నెల్లూరు
మద్రాసు
కోరమాండల్ తీరము
బంగాళా ఖాతము
ఆంధ్ర ప్రదేశ్
నైసర్గిక స్వరూపము నదులు
గుట్టలు (2000-3000)
పీఠ భూమి (1000-2000)
మైదానము (0-1000)

# ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము

## ప్రథమ ప్రకరణము

### పురాణ భూగోళము

బ్రహ్మ, విష్ణు, వాయు, మార్కండేయ, వామన, బ్రహ్మాండ, స్కాందపురాణాదులగు అష్టాదశ పురాణముల లోను, రామాయణ, భారత, భాగవతములందును, భూగోళ విన్యాసమును గూర్చిన అధ్యాయములు గలవు. పురాణ రచనాకాలము నాటికి మనపూర్వులు భూమండల విస్తృతిని గూర్చి ప్రచురించిన పరిజ్ఞానము ప్రశంసనీయమైనది. ఇయ్యది ప్రతి భారతీయుని దినచర్యయందు నిబద్ధమై యున్నది. తన జన్మభూమి నిత్యనైమిత్తిక జీవనమందు జ్ఞప్తికి దెచ్చునట్లుగా

"జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే, దండకారణ్యే, కృష్ణా గోదావరీ మధ్యదేశే,...." అని వారివారి జన్మభూమిని స్మరణమును దెచ్చుచు సంకల్పము చెప్పబడుచున్నది.

"సప్తద్వీపావసుంధరా"

భూమండలమంతయు సప్తద్వీప పరివృతము

వాయుపురాణములో

మనోః స్వాయంభువస్యాఽఽసన్దశ పౌత్రాస్తు తత్సమాః
వైరియం పృథివీ సర్వా సప్తద్వీప సమన్వితా॥

అ. 33. శ్లో. 4.

అట్లే మార్కండేయ పురాణములో

ఏతేషాం పుత్రపౌత్రైస్తు సప్తద్వీపా వసుంధరా ।
ప్రియవ్రతస్య పుత్రైస్తు భుక్తాస్వాయంభువేఽన్తరే॥

అ. 53. శ్లో. 42

అని చెప్పబడినది.

ఆ సప్తద్వీపములేవి యనిన, జంబూ, ప్లక్ష, శాల్మల, కుశ, క్రౌంచ, శాక, పుష్కరములు. ఈ సప్తద్వీపముల బరివేష్టించి లవణ, ఇక్షు, సురా, సర్పి, దధి, దుగ్ధ, జల, సముద్రములేడు నొకటి కొకటి ద్విగుణ విస్తారములై యుండెను.

> ద్వీపాత్తు ద్విగుణో ద్వీపో జంబూః ప్లక్షోఽథ శాల్మలః
> కుశః క్రౌంచస్తథా శాకః పుష్కరద్వీప ఏవచ
> లవణేక్షు సురా సర్పి ర్దధి దుగ్ధ జలాబ్ధిభిః
> ద్విగుణై ర్ద్విగుణై ర్వృద్ధ్యా సర్వతః పరివేష్టితాః॥
> మార్కండేయ పురాణము. అ. 54. శ్లో. 7

జంబూ ద్వీపమునం దేడు కులపర్వతములు గలవు. అవి, హిమవంతము, హేమకూటము, నిషధము, మేరువు, నీలగిరి, శ్వేతాచలము, శృంగవంతము ననునవి.

> హిమవాన్ హేమకూటశ్చ ఋషభో మేరురేవచ ।
> నీలః శ్వేతస్తథా శృంగీ సప్తాస్మిన్ వర్షపర్వతాః॥
> మార్కండేయ పురాణము. అ. 54. శ్లో. 9

ఈ కుల పర్వతముల నంటుకొని తొమ్మిది వర్షములు గలవు. అవి యేవనగా ఇలావృత, భద్రాశ్వ, కేతుమాల, హరి, కింపురుష, రమ్యక, హిరణ్మయ, కురు, భరతవర్షములు.

## భరతవర్షము

భరతవర్షము తొమ్మిది ఖండములుగ విభజింప బడినది. వాని పేర్లు—ఇంద్ర, కేతుమంత, తామ్రవర్ణ గభస్తిమంత, నాగ, సౌమ్య గాంధర్వ, వారుణ, కుమారికాద్వీపము లు. ఈ నవఖండము లేవియను విషయమున పురాణములలో నభిప్రాయ భేదమున్నది.

భారతస్యాస్య వర్షస్య నవభేదాన్ నిబోధమే,
సముద్రాంతరితా జ్ఞేయా స్తే త్వగమ్యాః పరస్పరమ్॥
ఇంద్రద్వీపః కశేరుమాంస్తా మ్రవర్ణో గభస్తిమాన్
నాగద్వీప స్తథా సౌమ్యో గంధర్వో వారుణ స్తథా।
అయంతు నవమ స్తేషాం ద్వీపః సాగర సంవృతః
యోజనానాంసహస్రం వై ద్వీపోఽయందక్షిణోత్తరాత్॥
పూర్వే కిరాతా యస్యాంతే పశ్చిమే యవనా స్తథా।
బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యాఃశూద్రాశ్చాంతః స్థితాద్విజ॥
మార్కండేయ పురాణము. అ. 57 శ్లో. 5-8

మార్కండేయ పురాణములో పైని వివరింపబడిన శ్లోకముల ననుసరించి నవద్వీపములు—ఇంద్రక, శేరు, తామ్రవర్ణ, గభస్తిమంత, నాగ, సౌమ్య, గంధర్వ, వారుణములను ఎనిమిదియు, తొమ్మిది యవది, ఉత్తరముననుండి దక్షిణమునకు సముద్ర పరివేష్టితమైన వేయి యోజనములుగల ద్వీపము. ఈ నవమ ద్వీపమునుగూర్చి వాయు పురాణములో గొన్ని వివరములు గలవు.

ఇంద్రద్వీపః కసేరుశ్చ తామ్రవర్ణి గభస్తిమాన్
నాగద్వీప స్తథా సౌమ్యో గంధర్వ స్తథ వారుణః
అయంతు నవమ స్తేషాం ద్వీపః సాగరసంవృతః
యోజనానాం సహస్రంతు ద్వీపోఽయం దక్షిణోత్తరమ్॥
ఆయతోహ్యా కుమారిక్యా దా గంగా ప్రభవాశ్చవై
తిర్యగుత్తర విస్తీర్ణః సహస్రాణి నవైతుః॥
అ. 45. శ్లో. 80

వాయుపురాణము ప్రకారము తొమ్మిదవ ద్వీపము ఉత్తరమున గంగాతటముననుండి, దక్షిణమున కుమారి వఱకును సహస్ర యోజనములు నొమ్మిదివేల యోజనము లు విస్తీర్ణముగల భూభాగము.

అంత కంటెను స్పష్టముగా నవమ ద్వీపము పేరు కుమారికా ద్వీపమని వామన పురాణములో జెప్పబడినది.

అయంతు నవమ స్తేషాం ద్వీపః సాగర సంవృతః ।
కుమారాఖ్యా పరిఖ్యాతో ద్వీపోయం దక్షిణో త్తరః ॥
అ. 3 శ్లో. 11

రాజశేఖరుడు కావ్యమీమాంసలో ఈ తొమ్మిదవ ఖండము, కుమారికా ద్వీపమనియే చెప్పియుండెను.

తత్రేదం భారతం వర్షమ్ అస్య చ నవభేదాః ॥
ఇంద్రద్వీపః కశేరుమాన్ తామ్రపర్ణో గభస్తిమాన్
నాగద్వీపః సౌమ్యో గంధర్వో వరుణః ।
కుమారీ ద్వీపశ్చాయం నవమః ॥

## సప్తద్వీప సప్తసాగర సమేతమగు భూమి

పురాణములలో ద్వీపమనగా నాల్గు ప్రక్కలను జలము కలిగి మధ్యనున్న భూభాగము కాదు. రెండు ప్రక్కలు మాత్రమే జలమావరించిన ప్రదేశమునకే యీ పదము వర్తిల్లును. సప్తద్వీపములు సప్త సాగర పరివృతములుగావు. ఆ సప్తద్వీప, సప్తసాగరములు నేటి ఖండములు, సముద్రములతో పరిశోధకులు పోల్చినవిధము, ఈ దిగువ జూపబడు చున్నది.

1. జంబూద్వీపము — ఆసియాఖండము (Asia)
 క్షారోదము — హిందూ మహాసముద్రము (Indian ocean)
2. ప్లక్షద్వీపము — ఆసియామైనర్ (Asia Minor)
 ఇక్షుసముద్రము — ఎఱ్ఱనల్ల సముద్రములు (Red sea and Black sea)

3. శాల్మలద్వీపము — ఆఫ్రికా ఖండము (Africa)
సురసముద్రము — మధ్యధరా సముద్రము (Mediterranean)

4 కుశద్వీపము — ఐరోపా ఖండము (Europe)
ఘృతసముద్రము— ఆర్కిటిక్ సముద్రము (Arctic ocean)

5. క్రౌంచద్వీపము — ఉత్తర అమెరికా (North America)
దధిసముద్రము — అట్లాంటిక్ సముద్రము (Atlantic ocean)

6. శాకద్వీపము — దక్షిణ అమెరికా (South America)
క్షీరసముద్రము — శాంతమహా సముద్రము (Pacific ocean)

7. పుష్కరద్వీపము — ఆస్ట్రేలియా మొదలగు దీవులు (Australia)
శుద్ధజలసముద్రము— అంటార్కిటిక్ సముద్రము (Antarctic)

కుమారికా ద్వీపమె భరతఖండము

కుమారికాద్వీపమె భరతఖండ నామమును దాల్చెనని స్కాంద మహాపురాణాంతర్గత కౌమారికా ఖండములోని బర్బరికా వృత్తాంతము వల్ల దెలియుచున్నది. ఆంధ్ర కౌమారికా ఖండమునుండి యీ విషయ మెత్తి వ్రాయబడినది.

భరతునకు శతశృంగుడను వాడుదయించెను. అతనికి ఎనమండ్రుకుమారులు ఒక్క కుమార్తెయును గలిగిరి. ఆ కుమారుల పేర్లు, ఇంద్ర ద్వీప కశేరు తామ్రద్వీప గభస్తిమన్నాగ సౌమ్య గాంధర్వ వరుణులు. కుమార్తె పేరు శతశృంగ లేక కుమారి. ఈమె వల్లనే నవమ ద్వీపము నకు కౌమారికా ఖండమని పేరువచ్చెను.

కం॥ అని పంచలింగ మహిమము
వినిపించి యమర్త్యమౌని విషధరుడు పృథా
తనయున కిట్లని తెల్పెను
విను బర్బరి యనెడు తీర్థ విషయం బింకన్.

చం॥ అది మహిమాఢ్య తీర్థమగు నర్జున దాని నెఱుంగ నీకు ని
ప్పుదు నెటులిద్ధికల్గినదొ భూపవరాత్మజ భూతలంబునన్
ఉదయము గాంచి ఖ్యాతిని మహోత్తమమై శతశృంగనాగ బెం
పొదవ జెలంగె నామెయె సముజ్జ్వల రూపకుమారి కాఖ్యచేన్.

సీ॥ జననుత ప్రాతమై సంస్తవార్హ ప్ర
వృత్తినిమించె దన్నామమున నిడియును
గౌమారికా ఖండనామము దాల్చెను
వర్గ చతుష్టయ వర్ణ్యఫలద
మగు జుమ్మ భూలోకమందు నానాగ్రామ
ముఖకల్పనయు నామె మూలముననె
వెలసెను శార్థ యా లలితాంగి యే దీని
భరత ఖండంబనబడు నటంచు

తే॥ జక్క గల్పించె ననుటయు సవ్యసాచి
యిట్టులడిగె మహాముని యిదియు మిగుల
నచ్చెరువు గాగ దోచెను నాత్మ కిపుడు
ననదగుం దీని వృత్తాంతమును గడంగి.

## జంబూద్వీపము-కుమారికా ఖండము నేటి నిరూపణము

జంబూ ద్వీపములోని మొదటి పదమైన 'జంబు' నేటి జమ్ము- కాశ్మీర దేశములో ప్రథమ భాగమైన జమ్ము విభాగములో శేషించి యున్నది. ఇక కుమారికా ఖండములోని మొదటిపదము హిందూ

దేశమునకు దక్షిణకొన నున్న కుమారికాగ్రములో(Cape Camorin) గలసి యున్నది.

## భరత ఖండము-నామోత్పత్తి కథనము

భరతఖండమునకీ నామమేల కల్గెనో మార్కండేయ పురాణము నందీ కథ తెలుపబడినది. స్వాయంభువ మనువు తనయుడైన ప్రియ వ్రతునకు తొమ్మండుగురు పుత్త్రిలు గలరు. వారిలో అగ్నీధ్రుడను వానిని జంబూద్వీప పాలకునిగా నియమించెను. ఆ అగ్నీధ్రునికి తొమ్మండుగురు కుమారులు పుట్టిరి. వారిలో ఋషభుడను వానిని హిమవంతమునకు దక్షిణ ఖండమున కధిపతిగా నియమించెను. ఋష భునకు భరతుడను పుత్రుడు గలడు. అతడీ భూభాగమును పాలించుట చేత దీనికి భరత వర్షమనియు భరత ఖండమనియు బేర్లు వచ్చెను.

తే॥ హిమనగేంద్ర దక్షిణ వర్షమేలు నాభి
యాత్మనందను ఋషభుని నధిపుజేసి
యరిగె గానకు నతడు నిజాత్మ జన్ము
డైన భరతు బట్టము గట్టి యడవి కరిగె.

వ॥ ఆ భరతుని పేర నివ్వర్షంబు భారత వర్షంబన బొగడొంచె. భరతుండును నిజనందనుండగు సుమతి నధిపతిగావించి తపంబునకు జనియె

ఆంధ్ర మార్కండేయ పురాణము ఆ. 4. వ. 129-!8

## దక్షిణాపథము ( Deccan )

పురాణము లందును, సంస్కృత కావ్యములందును, బౌద్ధవాఙ్మ యము నందును దక్షిణాపథము పేర్కొనబడినది. మార్కండేయ పురాణములో భరతఖండము నందలి జనపదములు పంచవిభాగములుగ విభజింపబడినవి. అవి మధ్యదేశ జనపదములు, ఉదీచ్యములు, ప్రాచ్య ములు, దక్షిణాత్యములు, ప్రతీచ్యములు.

'అథాపరే జనపదా దక్షిణాపథ వాసినః

....................................

నైశికాః కుంతలా ఆంధ్రా ఉద్బిదా వనదారకాః ॥

మార్కండేయ పురాణము అ. 57. శ్లో 45-48

రాజశేఖరుడు కావ్యమీమాంసలో భరతఖండము నైదు భాగములుగ విభజించెను.

తత్ర వారణస్యాః పరతః పూర్వదేశః
మాహిష్మత్యాః పరతః దక్షిణాపథః
దేవసభాయాః పరతః పశ్చాద్దేశః
పృథుకాత్ పరతః ఉత్తరాథః
వినసన ప్రయాగయోః గంగాయమునాయోశ్చ
అంతరం అంతర్వేదీ॥

కావ్యమీమాంస, పుట 93

## ఆంధ్రదేశ ప్రశంస-రామాయణ మహాభారతములు

శ్రీ మద్రామాయణమునందు, నదీ నదములు, పర్వతములు, పట్టణములు, వివిధ దేశములు సందర్భానుసారముగ వర్ణింపబడినవి. అందు ముఖ్యముగా నాలుగు తావుల వివిధ దేశముల యునికి విపులముగా జెప్పబడినది.

(1) శ్రీరామభద్రుడుసౌమిత్రీసహితుడై విశ్వామిత్రుని యాగరక్షణార్థము కౌశికుని వెంటబోయి మిథిలానగరము చేరుమార్గము. (2) భగీరథుడు గంగను భూమికి తెచ్చు సందర్భము (3) భరతుడు గిరివ్రజమునుండి అయోధ్యకు వచ్చు మార్గము (4) శ్రీరామచంద్రుని దండకారణ్య గమనము.

రామాయణములోని కిష్కింధాకాండములో నాంధ్రాది దేశ ప్రశంసగలదు.

సహస్రశిరసం వింధ్యం నానాద్రుమ లతా యుతం ।
నర్మదాంచనదీం దుర్గాం మహోరగ నిషేవితాం॥
తతో గోదావరీం రమ్యాం కృష్ణవేణీం మహానదీం।
వరదాంచ మహాభాగాంచ మహోరగ నిషేవితం॥
మేఖలా ముత్కలాంచైవ దశార్ణనగరాణ్యపి ।
అశ్వవంతీ మవంతీం చ సర్వమేవాను పశ్యత॥
విదర్భా నృషికాంశ్చైవ రమ్యాన్మాహిషకానపి ।
తథావంగాన్కళింగాశ్చ కౌశికాంశ్చ సమంతతః॥
అన్వీక్ష్య దండకారణ్యం సపర్వత నదీం గుహాం ।
నదీం గోదావరీంచైవ సర్వమేవాను పశ్యత ।
తథైవాంధ్రాశ్చ పుండ్రాశ్చ చోళాన్ పాండ్యాన్స కేరళాన్॥

శ్రీమద్రామాయణములోని పై ఆంధ్రదేశప్రసక్తి ప్రశస్తమనియు, రామాయణకాలమునాటికి ఆంధ్రజాతి లేదనియు, ఆంధ్ర, ఆంధ్రేతర చరిత్ర పరిశోధకుల నిశ్చితాభిప్రాయమను. వారివారియభిప్రాయముల నిందు జూపుచున్నాము. సుప్రసిద్ధపండితులు. విమర్శకాగ్రేసరులు, ఆంధ్రులకు చిరస్మరణీయులు నగు కీర్తిశేషులు శ్రీ కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు తాము రచించిన నన్నయభట్టారక చరిత్రము నందీ విధముగ వ్రాసియున్నారు.

"రామాయణము మనకు మిగుల పురాతన గ్రంథము గాను బూర్వులచరిత్రను దెల్పునదిగాను నున్నది. శ్రీరాముడు కైకకోరిన వరములదీర్చి, తండ్రియాడినమాట నిలుపుటకై దేశములందును గ్రామములందును బ్రవేశింపక పట్టియరణ్యములందే పదునాల్గు వత్సరములు నివసింప శపథము పట్టివచ్చి యీ ప్రాంతములందు సంచరించినట్లును ఈ భూమి ఘోరారణ్య ప్రదేశమైనట్లును, శ్రీమద్రామాయణమునందు దెల్పబడినది. మఱియును సీతను రావణుండెత్తికొని పోవుచున్నప్పుడామె మొరనాలించి రక్షింప వచ్చుటకు గాని, యామె యిడు ఆన

వాలును భద్రము చేయుటకుగాని, గోదావరి మొదలు పంపానదివఱకును నామమాత్రావశిష్ట మెవరును గాన్పించియుండలేదు. అప్పైన మాత్రము సుగ్రీవాదులు గాన్పించిరి. దీనిచేత తెలియవచ్చునది యేమనగా రామాయణము నాటికి మన హిందూదేశము యొక్క యుత్తరప్రకోణయును, దక్షిణప్రకోణయును జనాకీర్ణములైన దేశములుగా నుండెననియు, మధ్యభాగమంతయు నట్టిఘోరారణ్యమని దేలుటయే. ఈ రామాయణమునందే కిష్కింధా కాండములో నాంధ్రాదిదేశముల ప్రశంస కలదు. కాని యది ప్రక్షిప్తముగా గ్రహించవలసియున్నది. ఏమనగా మనమే భూభాగమును ఆంధ్రదేశముగా గ్రహించుచున్నామో, యా ప్రదేశము జనరహితమగు మహాదండకారణ్యమని హేతుసహితముగా గూడ నుత్తరకాండమున విస్పష్టముగా దెల్పబడియున్నది. ప్రక్షిప్త భాగములగు గ్రంథములను జేర్చువారు తాము నూతనముగా జేర్చుదానికి తగు తావేదియని చూచుకొని సందర్భముగలచోట నతుకుదురేగాని కథాభాగమునంతయు దిద్దజాలరు. దేశముల పేర్లున్నచోట నీ యాంధ్రదేశము మొదలగు నవీనదేశములను గూడ మనవారు జేర్చిరి. కాని, కథాభాగమువలన దేలుచున్న భావమేమో తెలుసుకొనలేకపోయిరి. దొంగతనము బయలుపడు మార్గమిదియేకదా"

శ్రీ బ్రహ్మయ్యశాస్త్రిగారి యభిప్రాయమే, ఆంధ్రేతరచరిత్రకారులు సమర్థించియున్నారు. అందొకరు వంగదేశ పండితుడు. రెండవవారు తమిళచరిత్రకారులు.

వంగదేశీయ చారిత్రకపరిశోధకుడు శ్రీ నవీనచంద్రదాసు రచించిన రామాయణ భూగోళమును గూర్చిన గ్రంథమునందు రామాయణములోని ఆంధ్ర, చోళ, పాండ్య, కేరళదేశ ప్రశంస ప్రక్షిప్తమనియు పండితమ్మన్యులెవరో తర్వాతి కాలమున ఆంధ్ర, చోళ, పాండ్య, కేరళ రాజన్యుల స్తుతిపాఠమునకై పై శ్లోకముల నెక్కించి యుందురనియు వ్రాసియున్నాడు.

("The passage within verse 12 is evidently the work of unskilled hand inserted in much latter times to suit the vanity of camparatively modern dynasties of Andhra, Chola, Pandya, and Kerala" Pages 61 and 71. A note to Ancient Geography of Asia. Compiled from Valmiki Ramayana with map and Index by Nobin Chandra Das)

అట్లే తమిళ చారిత్రక పరిశోధకులు శ్రీ శేషయ్యంగారు పై దేశములు మూలములోలేవనియు, క్రీ శ.ఆరవశతాబ్దమునకు తర్వాత కాలముననున్న దేశవిభాగమును పురస్కరించుకొని, తర్వాతివారు జొన్పించిన ప్రక్షిప్త భాగములేయనియు, నభిప్రాయపడియుండిరి.

("The four Cantos in Book IV of the original Ramayana which in describing Sugriva's instructions to the monkey chief represent Dandakaranya as occupying only a limited portion of South India and make copious illustrations to the flourishing kingdoms of South India, are here taken to be interpolations belonging to an epoch later than the 6th the century". Dravidian India vol 1 pages 17, 18)

## ఆంధ్రచరిత్రకారుని వాదము

ఆంధ్రచరిత్రకారులు శ్రీవీరభద్రరావుగారు తమ యాంధ్రుల చరిత్రము ప్రథమ భాగము, మూడవప్రకరణమునందు బ్రహ్మయ్య శాస్త్రిగారి వాదము విశ్వసనీయము కాదని యీ క్రింది విధమున వ్రాసియున్నారు.

"పై నుదాహరింపబడిన యైతరేయ బ్రాహ్మణ వచనమునుబట్టి యాంధ్రులను ననాగరిక అరణ్యజాతి వారొకరు కలరని తేటబడినది. ఆ యనాగరికాంధ్రులు నివసించుదేశమే యాంధ్రదేశమనబడు చున్నది. నాగరికులు నివసింప శక్యముగాని యంధకార బంధురమైన మహారణ్య ప్రదేశమునందు నివసించు వారగుటచేతనే యార్యులు వీరిదేశము నాంధ్రదేశమనియు, వీరినాంధ్రులనియు, వాడుచు వచ్చిరి. అనాగరికు లయిన యాంధ్రులు నివసించు దేశమున మిద్దెలు, మేడలు, నెట్లుకాన నగును? అనాగరిక దేశము నందు బుణ్యతీర్థము లెట్లుకాననగును? కాబట్టి రామాయణము నాటికి దక్షిణాపథమున నాంధ్రులు లేరని; ఆంధ్రదేశము లేదని చెప్పుట సాహసము".

## దండకారణ్యగాథ

రామాయణ కాలమున వింధ్యపర్వత దిగ్భాగమంతయు నొక మహారణ్యముగానుండి, యచ్చటచ్చట తాపసవరేణ్యుల తపోవనము లతో విరాజిల్లుచుండెను. దీనికి దండకారణ్యమని పేరు. దీనికా నామ మేల గల్గెనో రామాయణమునందలి ఉత్తరకాండలో కడపటి సర్గల యందు వివరింపబడెను. ఇక్ష్వాకుని కుమారుడగు దండుడనువాడు వింధ్యాటవీ దక్షిణప్రాంత భూముల పాలించుచుండెను. ఒకనాడీతడు తద్వన ప్రదేశముల సంచారము చేయుచుండ రాక్షస కులగురువగు భార్గవుని కుమార్తె అరజ యనుదానిని జూచి కామోద్దీపితుడై, యామెను బలాత్కరించి, యామెతో సంగమించెను. ఈ విషయము కుమార్తెవలన శుక్రుడు విని, దండుని రాజ్యమునందేడు దినములు మృద్వర్షము గురియునట్లు శాపమిచ్చెను. ఆ శాపము విని అరజ యామె తపముచేయు చుట్టును దశయోజన పర్యంత భూమి పాంసువర్షముచే బాధింప కుండునట్లు తండ్రిని వేడగా నతడట్లనుగ్రహించెను. ఆ శాప కారణముచే నా దక్షిణ భూభాగమంతయును దండకారణ్య మయ్యెను.

దండకారణ్యాంతర్య ప్రదేశమైన దశయోజన విస్తీర్ణమైన భూమండలము జనులకు వాసయోగ్య మగుటచే దానికి జనస్థానమను పేరువచ్చెను.

## శ్రీరాముని దండకారణ్య పర్యటనము

దండుని విషయమె దండకారణ్యము. దీని కుత్తరమున వింధ్య పర్వతములు, దక్షిణమున కృష్ణానదియు, తూర్పున మహేంద్రగిరులు, పశ్చిమమున మలయ పర్వతములు గలవు. శ్రీరామభద్రుడు అయోధ్యను వీడి, సీతా లక్ష్మణ సమేతుడై, భరద్వాజాశ్రమమునకు వచ్చి, యచ్చటనొక రాత్రి గడపి చిత్రకూటమును జేరెను ఈ చిత్రకూటము ప్రయాగకు డెబ్బదియైదు మైళ్ల దూరమున మందాకినీ నదీతీరమున గలదు.

చిత్రకూటమునందు కొన్ని దినములు గడపి అత్రిమహర్షి యాశ్రమమునకు జేరెను. అత్ర్యాశ్రమము నుండియే రాముడు దండకారణ్యము ప్రవేశించెను. ఈ దండకారణ్యము రామాయణము నందలి యరణ్యకాండ ప్రథమ సర్గలో వర్ణింపబడెను.

> "ప్రవిశ్యతు మహారణ్యం దండకారణ్య మాత్మవాన్
> దదర్శరామో దుర్ధర్షం తాపసాశ్రమ మండలమ్॥
> ........................................
> శరణ్యం సర్వభూతానాం సుసమ్మృష్టాజిరం తథా
> మృగై ర్బహుభిరాకీర్ణం పక్షిసంఘై స్సమావృతమ్॥
> సమిద్భిః తోయకలశైః ఫలమూలైశ్చ శోభితం ।
> అరణ్యైశ్చ మహావృక్షైః పుణ్యైస్స్వాదు ఫలై ర్వృతమ్॥
> ........................................
> పుణ్యైశ్చ నియతాహారై శ్శోభితం పరమర్షిభిః
> తద్బ్రహ్మ భవనప్రఖ్యం బ్రహ్మఘోష నినాదితమ్॥

ఈ యత్రి యాశ్రమము మధ్యప్రదేశములోని యుత్తర ప్రాంతముననున్న సిరగుజ మండల మధ్యమమున నుండెను. అచ్చటి నుండి దండకారణ్యములో గొంతదూరము పోయి విరాధువనము ప్రవేశించెను. ఈ విరాధువనము ఇప్పటి మధ్యప్రదేశములోని బిలాసపుర మండలములో నీశాన్య దిక్కునందుండెను. శోణానదికి దక్షిణమున బిలాసపురమున కుత్తరమున నున్న అమరకంటక పర్వత ప్రాంతమె విరాధుని నిలయము ఇచ్చట విరాధుని వధించి, శరభంగాశ్రమమునకు శ్రీరామభద్రుడు సీతాలక్ష్మణ సమేతుడై ప్రయాణమయ్యెను. ఈ శరభంగాశ్రమము మధ్యప్రదేశములో శరంగపురమని పిలువబడు చున్నది. బిలాసపుర మండలములో నుత్తరదిక్కున నీశాన్యమూల నున్నది. శరభంగాశ్రమమునుండి ప్రయాణమై నదీనదములనుదాటి వచ్చి శ్రీరాముడు సుతీక్ష్ణాశ్రమమును జేరెను. ఈ యాశ్రమము బస్తరురాజ్యములో ఇంద్రావతికి దక్షిణ తీరమున నుండెను. ఇది మన యాంధ్రప్రదేశము ఉత్తరపుటెల్ల. ఈసుతీక్ష్ణాశ్రమ ప్రాంతమె శాంతస్పూరను నామముచే పిలువబడుచున్నది. ఈ యాశ్రమమును వీడి పంచాప్సరస్సరోవరమును జేరి, క్రమముగా అగస్త్యాశ్రమమును బ్రవేశించెను. ఈ యాశ్రమము సహితము బస్తరురాజ్యములో దక్షిణపు దెసనుండెను.

## శ్రీరాముడు జనస్థానము-ప్రవేశించుట

ఈ జనస్థానము బస్తరురాజ్యములో గొంతభాగమును, గోదావరీనదీ యుభయతట ప్రాంతమును, ఆంధ్రప్రదేశములో(తెలంగాణము) నుత్తర ప్రాంతమునై యున్నది. రామాయణ కాలమున రావణుని సోదరుడగు ఖరుడీ జనస్థానమున కేలికయై యుండెను. అగస్త్య మహామునిని వీడ్కొని, శ్రీరామభద్రుడాయన యాజ్ఞానుసారముగ పంచవటమునకు బయలుదేరెను. మార్గమధ్యమున జటాయువుని

దర్శనము లభింపగా నావిహంగపుంగవుని బూజించి, యాతని వీడుకొని పంచవటిని జేరెను.

## పంచవటి పర్ణశాల

ఈ పంచవటి ఖమ్మము (మండలములోని) భద్రాచలమున కుత్తరముగా నిరువదిరెండు మైళ్లదూరమున గోదావరీతీరమున పర్ణశాలయను గ్రామ పరిసర ప్రాంతము. ఈ పంచవటీస్థల నిర్ణయమున మహారాష్ట్ర పండితులు కొందఱు నాసికా పట్టణ సమీపమున నున్నదని నిర్ణయించిరి కాని, వారిలోనె కొందఱు వినాయకవైద్య మొదలగు పండితులు ఆంధ్రదేశమునందున్న పర్ణశాలయే పంచవటీయని చెప్పియున్నారు. ఇచ్చటనే సీతాపహరణము సంభవించెను. శ్రీరాముని దండకారణ్యాగమన వర్ణనము ననుసరించియు, జనస్థానస్థల నిర్దేశము బట్టియు, పంచవటి యిప్పటి భద్రాచలము తాలూకాలోనున్న పర్ణశాల ప్రాంతమని నిస్సంశయముగా చెప్పవచ్చును.

భద్రాచలసమీపముననున్న పర్ణశాలయే పంచవటియని నిర్ణయించుటకు భవభూతిమహాకవి విరచిత ఉత్తరరామాయణనాటకమే ప్రబలసాక్ష్యము ఈనాటకములోని ద్వితీయాంకమున శ్రీరామచంద్రునకును శంబూకునకును జరిగిన సంభాషణములో దండకారణ్య జనస్థాన, పంచవటీ ప్రశంసల పరస్పరస్థల నిర్దేశములు గమనింపనగును.

రామః — కిం నామ దండకేతి (సర్వతోఽవలోక్య) హా! కథమ్!
స్నిగ్ధశ్యామాః క్వచిదపరతో భీషణాభోగరూక్షాః
స్థానే స్థానే ముఖరకకుభో ఝాంకృతైర్నిర్ఝరాణామ్
ఏతేతీర్థాశ్రమగిరి సరిద్గర్త కాన్తారమిశ్రాః
సందృశ్యన్తే పరిచితభువో దండకారణ్యభాగాః

శంబూకః — దండకైవైషా అత్రకిలపూర్వం నివసతా దేవేన.
చతుర్దశ సహస్రాణి చతుర్దశ చరాక్షసాః

త్రయశ్చ దూషణఖర త్రిమూర్ధానో రణేహతాః॥
యేనచ సిద్ధక్షేత్రే జనస్థానేఽస్మిన్నా్మ దృశామపి
జనపదో నామకుతోభయః సంచారః సంవృత్తః

రామః—నకేవలం దండకైవ జన స్థానమపి

శంభూకః—బాఢమ్! ఏతానిఖలు సర్వభూత రోమహర్షణాద్యు న్మత్త చండశ్వాపద కులాక్రింత వికటగిరి గహ్వరాణి జనస్థాన పర్యంత దీర్ఘారణ్యాని దక్షిణాందిశ మభిప్రవర్తన్తే.

రామః—పశ్యామిచ జనస్థానం భూతపూర్వ ఖరాలయం ప్రత్యక్షమివ వృత్తాంతా న్పూర్వాననుభవామిచ.

..........................................

అపిచ—

ఏతేత ఏవగిరయో విరువన్మయూరా
స్తాన్యేవ మత్తహరిణాని వనస్థలాని
అమంజు వంజులతాని చితాన్యమూని
నీరంధ్రనీర నిచులాని సరిత్తటాని.
మేఘమాలేవ యశ్చాయ మారాదిత విభావ్యతే
గిరిః ప్రస్రవణః సోయం యత్రగోదావరీనదీ॥

తథాహి—

అస్మ్యే వాసీన్మహతి శిఖరే గృధ్రరాజస్యవాస
స్తస్యాధస్తాద్వ యదుపిర తాన్తేషు పర్ణోటకేషు
గోదావర్యాః పయసివితతా నోకహశ్యామలశ్రీ
రన్తః కూజన్ముఖరశకునో యత్రరమ్యోవనాంతః
అత్రైవసా పంచవటియత్ర———

పై సంభాషణముపల్ల దండకారణ్యమధ్యభాగమున జనస్థానము గలదనియు, నదియే ఖరదూషణాదుల వాసస్థలమనియు, దానికి దక్షిణ

మున గోదావరీనది గలదనియు, దానితీరమున ప్రస్రవణ పర్వతమును, దాని సమీపముననే పంచవటి గలదనియు స్పష్టము. కాబట్టి పంచవటి యెక్కడనో జనస్థానమునకు పశ్చిమదిశను ఇప్పటి మహారాష్ట్రదేశ ములో నాసికా పట్టణము సమీపముననున్నదనియు చెప్పుట కాధా రము మృగ్యము

శ్రీరామచంద్రుడు సీతాపహరణమైన పిమ్మట సుమిత్రా నందనునితో, పంచవటి సమీపముననే గోదావరినిదాటి, నేటి తెలుగాణ ములో దక్షిణాభిముఖముగా గొంతదూరమునడిచి, తరువాత నైరుతి మూలగా నేటి మైసూరు రాష్ట్రములో బ్రవేశించి, పంపాసరోవరమును చేరి, తర్వాత కిష్కింధకును వచ్చెను. ఆ మార్గము పటములో జూడనగును.

## పంపాసరోవరము — పంపానది

దాశరథులు మార్గమధ్యమున కబంధుని సందర్శించిరి. అతడే వారికి రావణుని సీతాపహరణము గూర్చి చెప్పెను, అతడే ఋశ్య మూక శైలమున నివసించియున్న సుగ్రీవుడు వారికి సహాయుడై పంక్తి గ్రీవుని సంహారించుట యందు తోడ్పడగలడనియు, సీతను దెచ్చిసమ ర్పింపగలడనియు జెప్పెను. అంతసోదరులు కబంధుడు చెప్పినమార్గ మును బట్టిపోయి పంపాతీరమును జేరిరి. అచ్చటినుండి వారు ఋశ్య మూక పర్వతమును జేరిరి. అదియే కిష్కింధ.

రామాయణము కిష్కింధా కాండములో పంపానది, పంపా సరోవర వర్ణనలు గలవు. పంపానదియే నేటి తుంగభద్ర, పంపాసరో వరము నేటి మైసూరు రాష్ట్రముననున్నది. కిష్కింధయే ఇప్పటి హంపీవిరూపాక్షమను ప్రాచీన విద్యానగర లేక విజయనగరనిర్మాణ స్థలము. ఇక్కడనే ఋశ్యమూకము, మాల్యవంతము, మొదలగుపర్వ తములు గలవు. తుంగభద్రానది రామాయణములో వర్ణింపబడిన (అం)జన

పర్వతము, మాల్యవంతము, మతంగపర్వతము, ఋశ్యమూకములను పర్వతముల నంటుకొని ప్రవహించు చున్నది. పంపకే కన్నడమున హంపయను పేరు. విరూపాక్ష మహేశ్వరుని దేవాలయముండుటచే ఈ క్షేత్రమునకు హంపీవిరూపాక్షమను నామము కల్గినది. ఈ దేవాల యమున కెదురుగా మాతంగపర్వత మున్నది. ఋశ్యమూకముతుంగ భద్రాస్రవంతి కుత్తరమున నున్నది. ఈ కిష్కింధానగర స్థలముననే శ్రీహరిహర బుక్కరాయ సోదరులు మాధవ విద్యారణ్యులయానతి విద్యానగరమును నిర్మించిరి. ఈ చరిత్రాంశమును గూర్చి ప్రాచ్య ప్రతీచీ చారిత్రక పరిశోధకు లేకగ్రీవముగా సమ్మతించిరి.

వాలి సంహారణము, సుగ్రీవసఖ్యము, హనుమంతుని సీతా న్వేషణమును జరిగిన తర్వాత శ్రీరామలక్ష్మణులు వానరవాహినుల బలముతో లంకకు బ్రయాణమై సహ్యామలయాచలములు గడచి, మహేంద్ర పర్వతము నెక్కి సముద్రతీరమును జేరుట యందఱకుదెలిసిన విషయమె. గ్రంథవిస్తర భయముచే నిచ్చట వ్రాయలేదు.

## మహాభారతము - ఆంధ్రులు - ఆంధ్రదేశము

భీష్మపర్వములో భారతీయనద్యాది కథనములో మూలమునం దాంధ్రుల ప్రశంస లేకపోయినను తిక్కన సోమయాజి భాషాంతరీ కరణములో ఆంధ్రజనపదము మిగిలిన దాక్షిణాత్యజన పదములతో జతకూర్చెను.

"ఔడ్రాః పౌండ్రాశ్చ సికతాః పార్వతీయాశ్చమారిష
అథాపరే జనపదా దక్షిణా భరతవర్షభ
ద్రావిడాః కేరళాః ప్రాచ్యామూషికా వనవాసికా
కర్ణాటకా కుంతలాశ్చైవ సౌహృదానల కాననాః
కాకుద్రకాస్తథా చోళాః కొంకణాః మాళవాసకాః

భీష్మపర్వము - తొమ్మిదవ అధ్యాయము

"ఆంధ్రసింధు చేదిచోళ పుళిందపుండ్రక పాండ్య ఆభీరసౌవీర సౌరాష్ట్ర మహారాష్ట్ర విదేహ విదర్భ ద్రవిడ దశార్ణ కర్ణాటక..."

భీష్మపర్వము – ప్రథమమాశ్వాసము. 40

అట్లే ఆదిపర్వములో నర్జున తీర్థయాత్రా సందర్భమున ఆంధ్రులను గూర్చి మూలమున లేకపోయినను. నన్నయభట్టు తీర్థాభిగమనములో వేంగిదేశమును వర్ణించెను.

సభాపర్వములో సభాక్రియా పర్వణాధ్యాయములోను, సహదేవుని దక్షిణ దిగ్విజయ సందర్భములోను మూలమునందును, భాషాంతరీకరణ భాగమునందును ఆంధ్రులు పేర్కొనబడిరి.

జటాసురో మద్రకాంనాచ రాజా కుంతిః
పుళిందశ్చ కిరాతరాజః
తథాంగవంగో సహాపుండ్రకేణ
పాండోడ్ర రాజౌచ సహాంధ్రకేణ॥
అంగావంగ సుమిత్రశ్చశైబ్యశ్చా మిత్రకర్షణః
కిరాతరాజస్సుమనో యవనాధి పతిస్తథా॥
చాణూరో దేవరాతశ్చ భోజో భీమరథశ్చయః
ప్రతాయుధశ్చ కాళింగో జయసేనస్య మాగధః॥

సభాపర్వము – సభాక్రియా పర్వణము.

దూతై రేవవశే చక్రే కరంచైనా సదాపయః
పౌండ్రాంశ్చ ద్రవిడాం శ్చైవ సహితాంశ్చోడ్ర కేరళైః॥
ఆంధ్రాం స్తాలవనాం శ్చైవ కళింగానుష్ట్ర కర్ణికాః
అటవీంచ పురీంరమ్యాం యవనానాం పురంతథా॥

సభాపర్వము – సహదేవకృత దక్షిణ దిగ్విజయము

పౌండ్రకో వాసుదేవశ్చ వంగః కాళింగకస్తథా
ద్రావిడాస్సింహళశ్చైవ రాజా కాశ్మీరకస్తథా॥

అకర్షం కుంతలశ్చైవ మాళవాశ్చాంధ్ర కాస్తథా
కుంతిభోజో మహాతేజః పార్థివో గౌరవాహనః॥

సభాపర్వము - నిమంత్రిత రాజానుగమనము

ఆంధ్రీకరణములో పైభాగములు పద్యగద్యము లందిట్లుగలవు.

కం॥ తాళవన పాండ్య కేరళ
కాళింగ ద్రవిడ యవన కరహాటక భూ
పాలకుల నోడిచి దక్షిణ
వేలావన భూములందు విడిసి కడంకన్.

వ॥ మఱియు సహదేవాను శాసనంబున బుత్త్ర మిత్ర భ్రాతృ సమేతులై విరాట ద్రుపద శిశుపాల గాంధార రాజులను, ప్రాగ్జ్యోతిషంబున భగదత్తుండును శక సాల్వ బృహద్బలదేవ ప్రద్యుమ్న శూర సేనాది యదువృష్ణి భోజాంధక వరులును, అంగ వంగ కాళింగ కాశ్మీర కాంభోజ గౌడ ఆంధ్ర సింహళ కేరళ కుంతల ద్రవిడ మరు యవన పతులు.

సభాపర్వము - ఆ. 1. ప. 262; 284

వ॥ "కురు కుమారోలూక కేకయ కాశ్మీరకాంభోజ గాంధార మద్ర ద్రవిడ మగధ మాళవ కళింగ అంగవంగ బంగాళగౌడ ఆంధ్ర కేరళ కోసలాది మహీపతులును"

సభాపర్వము - ద్వి. ఆ. 113

## ఆంధ్రులు కౌరవ సైన్యమునజేరి పాండవులతో యుద్ధ మొనర్చుట

ఆంధ్రమహాభారతమును జదివినచో ఆంధ్రులు యాదవపాండవ విరోధులై, కౌరవ పక్షమును జేరి నిహతులైనట్లు తెలియనగును. దాక్షిణాత్య జనపదములలో:—

| కౌరవ పక్షము | పాండవ పక్షము |
|---|---|
| ఆంధ్ర జనపదము | చోళ జనపదము |
| కేరళ ,, | పాండ్య ,, |
| కొంకణ ,, | |
| కర్ణాట ,, | |
| కోసల ,, | |
| కళింగ ,, | |
| కుంతల ,, | |
| విదర్భ ,, | |

పైని వివరింపబడిన జనపదవాసులు కౌరవ యుద్ధమున పాల్గొనిరి.

భీష్మపర్వము-ద్వి. ఆ. ప. 21, 27, 59, 60, 67, 96, 98, 295;
ద్రోణపర్వము – ద్వి. ఆ. వ. 64;
కర్ణపర్వము – ద్వి. ఆ. వ. 317.

మహాభారతములో వర్ణింపబడిన దక్షిణదేశానుక్రమణిక ననుసరించి పటము వ్రాయబడినది, దీనిలో సహదేవుని దక్షిణ దిగ్విజయ యాత్రయు కౌరవ పాండవ పక్షదేశములు సూచింపబడినవి. మహాభారత రచనాకాలము క్రీ. పూ. ఐదవ శతాబ్దమనియు ఆ తర్వాత మూడవ ప్రథమ శతాబ్దముల మధ్య క్రమ క్రమముగా గ్రంథము నుపెంపొందించి యాయా శతాబ్దములనాటి దేశకాల పరిస్థితుల ననుసరించి పెక్కుశ్లోకములు కాలానుసారముగా పలుపురిచే గ్రంథస్థముగావింపబడెననియు చరిత్ర పరిశోధకుల యభిప్రాయము. ఈ ఆంధ్ర పాండ్యదేశాది వర్ణనలు ప్రక్షిప్తములని వారి నిశ్చితాభిప్రాయము. ఆ కాలమున దాక్షిణాత్యదేశములైన ఆంధ్ర కర్ణాట, కుంతలాది జన

పదములు లేవనియు దక్షిణాపథమంతయు నిర్జనారణ్యమని పలువుర పండితుల వాదము.

నానాఘాట్ శాసనములో నాగనిక భర్త దక్షిణాపథపతి యనియు, నాశిక శాసనములలో నొకదాని యందు వాసిష్ఠీపుత్రపుల మావి దక్షిణాపథేశ్వరుడనియు, జూనాఘడ్ శాసనములో రుద్రదమనుని సమకాలికుడైన శాతవాహనుడు దక్షిణాపథపతి యనియు బేర్కొన బడిరి. ఇక్కడ శాతవాహను లేలిన దక్షిణాథము పరిమితార్థముననే సార్థకమగుచున్నది. దక్షిణాపథమను ప్రదేశము నర్మదానదికి దక్షిణమున కుమారికాగ్రము వఱకుగల దక్షిణహిందూదేశము విపులార్థమున వాడుకలో నున్నను, సామాన్యముగా వింధ్య ప్రదేశమునకు దక్షిణమున ద్రవిడమండలమున కుత్తరముననున్న భూ భాగమునకే యీ నామము వర్తించును. అనగా నేటి మధ్యప్రదేశము, దానికి దక్షిణమున నున్న ఆంధ్రప్రదేశము వ్యాపించి యుండు భూభాగము,

## ఆంధ్రప్రదేశము - భౌతిక భూగోళము

నేటి ఆంధ్ర ప్రదేశము $12^{0}$-$40'$—$19^{0}$-$50'$ అక్షాంశములకును. $76^{0}$-$45'$—$84^{0}$-$50'$ రేఖాంశములకును మధ్య వ్యాపించి యున్నది. ఇయ్యది భరతఖండమునందు గల రాష్ట్రములలో విస్తీర్ణమునందు ఐదవ స్థానమును, జనసంఖ్యయందు నాల్గవ స్థానమునువహించి యున్నది. దీనికి తూర్పున బంగాళాఖాతము, ఉత్తరమున ఒరిస్సా, మధ్యప్రదేశములు, పశ్చిమమున మహారాష్ట్ర, మైసూరు రాష్ట్రములు, దక్షిణమున మద్రాసు రాష్ట్రమును గలవు. తూర్పున సముద్రతీరము 600 మైళ్లు పొడవున వ్యాపించియున్నది.

భౌతికముగ నీ ప్రదేశమునంతటిని మూడుభిన్న ప్రాంతములుగ విభజింపవచ్చును. అందు మొదటిది తూర్పుతీరప్రాంతము. ఈ తీరము వెంటుకొన్న మండలములు: శ్రీకాకుళము, విశాఖపట్టణము, తూర్పు

గోదావరి, పశ్చిమగోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు అనునవి యేడు-రెండవది తెలంగాణ పీఠభూమి. ఇందు తొమ్మిదిమండలములు గలవు: మహబూబ్‌నగర్, హైద్రాబాదు, మెదకు, నిజామాబాద్, ఆదిలాబాద్, కరీంనగర్, వరంగల్లు, ఖమ్మము, నల్గొండ మండలములు. మూడవది రాయలసీమ పీఠభూమి. దీనియందు కర్నూలు, కడప, అనంతపురము, చిత్తూరు అను నాల్గుమండలములు గలవు.

## తూర్పు తీర ప్రాంతము

ఈ ప్రాంతమునకు తూర్పున పూర్వసముద్రమను పేరబరగు నేటి బంగాళాఖాతము. ఈ తీరము ఆరువందలమైళ్లు. పడమటదిక్కున మహేంద్రపర్వతములను తూర్పుకనుమలు. ఈకొండలు ఒరిస్సారాష్ట్ర లోని మహేంద్రగిరి పర్వతము మొదలుకొని దాదాపు సముద్రతీరము నకు ఏబదిమైళ్ల సమదూరమున కృష్ణానదివఱకు వ్యాపించి దక్షిణ దిక్కుగామరలి, చిత్తూరుమండలము సరిహద్దును సమీపించి, నైరుతి దిక్కై నీలగిరికొండలలో కలియుచున్నవి (చూడుడు. మహేంద్ర గిరులు). ఈపర్వతశ్రేణిఖండఖండములుగాచీలి, సాంద్రారణ్యములతోను, నిమ్నోన్నతపర్వతశిఖరములతోను, కొండలోయలతోను, నిబిడీకృతమై యున్నది. ఆంధ్రప్రదేశము పడమటదిక్కునుండి తూర్పునకు పల్ల వాలుగా నున్నందున, మలయ, సహ్యాద్రిపర్వతములనుండి జన్మించిన గోదావరీ, కృష్ణ, పినాకినీ మొదలగు నదులుపూర్వదిశకు ప్రవహించి మహేంద్రగిరుల భేదించి, తూర్పుప్రాంతముగుండ పోయి పూర్వ సముద్రములో గలియుచున్నవి ఈ కొండలు పడమటికనుమలంత ఎత్తైనవికావు. ఖండఖండములుగ చీలుటచే కొండలోయ లేర్పడెను.

శ్రీకాకుళము మండలములోని మహేంద్రపర్వతములనుండి ఉద్భవించి, తూర్పుగా ప్రవహించి సముద్రములోగలియు ముఖ్యమైన నదులు నాగావళి వంశధారలు; ఇవి ఈ మండలములను సస్యశ్యా

మలముగా నొనర్చుచున్నవి. అట్లే విశాఖపట్టణ మండలమునందు మహేంద్రగిరులలో పుట్టి తూర్పుదిక్కై పారుచున్న ముఖ్యనదులు-గోస్తని, శారద, వరాహా, తాండవనదులు. తూర్పుగోదావరి మండలములోని ముఖ్యమైన పెద్దనది గోదావరి. చిన్ననదులు ఏలేరు, పంపానదులు. గోదావరినది సప్తగోదావరులను పేరుతో గోదావరి మండలమునందు ప్రవహించుచున్నది. ఈసప్త గోదావరులేవియనిన, తుల్యాభాగ, ఆత్రేయి, భరద్వాజి, గౌతమీ, వృద్ధగౌతమీ, కౌశికి, వసిష్ఠ నదులు. పశ్చిమగోదావరి జిల్లాకు తూర్పుసరిహద్దు గోదావరి. చిన్ననదులలో ముఖ్యమైనది తమ్మిలేరు. ఈ మండలములోని గొప్పసరస్సు కొల్లేరు. కృష్ణామండలములో ముఖ్యమైననది కృష్ణానదియే. ఇయ్యది యీ మండలమునకు పశ్చిమదిక్కున ప్రవహించుచున్నది. కొల్లేరు ఏలూరు తాలూకాలో నుత్తరభాగమున నున్నది. ఈ సరస్సు ఉభయ మండలములకు నీటిసముదాయము కలిగించుచున్నది. తూర్పుగోదావరి, పడమటి గోదావరి, కృష్ణా మండలములందలి డెల్టాభాగములు, లంకలు మిక్కిలి సారవంతములని ప్రఖ్యాతిని గాంచినవి. గుంటూరు మండలము నందు కృష్ణానది ఉత్తర, తూర్పుదిక్కుల చుట్టి దాదాపు ఎనుబదిమైళ్లు ప్రవహించుచున్నది. ఈ మండలములోని చిన్ననదులు తుంగభద్ర, గుండ్లకమ్మ, నాగులేరు, చంద్రవంక యనునవి. నెల్లూరు మండలములో పెద్దనది పినాకిని. కండ్లేరు, మూశి, పాలేరు, మన్నేరు, స్వర్ణముఖి చిన్ననదులు. ఈ నదులలో గోదావరి కృష్ణా నదులలోవలె సంవత్సరమంతయు నీరుపారదు.

## రాయలసీమ - కర్నూలు మండలము.

కర్నూలుమండలము రాయలసీమకుత్తరదిగ్భాగమున నున్నది ఎఱ్ఱమలలు, వెలిగొండలు, నల్లమలలు అను పర్వతశ్రేణులు గలవు. ఈ మండలములో మూడవభాగము అటవీ ప్రదేశము. దీనియందలి ముఖ్యనదులు, కృష్ణ, తుంగభద్ర యనునవి. కృష్ణానదిమైసూరురాష్ట్ర

ములో కొంతదూరము ప్రవహించి నందికొట్కూరు, మార్కా పురము తాలూకాల్లో ఉత్తర పొలిమేరచుట్టి గుంటూరు మండ లమును జేరుచున్నది. తుంగభద్రానది కర్నూలుతాలూకా ఉత్తర సరిహద్దున పాకి నందికొట్కూరుతాలూకాలో కృష్ణానదిని గలియు చున్నది. కృష్ణయు తుంగభద్రయుగాక కొన్నిచిన్న నదులుగలవు. అందు ముఖ్యమైనవి గుండ్లకమ్మ, దాని ఉపనదులు రాళ్లవాగు, తీగ లేరు, కండ్లేరు, దువ్వలేరు. ఈ నదులన్నియు నల్లమలలో నావిర్భ వించినవి. గుండ్లకమ్మ ఈశాన్యమూలగా ప్రవహించి గుంటూరు మండ లములో ప్రవేశించుచున్నది. సాగిలేరు, భవనాశి యను చిన్న నదులు నల్లమలలోనే జన్మించి, మొదటిది పెన్నానదిలోను, రెండవది కృష్ణా నదిలోను గలియుచున్నవి. ప్రత్తికొండ తాలూకాలో పుట్టినహంద్రీ నది కర్నూలు పట్టణమున దిగువ తుంగభద్రానదిలో గలియుచున్నది. ఈ చిన్ననదులు జీవనదులుకావు. వర్షాకాలమున మాత్రము కొద్ది కాలము నీరు ప్రవహించును.

కడప

ఈ మండలము పీఠభూమి, పర్వత ప్రదేశము. వెలిగొండలు, పాలకొండలు ముఖ్యపర్వత శ్రేణులు. వెలిగొండలు కడప మండల మును నెల్లూరు మండలమును వేరుచేయుచున్నవి. పాలకొండలు పశ్చి మోత్తర భాగమున వ్యాపించి రెండుచీలికలై శేషాచలము కొండలు, నల్లమల కొండలను పేర్లచే పిలువబడుచున్నవి. ఈ జిల్లాలోని ముఖ్య నది పెన్న. అయ్యది పడమరనుండితూర్పుగ ప్రవహించి, వెలిగొండల కనుమలలోనుండి సోమశిలవద్ద నెల్లూరు మండలమున జేరుచున్నది. దీనికి ఉపనదులగు పాపఘ్ని, చెయ్యేరు, చిత్రావతినదులు పాలకొండ కనుమలలోనుండి పెన్నానదిని గలియుచున్నవి. చిత్రావతియు, పాప ఘ్నియు మైసూరురాష్ట్రమున నావిర్భవించినవి. చెయ్యేరు(బాహుదా నది) మాత్రము చిత్తూరుజిల్లా వాయల్పాడు తాలూకాలో పుట్టి పాల

కొండలగుండా ప్రవహించి పెన్నానదిని గలియుచున్నది. సాగిలేరు, కుందేరు, కర్నూలు మండలమునుండి పెన్నానదిని గలియుచున్నవి. ఈ నదులేవియును జీవనదులు గావు.

## అనంతపురము

ఈ మండలము రాయలసీమకు మధ్యప్రదేశము. దీని కుత్తరమున తూర్పున కర్నూలు, కడప మండలములు, దక్షిణ పడమట దిగ్భాగముల మైసూరు రాష్ట్రము గలవు.

ఈ మండలము దక్కను పీఠభూమిలో సముద్రమట్టమునకు 1500 లేక 2000 అడుగుల యెత్తున నున్నది. ఉత్తరమునుండిదక్షిణమునకు మల్లపకొండ బుక్కపట్టణము కొండలు, పెనుకొండ,కుందుర్పి దుర్గకొండ, మడకశిరకొండలు వ్యాపించియున్నవి. మధ్యభాగమున నాగసముద్రము కొండలు గలవు ఇవిగాక నక్కడక్కడప్రత్యేకముగా పర్వత దుర్గములు గలవు. ఇవిచరిత్ర ప్రసిద్ధములైన గుత్తి, పెనుకొండ కుందుర్పి, కళ్యాణ దుర్గములు.

ఉత్తర పినాకిని (పెన్న) మండలములోని ప్రధానవాహిని. ఇయ్యది హిందూపురము తాలూతా దక్షిణమున ఈ మండలములో ప్రవేశించి, ఉత్తరముగా పెనుకొండ, కళ్యాణదుర్గ, ధర్మవరముఅనంత. పురము తాలూకాలగుండా ప్రవహించి తూర్పు ముఖమై గుత్తి, తాడిపత్రి తాలూకాలలో పారి, కడప, నెల్లూరు మండలములలో జేరి సముద్ర గామి యగుచున్నది. చిత్రావతియు, దీని ఉపనదియైన జయమంగళియు చిన్న నదులు.

## చిత్తూరు మండలము

ఈ మండలము ఆంధ్రప్రదేశమునకు దక్షిణ పొలిమేర యందున్నది. తూర్పు దక్షిణములలో మద్రాసు రాష్ట్రము. పడమట మైసూరు

శాష్ట్రము గలవు. ఉత్తరమున కడప, నెల్లూరు, అనంతపురము మండల ములు గలవు. ఇది పర్వతమయ పీఠభూమి. మూడవవంతు అరణ్య ములు గలవు.

ఈ జిల్లాలోని నదులు ఒక మండలమున బుట్టి వేఱొక మండల మునకు తరలిపోవుచున్నవి. పాపఘ్నినది మైసూరు రాష్ట్రమున బుట్టి మదనపల్లి తాలూకా పడమటి భాగమున బ్రవహించి అనంతపుర మండలములో జేరుచున్నది. బాహుదానది ఉత్తరమున వాయల్పాడు తాలూకాలో ప్రవహించి, కడప మండలములో గలియుచున్నది. కౌండిన్యనది పలమనేరుతాలూకా ఈశాన్యభాగమున ప్రవహించి మదరాసు రాష్ట్రములో జేరుచున్నది. అల్లేపాలారునది. చంద్రగిరితాలూకాలో పుట్టిన స్వర్ణముఖి చంద్రగిరి, కాళహస్తి తాలూకాలలో ప్రవహించి నెల్లూరుమండలములో జేరుచున్నది. ఈనదులు జీవనదులుగావు.

## తెలంగాణము-భూగోళము

తెలంగాణమునకు తూర్పున గోదావరీ మండల ద్వయమును, మహేంద్రపర్వతములు, పడమట మైసూరు, మహారాష్ట్రములు, ఉత్తర మున మధ్యప్రదేశము, దక్షిణమున రాయలసీమ, గుంటూరు మండల ములు, కృష్ణానదియు గలవు. ఉత్తరమున గోదావరి ఆదిలాబాదు మండలమును కరీంనగర నిజామాబాదుమండలములను వేరుచేసి, మధ్య ప్రదేశములోని బస్తరు, చందాజిల్లాకు దక్షిణ సరిహద్దుగ ప్రవహించు చున్నది. ఈ భూభాగము దక్కను పీఠభూమి యందలి మధ్యభాగము నావరించియున్నది. సముద్రమట్టమునకు దాదాపు 1250 అడుగుల ఎత్తునున్న పీఠభూమి, అక్కడక్కడ సముద్రమట్టమునకు 2500 అడు గులు మొదలు 3500 అడుగుల ఎత్తువఱకును పర్వత శిఖరములు గలవు. సహ్యాపర్వతశ్రేణి అదిలాబాదుజిల్లాలో వాయవ్య దిశనుండి ఆగ్నేయ దిక్కునకు దాదాపు 175 మైళ్ల పొడవున వ్యాపించియున్నది.

## ముఖ్యమైన నదులు-ఉపనదులు

గోదావరి మహారాష్ట్రములో పుట్టి, ఆరాష్ట్రమును దాటివచ్చి నిజామాబాదు ఉత్తర సరిహద్దున తెలంగాణములో ప్రవేశించి, కరీంనగర, వరంగల్లు, ఖమ్మంమెట్టు మండలములకు ఉత్తరముగా ప్రవహించి తూర్పు పడమటి గోదావరి మండలముల మధ్యగా ప్రవహించి, తూర్పు సముద్రమును గలియుచున్నది. దీనికి మంజీరానది ముఖ్యమైన ఉపనది. ఇది నైరృతి దిక్కునుండి నిజామాబాదు జిల్లాలో జేరి, ఈ మండలములోనే కుందుర్తి వద్ద గోదావరిలో గలియుచున్నది.

తెలంగాణమునకు దక్షిణమున కృష్ణానదియు, తుంగభద్రయు గలవు. ఇయ్యవి మహబూబునగరము జిల్లాకు దక్షిణ సరిహద్దులు. దిండి నది, కల్వకుర్తి అచ్చంపేట తాలూకాలలో ప్రవహించి కృష్ణానదికుత్తరమున గలియుచున్నది. హైదరాబాదు మండలములో మూసి (ముచుకుంద) నదియు, వరంగల్లు జిల్లాలో పాలేరు మున్నేరు(మున్న) కిన్నెరసాని ముఖ్యమైన నదులు. మున్నేరు పాకాలచెరువు నుండి బయలుదేరి వైరానదితో కలిసి నూరుమైళ్లు ప్రవహించి కృష్ణానదిలో గలియుచున్నది. పాలేరు వరంగల్లు తాలూకాలో నుద్భవించి మున్నేరుతో సమానాంతరమున ప్రవహించి జగ్గయ్యపేటవద్ద కృష్ణానదిలో గలియుచున్నది. కిన్నెరసాని వరంగల్లు ఖమ్మముజిల్లాలలో ప్రవహించి గోదావరిలో గలియుచున్నది. మూసినది హైదరాబాదు, నల్గొండ మండలములలో ప్రవహించి వాడపల్లివద్ద కృష్ణానదిలో సంగమించుచున్నది.

మహబూబునగరముజిల్లా విస్తారము అరణ్యభాగము. ఆగ్నేయ భాగమున ఉత్తరము నుండి దక్షిణమునకు గుట్టలవరస కలదు. హైదరాబాదు మండలము గుట్టలమయము. మెదకుజిల్లాలో బాలాఘాటు పర్వత పంక్తికి జెందిన కొన్ని గుట్టలు గలవు. అదిలాబాదు జిల్లాలో

సహ్యాపర్వతశ్రేణి వాయవ్య దిశనుండి ఆగ్నేయ దిశకు 175 మైళ్ల పొడవున వ్యాపించి యున్నది. ఈమండలములో సాంద్రారణ్యములు, చిట్టడవులు సహితము గలవు. కరీంనగరముజిల్లాలో బాలాఘాటుపర్వత శ్రేణికి చెందిన మూడు పర్వత పంక్తులుగలవు. ఈమండలములో గోదావరీనదీతీర ప్రాంతభూమి సాంద్రారణ్యమయము. ఖమ్మంజిల్లా ఉత్తర తూర్పుభాగముల దట్టమైన అడవులు గలవు. నల్గొండజిల్లా గుట్టల మయము. నాల్గు అయిదు వరుసలు మండల మంతయు వ్యాపించి యున్నవి.

## తెలంగాణములోని గిరి దుర్గములు

తెలంగాణములోని భౌతికభూగోళము పరిశీలించినచో నియ్యది ఎక్కువగా పీఠభూమియనియు, అరణ్యప్రాంత మెక్కువగా నున్నదనియు, మిట్టలు గుట్టలు గల ప్రదేశమనియు దెలియుచున్నది. తెలంగాణము గిరిదుర్గములకు ప్రసిద్ధము, మెదకుజిల్లాలో మెదకుదుర్గము, నల్గొండజిల్లాలో భువనగిరి, దేవరకొండ దుర్గములు, ఖమ్మంజిల్లాలో ఖమ్మంమెట్టు దుర్గము(స్తంభగిరి), వరంగల్లుజిల్లాలోని హనుమకొండ-ఏకశిలానగరము, మహబూబునగరజిల్లాలోని పానుగల్లు, కొయ్యలకొండ దుర్గములు చరిత్ర ప్రసిద్ధములు.

## తెలంగాణములోని సముద్రములు

తెలుంగాణపీఠభూమిలో పూర్వకాలమున, అందునుముఖ్యముగా కాకతీయ చక్రవర్తుల రాజ్యపాలనమున ఆయారాజన్యులు, వారిదండనాయక సామంతులు ప్రజల సౌకర్యార్థము పెద్ద పెద్ద తటాకముల నిర్మించి, వారివారి పేరిట వానికి సముద్రములని పేరిడిరి. తెలంగాణా శాసన సంపుటములలోని కాకతీయుల శాసనములలో పేర్కొనబడిన కొన్ని సముద్రముల పేర్లు ఈ దిగువ సూచింపబడినవి.

మొదటి సంపుటము

శాసన సంఖ్య

7 పిల్లలమఱ్ఱి సముద్రము
విశ్వనాథ సముద్రము
గౌర సముద్రము
8 చౌండ సముద్రము
11 ఎఱుక సముద్రము
లక్ష్మి సముద్రము
12 నామ సముద్రము
20 కాచ సముద్రము
21 గణప సముద్రము
32 ప్రోల సముద్రము
34 తమ్మ సముద్రము
35 ఉదయాదిత్య సముద్రము

వర్షపాతము

ఆంధ్రప్రదేశములో వర్షము నైఋతి ఋతుపవనముల వల్లను, (జూన్-సెప్టెంబరు నెలలు) ఈశాన్యఋతు పవనములవల్లను సంభవించుచున్నది. ఈ నైఋతి ఋతుపవనములవల్ల కోస్తా జిల్లాలగు శ్రీకాకుళము, విశాఖపట్టణము, తూర్పు పశ్చిమగోదావరి కృష్ణా జిల్లాలలో వర్షపాత మెక్కువ; గుంటూరు నెల్లూరు మండలములలో తక్కువ. రాయలసీమలో ఒక్క కర్నూలు మండలములో తూర్పుతీరమునను్న గోదావరీ మండలములతో సరివచ్చు వర్షపాతము కలుగుచున్నది. మిగిలిన చిత్తూరు, కడప, అనంతపురములలో దానిలోసగము పాలె లభించుచున్నది. తెలంగాణములో ఒక్క నల్గొండ మండలములో

దక్క మిగిలిన మండలము లన్నిటియందు నీ ఋతుపవనములవల్ల సువృష్టి కలుగుచున్నది

ఈశాన్య ఋతుపవనముల (అక్టోబరు-డిశంబరు నెలలు) వల్ల ఆంధ్ర ప్రదేశములో కోస్తా మండలములకె వర్షపాత మెక్కువ లభించును. మిగిలిన రాయలసీమ తెలంగాణా ప్రాంతములకు వర్షపాతము బహుస్వల్పము.

## నేలలు

ఆంధ్రప్రదేశములోని నేలలను మూడు విధములుగ విభజింపవచ్చును. అవి నల్లరేగడి నేలలు, ఎర్రనేలలు, జిగురునేలలు, కొండభూములు

నల్లనేలలు గుంటూరు మండలము నందును, తెలుగాణ పశ్చిమ ప్రాంతమండలమునందును గలవు. నీటి పారుదల సమృద్ధిగ నుండిననే గాని వరి చెఱకు సస్యములు పండవు. లేనిచో మెట్టపైరులగు జొన్న సజ్జ మిరప మొదలైనవి వర్షాధారముచే పండును.

ఎర్రనేలలు తెలగాణములో నెక్కువగా నున్నవి. వర్షాధారమున పండ్లతోటలు పెరుగును. నీటి వసరులున్నచోట ప్రత్తి, చెఱకు పండును.

జిగురు నేలలు ఆంధ్రప్రదేశములో చాల తక్కువ. విశాఖపట్టణము, నెల్లూరు, చిత్తూరు మండలము లందున్నవి.

కొండభూములు, అడవినేలలు ఆంధ్రప్రదేశమునందు జిగురు నేలల వలెనే చాల తక్కువ.



# ప్రాచీనాంధ్రదేశ విభాగములు

## ద్వితీయ ప్రకరణము

### రట్ఠములు

బౌద్ధవాఙ్మయమునందు మధ్యదేశము, దక్షిణాపథములందలి దేశములలో అంధకరట్ఠము, కళింగరట్ఠము, చోళరట్ఠము, దమిళ రట్ఠము, మహారట్ఠము, సురట్ఠములను వివిధరట్ఠము లుగ్గడింప బడెను. అవి ఆంధ్రరాష్ట్రము, కళింగరాష్ట్రము, చోళరాష్ట్రము, ద్రవిడ రాష్ట్రము, మహారాష్ట్రము, సౌరాష్ట్రములను పేర బరగెడు నవీనదేశ ములు. అట్లే కమ్మాకరట్ఠము లేక కమ్మరాష్ట్రము. ఈ రట్టము, లేక రట్ఠము పల్లవరాజైన శివస్కంధవర్మ హీరహడగల్లి ప్రాకృతశాసన ములో చిల్లిరెక కోడుంక లేక చిల్లరెక కొడుంక గ్రామము శాతా వాని రఠములోనిదని చెప్పబడినది. అట్లే ఇక్ష్వాకుల రాజశేఖరుడైన శ్రీవీరపురుషదత్తుని జగ్గయ్యపేట ప్రాకృతశాసనములో కమ్మాక రట్ఠము పేర్కొనబడినది.

### హారము

అత్యంత ప్రాచీనమైన దేశవిభాగములో హారమొకటి. కర్నూలు మండలములో ఆదోని తాలూకాలో, శాతవాహనకుల రాజైన శ్రీపులమావి ప్రాకృతశిలాశాసనములో, శాతవాహనిహార జనపదములోని వేపురక గ్రామముదాహరింప బడినది. దీనినిబట్టి శాత వాహనిహార మొక జనపదముగా పరిగణింపబడినట్లు స్పష్టము. ఈ శాసనమందలి శ్రీ పులమావి వాసిష్ఠీపుత్ర రెండవ పులమావియై యుండుననియు, నియ్యది క్రీ. శ. రెండవ శతాబ్దికాలమునాటిదియై

యుండవచ్చుననియు శాసన పరిశోధకుల అభిప్రాయము. కొంచెము హెచ్చుతగ్గుగ నా కాలమునాటిదిగాని, తర్వాత శతాబ్దములోనిదిగాని బృహత్ఫలాయన రాజగు జయవర్మ కొండముది శాసనములో, 'కూడూరహారె గ్రామమ్ పాంటూరమ్,' అని కూడూరహారములో పాటూరు గ్రామము పేర్కొనబడినది. శాలంకాయన ప్రభువులగు విజయస్కంధవర్మ, నందివర్మల కంతేరు శాసనములలో,

> "శ్రీ విజయస్కంధవర్మణో వచనాత్కుడూహార
> చిత్తపురే" యనియు, "శ్రీ నందివర్మే కుద్రాహారే
> విషయే కురువాడ గ్రామే"

యనియు నీ కూడూరహారమె పేర్కొనబడినది. నందివర్మ శాసనమునుబట్టి కుద్రాహారమొక విషయముగ పరిగణింపబడెననుట స్పష్టము. అనగా హారమనిన విషయమునకు పర్యాయపదమని చెప్పనగును. ఈ కూడూరహారమె తూర్పుచాళుక్యుల కాలమున కుద్రాహార మయ్యెనని శాసనములవల్ల విదితము.

## రాష్ట్రము

పల్లవుల కాలమునాటి సంస్కృత శాసనములలో రాష్ట్రమె బహుళముగ వాడబడినది. రెండవ విజయస్కందవర్మ ఒంగోడు శాసనములోను, మూడవ కుమారవిష్ణువు చెందలూరు శాసనములోను, సింహవర్మ ఒంగోడు శాసనములోను ఆ గ్రామములు కర్మరాష్ట్రము, కమ్మాంక రాష్ట్రములోనివిగ చెప్పబడినవి. సింహవర్మ పికిర, బుచ్చిరెడ్డిపాలెము శాసనములలో నా గ్రామములు ముండరాష్ట్రములోనివని వక్కాణింప బడెను. రెండవ సింహవర్మ మాంగడూరు శాసనములో వెంగోరాష్ట్రము పేర్కొనబడినది. ఈ వెంగోరాష్ట్రమె తర్వాతి వెంగనాడు. అట్లే కమ్మరాష్ట్రమునకు కమ్మనాడనియు, ముండరాష్ట్రమునకు ముండనాడనియు తర్వాతి కాలమునాటి శాసనములలో నుదా

ఖ్యాత మయ్యెను. ఆ విధముననే పాకరాష్ట్రము, పాకనాడు, దేవ రాష్ట్రము - కురకరాష్ట్రమను చిన్న చిన్న విభాగములు గలవు.

## పథము

పల్లవ యువమహారాజైన శివస్కందవర్మ యొసగిన మైదవోలు ప్రాకృత శాసనములో ఆంధ్రదేశమునకు ఆంధ్రపథమని పేరు చెప్పబడినది. బాణరాజులలో నత్యంత పూర్వుడైన జయనందివర్మ పాలించిన రాజ్యము "ఆంధ్రాత్ పథః పశ్చిమతో క్షితిః" అని రెండవ విక్రమాదిత్యుని ఉదయేంద్రియము తామ్రశాసనములో చెప్పబడినది.

## మండలము

బాణరాజైన మల్లదేవుని ముడియానూరు తామ్రశాసనములో ఆంధ్రమండలము పండ్రెండువేల గ్రామపరిమితమని చెప్పబడినది. 'ఆంధ్రమండల ద్వాదశ సహస్రగ్రామ సంపాదిత.' మని దానియందు గలదు. ఇయ్యది నాల్గవ శతాబ్దినాటిది. ఈ ఆంధ్రమండలమునకే 'వడుగావళి పండ్రెండువేలు' అను నామాంతరము. అనగా ఆంధ్ర మండలమన్నను వడుగావళి యన్న నొక్కటే. ఇదియే మండలము నకు కొన్ని సంఖ్యల గ్రామములు గలిపిచెప్పుట ప్రథమమేమొ యని స్ఫురించుచున్నది. తర్వాతి కాలమునాటి శాసనములలో వేంగీమండలము - వేంగిరాష్ట్రము - వేంగీవిషయము అని మండలమునకు పర్యాయపదముగ నొకేదేశభాగమునకు రాష్ట్ర, విషయపదములు జేర్చబడినవి. ఇట్లే కోనమండలము, కోనరాష్ట్రము, కోనదేశము.

## విషయము

సంస్కృతాంధ్రసారస్వతములందును, శాసనములందును వివిధ కాలములందు దేశవిభాగమును సూచించు సర్వజనవిదితమైన పదము. ఆంధ్రవిషయము, వేంగివిషయము, పాకవిషయము, చీకూర విషయ

ములు మొదలగు వివిధ విషయములు మనకు తెలియవచ్చుచున్నవి. విస్తీర్ణమందు పెద్దది, చిన్నది యను భేదమించుకయులేక వివిధ ప్రాంతముల కీ నామముపయోగింపబడినది. వేంగివిషయమునకె వేంగి మండలము, వేంగిరాష్ట్రము, వేంగినాడను పేర్లుగలవు. పాకవిషయమునకు పాకనాడనియు పేరు కలదు. అనగా మండలము, రాష్ట్రము, విషయము, నాడు పర్యాయపదములుగ వాడబడెను.

## నాడు

ఆంధ్రదేశమున ప్రాచీనరాజకీయ విభాగములలో ప్రసిద్ధమును, బహుళవ్యాప్తియు గాంచిన దేశ వాచకము నాడు. నేడది వ్యాప్తిలో లేకపోయినను బ్రాహ్మణ బ్రాహ్మణేతర శాఖాసాంఘిక వ్యవస్థతో సుస్థిరమై యున్నది. వెలనాట్లు, వేగినాట్లు, కాసలనాట్లు, ములికినాట్లు, తెలగాణ్యులు, కమ్మనాట్లు, పాకనాట్లు మొదలగు శాఖాభేదములు నేటికిని నిల్చియున్నవి.

ఈ నాడనునది "మండలము"న నంతర్భాగము

1. చోడమండలమున వెలనాణ్టి పెరుంబణ్ణూరు.
2. జయగొండ చోడమండలములోని అంగడిపట్టనాడు.
3. త్రిలింగ విషయములోని వెలనాడు విజయనగర సామ్రాజ్య కాలమున "రాజ్యము"లో నంతర్భాగము.

1. ఉదయగిరి రాజ్యము—పాకనాడు.
2. చంద్రగిరి రాజ్యము—పడనాడు.
3. కొండవీటి రాజ్యము—ఏరువనాడు.

నాడు కొట్టములోను, వలనాటులోను నంతర్భాగముగ సూచింప బడినది.

చాళుక్యచోళుల పరిపాలన కాలమున వారు పాలించిన ఆంధ్ర ప్రదేశ భూభాగమునకు కులోత్తుంగ చోళమండలమనిన్ని జయగొండ

చోళమండలమనిన్నీ రాజేంద్ర చోళమండలమనిన్నీ, ఆ యా రాజ్యముల బిరుదు నామములతో ఆంధ్రభూమండలము వెలయుచుండెను. ఈ మండలములే వలనాడులుగను, కొట్టములుగను, నాడులుగను విభజింపబడుచుండెను.

1. జయగొండ చోళమండలము — జయకుల మాణిక్యవలనాడు— పడై నాడు—విక్రమసింహపురము.
2. జయగొండచోళమండలము—పైయూరిలన్ కొట్టము — కీళ పట్టనాడు-తిరువంజూరు.
3. రాజేంద్రచోళమండలము-పవ్వత్తిరికొట్టము పేరూరునాడు - పాండురంగము.
4. కులోత్తుంగ చోడమండలమున గంగైకొండ చోడవలనాటి సకటమంతనినాటి రాజనారాయణపురము.

## వలనాడు

చోళచాళుక్యులకాలమున మండలములోని ప్రథమయంతర్భాగమని మండలమును గూర్చి వ్రాసిన సందర్భమున సూచింపబడినది.

1. ఉత్తమచోడవలనాంటి కమ్మనాంటి ప్రేంపల్లి శ్రీ భావనారాయణదేవర (బాపట్ల శాసనము)
2. గంగైకొండ చోళవలనాంటి సకటమంతనినాడు.

ఈ వలనాడుల ప్రసక్తి చోళచాళుక్యుల పరిపాలనమంతరించిన వెనుక శాసనములందు లేదు.

## రాజ్యము—మహారాజ్యము

రెడ్డి, కాకతీయ, విజయనగరసామ్రాజ్య పరిపాలనల కాలమున నీ 'రాజ్య'పదము వారు పాలించిన రాజ్యవిభాగములకుగాని, సామ్రాజ్యాంత

గతములగు వివిధదేశ విభాగములకుగాని రాజ్యపదము వ్యవహారసిద్ధ మయ్యెను. ఈ రాజ్యములకు ముఖ్యనగరములు దుర్గములు:—పెను కొండ రాజ్యము – పెనుకొండ దుర్గము – కొండవీటి రాజ్యము – కొండవీటి దుర్గము- చంద్రగిరి రాజ్యము – చంద్రగిరి దుర్గము– గుత్తి రాజ్యము – గుత్తి దుర్గము. పెనుకొండ రాజ్యము – పెను కొండ మహారాజ్యము. కొండవీడు. రాజ్యము – కొండవీడు మహా రాజ్యము.

ఈ రాజ్యములే పరిపాలన సౌకర్యార్థము సీమలుగను విభజింప బడినవి. కొన్నిటియందు నాడులుగలవు.

1. ఉదయగిరి రాజ్యాన పొదిలిసీమ, కందుకూరి సీమ.
2. కొండవీటి రాజ్యంలోని అద్దంకి, అమ్మనంబ్రోలు సీమలు.
3. గుత్తిరాజ్యంలో నున్న గుత్తిసీమ, పెన్నబడిసీమ.
4. పెనుకొండరాజ్య రొదనాడు లేక రొదసీమ.
5. ఉదయగిరి రాజ్యంలోని పాకనాడు.
5. రాయదుర్గ రాజ్యములోని అగలిసీమ.

## సీమ

సీమ రాజ్యములో నంతర్భాగమని పైని సూచింపబడినది. ఈ రాజ్యవిభాగము రెడ్డి, కాకతీయ విజయనగర సామ్రాజ్యకాలములందు ఎక్కువ వెలయుచుండెను. విజయనగర సామ్రాజ్యకాలమున వందల కొలది గలవు. కాకతీయుల కాలమున నతవాటిసీమ, మెదకుసీమ మొదలైన సీమలు గలవు రెడ్లకాలమున కడలునాడు, కడలి సీమ యని వ్యవహరింప బడినవి. ఈ సీమలు కృష్ణానదీ దక్షిణప్రాంతమగు ఆంధ్రప్రదేశము గల శాసనములలో నెక్కువగా నున్నవి.

## పడి-బడి-పాడి-వాడి

ఈ సీమా విభాగము ముఖ్యముగా కృష్ణకు దక్షిణమున నున్న ఆంధ్రదేశములోగల ప్రాచీన కన్నడాంధ్ర శాసనములలో గాన్పించు చున్నది.

1. పెరుంబాణప్పాడి-ఇది బాణరాజులు పాలించిన ప్రాంతమునకు పేరు.
2. గుత్తిరాజ్యంలోని పెన్నంబడి లేక పెన్నబడిసీమ.
3. గుంటూరు మండలములో చాళుక్యశాసనములలో కండేయవాడి, కొండనతవాడి, మొదలగునవి వెలనాటిలో కంద్రవాడి యంతర్భాగమని మాలాక్కపుర శాసనములో నున్నది.
4. గుద్దవాడి లేక గుద్దవాడి నాడు.
5. గంగపాడి లేక గంగవాడి; నోలంబపాడి లేక నోలంబవాడి, సిందపాడి లేక సిందవాడి; రట్టపాడి లేక రట్టవా.డి

హారమునకు పూర్వరూపము పారమనిన్నీ, ఈ పారమె పాడి, వాడి, పడి, బడి యను వివిధ రూపములు దాల్చెననియు, ఈ పదమునకు మార్గము, పథము, స్థలము, లేక సీమ యర్థమనియు శాసన పరిశోధకుల యభిప్రాయము.

## వళితము

ఈ సీమా విభాగము రాయలసీమలోని కన్నడ శాసనములం దెక్కువగా గన్పించుచున్నది. అందును విజయనగర సామ్రాజ్య కాలమునందె ఈ విభాగము ఎక్కువగా నున్నది.

చంద్రగిరి రాజ్యములోని గుత్తివళితము.

హస్తినావతి యందలి ఆదవాని వళితము.

3. హస్తినావతి వళితములోని మూడనాడు. కన్నడభాషలో వళిత మనగా మండలము, రాజ్యభాగము, సామంతమండలము, అని యర్థము.

## వెంఠ

పై విధముననే వెంఠయను దేశవిభాగము విజయనగరరాజుల శాసనములలో గన్పించుచున్నది.

1. హస్తినావతిలోని మూడనాటి యందలి రాయదుర్గ వెంఠలోని ఉరవకొండసీమ.
2. రాయదుర్గ వెంఠలోని అగలిసీమ.
3. రాయదుర్గ రాజ్యములోని వేపరాల వెంఠ.

ఈ వెంఠ రాజ్యములో నంతర్భాగము. వెంఠలోని యంతర్భాగము సీమ.

## మాగాణి లేక మాగణి

ఈ విభాగము విజయనగరరాజుల, ఆంధ్రకన్నడ శాసనములలో గన్పించుచున్నది.

1. గుత్తిసీమలోని పులియేరు మాగాణి.
2. గుత్తిరాజ్యములోని చీర మాగాని.
3. గుత్తిరాజ్యములోని హొంనెయ మాగాని.
4. జగదాపి గుత్తిసీమలోని పెన్నబడి మాగాని.
5. జగదాపి గుత్తిసీమలోని పెన్నబడి.

కన్నడ భాషలో మాగాణి లేక మాగణి పదమునకు A part of Taluk or District అనగా జిల్లా లేక తాలూకాలోని అంత ర్భాగమని పేరు. పై శాసనోదాహరణముల ననుసరించి, మాగాణి,

పడి, లేక బడికి పర్యాయపదముగ నుపయోగింప బడినదని తెలియు చున్నది.

## స్థలము

స్థలమనగా a field, tract, a district. భూమి, ప్రదేశము మండలమని యర్థము.

కాకతీయ, విజయనగర రాజుల కాలములలో నీ సీమా విభాగము కలదు.

1. కందుకూరి స్థళంలోని బముపాడి (వేంపాడు) అనే యూరు.
2. ఆటులూరి పెళ్తూరి స్థలము యెన్మిది యూళ రెడ్లను.
3. పానుగంటి స్థలము.
4. రాయదుర్గ రాజ్యములోని అగలి సీమలోని రత్నగిరి స్థలము.
5. పెనుగొండ రాజ్యములోని రొడ్డనాటి తుంబికెళ్ళ స్థలము.
6. రాయదుర్గ స్థలములోని అగలి స్థలము.

పై యుదాహరణములను బట్టి రాజ్యము, స్థలము, సీమ దేశ వాచకములుగా గన్నట్టు చున్నవి. స్థలమనగా కొన్ని గ్రామములు గల నేటి Firkaతో సరిపోవును.

## భోగము

భోగమనగా నొక మండలములోని యంతర్భాగము. ఇదియు అధునాతన అర్వాచీన శాసనములందును ప్రయుక్తము.

కవచకార భోగము. (కమ్మరాష్ట్రము లోనిది)
ఓంకారభోగము. (కళింగములోనిది)
హేంద్రభోగము. (కళింగములోనిది)

## దండపాట

గజపతుల పాలనములో రెడ్డి విజయనగర రాజులకాలమునాటి రాజ్యములకు, సీమలకు, దండపాటలని పేరువచ్చెను.

కళింగ దండపాట.
కొండపల్లి దండపాట.
కొండవీటి దండపాట.
అద్దంకి దండపాట.
అమ్మనంబ్రోలి దండపాట.

## కంపనము

ఇదియు నొక దేశవిభాగము. రాయలసీమలోను నెల్లూరు మండలములోను గల శాసనములలో గన్పట్టుచున్నది. కన్నడభాషలో కమ్పణ మనగా నొక మండలము (District లేక విషయము) అని యర్థము.

నెల్లూరు మండల శాసన సంపుటములలో దర్శి (25) శాసనములో "శ్రీ త్రిపురాంతక దేవర దివ్య శ్రీ పాదపద్మారాధకులైన శ్రీమతు శాంతశివగురుదేవరకు 'అమవకలమూరి కంపనము'లోన పలికించిన చలమర్తి గంగాపురమనెడి యూరు" అని యొక కంపనము పేర్కొనబడినది (శా. శ. 1177). అట్లే త్రిపురాంతకములోని శాసనములో కొన్ని 'కంప్పణములు' పేర్కొన బడినవి. కొన్ని పేర్లు మాత్రము శాసనములో శిథిలమైనవి. ఆ కంప్పణములలో బేర్కొనబడిన గ్రామనామములు శేషించియున్నవి.

1. ...కంప్పణములోన చెఱవు బమ్మశూరు సోమపల్లి, ఉక్కమెపల్లి, యునిమడ్లపాడు.

2. నుదుపలి కంప్పణములోని రామసముద్రము నాగసానిపల్లి.

ఇంకొక శాసనములో కాకతీయ గణపతి దుప్పలి కంపనములో బోయలపల్లిని రెడ్లపల్లి పొలము చతుస్సీమముగా త్రిపురాంతకదేవునికి సకలాయసహితముగా నిచ్చెనని కలదు (శా. శ. 1172). ఈ దువ్వలి కంపనమె త్రిపురాంతకములోని గణపతిదేవుని కాలమునాటి మఱియొక శాసనమునందు దువ్వని కంపనములోని కెంకులకుంటగ్రామముదాహరింప బడినది (శా. శ 1176) (S. I. I. Vol X No. 258, 332, 343).

## కొట్టములు

ఈ కొట్టముల ప్రశంస నెల్లూరి మండలములోని తమిళ శాసనములం దెక్కువగా గన్పించుచున్నది. బోయకొట్టములు, పై యూరిలన్ కొట్టము, పవ్వత్తిరికొట్టము మొదలైనవి. బోయకొట్టములకు తెలుగు శాసనములలో బోయవిషయ దేశములని పేరు గలదు. ఈ కొట్టములు మండలములో నంతర్భాగములు.

## భూమి

భూమి యనునది యొక చిన్నవిభాగముగ జెప్పవచ్చును. ఆంధ్రశాసనములలో కోటభూమి మొదలైన దేశవిభాగములు చెప్పబడినవి.

## పాంచాలి

పూర్వగాంగుల శాసనములలో పాంచాలి యను దేశ విభాగమొకటి ఉదాహరింప బడినది. ఒక్కొక్క పాంచాలిలో నంతర్భాగము పంచగ్రామములు గలిసి యుండనోపును. ఇట్లే కొరాసోడక పాంచాలిలో తాలుమూల, కొరాసొండ గ్రామములు చెప్పబడినవి. శాసనోదాహృతములైన కొరాసోడక పాంచాలి, పుష్యగిరి పాంచాలి,

దేవన్నపాంచాలి, చిఖలీపాంచాలి ముఖ్యాసులు. వీనిస్థితిని ఇతమిత్థమని నిర్ణయించుటకు వీలులేకున్నది. ఇవి యన్నియు నేటి ఒరిస్సా రాష్ట్రములో గంజాము మండలములోని పర్లాకిమిడి తాలూకాప్రాంతమని చరిత్రపరిశోధకుల యభిప్రాయము.

## ప్రాచీనదేశ విభాగముల విస్తీర్ణము-గ్రామపరిమాణము

ప్రాచీనాంధ్రదేశ విభాగముల విస్తీర్ణమునకు గ్రామమె పరిమాణమై, ఆయాదేశ విభాగములు గ్రామసంఖ్యా పరిమితములని కర్ణాటాంధ్ర శాసనములందును, ఆంధ్ర సంస్కృత కావ్యములందును జెప్పబడినది. ఈ పద్ధతి ముఖ్యముగా ఎనిమిదవ శతాబ్దము మొదలు పదమూడవ శతాబ్దము వఱకు గల కన్నడ శాసనములందు బహుళముగ జూపట్టుచున్నది. కొన్ని ఉదాహరణము లిందు పొందుపరుబడినవి. కన్నడములో సాసిరమనగా వేయియని యర్థము.

| | | |
|---|---|---|
| 1. బాణులు | గంగలు సాసిరము (1000) | పుంగనూరు జమిందారి |
| 2. నోలంబ పల్లవులు | ,, ,, | ,, |
| 3. రాష్ట్రకూటులు | సిందవాడి సాసిరము (1000) | ఆదోని తాలూకా |
| 4. కల్యాణి చాళుక్యులు | ,, ,, | ,, |
| | నోలంబవాడి | ,, |
| | మూవత్తిరచ్చసిరము (32000) | ,, |
| | కొత్తమూనూఱు | గుత్తి |
| | కణియకల్లు మూనూరు | ,, |

| | | |
|---|---|---|
| | కన్నెమూనూఱు | నందికొట్టుకూరు |
| | నఱవాడి అయనూఱు | ,, |
| | వెంగి పదినాల్కు సాసిరము (14000) | బాపట్ల |
| | వెంగి పన్నిర్చాశిరము (12000) | ,, |
| | కొండపల్లిమూనూఱు (300) | మార్కాపురము |
| | ఎమ్మెదల యెఱుసాసిరము (6000) | ... |
| | ఆదవని యయనూఱు (500) | |
| 5. కాలచుర్యులు | కందుకూరిర్వత్తు నాల్కుఊళు (24) | ఆదోని |
| 6. రేనాటి చోళులు | రేనాడెళ్ళత్తు (70) కన్నెమూనూఱు(300) | ప్రొద్దుటూరు |

పై విధముగనే విష్ణుకుండిన, పూర్వచాళుక్య, రేనాటి పాకనాటి, వెలనాటి చోళుల శాసనములందును, నాటికావ్యములందును ఆయా మండలములు ఆయా సంఖ్యాకములని వివరింపబడినవి.

| | | |
|---|---|---|
| 1. విష్ణుకుండినులు | దశశతసకల ధరణీతలము (వేంగివేయి) | |
| 2. రేనాటి చోళులు | రేనాణ్డు ఏఱువేలు (7000) | పులివెండ్ల |

| | | |
|---|---|---|
| 3. | పూర్వచాళుక్యులు | ద్వాదశసహస్ర ప్రమాణం వేంగిమండలము |
| | | ,, షోడశ సహస్ర |
| | | ,, ప్రదదౌ వేంగి మండలం |
| 6. | పాకనాటి చోళులు | పాకనాటి యందిరువది యొక్కవేయి (కుమారసంభవ పీఠిక) ఏకవింశతి సహస్రగ్రామ సంఖ్యాకము (21000) (కేయూర బాహుచరిత్ర పీఠిక) |
| 7. | వెలనాటి చోళులు | ఆఱువేల వెలనాడు త్రిశతోత్తర షట్సహస్రావని ఆఱువేలు గిరిపశ్చిమ దేశము (కొండపడుమటి దేశము) "త్రిసప్తతి గ్రామవతీం మహీం" (70) |

శ్రీ మదాంధ్ర స్కాందపురాణాంతర్గత కౌమారికా ఖండము తృతీయాశ్వాసమునుండి ఉదాహరణములు :—

వ॥ ఆ డెబ్బదిరెండు విభాగముల పేరులు గ్రామపత్తన వేలాకూలంబుల నెఱుంగింతు — లక్ష గ్రామములు నేపాళమందును,

ముప్పదియాఱు లక్షల గ్రామములు కాన్యకుబ్జమునందును, బదునెని మిదిలక్షలు గౌడదేశమందును......తొమ్మిదిలక్షలు కామరూపంబు నందును డాహాళంబునందు నవలక్షలును......ద్రవిడవిషయంబున సార్ధలక్షత్రయంబును...గుర్జరాత్రంబున డెబ్బదివేలును...పాండువిష యంబున సప్తతి సహస్రంబును..కొంకణంబున ముప్పదాఱువేలును, లఘుకొంకణంబున బదునాల్గునూర్లు నలువదియును...రామక దేశం బున బదునెనిమిది కోటులును, తోమర కర్ణాట యుగళంబులను మూఁడు దేశములందు వేఱు వేఱు సపాదలక్షయును...కాంభోజ కోసలలందు బదేసి లక్షలును.. విదర్భ విషయంబున బంచలక్షలును... మాగధంబున నలువదియాఱువేలును...ఇట్లు డెబ్బది రెండు దేశంబు లందు గ్రామసంఖ్య చెప్పబడియె. ఇట్లు భరతఖండంబునఁ దొంబది యాఱుకోట్లు గ్రామములు గలవు. డెబ్బదియాఱులక్షలు పత్తనంబులు గలవు. వేలాకూలంబులు ముప్పదాఱువేలు గలవు. ఇట్లు విభజించి ఖండంబుపాలింప నక్షత్రంబులుగాఁ దొమ్మండురకు నొసంగె."

కౌమారికా ఖండము. తృతీయాశ్వాసము (పుటలు 829. 830).

పై భాగమంతయు స్కాందమహాపురాణము నందలి మహే శ్వరఖండాంతర్గత కౌమారికాఖండమందలి నుప్పదితొమ్మిదవ అధ్యా యము నుండి శ్రీ శేషాద్రిశర్మగారు తెనింగించిరి. సంస్కృత భాగ ముదాహరించుట గ్రంథవిస్తరభీతిచే మానుటయైనది.

ఇట్లే పాల్కురికిసోమనాథుడు పండితారాధ్య చరిత్రము-పర్వత ప్రకరణములో కొన్ని దేశములు గ్రామసంఖ్యాకములుగ వర్ణించి యున్నాడు.

లక్షింపంగ సపాదలక్ష నేపాల
మీక్షింపంగ సపాదలక్ష సంజనిత
క్షీక్షింపంగ సపాదలక్ష కేదార

మీఱింపంగ సపాదలక్ష త్రిగర్తి
లక్షింపంగ సపాదలక్ష కాశ్మీర
మీఱింపంగ సపాదలక్ష కనోజ
లక్షింపంగ సపాదలక్ష కొంకణ
మీఱింపంగ సిరహట్టమిల సపాదలక్ష
క్రమమొంద సార్ధరంబది లక్ష
ప్రమితయౌ దశలక్ష బంగాళభూమి
గురిసప్తతి సహస్ర గుజరాష్ట్రభూమి
మరి యట దశలక్ష మాళవభూమి
జానొంద నవలి పంచద్రావిళముల
లో నవలక్ష తెలుంగు దీనికిని
యిమ్మడి ముమ్మడి యితరదేశములు

అదే విధముగ వినయచంద్రుండు కావ్యశిక్ష యను గ్రంథములో ఆయా దేశములెన్ని గ్రామపరిమితములో నిట్లు వ్రాసియున్నాడు.

'నవసహస్రాణి సురాష్ట్రః । ఏకవింశతి సహస్రాణి
లాటదేశః । సప్తతి సహస్రాణి గుర్జరోదేశః
పారతశ్చ। ........

(చూడుడు కావ్యమీమాంస- పుట 248-249).

## గ్రామము-పదనిర్వచనము

గ్రామసంఖ్య కొందఱు చరిత్రకారులు ఆయా దేశముల రాబడిని కొన్ని నిష్కములలో తెలుపు విధానమని తెలిపియున్నారు (Revenue value attached to the name). వేఱొకరు గ్రామ మనగా పన్ను విధించుటకు లోబడిన స్థలమని నిర్వచించిరి (Subject of assessment). మరికొందఱు గ్రామము క్రోశపరిమితిగల స్థలమని వ్రాసియున్నారు (Grama - a piece of land the area of

which is a kros with a yield of 1000 silver Varsas) ఇంకొందరు గ్రామమనగా ఒక్క నాగలితో దున్నుటకు తుల్యమగు భూభాగమని యూహించుచున్నారు (Area which coulo be ploughed with a single plough). ఏది యెట్లయినను గ్రామ పద నిర్వచనము సులభసాధ్యముగలేదు. ఈ సంఖ్య లతిశయోక్తిగా తలపనగునని యూహింపవచ్చును.

## దేశవిభాగములు-నామోత్పత్తి విధానము

ప్రాచీనదేశ విభాగములకు నామములెట్లు కల్గెనో నిరూపించుట కన్నిటియందును సాధ్యము కాదు. కొన్నిటియందు మాత్రము కారణములు నిరూపింపవచ్చును.

### 1. జాతుల నివాసస్థానము

ప్రాచీనకాలమున హిరణ్యకుల కావాసమౌటచే హిరణ్యరాష్ట్రమనియు, పూగీయుల వాసభూమియౌటచే పూగిరాష్ట్రమనియు ముండీయుల వాసస్థానమగుటచే ముండరాష్ట్రమనియు పేర్లు వచ్చియుండునని కొందరు చరిత్ర పరిశోధకుల యభిప్రాయము. ఇట్లే ములకజాతివారి కాణాచి యౌటచే ములకనాడని పేరు కల్గెనని కొందరి యభిప్రాయము.

### 2. రాజవంశములలో సుప్రసిద్ధులగు మూలపురుషుల నామములు

భరతఖండమునకు పేరు భరతుడు పాలించుటచేత కల్గినట్లే, మహాబలికుమారుడైన బాణుని వల్ల వంశమునకు బాణవంశమను పేరు వచ్చి వారుపాలించిన భూభాగమునకు బాణప్పాడి యని పేరు వచ్చెను.

త్రినయనుని వంశములో పుట్టిన నోలంబాధిరాజను మారు పేరుగల మంగళుడను మూలపురుషునిచే, నోలంబపల్లవు లేలిన రాజ్యమునకు నోలంబవాడి యను అభిధేయము కల్గెను.

పశ్చిమ. పూర్వగాంగుల శాసనముల బట్టి వీరు గంగానదితో సంబంధము కలిగినట్లు తెలియుచున్నది. ధనంజయునికు మారుడు హరిశ్చంద్రుడు. అతని సంతతివాడు భరతుడు, అతని భార్య విజయమహాదేవి. ఆమె గర్భవతిగా నున్నకాలములో తన మాంద్యము తగ్గించుకొనుటకు గంగానదిలో స్నానము చేసిన తర్వాత కొంతకాలమునకు కుమారుడు గల్గెను. అతనికి గంగాదత్తుడని పేరు పెట్టిరి. వీని సంతతివారె గంగులు. తూర్పుగాంగుల శాసనముల ననుసరించి, యయాతి మనుమడును, తుర్వసు కుమారుడునగు గాంగేయుని సంతతివారు గంగులైరి. కాబట్టి వీరు పాలించినదేశమునకు గంగపాడి, లేక గంగ రాజ్యమని పేరు వచ్చెను.

## 3. భౌతికస్థానము

దేశమునందలి యా యా ప్రదేశముల భౌతికస్థితిని బట్టి, పేర్లు కల్గెనని భావించవచ్చును.

| | |
|---|---|
| 1. గిరిపశ్చిమము కుత్కీలప్రత్యగుర్వి | కొండకు పడమటి దేశము - కొండవీటి కొండకు పడమటి భాగము. |
| 2. కడలునాడు లేక కడలి సీమ | గోదావరి మండలములోని -సముద్రతీర సీమ (కడలు=సముద్రము). |
| 3. కోనమండలము, | తూర్పుగోదావరి మండలములోని గౌతమీ వసిష్ఠనదుల మధ్యభాగము - కోణమనగా మూల, అంచు అని యర్థము. ఈ మండలమునకు మూల, అంచున నున్న ప్రదేశము. |
| 4. పాకనాడు | : పాక్క మనగా నపరవభాలో తీరమని యర్థము. నెల్లూరు మండలములోని సముద్రతీర ప్రాంతమునకు పాకనాడని పేరు వచ్చియుండును. |

| | |
|---|---|
| 5. సింధుయుగ్మాంతర దేశము. | ఇది యే తూర్పు గోదావరి మండలము లోని రెండేఱుల నడిమి విషయము. గౌతమీ వశిష్ఠానదుల మధ్య నున్న భాగము. |
| 6. ఒంగేఱు మార్గము గుండికర్తి లేక కర్తి | ఒంగేఱు నదికి ఇరుతటముల గల ప్రదేశము. కరయనగా తీరము. గుండికర్తి యనగా గుండ్లకమ్మకు ఇద్దరి, అద్దరి నున్న ప్రదేశము. |

## 4. ముఖ్యపట్టణములు

ఆ యా రాజ్యముల యొక్కగాని, నాడులయొక్కగాని, సీమల యొక్కగాని ముఖ్యపట్టణము పేర, ఆయా దేశవిభాగములకు పేర్లు కల్గెనని యీ క్రింది ఉదాహరణమువల్ల స్పష్టము.

*కొండవీటి, ఉదయగిరి, చంద్రగిరి, పెనుగొండ* మొదలైన రాజ్యములు.

*పొత్తపినాడు, వేంగినాడు,* దిమిలినాడు.

*అత్తిలి* విషయము.

*అద్దంకి* సీమ.

*కోటభూమి* (ధరణికోట)

## 5. ప్రభువుల బిరుదు నామములు

చాళుక్య చోళులు ఆంధ్రదేశములోని వేంగినాటిని ద్రావిడ దేశమునందలి గంగైకొండ చోళపురము నుండి పరిపాలించినపుడు వారి బిరుదనామముతో వారి పాలనము క్రిందనున్న భూభాగమునకా నామధేయములుండెను. రాజేంద్రచోడుని బిరుదనామమైన కులోత్తుంగాభిదానము వలన కులోత్తుంగ మండలమనియు దానిలో నంతర్భాగమునకు గంగైకొండవలనాడనియు బేర్లు వచ్చెను.

## మూడవ ప్రకరణము

## చారిత్రక భూగోళము



ఒకజాతి చరిత్ర, సంస్కృతి యాజాతి నివాసభూమి యొక్క భౌతికభూగోళ వివరణముపై నాధారపడియున్నది. ఆ జనపదములోని పర్వతారణ్యావిన్యాసము, నదీనదుల ప్రవాహాగమనము, పరిసరప్రదేశముల స్థితి, ఖనిజసంపద, శీతోష్ణస్థితి, వర్షపాతము, మొదలగువాని ప్రభావము ప్రస్ఫుటము చేయుటయే చారిత్రక భూగోళముయొక్క ప్రధానోద్దేశము ఆంధ్రప్రదేశము భౌతికభూగోళమును గూర్చినవివరములు పరిశీలించి, ఆంధ్రుల చరిత్రపై వాటిప్రాబల్యము నీపరిచ్ఛేదము నందు విశదీకరింపబడుచున్నది.

ఆంధ్రదేశము త్రిభాగములుగ విభజింపబడి, యాభాగములు భౌతిక ప్రవృత్తులు నిరూపింపబడినవి. అట్లేయాయా ఖండములచరిత్ర పై భూగోళ ప్రభావమెట్లు పరిఢవిల్లెనో స్పష్టముగ కనుగొనవచ్చును.

### పూర్వసముద్రము

భరతఖండములోని సముద్రతీర దేశములైన వంగ, కళింగ, ఆంధ్ర, ద్రవిళ, కేరళ, కర్ణాటక, మహారాష్ట్ర, ఘూర్జర దేశము, లెని మిదింటిలో నీ దేశమొకటి. ఇప్పటి భరతఖండము సముద్రతీరము 3500 మైళ్లు, ఒక్క ఆంధ్రదేశముయొక్క సముద్రతీరమె 600మైళ్లు

కాళిదాసు రఘువంశములో రఘువంశ మహారాజుల వర్ణించుచు వారిని ఆసముద్రక్షితీశులనియు, వారి సామ్రాజ్యమునకు సముద్రమే పరిఖయనియు జెప్పియున్నాడు. కాని ఆంధ్రమహీశులు పూర్వసముద్రాధీశ్వరులు; ఆంధ్ర భూమండలమునకు తూర్పున సముద్రము పెట్టని

యగడ్త. ఆంధ్రధరిత్రీశ్వరులను పూర్వసాగరము పగరాజన్యుల దండయాత్రల నుండి పరిరక్షించుచుండెను. దక్షిణోత్తర ప్రతీచీ దిశలనుండి మాత్రము దేశమున కెప్పుడును భంగము కలుగుచునే యుండెను. ఈ దిశలు భేద్యములై ఈ తీరాంధ్రమును కదనరంగముగ మార్చి వైచెను.

## రెడ్లు-కాకతీయులు-విజయనగరాధీశులు

రెడ్లనాటి తెలుగుశాసనములలో రెడ్డిప్రభువులు పూర్వసముద్రాధీశ్వరులని చెప్పుకొన్నారు. ఎఱ్ఱాప్రెగడ హరివంశములోవారిని రత్నాకరనాయకులని ప్రస్తుతించెను. గుంటూరు మండలములోని బాపట్లకు సమీపముననున్న మోటుపల్లి ప్రాచీనకాలము నుండియు ప్రసిద్ధిగాంచిన రేవు పట్టణము. శా. శ 1280 (క్రీ. శ 1244) కాకతిగణపతిదేవుడు, శా.శ 1280(క్రీ. శ. 1358) అనపోతారెడ్డి, శా. శ 1812 (క్రీ. శ. 1890) రెండవదేవరాయలు మోటుపల్లిలో వ్రాయించిన ఆంధ్రశిలాశాసనములు ఆ వర్తకస్థానము యొక్క ఔన్నత్యము చాటుచున్నవి. ఎఱ్ఱాప్రెగడయు, శ్రీనాథుడును హరివంశ, హరవిలాస కావ్యములందు, రెడ్లనాటి సముద్రతీర వ్యాపారము వర్ణించి యున్నారు అవచి తిప్పయశెట్టియు, కుమారగిరిరెడ్డియు నీ పట్టున చిరస్మరణీయులు

విజయనగరాధీశులలో కృష్ణదేవరాయలు పూర్వ,దక్షిణ పశ్చిమ సముద్రాధీశ్వరుడని యాతని శాసనములలో పేర్కొనబడెను. ఈత్రిసముద్రాధిపత్యమునకు గారణము విజయనగర సామ్రాజ్యమాతని కాలమున దక్షిణ హిందూస్థానములో కృష్ణానదికి దక్షిణమున నున్న భూభాగమంతయు నతని యాధిపత్యమున నుండుటయే. ఈ భూభాగమును ప్రాగ్దక్షిణ పశ్చిమ సముద్రము లావరించి యున్నవి. ఈ కాలములోనే ఆంధ్రుల నౌకాయానము వాణిజ్య విజృంభణము పశ్చిమతీరముననున్న గోవా మొదలగు రేవు పట్టణములనుండి విరివిగా సాగుచుండెను.

## ప్రాచీనాంధ్ర రేవు స్థలములు, రేవు పట్టణములు

పట్టణమనగా రేవుస్థలము లేక సముద్రతీరమున నున్న వాణిజ్య నిలయము. తూర్పుతీరముననున్న రేవుస్థలములు ప్రాచీన శాసనము లందును, సారస్వతము నందును పట్టణాభిధానములై విరాజిల్లుచుండెను. నేటికిని యాపేరనే బరగుచుండుట తెలిసిన విషయమే.

ప్రాచీనాంధ్ర రేవుస్థలములలో కృష్ణానదీముఖద్వారముననున్న కోడ్డూరములేక గూడూరు ప్రసిద్ధమైనది. కంటకశైలమనెడి ఘంటశాలయు బేరెక్కిన వాణిజ్య స్థలము. గుంటూరు మండలములోని మోసలిపురము, ముకుళపురము, దేశూయకొండ పట్టణము అని నామాంతరములు గల్గిన మోటుపల్లి పండ్రెండు, పదమూడు, పదునాల్గు పదునైదవ శతాబ్దములలో వాసిగాంచిన రేవుస్థలము. నెల్లూరి మండలములోని గూడూరు తాలూకాలో సముద్రతీరముననున్న 'కొల్లితురై' లేక గండగోపాలపట్టణము కాకతీయుల కాలమున ప్రసిద్ధికెక్కినరేవు. ఇదియే శ్రీనాథుడు వర్ణించిన వారిధితటీకాల్పట్టణము. ఉత్తరతీరమున కళింగపట్టణము, కులోత్తుంగ పట్టణమను నామాంతరము గల విశాఖపట్టణము ప్రసిద్ధరేవు స్థలములని శాసనములవల్ల దెలియుచున్నది.

ఈ తూర్పుతీరమునుండియే ఆంధ్రులు శాతవాహనుల కాలమునుండియు ప్రాచ్యప్రతీచీ ద్వీపాంతరములతో విస్తారముగ వాణిజ్యము సాగించుచుండిరి. దీనికి మనకు తూర్పుతీరమున నున్న సాలిహుండము, విజయవాడ, నెల్లూరు మొదలగు ప్రదేశములందును, మధ్యాంధ్రదేశమైన కడపమండలములోను దొరికిన రోమన్ (Roman) నాణెములె సాక్ష్యము. అదియును గాక పూర్వచాళుక్యప్రభువుల బంగారు వెండి నాణెములు బర్మాదేశము సమీపముననున్న కొన్నిద్వీపములలో లభించినవి. కళింగాంధ్ర తీరమునుండి బర్మా, సుమత్రాదీవులకు సముద్ర

యానముచేసి, యచ్చట స్థిరనివాసము నేర్పఱచుకొని. పరదేశీయులచే 'క్లింగు'లని వ్యవహరింపబడినవారు కళింగాంధ్రులే!

## తూర్పు తీరాంధ్ర వైభవము

భౌతికస్థితి చేత తూర్పుతీరాంధ్రము నదీ మాతృకము. సస్య శ్యామలము. సంపన్నిలయము. బహుజనానీకము.

ఆంధ్రమహాకవులు ఏదో సందర్భము కలిగించుకొని, యనువైన తావున వారు వాసించిన మండలముల వర్ణించుచు, పూర్వాంధ్ర భూ భాగవైభవమును ప్రస్ఫుటము గావించిరి, నన్నయ మహాభార తాది పర్వమున నర్జునుని తీర్థయాత్రా సందర్భమున వేంగిదేశ విభవ మును "అనఘమై శిష్టాగ్రహార భూయిష్ఠమై, ధరణీసురోత్తమాధ్వర విధాన పుణ్యసమృద్ధమై పొలుచు చుండె" నని వర్ణించెను. ఈ వేంగిదేశమె (గోదావరీతీర భూమి) శ్రీనాథుని కాలమున నెట్లుం డెనో భీమేశ్వర పురాణమున ప్రథమాశ్వాసములోని పద్యగద్యములలో వర్ణింపబడినది. ఇయ్యది "బృథులవారి శీకర పటలపానదర వికట కరటి ముఖ వికలిత వరాట కోశ వ్యాకోచ హాటక కుశేశయంబులగు సప్త గోదావర ప్రవాహసలిలంబుల చేతను ...... గోదావరీతుల్య భాగా కౌంతేయా కణ్వాపగానదీ మాతృకాయ మానంబులై యిరుగారును బంట పొసంగు పంటవలంతి కేదారక్షేత్రంబుల చేతను."

ద్వితీయాశ్వాసములో "వింధ్యాచలపాదంబున గేదార కుంభ కోణార్కస్థానంబుల కుపమానం బనజాలి యేలేటి మేటి కాలువల వలన నదీమాతృకంబులగు పంటవలంతిచేలతోడను, త్రపుస పుష్పల తామతల్లీ పటోలికా కారవేల్ల కుడుంగకములతోడను, కూష్మాండ వృంతాక కోలక చించికా కాయమాన కదంబకములతోడను శాకినీ మూలకచ్ఛత్రాకసారణీ ధాన్యాక మేఘనాదములతోడను, పిప్పల్యు పోదకీ పీత పలాండుక వాస్తుశాఖాకోటి వాటితోడను, రాజనల

తోడను, శృంగ బేరములతోడను, చిఱుగడవు బెండలముతోడను, జేమ తోడను. ఉపవనములతోడను" ఈ ప్రాంత మొప్పుచుండెనని వర్ణించి యున్నాడు.

పై విధముననే మంచన కేయూరబాహు చరిత్రమునందు వెల నాటి వైభవము నిట్లు వర్ణించియున్నాడు. ఇది యప్పటి కృష్ణాతీ రాంధ్రభూమి విభవమును దెలియజేయుచున్నది.

వెలనాటికి రాజధానిగ నుండిన చందవోలు (ధనదుపురము) ఇట్లుండెనట.

సీ॥ పుష్పకనివహంబు భూమిపై నిలిచిన
యట్లందమైన దేవాలయములు,
రూప్యాచలము బహురూపంబుల నటించు
రమణశోభిల్లు సౌధముల పెల్లు,
అలకాధిపతి నిధులన్నియు వెలపీట
విడిసిన క్రియ బణ్యవీథికలును,
ధాతమేదిని మిన్నదఱిగి వైచినమాడ్కి
గనుపట్టు బహుతటాకముల సొంపు

గీ॥ నుపవనంబులు సరసులు నొప్పుచేయు
చెఱకుదోటలుఁ బ్రాసంగుచేలు మెఱయ
నఖిల విభవంబులకు నెలవగుచు వెలయు
ధనదుపురమున కెనయన ధనదుపురము.

గీ॥ మంటికడవ నులక మంచంబు పూరిల్లు
నూలిచీర రత్నకీలితంబు
గానిపైడితొడవు గలుగు కొఱుంగరు
ధనదుపురములోని జనములెల్ల.

శాసనములలో సహితము "ఆరామైరభిరామ భూమిరభితశ్శాలేయ కేదారజః శ్రీశాలీ వెలనాండునామ విషయం భూమండలీ మండన" మని వెలనా డభివర్ణింపబడినది.

## తూర్పు తీరాంధ్ర దేశము

ఈ ప్రదేశము యొక్క నైసర్గిక స్వరూపము గమనించినచో నీ స్వభావము ఈ ప్రాంత చరిత్ర పై నెట్టి ప్రాభవము వహించెనో తెలియగలదు.

మహాభారతకాలము నందు సహదేవుడీ తీరప్రాంతము మీదుగా దక్షిణ దిగ్విజయ యాత్ర సాగించెను. అశోకచక్రవర్తి దండయాత్ర ఖారవేలునిదాడి, సముద్రగుప్తుని సర్వదక్షిణాపథరాజ్య విజయధాటి పూర్వాంధ్ర దేశము మీదుగనే సంభవించెను. ఇదియే కళింగము మొదలు కాంచీపురము వఱకు ఏకధాటిగ ప్రప్రథమమున సాగిన దిగ్విజయ యాత్రలు. తర్వాత పశ్చిమ చాళుక్య చక్రవర్తియగు రెండవ పులకేశి కళింగము పిష్టపురము మీదుగా వేంగినగరము వఱకు ఈ ప్రాంతముపై దండు వెడలి వేంగిరాజ్య స్థాపకుడయ్యెను. పూర్వ చాళుక్య చక్రవర్తులలో సుప్రసిద్ధుడగు గుణగ విజయాదిత్యుడు దక్షిణమున నెల్లూరు మండలము వఱకు, ఉదీచ్యమున కళింగము మీదుగా చక్రకొట్టము వఱకు దండయాత్ర నడిపినదీ పూర్వతీరాంధ్రము మీదుగనే. ఈతని కాలముననే వేంగిరాజ్యము తూర్పుతీరమంతయు వ్యాపించినది. చోడ భీముని కాలమున వేంగిరాజ్యము మహేంద్రగిరి కాంచీపురము వఱకు వ్యాపించియుండెను తూర్పు తీరాంధ్రము కర్ణాటక చోళ రాజులకు కదనరంగమై యొకరి దగ్గఱ నుండి మఱియొకరు దానిని కైవశము గావించుకొనుటకు ప్రయత్నించిరి. గుణగ విజయాదిత్యుని వలెనే వీరరాజేంద్రుడు పూర్వదేశమున సప్త కళింగములను దాటి, మహేంద్రగిరి వఱకు బోయి విజయ

భేరిని మ్రోగించి, అక్కడ కొండలను దాటి చక్రకూటదుర్గము నాక్రమించెను. ఈ దాడియంతయు చోళమండలము నుండి కళింగ మండలము వఱకు సాగియుండెను. అటుపిమ్మట చాళుక్యచోళ ప్రభు వగు కులోత్తుంగ చోళుని కాలమున అతని సేనాపతియగు కరుణాకర తొండమాను ఉదీచ్యదేశమగు కళింగముపై దండు వెడలి పాలేరు, సువర్ణముఖి, పెన్న, మన్నేరు, కృష్ణ, గోదావరి, పంప, గోస్తని నదులను దాటి, ఓఢ్రదేశ సీమా సంధవద్ద విజయస్తంభమును నెల కొల్పెను.

కాకతీయుల కాలమున కొలని రుద్రదేవుడు ఓరుగంటి తూర్పుగవని మొదలుగా సింహాద్రి వఱకుగల తూర్పుతీర భూభాగ భరమును దాల్చెనని శివయోగసారమున వర్ణింపబడినది. గణపతి దేవుని కాలమున రాజనాయకుడు ఉత్తరదిశ నుండి కళింగములోని బొక్కెర, ఉదయగిరి, ఝూడు స్థలముల నిర్జించి, ద్రాక్షారామము మీదుగా ఓరుగంటికి మఱలిపోయెను.

రాజమహేంద్రవర రెడ్లరాజ్య కాలమున వీరభద్రారెడ్డి రాజ మహేంద్రవరము రాజధానిగ చీకటి, కళింగము, చిల్కసముద్రము, సింహాచల పరిమితాంతర భూమిని ఏలెననియు, క్షీరాంభోనిధి తటమున (చిల్కసముద్రము) జయస్తంభమును నిలిపెననియు శ్రీనాథుడు కాశీఖండమున వర్ణించియున్నాడు.

విజయనగరాధీశుల కాలమున దక్షిణమున నుండి సాళువ నరసింహరాయలు గజపతుల విజృంభణమరికట్టుటకై కళింగముపై దండు వెడలినట్లు సంస్కృతాంధ్ర కావ్యములు వాకొనుచున్నవి.

శ్రీకృష్ణదేవరాయల కళింగ దిగ్విజయయాత్రలు కావ్యము లందును, శాసనములందును వర్ణింపబడుట సర్వజన విదితము. ఈతడు కృష్ణానదీ దక్షిణ తటమునుండి, దిగ్విజయయాత్ర సాగించి, బెజవాడ దగ్గఱ కృష్ణను దాటి తూర్పుతీరముగుండా కోన, కొట్టాము, వడ్డాది,

మాడుగలు, సింహాచలము మీదుగా పొట్నూరి వఱకును బోయి యచ్చట విజయ స్తంభము నిల్పి, కటకము దగ్గఱ తన జైత్ర యాత్రను ముగించెను.

భూమియొక్క భౌతిక స్వరూపము దేశము నెంత సంపన్నము గావించునో ఆంధ్ర కామందకములో విశదీకరింపబడినది. దిగువ సీసపద్యములోని కరపట్టణములనగా రేవుపట్టణములని యర్థము.

కం॥ భూమిగుణంబున రాష్ట్రము
దామించును; రాష్ట్రమెంత దనరిన యేనిన్
భూమిపతికి మంచిది; యం
తేమహి మటుగాన, మంచిదియె కావలయున్.

సీ॥ కరపట్టణములపై గనులు ద్రవ్యంబులు
జలములు ధాన్యముల్ చాలగలిగి,
యావులకును మంచివై, మనోహరములై
మేలైన యూళ్లచే మించగలిగి,
వారణంబుల బొల్చు వనదేశములుగల్గి
నీళ్లత్రోవలచేత, నేలత్రోవ
చే, నీటి కాల్వలచే నొప్పు భూములు
నరనాయకులను సిరులొసంగు.

గీ॥ మొరములను, జౌడుకొడవలు, ముచ్చుబంట్లు
చెట్టు మిట్టలు బుట్టలు వెట్టదనము
గుండ్లు ముండ్లును బాముల దండ్లుగల్గు
వసుధ యెవ్వేళ సంపద లొసగలేదు.

(రాష్ట్ర సంపత్స్వరూపము. ద్వి. ఆ. ప. 98-99)సీసపద్యము లోని మొదటి నాల్గు చరణములు తూర్పు తీరమునకు వర్తించును.

## కృష్ణా గోదావరీ మధ్యదేశము

ఈ నదీ యుగ్మాంతరదేశము ఆంధ్రదేశ చరిత్రలో ప్రముఖ స్థానము వహించియున్నది. ఇయ్యది సారవంతమై, జనసంకీర్ణమై, ఉభయ వాహినులచేతను ప్రాక్సముద్రముచేతను సంరక్షింపబడి, రాజ్య స్థాపనకు దోహదమొసగి ఆర్థిక సంస్కృతుల కావాసమై, చిరకాలము నుండి వర్ధిల్లుచున్నది. ఇదియే వేంగిరాజ్య స్థాపనకు, వృద్ధికి, కారణమయ్యెను. వేంగిసామ్రాజ్యమున కుత్తరమున మహేంద్రపర్వతము వఱకును, దక్షిణమున మన్నేఱువఱకును విస్తరించుటకు హేతువయ్యెను. నాటికిని నేటికిని తన వ్యక్తిత్వము నిలువబెట్టుకొన్నది.

## కృష్ణా ముఖద్వారము

ఈ నదీతీరమె యాంధ్రుల ఆర్థిక రాజకీయ సాంఘిక జీవనమునకు జీవగఱ్ఱ. ఆంధ్రుల దృష్టి సాగరముపై సాగించి, వారి చరిత్రకొక విశిష్టత నెలకొల్పెను. పరరాజన్యుల వాహినీ నివహములకు చెలియలి కట్టయై తన ప్రభావము ప్రకటించుకొన్నది.

బృహత్ఫలాయనులు కృష్ణకుత్తరతీరమునను, శాలంకాయనులు కృష్ణాగోదావరీ మధ్యదేశమును, ఆనందగోత్రులు కృష్ణానదికి దక్షిణ తీరమునను రాజ్యమేర్పఱచుకొనిరి. ఆనంద కందరరాజునకు కృష్ణవేణ్ణా నాథుడను బిరుదుగలదు. వెలనాటి, కోట, సామంత మండలేశ్వరులు కృష్ణవేణీనది దక్షిణషట్సహస్ర గ్రామావనీ వల్లభులు.

## తెలంగాణము-చారిత్రక భూగోళము

తెలంగాణముయొక్క భౌతికస్వరూపము తూర్పుతీరాంధ్రమునకు వ్యత్యస్తము. ఇది ఎత్తైన పీఠభూమి. వర్షపాతము తక్కువ. పశ్చిమమున సహ్యాద్రులు, తూర్పున మహేంద్రపర్వతములు ఋతుపవన ప్రసరముల కడ్డుతగిలి, వర్షపాతము తగ్గించుచున్నవి. ఉత్తరమున

గోదావరియు, దక్షిణమున కృష్ణయు జీవనదులయ్యును, పీఠభూమి యందు ప్రవహించుచుండుట చేతను, ప్రవాహావేగముచేతను దేశము యొక్క సస్యసంపద కనుకూలపడలేదు. ఇక దేశమధ్యభాగమున క్షుద్ర నదులు ప్రవహించు చుండుటచేతను, వర్షాకాలమున నీరుండునుగాని యితర కాలములలో నెండిపోవును. నదీమాతృకములు లేకపోవుటచే దేవమాతృకములే యాధారము. పెద్దపెద్ద తటాకములు సముద్రము లను బేర తెలంగాణము నంతటను గలవు. ఇది దీని విశిష్టత. ఉష్ణోగ్రత హెచ్చు. అరణ్య ప్రాంతములెక్కువ, గుట్టలమయము. గరపనేలలు, ఇసుకభూములు విస్తారము.

## స్థల, వన, గిరి దుర్గములు

మహబూబునగరమండలములోని గొయ్యలకొండ, పానుగల్లు, మెదకు జిల్లాలోనిమెదకు దుర్గము, కరీంనగరముజిల్లాలోని మలింగూరు కోట, వరంగల్లుజిల్లాలోని ఓరుగల్లు, వేలుపుగొండ, నల్గొండజిల్లాలోని భువనగిరి, దేవరకొండ, నల్గొండ మొదలగు వన, స్థల, గిరిదుర్గములు తెలంగాణములో ప్రసిద్ధి కెక్కినవి. ఈ తెలంగాణములో నిట్టి కోటలు పెక్కులుండుటచే, పలుతావుల చిన్నచిన్న రాజ్యము లేర్పడి, పరస్పర కలహముల కాట్టపట్టులై దేశ స్వాతంత్ర్యమునకు ప్రతిబంధకములై పెక్కేండ్లు తెలంగాణ మేకచ్ఛత్రాధిపత్యమున కాటంకము గలిగిం చెను. ఒక్కఓరుగంటి సామ్రాజ్యమున తెలంగాణ గాక యావ దాంధ్ర ప్రదేశమును ఏకచక్రవర్తి క్షేత్రముగ పరిఢవిల్లినను, దాని పతనాంతరము భిన్నరాజ్యముల కాలవాలమయ్యెను. కాకతీయ రాజ్యపతనానంతరము తెలంగాణము చరిత్ర ప్రసిద్ధములైన రాచ కొండ, దేవరకొండ దుర్గములు వెలమ ప్రభువుల శౌర్యప్రతాపము లకు పెట్టని కోటలై, మహమ్మదీయ వాహినీనివహములకు చెలియలి కట్టలై విరాజిల్లెను. వీరికాలముననే తెలంగాణములోని భువనగిరి మొదలగు దుర్గములు సాధింపబడెను.

తెలంగాణములో కాకతీయులు సుస్థిరసామ్రాజ్యము నెలకొల్పుటకు పూర్వము కళ్యాణిచాళుక్యుల ప్రాభవ మీ ప్రాంతముపై రెండు శతాబ్దముల కాలము వ్యాపించియుండెను. వీరిరాజధానులైన మాన్యఖేటము, కల్యాణకటకము తెలంగాణమునకు పశ్చిమమున నుండెను. ఈ చాళుక్యరాజులు వైభవపరాక్రమోపేతులై తెలంగాణమంతయు వశపఱచుకొని, తుదకు వేంగిపై సహితము దాడు వెడలిరి. వీరు పశ్చిమమునుండి, తూర్పు తీరము వఱకు నెట్టి యాటంకములు లేక రాజ్యాభివృద్ధిని గావించిరి. కాని తూర్పుతీరము నాక్రమించి, పెక్కుకాలము వారి పరిపాలనము నెలకొల్పలేక పోయిరి. ఆకాలమున తెలంగాణము చాళుక్యచోళ రాజులకు సంగ్రామరంగమై వెలయుచుండెను. తెలంగాణమునకు పూర్వ మధ్య యుగములలో పశ్చిమ ప్రాంతము నుండియే యొత్తిడి కలుగుచుండెను

పదునాల్గవ శతాబ్ద ప్రారంభమునుండి మహమ్మదీయులు మాళవ దేశము మీదుగా, యాదవ రాజధానియైన దేవగిరి నుండియే తెలంగాణముపై దాడివెడలి ఏకశిలానగరమును కైవసముగావించికొన పనుకట్టిరి. మహమ్మదీయ దండయాత్రలు ఆర్యావర్తమునుండి సరాసరి తెలంగాణముపై సాగుటకు వింధ్యపర్వతము లాటంకము వచ్చెను. తెలంగాణమునకు కేంద్రస్థానమైన ఓరుగంటిదుర్గము హస్తగతము గావించుకొనుటకు మహమ్మదీయులు దేవగిరి మార్గము నుండియే వచ్చిరి. ఈ మార్గము భౌతికముగ నత్యంత సులభమైనది. మహమ్మదీయ సైన్యనివహములకు కృష్ణానది పెద్దయగడ్తయై వారికి దాటుటకు శక్యము కాదాయెను. దాటివచ్చినను వారు సుస్థిర రాజ్యము కృష్ణకు దక్షిణతీరమున నెలకొల్పలేరైరి. కృష్ణానది కుత్తరమున బహామనీరాజ్యము, దక్షిణమున విజయనగర రాజ్యములేర్పడి, హిందూమహమ్మదీయ రాజన్యులకు కృష్ణానదియే సరిహద్దుగా నేర్పడెను,

బహమ్మనీ రాజ్య విచ్ఛిన్నమైన పిమ్మట గోలకొండ కేంద్ర స్థానముగ నేలిన కుతుబుషాహివంశ మహమ్మదీయ చక్రవర్తులు వారి రాజ్యము తెలంగాణము, తూర్పు తీరాంధ్రము, రాయలసీమలోను వ్యాపింపజేసిరి. వీరికాలముననే హైదరాబాదు నిర్మాణము జరిగి, నేటి ఆంధ్రప్రదేశమునకు రాజధాని యయ్యెను.

## రాయలసీమ

దీని భౌతిక స్వరూపము తూర్పు తీరాంధ్రమునకు విపరీతము తెలంగాణమునకు తుల్యము. ఉత్తరమున కృష్ణానది. దక్షిణమున మదరాసు రాష్ట్రము. పశ్చిమమున మైసూరు రాష్ట్రము, తూర్పునమహేంద్రగిరులు దీనికెల్లలు. ఎత్తైన పీఠభూమి, పర్వతారణ్య భూభాగమెక్కువ; ఉష్ణోగ్రత పెక్కుచోట్ల హెచ్చు. వర్షపాతము తక్కువ. క్షుద్ర నదులు దేవమాతృకములు ప్రజల జీవనాధారములు సారవంతములగు నల్లరేగడ భూములు తక్కువ. నిస్సారములగు ఎర్రనేల లెక్కువ. కొన్ని ప్రాంతములు కొండగుట్టల మయము. కావున జనాకీర్ణమైన భూమి కాలేదు.

## రాయలసీమలోని సముద్రములు

తెలంగాణములోని సముద్రములకు తుల్యమైన సాగరములు రాయలసీమ యందును గలవు. తిప్ప సముద్రము. అనంతసాగరము మొదలగునవి.

## రాయలసీమలోని దుర్గములు

చిత్తూరుమండలములోని చంద్రగిరి దుర్గము, అనంతపుర మండలములోని గుత్తి, పెనుగొండ, రాయదుర్గము, కళ్యాణదుర్గము, కర్నూలు మండలములోని కందనవోలుదుర్గము, కడపమండలములోని

గండికోటదుర్గము ప్రసిద్ధికెక్కినవి. ముఖ్యముగా విజయనగర సామ్రాజ్య కాలమున వాసిగాంచిన వివిధరాజ్యములకు కేంద్ర స్థలములు.

రాయలసీమ కెల్లపుడును దక్షిణమునుండి పల్లవ, చోళుల యొత్తిడి కలుగుచుండెను. పశ్చిమమున గాంగులు, కర్ణాటకుల ప్రాభవము హెచ్చుగ నుండెను. పాండ్య, చోళ, కర్ణాటకములు సారవంతములైన భూములు. పల్లవులు కృష్ణానది దక్షిణతీరము వఱకు సులభముగ నీప్రాంత మాక్రమించిరి. ఈ ప్రాంతము సుస్థిర రాజ్యమేర్పరచుకొనుటకుగల స్థలమె లేకపోయెను. చోళ, చాళుక్య ప్రభువులొకరితో నొకరు పోరాడుచు, తుదకు చోళులే విజయముగాంచి, కర్ణాటక చాళుక్యులను త్రోసి రాజనిరి. చోళుల ప్రాభవమీప్రాంతమునక్షీణించిన తర్వాత వారి సామంతులుగనో, స్వతంత్రులుగనో రేనాటి చోళులు, పొత్తపనాటి చోళులు (తెలుగు చోడులు) పరిపాలనము నెరపి, మరల హొయిసల బళ్లాణరాజుల కర్ణాటక చాళుక్యుల నిర్జించి, కొంతకాలము ప్రబలులై, విజయనగరసంగమ వంశరాజన్యులకువశమై పోయిరి. విజయనగర రాజ్యస్థాపనమైన తర్వాత కృష్ణకు దక్షిణ తీరమున నున్న రాయలసీమ ప్రాంతమంతయు వారివశమయ్యెను.

విజయనగర రాజ్యాధీశుల కుత్తరమున కృష్ణానదియు, తూర్పున దక్షిణమున, పశ్చిమమున, సముద్రములు పెట్టనికోటలై, యుండుట చేత వారిరాజ్యము మూడువందల సంవత్సరములు ప్రజ్వలమయ్యెను. విజయనగరాధీశులు త్రిసముద్రాధీశులని శాసనములందు చెప్పబడిరి.




1-వ పటము




2-వ పటము




౯-వ పటము




6-వ పటము




7-వ పటము


భరత వర్షము
కుమారికా ఖండము
కాశ్మీరదేశములు
ఉదీచ్యదేశము
హిమవంతము
హిమాలయదేశములు
పారియాత్రములు
మధ్యదేశము
వింధ్యపర్వతములు
ప్రాచీచ్యదేశములు
వింధ్య దేశములు
మహేంద్ర పర్వతములు
గోదావరి
దాక్షిణాత్యములు
కృష్ణ
దేశము
ఆంధ్ర
పశ్చిమ సముద్రము
పూర్వ సముద్రము
కుమారికాగ్రము
(CAPE CAMORIN)
దక్షిణ సముద్రము

౮-వ పటము

# భారత కాలంలో దక్షిణాపథం

పాండవ పక్ష దేశములు

కౌరవ పక్ష దేశములు

•••• సహదేవుని దిగ్విజయయాత్ర

10–వ పటము

# సప్తద్వీపా పృథివీ మేరుపర్వతీ యుతా జంబూద్వీపము



# చారిత్రక భూగోళ పటములు

## గ మ ని క

ఈ పటములు వ్రాయుటకు తెలుగుభాషా సమితివారు తెలుగు సంస్కృతి సంపుటములో ముద్రించిన ఆంధ్రప్రదేశ మండలపటములు ముఖ్యాధారములు. నా పరిశీలనము కొఱకు, ఉపయోగార్థము వారు పటములు ప్రత్యేకించి పంపించినందుకు, తెలుగుభాషాసమితి కార్యనిర్వాహకులకు కృతజ్ఞత వెలిబుచ్చుచున్నాను.

ఈ పటములలో గ్రంథములోని కొన్ని ప్రాంతములు. స్థలములె చూపింపబడినవి. మొట్టమొదటి స్థల నిర్దేశమునకు మద్రాసు ప్రభుత్వమువారు ప్రకటించిన రాష్ట్ర గ్రామ పట్టికలు (List of Villages in the Madras Presidency), హైదరాబాదు నైజాము ప్రభుత్వమువారు ప్రకటించిన(List of Villages in the Hyderabad State) హైదరాబాదు రాష్ట్ర గ్రామ పట్టికల నుపయోగించితిని. ఈ హైదరాబాదు రాష్ట్ర గ్రామపట్టిక గ్రంథము, నా శ్రేయోభిలాషులు, సారస్వతపోషకులునగు శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజుగారు నాకొసంగినందుకు వారికి నా నమస్కారములు. ప్రత్యేక రాష్ట్రావతరణము తర్వాతను, ఆంధ్రప్రదేశ నిర్మాణానంతరమునను, మండల విభజనములు జరిగి ఒకమండలములోని తాలూకాలు, గ్రామములు, వేరొక మండలములోనికి మార్పబడుట సంభవించెను. కాని, కొన్నిచోట్ల గ్రామ నిర్దేశ పట్టికలలో నీ నూతన విభజన విధానము ప్రకారము మార్పు సూచింబడలేదు. ఈ విషయము చదువరులు గమనింప వేడుకొనుచున్నాను.

కుందూరి ఈశ్వరదత్తు.

## ఆంధ్రప్రదేశ్


మహారాష్ట్రము
ఆదిలాబాదు
మధ్యప్రదేశము
శ్రీకాకుళము
నిజామాబాదు
కరీంనగరము
వరంగల్లు
మెదకు
ఖమ్మము
నల్లకొండ
మహబూబు
నగరము
గుంటూరు
తూర్పుసముద్రము
కడప
చిత్తూరు
మైసూరు
మదరాసు


మైసూరు రాష్ట్రము
మెదకు జిల్లా
గోలకొండ
మూసీనది
హైదరాబాదు
హైదరాబాదు జిల్లా
నల్లగొండ జిల్లా
మహబూబునగరము జిల్లా


కరీంనగర్ జిల్లా
ఓరుగల్లు
వరంగల్లు జిల్లా
అనుమకొండ విషయము
కొఱవి
ఖమ్మంమెట్టు జిల్లా
నల్లకొండ జిల్లా


కరీంనగరం జిల్లా
నిజామాబాదు జిల్లా
మెదకు
మెదకు సీమ
వరంగల్లు జిల్లా
నల్లకొండ
హైదరాబాదు జిల్లా
మహబూబునగరం జిల్లా


గోదావరి
అదిలాబాదు జిల్లా
చాందా జిల్లా
సబ్బినాడు
గోదావరి
కాళేశ్వరము
గోదావరి
కరీంనగరం జిల్లా
రామగిరి
వేములవాడ
కౌసలనాడు
వరంగల్లు జిల్లా
మెదకు జిల్లా


హైదరాబాదు జిల్లా
హైదరాబాదు జిల్లా
కొయ్యలకొండ
నల్లగొండ జిల్లా
మహబూబునగరము జిల్లా
పానుగల్లు
కృష్ణానది
అయిజనాడు
కృష్ణానది
అలంపురము
తుంగభద్రనది
కర్నూలు జిల్లా



ఆదిలాబాదు జిల్లా
గోదావరి
బోధన
మంజీరానది
నిజామాబాదు జిల్లా
మంజీరభూమి
కరీంనగరు జిల్లా
మెదకు జిల్లా




కొలనుపాక
వరంగల్లు
రాచకొండ
భువనగిరి
ఖమ్మం మెట్టు జిల్లా
వర్ధమానకోట
హైదరాబాదు జిల్లా
నల్గొండ జిల్లా
నల్గొండ
దేవరకొండ
గోదావరి నది
మహబూబ్‌నగర జిల్లా
గుంటూరు జిల్లా


బస్తరు జిల్లా
విశాఖపట్టణము జిల్లా
పూర్వ గోదావరి జిల్లా
గోదావరి
కోరుకొండ
పిఠాపురము
రాజమహేంద్రవరము
ద్రాక్షారామము
పశ్చిమ గోదావరి జిల్లా
కోనసీమ
బంగాళాఖాతము



ఖమ్మంమెట్టు జిల్లా
పశ్చిమ గోదావరి జిల్లా
కృష్ణా జిల్లా
నవ
వాడి
కొండపల్లి జిల్లా
కృష్ణానది
బెజవాడ
గుడివాడ
గుద్రవారము
ఘంటశాల
గుంటూరు జిల్లా
బంగాళాఖాతము




ఖమ్మంమెట్టు జిల్లా
తూర్పు గోదావరి జిల్లా
పశ్చిమ గోదావరి జిల్లా
కురవాటము
పెదవేగి
వేంగీ విషయము
ఏలూరు
కొల్లేరు
పానార సీమ
కృష్ణా జిల్లా
బంగాళాఖాతము


కర్నూలు జిల్లా
రేనాడు
నెల్లూరు జిల్లా
రేనాడు
కడప మండలము
పెన్నానది
ములికినాడు
అనంతపురం జిల్లా
చిత్తూరు జిల్లా


కర్నూలు జిల్లా
గుత్తివిషయము
గుత్తి
చిన్నపెన్నానది
పెన్నానది
టెంకణము
రాయదుర్గము
కడప జిల్లా
అనంతపురము జిల్లా
కల్యాణదుర్గము
పెనుకొండ
రేనాడు
చిత్తూరు జిల్లా


అనంతపురం జిల్లా
కడప జిల్లా
నెల్లూరు జిల్లా
తిరుపతి
కాళహస్తి
చంద్రగిరి
చిత్తూరు మండలము
కోలారు జిల్లా
మద్రాసు రాష్ట్రము


గుంటూరు జిల్లా
మహబూబ్‌నగరం జిల్లా
శ్రీశైలము
కర్నూలు
అరవీడు
కర్నూలు జిల్లా
నెల్లూరు జిల్లా
ఎఱ్ఱగుడి
రేనాడు
అనంతపురం జిల్లా
కడప జిల్లా

# ప్రాచీనాంధ్ర

# చారిత్రక భూగోళము

## అంగడమంతనాడు

"పిన్నమనాయకుండు అంగడమంతనాంటిలోని దమప్రవిత్తియైన కొడుమన అణ్ణమందేవరకు బయిండిపాడు యేకభోగ మాచంద్రార్కముగా ధారవోసి" (1)

పైని చెప్పబడ్డ పయిండిపాడు గ్రామము, నెల్లూరు మండలములో ఆత్మకూరు తాలూకాలోని పమిడిపాడను బరగు గ్రామము. అంగడమంత నాడు, ఆత్మకూరు తాలూకాలో నంతర్భాగమై యుండవచ్చును.

జయంగొండ చోళమండలములో నంతర్భాగమైన అంగడిపాట్ట నాటిలోని సెఱుడిసై గ్రామములోని కేశవపెరుమాళ్ళ కిచ్చిన తమిళదాన శాసనము. అఱవభాషలోని "సెఱుడిసై" గ్రామమె ఆత్మకూరు తాలూకాలోని చిరమన గ్రామము. అంగడమంతనాటికె అఱవములో అంగడిపాట్టనాడని నామాంతరము. (2)

(1) N. I. Atmakur (55) (శ. స. 1212.) (2) N. I. Atmakur (26) కుళోత్తుంగ చోళదేవుని పదునెనిమిదవ సంవత్సర రాజ్యకాలము.

## అంగపళండనాడు

నెల్లూరుపురవాసి నాగదేవుడను వాడు వెట్టువన్‌పట్టెవీటిలోని భీమన దేవునకు అంగపళండనాటిలోని కొన్ని భూములు దానముచేసినట్లు నెల్లూరు మండలము, నెల్లూరు తాలూకా ఈదూరు గ్రామములోని తమిళశాసనములో గలదు. వెట్టువన్‌పట్టెవీటికె ఈదూరను నామాంతర ముండవచ్చును.

ఆ యూహ సరియైనచో అంగపళండనాడు నెల్లూరు తాలూకా ఈదూరు ప్రాంతము గానోపును లేదా అంగడమంతనాడు, అంగడిపట్టనాడు, అంగపళండనాడు ఒకటియై యుండనోపును.

N. I. Nellore (21) (శ. స. 1198)

### అంధకరట్ఠము

బౌద్ధసారస్వతము నందు పేర్కొనబడిన రట్ఠములలో నిదియొకటి. చోళరట్ఠము, కళింగరట్ఠము, ద్రమిళరట్ఠములు సహితము పేర్కొనబడినవి. గోదావరీనదికి ఉభయపార్శ్వముల అళక, ముళక దేశములు గలవు. "సుత్తనిపాత" గ్రంథముపైని వ్యాఖ్యానములో పై రెండు దేశములు రెండు అంధక రాష్ట్రములని చెప్పబడినది.

India as described in early texts of Buddhism and Jainism P. 78,114.

### అగళిసీమ (స్థలము)

ఇది రాయదుర్గ రాజ్యములోని యంతర్భాగము. అగళి అనంతపురము జిల్లా మడకశిర తాలూకాలోని గ్రామము. ఈ సీమలోని గ్రామ నామముల పట్టిక జూపబడుచున్నది.

| | శాసనములోని గ్రామము | | నేటిగ్రామ నామము | తాలూకా |
|---|---|---|---|---|
| (1) | అగళిస్థలము | అగళి | అగళి | మడకశిర |
| (2) | ,, | పళిగనహళ్ళి | పిల్లనహళ్ళి | ,, |
| (3) | అగళిసీమ | దొడేరి | దొడ్డేరి | ,, |
| (4) | ,, | రావిడి | రావుడి | ,, |

పై యగళిసీమ, మడకశిర తాలూకా అగళిగ్రామ ప్రాంతమని యూహింపవచ్చును.

(1) S. I. I. Vol, IX. Part II. No. 472 (శా. శ. 1407).
(2) S. I. I. Vol. IX Part II No. 474 (శా. శ. 1420).
(3) S. I. I. Vol. IX. Part II. No. 690 (శా. శ. 1508).
(4) S. I. I. Vol. IX. Part II. No. 693 (శా. శ. 1526).

**అచలపురము**

ఆ. వె. కిరణపురము దహాల నిరుతంబు దక్షిణాదు
నచలపురము నొచ్చె నచలితుండు
వల్లభుండు గుణకెనల్లుండు పంచిన
పండరంగు చూరె పండరంగు.

చాళుక్య భీమమహారాజు ధర్మవరము శాసనము
(భారతి విభవ సం॥ చైత్రమాసము)

పండరంగడు జయించిన అచలపురము ఇప్పటి మధ్యప్రదేశములోని 'ఎలిచ్‌పూర్' అను పేరనున్న నగరము.

**Life in Ancient India as depicted in Jaina Canons. Chapter IV Geographical Lexicon P 263.**

**అచలపురి**

కొండవీడునకు సంస్కృత పర్యాయపదము. నేటి గుంటూరు మండలములో నరసారావుపేటతాలూకాలోని గిరిదుర్గము. (చూడుడు కొండవీడు)

నాదెండ్ల అప్పమంత్రి యొనర్చిన దానములలో అచలపురి (కొండవీటి) లోని రాఘవదేవర గుడికి గోపురప్రాకారములు నిర్మించినట్లు గలదు.

రాఘవాయ గణితే శకవర్షే రాఘవాయ రచితాచల పుర్యాం।
వప్రగోపుర మహ్యెగ్న్యవ హాస్త్రె(?) గ్గోపమంత్రి తిలకేన సపర్యా॥ శ్లో. 29

Two Inscriptions of Krishnaraya, E.I. Vol. VI No. 12 (శా. శ. 1442).

**అత్తిలి విషయము**

ఈ క్రింది గ్రామములు అత్తిలివిషయము లోనివని శాసనములలో వక్కాణింపబడినవి. అత్తిలి నేటి పడమటి గోదావరిజిల్లా తణుకు తాలూకా లోని గ్రామము.

| శాసనములోని గ్రామము | ఇప్పటి గ్రామ నామము | నేటి జిల్లా(?) | తాలూకా |
|---|---|---|---|
| విప్పఱు | విప్పర్రు | తణుకు | ప॥ గోదావరి |
| ఆరువిల్లి(?) | అరవిల్లి | ,, | ,, |

| | | | |
|---|---|---|---|
| కోరుకొలను | కోరుకొల్లు | భీమవరము | ప॥ గోదావరి |
| ఇడియూరు | ఈడూరు | తణుకు | ,, |
| కలుచుంబఱ్ఱు | కంచుమఱ్ఱు | ,, | ,, |

పైన వివరింపబడిన గ్రామములు పానార విషయము లోనివిగా గొన్ని శాసనములలో వ్రాయబడినవి. అత్తిలివిషయము పానారవిషయాంత ర్భాగమై యుండును. (చూడుడు -పానార విషయము)

E. I. Vol VII No. 25; S. I. I. Vol. IV No. 1163.

**అద్దంకి**

త్రిలింగ జనపదములోని పట్టణము. ప్రోలయ వేమారెడ్డి పాలించిన రెడ్డి రాజ్యమునకు రాజధాని.

"సకల ధర్మలింగ స్త్రీలింగో నామ జనపదః.........శరదివ విలసత్ సత్ప్రకాశా, బ్రాహ్మణ జాతిరివ నిగమశాలినీ, మహోఘోషాన్వితాపి నిరా క్రోశా, ప్రకట భుజంగ ప్రచారాప్య పోషితాహితభయా, బలిరాజ నిలయ భూతాపి గంధర్వ భూమిః అద్దంకి నామధేయా నగరే."

(వేమభూపాలీయము)

శ్రీపర్వతపు తూర్పుపాదము మొదలు పూర్వసముద్రము వఱకును గుండ్లకమ్మనది కిరుపార్శ్వములను గల పూంగినాటిలోని నగరము.

"అస్తి శ్రీగిరి పూర్వపాదనికటా దాపూర్వ పాథోనిధేర్దేశః
కుండి తరంగిణీ ముభయతః శ్రీపూంగి నామాంకితః
తస్మిన్ భాసుర సౌధ గోపురవతీ నిత్యాప్సరో లంకృతా
నందత్ పౌరజనో విభాతి నితరోమద్దంకి నామ్నీపురీ ;"

(చూడుడు -పూంగినాడు)

వేమభూపతి :—

తే. తనకు నద్దంకి తగు రాజధాని గాఁ బ
రాక్రమంబున బహుభూము లాక్రమించి
యనుజ తనుజ బాంధవ మిత్రజనుల కిచ్చె
నెదురె యెవ్వారు వేమ మహీశ్వరునకు.

(హరివంశము పూ 1-23)

ప్రోలయ వేమారెడ్డి పెద్ద కుమారుఁడు అనపోతారెడ్డి యీ అద్దంకి పురమును వీడి, తన రాజధానిని కొండవీటికి మార్చెను. నాటి నుండియు నద్దంకిపురము పూర్వ వైభవమును గోల్పోయి మాండలికుల పరిపాలనము క్రింద నుండెను.

**అద్దంకి దండపాటు**

"వీర శ్రీ గజపతి గౌడేశ్వర నవకోటి కర్ణాటక కలుబరిగేశ్వర.... రాయ శ్రీ ప్రతాపరుద్రదేవు మహారాజాంకరు విజయరాజ్యే....అర్థోదయ పుణ్య కాలాన శ్రీమహాస్తానను ధారాపూర్వకంగాను....అద్దంక్కి దండ్డపాట లోని వంకాయపాడున్ను...."

శాసనములో నుదాహరింపబడిన వంకాయపాడు గుంటూరు మండలములోని బాపట్ల తాలూకాలో నున్నది. గజపతుల కాలము నాటికి అద్దంకి దండపాట ఒంగోలు తాలూకా కుత్తరమున నున్న బాపట్ల తాలూకా దక్షిణ ప్రాంతము వఱకు వ్యాపించి యుండవచ్చును.

N. I. C. P. No. 22.

**అద్దంకి సీమ**

"చతుర్వేద విద్యాపారంగతులైన బ్రాహ్మణోత్తములకు నూటయెన మండ్రకు సర్వమాన్యముగాను అద్దంకిసీమలో నిచ్చిన నిడుమానూరు గ్రామమున్ను" (1)

"కొండవీటిదుర్గంలోని కాచదుసయ్యవారు మాకు యీ నవధరించిన అద్దంకిసీమలోని చందలూరి గ్రామం కేశవనాథని వివాహప్రతిష్టచేసి" (2)

"కొండవీటిసీమకు చెల్లివచ్చె అద్దంకిసీమలోని మల్లవరం అనే గ్రామము" (3)

"కొండవీటి రాజ్యములోని అద్దంకి అమ్మనంబ్రోలి సీమలోన చదలువాడ శ్రీరఘునాయకులకు" (4)

నెల్లూరు మండలములోని దర్శితాలూకా సోమవరము, పోలవర గ్రామములు అద్దంకి సీమలోనివని, ఆ మండలములోని మరి రెండు శాసనములవల్ల విదితమగుచున్నది. (5)

కావున అద్దంకిసీమ గుంటూరు మండలములోని ఒంగోలు తాలూకాయును, నెల్లూరు మండలములో దర్శి తాలూకాలోని కొంత భాగమునై యుండెను.

(1) S. I. I. Vol. VI No. 248 (శ. స. 1437).
(2) N. I. Ongole (28) (శ. స. 1456),
(3) N. I. Ongole (21) (శ. స. 1467).
(4) N. I. Ongole (29) (శ. స. 1438).
(5) Inscriptions of Madras Presidency–
Rangachari No. 113 and 129–Nellore Dist. శ.స. 1541)

## అద్దంకి స్థలము

నెల్లూరు మండలములోని దర్శి తాలూకా యందలి తమ్మళూరు గ్రామము, అద్దంకి స్థలములోనిదిగ జెప్పబడినది. అనగా అద్దంకిస్థలము దర్శి తాలూకాలో గొంత భాగము వఱకు వ్యాపించియుండును. ఒంగోలు, దర్శి తాలూకా కొంతభాగము అద్దంకిసీమ, స్థలములు వ్యాపించెంది యుండెను.

N. I. Darsi (72) (శ. స. 1194).

## అధిరాజేంద్ర చోళమండలము

ఈ మండలము కడప మండలములోని కొన్ని గ్రామము లందలి తమిళ శాసనములలో పేర్కొనబడినది.

| | |
|---|---|
| 1. అత్తిరాల (రాజంపేట తాలూకా) | అధిరాజేంద్రచోళమండలములోని మేల్పాకనాటియందలి తిరుపత్తురై (అత్తిరాల). అధిరాజేంద్రమండలములోని, మేల్పాకనాటిలోని పొత్తపినాటి యందలి తిరువత్తురై. |
| 2. పోలి (రాజంపేట తాలూకా) | అధిరాజేంద్రమండలము లోని మేల్పాకనాటి యందలి పుదోలి (పోలి). |
| 3. లేపాక (రాజంపేట తాలూకా) | అధిరాజేంద్రమండలములోని మేల్పాకనాటిలోని నెణ్పాక్కై (లేపాక). |
| 4. పులిపట్టూరు (రాజంపేట తాలూకా) | అధిరాజేంద్రచోళమండలములోని మేల్పాకనాటియందలి పులిపట్టూరు. |

మేల్పాక నాడనగా పశ్చిమపాకనాడని యర్థము. నేటి కడపమండలములోని రాజంపేట తాలూకా ఈ చోళమండలములో నంతర్భాగము.

**Nos. 298, 299, 407, 413 of Epigraphical Collections 1911-12**

**అనుమకొండ విషయము**

అనుమకొండ పట్టణమిప్పుడు హనుమకొండ యని పిలువబడుచు ఓరుగల్లునకు (వరంగల్) నాల్గు మైళ్ళ దూరమున నున్నది. ఇయ్యది కాకతీయ ప్రభులకు మొదటి రాజధాని నగరము.

శాసనములలో దీనికి అనుమకొండ, అన్మకుండ, అమ్మకుండె, అన్మకొండ యని వివిధ రూపములు గలవు.

రుద్రదేవుని వేయిస్తంభాలగుడి శాసనములో నతని రాజధాని నగరమైన అనుమకొండ యిట్లు వివర్ణింపబడినది (1)

"తస్యాస్తేఽనుమకొండ నామనగరీ శ్రీరాజధానీన యా
యత్రోద్యత్సదఖండ ఖండపరశు ర్వ్యాజృంభతోజ్జృంభితా
కందర్పస్యపురీవ సారతిమతీ శృంగారభావాన్వితా
మాహేంద్రీవచ జిష్ణు, విష్ణుసహితారంభా విలాసాశ్రితా.

యత్ర స్త్రియో మకరకేతన రాజధాన్యః
అనీలనీరజదలాళదృశః కృశాంగ్యః
త్రైలోక్య సుందర దృశాం తిలకాయమానా
ఆపీనతుంగ కుచకుంభ భరాలసాంగ్యః.

వేశ్యాగృహేషు సురతోత్సవ జాతచేష్టాః
శబ్దానుకారి శుక శాబకలోరు శబ్దాః
సర్వాదిశో ముఖరయంతి దివా విటానాం
కందర్పదర్పతరలార్ణవ పూర్ణచంద్రాః.

నాతిక్రామతి వైష్ణవం పదమితిద్యాం గౌరితిక్ష్మామిమాం
పాదైస్స్పృశ్య క్షితినో తురంగమచయ శ్రీరుద్రదేవస్యయః
సర్వాశాః పరిపూరయ న్విజయతే నృత్యేన సంక్షిపయం
చ్ఛత్రూనృద్ధ మహీతలే ప్రతిదినం విద్రావయన్మారయన్.

అతిరమణ శరీరాయే చ నీచస్వరాఢ్యా
స్సకలతురగ శాస్త్రోద్భాసి సల్లక్షణాఢ్యాః
జవభర భరితాంగాస్సత్వ సంపన్నగాత్రా
అతిచిరతర జీవాః పంచధారా స్తురంగాః."

ఈ అనుమకొండ విషయము తూర్పున సముద్రము, పడమట కల్యాణ కటకము, ఉత్తరమున మాల్యవంతము, దక్షిణమున శ్రీశైలపర్వతమువఱకు వ్యాపించిన రుద్రుని రాజ్యమునకు రాజధాని.

"రాజ్యంప్రాజ్యం లవణజలధేస్తీర పర్యంతమస్య
శ్రీశైలాంతం ప్రచరతిసదా దక్షిణాశాం సమగ్రాం
ప్రాతీచ్యాన్తా కటకవికటస్థాయినీ రాజ్యలక్ష్మీః
కౌబేర్యాశాఃతటవిలసితే మాల్యవంతం ప్రదేశే."

ఈ అనుమకొండ విషయము మొదట కాకతీయుల కెట్లు లభించెనో ఖాజీపేట శాసనమునందు చేర్కొనబడెను. ప్రథమమున వియ్యది యొక చిన్న ప్రదేశమునకు రాజధానియై యుండవచ్చును. (2)

జిత్వాపాస్తరమన్వయా ల్ఘుపనా గోడ్వర్త్తిదుర్గాత్మజం
హత్వాజౌగుణ సాగరస్య పురకూటదేశంచ గోన్నాహ్వాయం
తత్తద్భూయుత మన్మకొండ విషయం త్రైలోక్యమల్లక్షమా
ధీశాచ్ఛాసన బద్ధముద్ధత జయా సంలబ్ధవాన్ శాశ్వతః.

మొదటి ప్రోలరాజు చాళుక్యరాజగు త్రైలోక్యమల్లునికి సామంతుడై, పురకూటదేశమును జయించి, యతనికి సామంతుడై అన్మకొండ విషయమును సంపాదించుకొనెను.

(1) Hyderabad Archaeological Series-13, No. 8 Hanumakonda Inscription.

(2) Khajipeta Inscription. తెలంగాణా శాసన సంపుటము. 2. కాకతీయ శాసనములు-1. (శ. స. 1018)

**అమరావతి**

గుంటూరు మండలములోని సత్తెనపల్లి తాలూకాలోని కృష్ణాతీరముననున్న సుప్రసిద్ధ క్షేత్రము. దీనికి సమీపముననే, ఉత్తర దిక్కున ధరణికోట యను గ్రామము గలదు. ధరణికోట ప్రాచీనాంధ్ర రాజులకు రాజధానిగ నుండెను. (చూడుడు-ధరణికోట).

అమరావతి పూర్వమొకప్పుడు బౌద్ధ సంఘారామమై యుండెను. బుద్ధుడు తన పూర్వ జన్మములలో నొకదానియందు సుమేధుడను బ్రాహ్మణ బాలునిగ యీ గ్రామమునందు జన్మించెను. అమరావతియే సుమేధుని రాజ్యముగ చెప్పబడెను. (1)

ఇది పంచారామములలో నొకటి.

సీ. భీమాపురము దంకరేమి పాల్కొలను దా
క్షారామపురి శ్రీమదమరడాలు
యను నంధ్రధరణి పంచారామముల మహా
దేవరలకు బుద్ధదేవరకును ...(2)

ఈ పంచారామ ప్రతిష్ఠితంబులగు దివ్యలింగముల శ్రీనాథుడు భీమేశ్వర పురాణములో నిట్లు వర్ణించెను.

"వ. అనంతరం బా యంబికావల్లభుండు జాంబూనదశైల కోదండం బెక్కుడించి యథాస్థానంబున నునిచి నారియగు పాపఱేనిని విశ్వంభరాభరణంబునకు నియోగించి క్షీరాంభోరాశి తూణీరంబున వైకుంఠ బాణంబుచేర్చి వేల్పుల వీడ్కొలిపి బ్రహ్మను సత్యలోకంబున కనిచి వేదంబులం దన నిట్టూర్పు గాడ్పుల లోనం గలిపి చంద్రసూర్యులం గాలంబు గడుప నియోగించి కృతకృత్యుండై త్రిపురదైత్యుల కులదైవతంబైన యద్దివ్యలింగంబును పంచబ్రహ్మ పంచాక్షరీ పంచతత్వ పంచభూతమయం బగుటంజేసి పంచఖండంబులుగా ఖండించి కృష్ణవేణీ మహానదీతీరంబున ధరణాలకోటయను గ్రామంబున నమరేశ్వరుని చేతం బ్రతిష్ఠితంబగుటంజేసి యమరలింగంబునా బ్రసిద్ధంబైన యమరారామంబును, గౌతమీ తీరంబున దక్షిణ కూలంబున గుణపూడియను గ్రామంబున సోమునిచేత ప్రతిష్ఠితంబు సేయంబడుటం జేసి సోమలింగంబనఁ బ్రఖ్యాతంబైన సోమారామంబును, పాలకోటయను గ్రామంబున శ్రీరామచంద్రునిచేఁ బ్రతిష్ఠితంబగుటం జేసి రామలింగంబునాఁ బ్రసిద్ధంబైన క్షీరారామంబును. చాళుక్యవంశ రాజధానియగు చాళుక్యభీమవర నామగ్రామంబునఁ గుమారరత్నంబైన కుమారస్వామి చేతం బ్రతిష్ఠితంబగుటంజేసి కుమార భీమలింగంబనఁ బ్రఖ్యాతంబునొందిన భీమారామఁబును, మొదలిమామయగు దక్షప్రజాపతి యునికి పట్టైన యారామంబగుట దక్షారామంబున శివసన్నిధానంబై దానుండునట్టుగా నీప్రకారంబున భోగమోక్షప్రదంబులైన పంచారామంబులను ప్రతిష్ఠ నొందించి."

(భీమేశ్వర పురాణము 4-151)

భీమేశ్వరపురాణము సంస్కృతభాగమున నీ యమరారామము గూర్చి యిట్లు గలదు.

"పంచఖండాని కృత్వాథపంచస్వారామ భూమిషు
అమరేశారామ సోమారామ క్షీరవనానిచ
కుమారారామ విఖ్యాతాచ్చతురారామ పట్టణే
ప్రతిష్ఠాప్య స్వయంభీమోదక్షిణాబ్ధి తటస్థితే
దాక్షారామపురే రమ్యేదక్షిణానంద కాననే
శుద్ధస్ఫటిక సంకాశం సర్వలోక మనోహరం."

ఈ పంచారామములు అమరావతి, పశ్చిమగోదావరి మండలములోని పాలకొల్లు, గుణపూడి భీమవరము, తూర్పుగోదావరి మండలములోని ద్రాక్షారామము, భీమవరమునను నైదు శైవక్షేత్రములు

ధరణికోట నుండి అర్వేలనాటిని బాలించిన కోట భూపాలురు తాము అమరేశ్వర దేవ దివ్యశ్రీపదపద్మారాధకులమని చెప్పుకొన్నారు.

"స్వస్తిచతుస్స ముద్రముద్రిత నిఖిలవసుంధరా పరిపాలక శ్రీమత్రి నయన పల్లవ ప్రసాదిత కృష్ణవేణానదీ దక్షిణషట్సహస్రావనివల్లభ భయలోభదుర్లభ చోడ చాళుక్య సామంత మదానేకప మృగేంద్రవిభవో మరేంద్ర శ్రీ మదమరేశ్వర దేవ దివ్య శ్రీపాద పద్మారాధక పరబల సాధక శ్రీ ధాన్యకటక పురవరాధీశ్వర ........" (3)

కోట కేతరాజు నాటి అమరావతి శాసనములో నొకదానియందు అమరావతిలోని బుద్ధుని చైత్యమా కాలము నాటికి సురక్షితముగా నుండెనని తెలియుచున్నది.

"అస్తి శ్రీ ధాన్యకటకంపురం సురపురాత్పరం
యత్రామరేశ్వరః శంభురమరేశ్వర పూజితః
బుద్ధోదేవస్స స్సాన్నిధ్యాదత్ర దాత్రో ప్రపూజితః
చైత్య మత్యున్నతం యత్ర నాథోసుచిత్రతం॥" (4)

ఆ శాసనములో రాజు యొక్క ఉంపుడుకత్తె గసవి సూరమదేవులు 'దనకు ధర్మార్థముగ శ్రీ మద్బుద్ధదేవరకు నఖండవర్తిదీపమునకు ఏబదియైదు గొఱ్ఱెల దానము చేసెనని కలదు. అనగా ఆకాలము నాటికి అమరావతియందు బుద్ధదేవుని పూజలు జరుగుచున్నవని తెలియుచున్నది. (శా. శ. 1104)

అమరావతిలోని మరియొక శాసనములో వేమచమూపతి కొండవీటి 'అనపోతారెడ్డింగారికి ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధిన్ని పుత్రపౌత్రాభి వృద్ధిన్ని అవునట్లుగాను పంచారామంబులకు ప్రథమారామంబైన అమరా రామంబను శ్రీ ధాన్యవాటి పురంబునకు నధీశ్వరుండైన అమరేశ్వర శ్రీమన్మహాదేవరను ఆచంద్రార్కముగాను పునః ప్రతిష్ఠ జేసిరి. (5) (శా. శ. 1283)

అచ్చటనేయున్న ఇంకొక శాసనములో హాంద్రికె పెద్దప్పయనువాడు ధరణికోట శ్రీ అమరేశ్వర లింగమును మూడవ ప్రతిష్ఠను జేసినట్లును,

మొదటి ప్రతిష్ఠ యింద్రునిచే జేయబడెననియు, రెండవ ప్రతిష్ఠ అన్నవేమ ధరణీశ్వరుడు చేసెననియు గలదు. (6) (శా. శ. 1548)

అమరావతిలో కోటభూమి నేలినవారి శాసనములు, కొండవీటి రెడ్డి రాజుల శాసనములు, శ్రీ కృష్ణదేవరాయల శాసనములు నుండుటచే నియ్యది ఆంధ్రదేశ చరిత్రలో ప్రఖ్యాతిగాంచిన ప్రాచీన నగరరాజములలో నొక్కటి.

మహోదాతయు, కమ్మప్రభులైన వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు అమరావతి రాజధానిగ తత్ప్రాంతముల బాలించెను. ఇతడు మొదట సత్తెనపల్లి తాలూకా చింతపల్లి జమీందారుడు. తన రాజధానిని చింతపల్లి నుండి అమరావతికి మార్చి అచ్చటి నుండియే ధర్మపరిపాలనము గావించెనని యీతనిపై చెప్పిన చాటుపద్యములవల్ల దెలియుచున్నది. అమరావతికి ప్రాకార గోపురములు నిర్మించెననియు, నచ్చట నందనవన మొకదానిని గావించెననియు దెలియుచున్నది.

"కం॥ అమరావతి యమరావతి
అమరగ నింద్రుండు వెంకటాద్రీంద్రుండే ।
అమరులు గోత్రామరులే ।
కమనీయము నందనంబు ఘననందనమే ।

చం॥ హితమతి వెంకటాద్రి విభుడేలెడు నయ్యమరావతీ పురిన్
గ్రతుభుజు లన్నవస్త్రములు గాంచ రొకప్పుడుఁ బూర్వదేవతా
హితమతి వెంకటాద్రి నృపుడేలెడు నీ యమరావతీ పురిన్
సతత సమస్తవర్ణులును జక్కగఁ గాంతు రన్నవస్త్రముల్॥"

చాటుపద్య రత్నాకరము.
(తృతీయ తరంగము పుట 154-168.)

1. Geography of Early Buddhism P. 62; Geographical Essays P, 68.
2. S. I. I. Vol. IV. No. 749 (శా. శ. 1068).
3. S. I. I. Vol. VI. No 224 (శా. శ. 1104).
4. E. I. Vol. VI. No. 15 (శా. శ. 1104).
5. S. I. I. Vol. VI. No. 225 (శా. శ. 1283).
6. S. I. I. Vol. VI. No. 227 (శా. శ. 1548).

### అమవకలమూరి కంపనము

"శ్రీ త్రిపురాంతక దేవర దివ్య శ్రీపాద పద్మారాధకులైన శ్రీమతు శాంత శివగురు దేవరకు అమవకలమూరి కంపనము లోన పలికించిన చలమతి గండాపురమనెడి యూరు." (1)

పై శాసనము కాకతీయ గణపతిదేవమహారాజు కాలమునాటిది. నెల్లూరు మండలములోని దర్శి తాలూకాలోని గంగవర గ్రామములోనిది. గంగవర గ్రామమునకె కాకతీయుల బిరుదైన చలమత్తిగండ బిరుదమును జేర్చి గండవరమని పేరు గలిగి యుండవచ్చును. అమవకలమూరి కంపనము దర్శి తాలూకా గంగవర ప్రాంత భూమి కానోవు.

(1) **N. I Darsi (25)** (శా. శ. 1176)

### అమ్మనంబ్రోలి సీమ

"తిమరసయ్యవారు తమకు చెల్లివచ్చె కొండవీడు రాజ్యంలోను అబ్బానాయని వార్కి దయచేసి యిచ్చిన అమ్మనంబ్రోలి సీమలోని కొచ్చెర్ల కోట కటకసాలుంగ పట్టున గోనగుంటన." (1)

"అమ్మనంబ్రోలి సీమలోని ఊరు దొడ్డారమున మల్లిఖార్జున దేవునికి" (2)

"శ్రీకృష్ణదేవరాయ మహారాయల శాసనం, అమనంబ్రోలి సీమలోని వల్లూరి గ్రామాన్ని తమ పురోహితులు రంగనాథ దీక్షితులకున్ను, శివా దీక్షితులకున్ను అమ్మనంబ్రోలి సీమలోని.........కొత్తపల్లి గ్రామంన్ని తోంగుంట గ్రామంన్ని." (3)

S. I. I. Vol. VI. No 248 (శా. శ. 1437).

"అమ్మనంబ్రోలి సీమలోని చదలువాడ స్థలమందు." (4)

గ్రామ స్థల నిర్దేశ పట్టిక

| | | | |
|---|---|---|---|
| అమ్మనంబ్రోలు | అమ్మనంబ్రోలు | ఒంగోలు తాలూకా | |
| క్రొత్తపల్లి | కొత్తపల్లె | దర్శి | ,, |
| తోంగుంట | తునుగుంట | కందుకూరు | ,, |
| కొచ్చెర్లకోట | కొచ్చెర్లకోట | దర్శి | ,, |

| | | |
|---|---|---|
| గోనుగుంట | గోనుగుంట | ఒంగోలు తాలూకా |
| చదలువాడ | చదలు వాడ | ,, ,, |
| వల్లూరు | వల్లూరు | ,, ,, |
| దొడ్డారము | దొడ్డవరము | ,, ,, |

అమ్మనంబ్రోలు సీమ ఒంగోలు తాలూకా దర్శి, కందుకూరు తాలూకాలలో కొంత ప్రాంతమై యుండెను.

1. N. I. Ongole (46) శ. స. (1438).
2. ,, ,, (41) శ. స. (1450).
3. S. I. I. Vol. VI. No. 248 (శ. స. 1487).
4. N. I. Ongole (81) శ. స. (1481)

## అయిజ మున్నూరు (ఐజ) నాడు (స్థలము)

అయిజ యను గ్రామము మహాబూబునగర జిల్లాలోని గద్వాల తాలూకాలో నున్నది. తెలంగాణ శాసనములలో కల్యాణి చాళుక్య శాసనములలో వక్కాణింపబడిన నాల్కునాడులలో నొకటి (1)

(1) కన్నెమూనూఱు
(2) పెడకంటినూఱు
(3) నఱవాడి యయ్యూఱు
(4) అయిజె మూనూఱు

అయిజ మూనూఱు నాటిలోని కొన్ని యీ క్రింది గ్రామములు, నేటి యా యా గ్రామనామము లుదాహరింపబడు చున్నవి.

| | | |
|---|---|---|
| యుణ్డవెలి | ఉండవెల్లి | అలంపూరు తాలూకా (2) |
| బోరువెల్లి | బోరువెల్లి | ,, |
| చాకిదొన | చాగదొన్ని | గద్వాల తాలూకా (3) |

(1) తె. శా. సంపుటము 2. కళ్యాణిచాళుక్య శాసనములు సంఖ్య 12
(2) ,, ,, ,, 19
(3) ,, ,, ఇతర శాసనములు 8, 9

అయిజ మున్నూరు నాడు (స్థలము) ఇప్పటి ఆంధ్రప్రదేశములోని కృష్ణ కుత్తర దిక్కున అలంపురము, గద్వాల తాలూకా ప్రాంతమై యుండును.

### అఱులూరి స్థలము

"అఱులూరి పెఱ్ఱూరి స్థలము యెన్మిదియుళరెడ్లును వీరి యుభ యాన్మతమ్మున వంగోలిని"

పైని పేర్కొనబడిన అఱులూరు, పెఱ్ఱూరి గ్రామములు గుంటూరు మండలములోని వంగోలు తాలూకాలో గలవు. ఆ యా స్థలములకు చెందిన యెనిమిది గ్రామములు ఆ తాలూకాలో యుండవచ్చును. గ్రామ నామములు శాసనములో పేర్కొనబడలేదు.

N. I. Ongole (101) శ. స. (1194)

### అలంపూరు సీమ

అలంపూరు గ్రామము సుప్రసిద్ధమైన ప్రాచీన శైవక్షేత్రము. తుంగ భద్రానదికి ఉత్తరతీరమందున్నది. ఆంధ్రప్రదేశములోని మహబూబునగర మండలములో నున్నది. బాదామి చాళుక్య, రాష్ట్రకూట, కళ్యాణిచాళుక్య రాజన్యుల పరిపాలన కాలమున వారి సామంతమండలేశ్వరుల యధీనము నందుండెను. శ్రీశైలమునకు పశ్చిమద్వారమని ప్రసిద్ధము.

అలంపూరుసీమ లోనివని యీ క్రింది గ్రామములు పేర్కొనబడినవి (1)

| | | |
|---|---|---|
| గోకులపాడు | గోకులపాడు | అలంపురము తాలూకా |
| చెన్నిపాడు | చెన్నుపాడు | ,, |
| పూసలపాడు | పోసెలపాడు | ,, |

శ్రీకృష్ణదేవరాయలు రాచూరిపై దండువెడలి, దానిని స్వాధీనము గావించుకొని అలంపురము విచ్చేసి గౌరదండనాయకుని బసవప్పయ్యను అమరనాయకునిగ నిర్మించినట్లు ఇచ్చటి రాయల కన్నడశాసనమునందు కలదు. అలంపురములోని కన్నడాంధ్ర శాసనములు తెలంగాణ శాసన సంపుటములందు గలవు.

(1) శ్రీకృష్ణదేవరాయల అలంపుర శాసనములు తెలంగాణ శాసన సంపుటము 2. విజయనగర శాసనములు 2, 3, 4, 5, 6. (శ. స. 1443–1450).

(2) అలంపుర చాళుక్య రాష్ట్రకూట శాసనములు.

(a) చాళుక్య శాసనములు. తెలంగాణ శాసన సంపుటము-1.
చాళుక్య శాసనములు 9-12.

(b) చాళుక్య శాసనములు. తెలంగాణ శాసన సంపుటము 2.
బాదామి చాళుక్యులు-సంఖ్య. 3; రాష్ట్రకూటులు సంఖ్య. 1-3; కళ్యాణ చాళుక్యులు-సంఖ్యలు. 2-22, 24-27; కాలచుర్యులు సంఖ్యలు. 2.

పై శాసనము లన్నియు కన్నడ భాషలో నెనిమిది, తొమ్మిది, పదియవ శతాబ్దముల నాటివి.

(3) శ్రీ ఆదిరాజు వీరభద్రరావు-ప్రాచీనాంధ్ర నగరములు అలంపుర కథనము.

## అల్లూరు

కృష్ణా మండలములోని నందిగామ తాలూకాలోని గ్రామము. ఈ గ్రామ సమీపమున ప్రాచీన బౌద్ధస్తూప మొకటి క్రీ. శ. 1926 సంవత్సరమున గుర్తింపబడినది. ఇచ్చట శిథిలమైన పాలరాతి ఫలకములు, బ్రాహ్మి లిపిలోనున్న శిలా స్తంభములు గలవు. ఆంధ్రప్రదేశములో నత్యంత పురాతనమైన స్థలములలో నొకటి. నదునేడు పంక్తులుగల క్రీ. శ. రెండవ శతాబ్దమునాటి బ్రాహ్మిలిపిలో నున్న యీ శాసనమును శాసన పరిశోధక శాఖ వారు వారి నివేదికలో ప్రచురించిరి.

No. 331 of 1924 M. E R. 1923-24 Part II P. 97.

## అవుకు (ఔకు) సీమ

ఈ అవుకుగ్రామము కర్నూలు మండలములో కోయిలకుంట్ల తాలూకాలో నున్నది. సదాశివరాయలనాటి కొన్ని శాసనములలో అవుకు సీమలోని యీ క్రింది గ్రామములు పేర్కొనబడినవి. (1)

| శాసనములలోని గ్రామము | నేటి గ్రామము | నేటి తాలూకా |
|---|---|---|
| వినయమ్మనూరు | పెద్దయమ్మనూరు | కోయిలకుంట తాలూకా |
| చింతకుంట (పెద్ద) | చింతకుంట (పెద్ద) | శిరువెళ్ళ |
| తుమ్మలపెంట | తుమ్మలపెంట | కోయిలకుంట |

అళియరామరాయల పెద్ద తండ్రియగు తిమ్మరాజు అవుకు సీమకు ప్రభువై నప్పటి నుండియు నతని సంతతివారికి నవుకువారని యింటిపేరు వచ్చినట్లు రామరాజీయములో జెప్పబడినది.

కం. ఆ తిమ్మనృపతి భూకాం
తా తిలకంబైన యవుకు దా వేలుచు వి
ఖ్యాతిగ నవ్వూరి పేరన్
ప్రీతినిఁ దనకులము వెలయ బెంపొందె మహిన్.

ఈ అవుకుసీమ విజయనగర సామ్రాజ్య కాలములో నేటి కోయిల కుంట్ల తిరువెళ్ళ తాలూకా ప్రాంతమై యుండెను.

M E. R. Nos. 265, 269, 276.

**అశ్మకము**

గోదావరీ తీరమందలి అంధక జనపదములలో నిది యొకటి. రెండ వది ములకము. అస్సక లేక అసక యనియు పాళీపరిభాషలో దీనికి పేర్లు. పొతన, పొదని లేక పోతన దీనికి రాజధాని. ఆంధ్రప్రదేశములోని నిజామా బాదు మండలము నందలి బోధన తాలూకాకు ప్రధాననగరమైన బోధనయే పోతన యని చారిత్రక పరిశోధకులు గుర్తించియున్నారు. బోధన తాలూ కాకు పడమటి దిక్కున మంజీరానది ప్రవహించుచున్నది. అశ్మక జనపదము గోదావరి, మంజీరా నదుల ఉభయతటముల నావరించి, కొంత మహా రాష్ట్ర దేశములోను, గొంత ఆంధ్రప్రదేశము (తెలంగాణము) వాయువ్య ప్రాంతము గూడివచ్చిన భూభాగమని నిర్ణయింప వచ్చును.

**India as described in early texts of Buddhism and Jainism (pages 34; 107-08)**

**ఆంధ్రము**

ఆంధ్రులను జాతి వారికి నివాస భూమియైన జనపదము. ఐతరేయ బ్రాహ్మణమునందు శౌనశ్శేఫాఖ్యానములో విశ్వామిత్ర ఋషి తన సంతతి వారిని ఆర్యావర్తమయుల సరిహద్దులలో నివసించునట్లుగా శపించెననియు, వారలే ఆంధ్రులనియు, పుండ్రులనియు, శబరులనియు, పుళిందులనియు,

భూతికా లనియు పిలువబడుచున్నారని తెలుపబడినది. వీరు ఆర్యావర్తము నకు దక్షిణమున నివసించెడివారు.

"బ్రా. తస్యహ విశ్వామిత్ర స్యైకశతం పుత్రా ఆసుః—పంచాశ దేవజ్యాయాం, సోమథు చందసః—పంచాశత్య నీయాం స్త స్తద్యైజ్యాయాం సోనతేకుశలం మేనిరే. తానను వ్యాజహారాం తాన్వః ప్రజాభక్షీష్టేతి— త ఏతేంధ్రాః పుండ్రాః శబరాః పుళిందా మూతిభా ఇత్యుదుత్యా బహవో భవంతి."

రామాయణమున ఆంధ్రుల ప్రశంస గలదు.

"సహస్ర శిరసం వింధ్యం నానాద్రుమలతాయుతం ।
నర్మదాంచ నదీం దుర్గాం మహోరగ నిషేవితాం ॥
తతో గోదావరీం రమ్యాం కృష్ణవేణీం మహానదీం ।
వరదాంచ మహాభాగాంచ మహోరగ నిషేవితాం ॥
మేఖలో ముత్కలాం చైవ దశార్ణ నగరాణ్యపి ।
అశ్వవంతీ మవంతీం చ సర్వమేవాను పశ్యత ॥
విదర్భా వృషికాం శ్చైవ రమ్యాన్మాహిష కానపి ।
తథా వంగాన్కళింగాశ్చ కౌశికాంశ్చ సమంతతః ।
అన్వత్య దండకారణ్యాం సపర్వత నదీం సహాం ।
నదీం గోదావరీం చైవ సర్వమేవాను పశ్యత ॥
తథైవాంధ్రాంశ్చ పుండ్రాంశ్చ చోళాన్ పాండ్యాన్ శ్చ కేరళాన్

"హనుమంతుడు మొదలగు వానరులు దక్షిణ దిక్కునకు వచ్చుట. సీతను వెదకుచు దండకారణ్యంబున కరిగి యచట గిరివన దుర్గంబుల గోదావరీ తీరంబుల నంధ్ర పుండ్ర కేరళకురుదేశంబుల బతికించుచు...."

(రామాయణ - కిష్కింధా కాండము)

మహాభారతము భీష్మ పర్వమునందలి భారతీయ నద్యాది నామకథ నములోను, సభాపర్వములో సహదేవుని దక్షిణ దిగ్విజయ సందర్భమునను, నిమంత్రిత రాజాన్నుగమన కథనములోను ఆంధ్రప్రశంస గలదు.

ఆంధ్రాశ్చ బహవో రాజన్న గిర్యాస్త థైవచ।
బహిర్గిర్యంగ మలజా మాగధా మానవర్జ కా॥
ఆంధ్రాం స్తాల వనాంశ్చైవ కళింగాదు ష్ట్రికర్ణి కాన్ ।
అటవీం చ పురీం రమ్యాం యవనాం పురంతథా॥
పౌండ్రవో వాసుదేవశ్చ వంగః కాళింగ కస్తథా।
ద్రావిడాస్సింహళశ్చైవ రాజా కాశ్మీర కస్తథా॥
ఆకర్షం కుంతలశ్చైవ మాళవాశ్చాంధ్ర కాస్తథా।
కుంతిభోజో మహాతేజః పార్థివో గౌరవాహనః॥
ఆంధ్రకాః। కృష్ణా గోదావర్యో మధ్యే విద్య మానే దేశః।

దక్షిణాత్య జనపదవాసులలో ఆంధ్ర, కేరళ, కొంకణ, కర్ణాటక, కోసల, కాళింగ, కుంతల, విదర్భ దేశజులు కౌరవ పక్షమునను, చోళ పాండ్య దేశజులు పాండవ పక్షమునను బోరాడినట్లు భీష్మ, ద్రోణ, కర్ణ పర్వములందు వర్ణింపబడినది.

అథాపరే జనపదా దక్షిణాపథ వాసినః।
"పుండ్రాశ్చ కేరళాశ్చైవ గోలాంగు లాస్తథైవచ
శైలూషికా మూషికాశ్చైవ కుసుమా వామవాసకాః
మహారాష్ట్రా మాహిష్కా కళింగాశ్చైవ సర్వశః
అభీరాః సహవైశిక్యా అధక్యా శబరోశ్చచయే
పులిందా వింధ్య మౌలేయా వైదర్భాదండకైస్సహ
సౌరికా మౌలికాశ్చైవ అశ్మకా భోగవర్ధనాః
నైశికాః కుంతలా ఆంధ్రా ఉద్భిదావనదారాః

ఆ మధ్యదేశంబునకు.......... దాక్షిణాత్యంబులై పాండ్య, కేరళ, చోళ, కుల్య, మహారాష్ట్ర, మహిష, కళింగ, విదర్భ, కుంతలాంధ్రాదులును"

(మార్కండేయ పురాణము)

కుమారాఖ్యాం పరిఖ్యాతోద్వీపోయం దక్షిణోత్తరః॥ పూర్వే కిరాతోయస్యాస్తే పశ్చిమేయవనాః స్మృతాః॥ ఆంధ్రా. దక్షిణతో వీర తురుష్కా స్త్వపిచోత్తరే॥

భరతుని నాట్య శాస్త్రములో ఆంధ్రము దక్షిణాత్య దేశములలో నొకటిగా జెప్పబడినది.

తత్ర దక్షిణాత్యా భవేత్ బహుగీత నృత్య వాద్యా కైశికీప్రాయా చతుర మధుర లలితాంగాంభినయా । యథా.

"మహేంద్రోమలయః సహ్యో మేలకః పలపింజరః ।
ఏతేషు సంశ్రితా దేశాః సజ్ఞేయో దక్షిణాపథ ।
కోశలాస్తోశ లాశ్చైవ కలింగా ఏవ గోశలాః ।
ద్రవిడాంధ్ర మహారాష్ట్రా వైణ్యావై వాన వానజాః ।
దక్షిణస్య సముద్రస్యతథా వింధ్యస్య చాన్తరే ।
యే దేశా స్తేషు యుంజీత దాక్షిణాత్యాంతు నిత్యశః ॥"

బృహత్సంహితా కూర్మ విభాగములో ఆంధ్ర దేశ ప్రశంస గలదు.

"అగ్నేయాందిశి కోసల కళింగ వంగోపవంగజఠరాంగాః ।
శౌలిక విదర్భ వత్స్యాంధ్రచేదికా శ్చోర్ధ్వ కంఠాశ్చ ॥"

క్రీస్తు పుట్టుటకు పూర్వము నాలుగవ శతాబ్దాంతమున లేక మూడవ శతాబ్ద ప్రారంభమున మగధ సామ్రాజ్య మేలిన చంద్రగుప్త చక్రవర్తి యాస్థానమునకు 'సెల్యూకస్ నికెటార'ను వానిచే రాయబారిగా బంపబడిన 'మెగాస్తనీస్' అను వాడు భరతఖండములో మగధ సామ్రాజ్యము తర్వాత దక్షిణాపథమునకు ఆగ్నేయ భాగమందుండిన ఆంధ్ర సామ్రాజ్యమె పరాక్రమవంతమైనదని యిట్లు వర్ణించెను.

"వారి తరువాత 'అందరే' అను వారింకను పరాక్రమవంతులైన జాతివారున్నారు. వారికి దుర్గ ప్రాకారములచే సంరక్షింపబడిన ముప్పది పట్టణములు గలవు. ఇంకను లక్ష కాల్బలమును, రెండువేల గుఱ్ఱములు, వేయి యేనుగులును గల సైన్యము గలదు."

చంద్రగుప్త చక్రవర్తి మనుమడగు అశోకచక్రవర్తి కళింగ దేశముపై దండువెడలి యాదేశమును దన సామ్రాజ్యములో గలుపుకొనెను. తన కాలమున తన రాష్ట్రములోని వారలవలెనె యవనులు, కాంభోజులును, నాభకులును, భోజులును, పైతానికిలును, ఆంధ్రాలును, పుళిందులును తన చేత ప్రకటింపబడిన బౌద్ధధర్మము నవలంబించిరని తన 13 శిలా శాసనమున బ్రకటించి యుండెను.

క్రీ. శ. 640 వ సంవత్సర ప్రాంతమున చీనా దేశపు యాత్రికుడగు హీనుత్సాంగు (యువాన్ చ్వాంగ్) అను నతడు దక్షిణాపథ దేశముల గుండ కాంచీపురమునకు బోవుచు, మార్గమధ్యమున అంతొలోలను (ఆంధ్ర దేశము) గూర్చి యిట్లు వక్కాణించి యున్నాడు.

"కోసల దేశము నుండి దక్షిణ దిశకు బ్రయాణించి, యొక యడవి మార్గమున 'అంతొలో' దేశమును బ్రవేశించెను. ఆ దేశము దాదాపు 450 చదరపు మైళ్ళ వైశాల్యము గలది. దానికి 'పింగ్ – కి – లొ' (వేంగి) రాజధాని. అది దాదాపు ముప్పది మైళ్ళ వైశాల్యముగా నుండెను. ఈ ప్రాంతమంతయు సారవంతమైన భూమి. దీని శీతోష్ణస్థితి తేమతో గూడిన వేడి ప్రదేశము. ప్రజ లుద్రేకపూరితులు. వీరి భాష భారత మధ్య భాగము నందలి భాషకు భిన్నమైనది. కాని వారి లిపి, వీరి లిపికిని సామ్యము కలదు. ఇక్కడ బౌద్ధ సంఘారామము లిరువదికి పైగా నున్నవి. వానిలో బౌద్ధ భిక్షుకులు మూడువేలకు మించి గలరు. రాజధానికి సమీపములో పదునలు దీర్చిన చావడులతోను, శిల్ప నైపుణ్యమును జూపు మేడ మిద్దెల తోను గూడిన యొక పెద్ద సంఘారామమున్నది. దానిలో దివ్యమైన బుద్ధ విగ్రహముండెను."

పై వర్ణననుసరించి, యూవాన్ చ్వాంగు వర్ణించిన ఆంధ్రదేశము గోదావరి, కృష్ణ, మధ్యాంతర్వేది యనియు, నప్పటికి నిప్పటికి, నీ ప్రాంత భూమియు, నందలి ప్రజలు నెట్టి మార్పులేక నుండుటయు గ్రహింపనగును. (పీఠికను జూడనగును)

## ఆంధ్ర దేశము

వెలనాటి గొంకరాజు శాసనములో ఆంధ్రదేశము పంచశత లక్ష గ్రామ పరిమితమగు దేశమని వక్కాణింపబడినది.

> "ధనదాఖ్యపురం రమ్యం కృష్ణవేణ్యా సమీపతః
> తుంగభద్రా తరంగిణ్యాం ప్రాగ్దిశం వెలనాడితి
> విఖ్యాతం జన సంపూర్ణం మల్లవర్మా తథాకరోత్
> స్వనామ్నా శివలింగేశం ప్రతిష్ఠాప్య వ్యరాజత
> తద్వంశజాతో గొంకేశ శరణ్యస్సె వ్యభూభృతాం

మదాన్వృగస్య విఖ్యాతా సన్నద్ధర జయస్నృపాల్
పంచాశత్ లక్షయుక్త మంధ్రదేశ మపాలయన్.''

తుంగభద్రానదికి పూర్వ దిక్కున వెలనా డుండెను. దానిని పాలించిన మొదటి (?) గొంకరాజు 50,00,000 గ్రామ పరిమితి గల ఆంధ్రదేశమును పాలించెనని పై శాసనమువల్ల ద్యోతకమగుచున్నది.

(పులివర్రు కైఫియతు—భారతి—వ్యయ సం॥ శ్రావణమాస సంచిక)

విన్నకోట పెద్దన తన కావ్యాలంకారచూడామణి యను లక్షణ గ్రంథములో ఆంధ్రదేశమునకు హద్దులను నిరూపించుచు, నయ్యది త్రిలింగ దేశము, తెనుగుదేశమను నామములతో వెలయుచున్నదని చెప్పియున్నాడు. ఇందు ఆంధ్రదేశ వ్యాప్తి నిరూపణము పరిమితమై యున్నది.

కం॥ ధర శ్రీ పర్వత కాళే
శ్వర దాక్షారామ సంజ్ఞ వఱలఁ ద్రిలింగా
కరమగుట నంధ్రదేశం
బరుదారఁ ద్రిలిఁగదేశ మనఁ జను గృతులన్.

గీ॥ తత్త్రిలింగ పదము తద్భవం బగుటచేఁ
దెలుఁగు దేశమనఁగఁ దేట పడియె
వెనుకఁ దెనుఁగు దేశమును నండ్రుగొందఱ
ఖ్యాఘ పంచగతుల బరగుచుండు.

పై విషయమె పదునేడవ శతాబ్దియందున్న అప్పకవియు దన వ్యాకరణములో నిరూపించి యున్నాడు. పై నిర్ణయము ప్రకారము శ్రీశైలము, దాక్షారామము, కాళేశ్వరము ఈ మూడు క్షేత్రముల మధ్య భాగము ఆంధ్రదేశము, త్రిలింగదేశము, తెలుగు (తెనుగు) దేశ నామముల బరగుచుండెను.

## ఆంధ్ర నగరము

ఏడవ శతాబ్దము నందుండిన దండి మహాకవి తాను రచించిన దశకుమార చరిత్రములో మంత్రగుప్త చరితమునందు ఆంధ్రరాజైన జయసింహుని, యతని రాజధానియైన యాంధ్రనగరమును బేర్కొనియున్నాడు.

"కళింగరాజస్సహాంగ నాజనేన సహచ తనయ యా సకలేనచ నగర జనేన దశతీత్రిణి చ దినాని దినకర కిరణజాలా లంఘనీయో రణదళిసంఘ లంఘితనత లతాగ్ర కిసలయాలీఢ సైకతతలే తరళ తరంగ శీకరాసారసంగ శీతలే సాగరతీర కాననే, క్రీడారస జాతాస క్తిరాసీత్. అథ సంతత గీత సంగీత సంగతాంగనా సహస్ర శృంగార హేలా నిరర్గళా సంగసంఘర్ష హర్షితశ్చ రాగతృష్ణైక తంత్రి స్తత్రరన్ద్రి ఆంధ్ర నాథేన జయసింహేన సలిలతరణ సాధనా నీతేనా నేకసంఖ్యేనా నీకేనద్రాగా గత్యాగృహ్యత సకళత్రిః సాచానీయత త్రాసచంచలాక్షీ దయితాసాస్సహ సఖిజనేన కనకలేఖా....

అత్రాంతరే ఆన్ధ్రనగరా దాగచ్ఛన్ బ్రాహ్మణ కశ్చిదైత్యత.... పాత్రియాసిషం చదిసై కైశ్చి దన్ధ్రనగరమ్. తస్యనాత్యాసన్నే సలిల రాశి సదృశస్యకలహంస గణదళిత నళిన దళసంహతి గళిత కింజల్క శకల శారస్య సారసశ్రేణి శేఖరస్య సరసస్తీర కాననైకృత నికేతన స్థితః."

"సీ॥ ఆంధ్ర దేశాధీశుడగు జయసింహుండు
పత్రి భటుండగుట రంధ్రంబు వేచి
బరిమిత పరిచార పరిగతుడని తన
వేగులు చెప్పిన వివిధ యాన
పాత్రముల్ సమకట్టి బలములు దానును
వారాశిలో జొచ్చి తీరభూమి
డిగ్గి మోహారములు డిగ్గన దీర్చి కం
పిత మహీతలుడయి బిట్టునుండి

తే॥ లీల నేమఱియున్న కళింగవిభుని
గామినీ జన సహితంబు గాగనడగ
బట్టి కలముల లోపల బెట్టి కొని స
మగ్ర మదగర్వ మొప్పంగ మగుడనరిగె

...........................................

వ. అని నిశ్చయించి సముచిత సల్లాపంబుల వెండియుం గొండొక సేపు గడపి యాజియ్యవేడ్కని యరిగి యాకార్యంబు వెల్లగునట్లుగా నైపుణ్యంబునం దాపస వేషంబు దాల్చి కొందఱు శిష్యులం గూర్చుకొని యేనును వారున్నుం

బరమాప్తిక జన మధ్యంబున సుఖులమై నడచి యంధ్రనగరంబు చేరువకరిగి తత్ప్రదేశంబున నొక్కకొలని కడం బర్ణశాల గావించుకొని యందువసించి"
(కేతన–దశకుమార చరిత్రము. ఏకాదశాశ్వాసము)

దండి పేర్కొన్న జయసింహుడు పూర్వ చాళుక్య రాజైన ప్రథమ జయసింహ వల్లభ మహారాజు. అతడు వర్ణించిన ఆంధ్రనగరము దాని సమీపముననున్న కొలను,ఆంధ్ర చాళుక్య రాజధానియగు వేంగిపురమనియు, దానికి సమీపమున నున్న కొల్లేరనియు జరిత్రజ్ఞుల యభిప్రాయము. ఇవి రెండును పడమటి గోదావరి మండలమునందున్నవి.

(చూడుడు–ఓరుగల్లు)

## ఆంధ్ర పథము

మూడవ శతాబ్దమున గాంచీపురము రాజధానిగా ఆంధ్రదేశమును పాలించిన శివస్కందవర్మయను పల్లవరాజు తాను యువరాజుగ నున్నపుడు వ్రాయించిన మైదవోలు శాసనములో సాతవాహనులకు రాజధానిగ నుండిన ధనకటకము (ధరణికోట) ఆంధ్రాపథములోని దనియు, దానిలో 'విరిపర' యను గ్రామము నిద్దఱుబ్రాహ్మణులకు దానమిచ్చినట్లును దెలుపబడినది.(1)

'అన్ధాపతీయ గామోవిరిపరమ్.' ఈ శాసనము ప్రాకృత భాషలో వ్రాయబడి కాంచీపురము నుండి ప్రకటింపబడినది. ఇయ్యది గుంటూరు మండలములోని నరసారావుపేట తాలూకా మైదవోలు గ్రామమున లభించినది. దానమీయబడిన గ్రామము విరిపర యనునది ఆ తాలూకాలోని విప్పర్ల యను గ్రామమే.

బాణరాజైన రెండవ విక్రమాదిత్యుని ఉత్తర ఆర్కాడు జిల్లా గుడియట్టము తాలూకా ఉదియేంద్రము తామ్రశాసనములో తన పూర్వుడైన జయనందివర్మ ఆంధ్ర పథమునకు పశ్చిమమున నున్న భూభాగము నేలుచుండెనని వ్రాయించుకొనెను. "సతిస్మతితి మేకవీర ఆంధ్రాత్పథః పశ్చిమతో బలీయాన్ వధూమనన్య సమామ్ కులోత్తమామ్ రాజన్య చూడామణి రంజితాంఘ్రిః." (2)

బాణరాజులేలినరాజ్యమునకు వడుగావళియనియు. పెరుంబాణప్పాడియనియు పేర్లు. చిత్తూరు మండలములోని దక్షిణ భాగము, అనంతపురము

మండలములోని కొంతభాగము, మైసూరు రాజ్యములోని కోలారు మండల ప్రాంతము, దక్షిణమున పాలారునది గల భూభాగము బాణరాజ్యము. మైదవోలు, ఉదయేంద్ర శాసన స్థల నిర్దేశమునుబట్టి ఆంధ్ర పథము పల్లవ, బాణరాజుల కాలములో గుంటూరు మండలము నుండి దక్షిణ దిగ్భాగమైన నేటి ఆంధ్రప్రదేశమునకు సరివచ్చు దేశమని తలంపవచ్చును.

(1) Mydavole Plates of Sivaskanda Varma) శివస్కంద వర్మ మైదవోలు శాసనము) E.I Vol. VI. Pages 85-88. (2) E.I. Vol. III. P. 76.

**ఆంధ్ర భూతలము**

సత్తెనపల్లి తాలూకా సిరిపురములోని యొక శాసనములోని

చ॥ "ఇల వెలనాటి గొంకవసుధేశు తనూభవుడైన చోడ భూ
తలపతి సోడపట్టము ముదంబునగట్టి భుజాబలంబునన్
గొలనుజయించి యందు రిపుకుంజరు భీమునిజంపి **యాంధ్ర**
**భూతలము** పదాఱువేలు సతతస్థితినేలె సురేంద్రలీలతోన్."

ఈ ఆంధ్ర భూతలమె ఆఱువేల వెలనాడు.

S. I. I. Vol. X. No 177 (శా.శ. 1053).

**ఆంధ్ర మండలము**

క్రీస్తునకు తరువాత నాల్గవ శతాబ్దములోనున్న వధూవల్లభ మల్లదేవ నందివర్మయను బాణరాజు తాను వ్రాయించిన ముడియానూరు శాసనములో ఆంధ్రమండల ద్వాదశసహస్ర గ్రామ సంపాదితమగు సప్తార్ధలక్ష విషయాధిపతినని తెలుపుకొనెను.

"తస్య తాదృశస్య విశ్వంభరా వలయాభరణ
దీర్ఘ బాహోరహ రహరని వర్ధమాన శక్తి
త్రియస్య అన్ధ్రమండలే ద్వాదశ సహస్రగ్రామ
సంపాదిత సప్తార్ధ లక్ష విషయాధి పతేః....
....మల్లదేవ నందివర్మణః"

ఈ ఆంధ్ర మండలమునకే తమిళ, కన్నడ శాసనములలో 'వడుగావళి పంద్రెండు వేల'ని మారు పేరు గలదు. (చూడుడు 'వడుగావళి')

(1) I. A. Vol. XV, Page 175
(2) S. I Vol. IiI. Page 90.

## ఆంధ్ర విషయము

మురారి అనర్ఘరాఘవనాటకము సప్తమాంకములో శ్రీ రామచంద్రమూర్తి రావణ సంహారానంతరము పుష్పక విమానమెక్కి అయోధ్యకు బోవుచుండగా మార్గమధ్యమున గానవచ్చిన దేశములను క్షేత్రములను వర్ణించు సందర్భమున ఆంధ్ర విషయము నందలి దక్షారామ భీమేశ్వర క్షేత్రము నిట్లు వర్ణించి యుండెను.

విభీషణుడు రామునితో—

"విభీషణః—(దక్షిణతోదర్శయన్) దేవ ! ప్రణమ్యతా
మయ మన్ధ్రవిషయల లక్ష్మ్యాః సప్తగోదావరీ హార
కలసైక నాయకో భగవాన్ భీమేశ్వరః"

వాత్స్యాయనుని కామసూత్రములకు వ్యాఖ్య రచించిన జయమంగళుడు ఆంధ్ర విషయము కర్ణాటక విషయమునకు దూర్పున నున్నదని చెప్పెను.

"నర్మదాయా దక్షిణేన దేశో దక్షిణాపథః ।
తత్ర కర్ణాటక విషయాత్ పూర్వేణాంధ్ర విషయః ।
నర్మదా కర్ణాట విషయోర్మధ్యే మహారాష్ట్ర విషయః ।
కర్ణాట విషయాద్దక్షిణేన ద్రవిడ విషయః ।
కొంకణ విషయాత్ పూర్వేణ వనవాస విషయః ।"

వెలనాటి రెండవ రాజేంద్రచోళుని నందూరు శాసనములో తూర్పు సముద్రమునకు, శ్రీశైల పర్వతమునకు, మహేంద్రగిరికి, కాళహస్తి కొండలకు మధ్యగల భూభాగము ఆంధ్ర విషయమని వ్రాయబడినది.

"పూర్వాంభోనిధి కాళహస్తి శిఖరీ శ్రీమన్మహేంద్రాచల
శ్రీశైలేర్వలయీకృతాంధ్ర విషయం శ్రీరాజరాజస్వయః."
(శ్లోకము ౯౭)

నన్నెచోడ మహాకవి కుమారసంభవ కావ్య ప్రథమాశ్వాసంలో ఆంధ్ర విషయమును పేర్కొనెను.

కం. మును మార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గును నిలిపి రంధ్ర విషయం
బునఁ జనఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువుర్.

E.I. Vol XXIX. Part VII (నందూరి శాసనము శ. స. 1091)

## ఆతూరునాడు

ముమ్మడి చోళాపుర మను నామాంతరముగల కాళహస్తి ఆతూరి నాటిలోనిదని కాళహస్తీశ్వరస్వామి యాలయములోని శ్రీకృష్ణదేవరాయల కాలమునాటి యొక శాసనమునందు దెలుపబడినది. ఆతూరు చిత్తూరు మండలము నందలి చంద్రగిరి తాలూకాలోని అత్తూరు గ్రామము. కాళహస్తియు నీ తాలూకాలోనిదే. ఆ శాసనములో ఆతూరునాడు జయంగొండ చోళ మండలములోనిదని చెప్పబడినది. రాయల కాలమునాటికి సహితము తమిళ మండల నామములు వాడుకయందుండెనని తోచుచున్నది.

'జయంగొండ చోళమండలద ఆతూరునాడుద
శ్రీకాళహస్తియాంద ముంమడి చోళపురద
నయినారు శ్రీ కాళహస్తి నయినార దేవర'

S. I. I. Vol. IX. No. 505 (శ. క. 1458).

## ఆదర స్థలము

శ్రీశైల మల్లికార్జున దేవునికి పదమూడవ శతాబ్దమునకు పూర్వము మహారాజులు మాండలీకులు దానముచేసిన వివిధ నాడులలోని గ్రామములు తెలుపబడిన శాసనములో ఆదర స్థలములోని వెనకపల్లియు ద్వారసముద్రము దిక్కున వారశీయ పురవు అను రెండు గ్రామములు. ఈ ఆదరస్థల మెక్కడిదియో నిర్ణయించుటకు వీలు కలుగలేదు.

S. I. I. Vol. X. No. 504 శ్రీశైలములోని శాసనము.

**ఆదవాని (దుర్గము, సీమ, వళితరాజ్యము)**

ఆదవాని యిప్పుడు ఆదోని యని పిలువబడు కర్నూలు మండలము లోని ఆదోని తాలూకాకు ముఖ్యపట్టణము. కళ్యాణి చాళుక్య ప్రభువుల కాలమునుండియు ప్రసిద్ధికెక్కిన సీమలలో నొకటి. ఈ పట్టణ సమీపముననే యొక గిరిదుర్గము కలదు. చాళుక్య భూలోక మల్లదేవుని చాళుక్య విక్రమ సంవత్సర ఏబది యేడవ సంవత్సరమున, నతని సామంతు డొకడు సిందవాడి సాసిరములోని యాదవని యయ్యూఱులోగల గురుజ యెర్బత్తఱు నందలి ఇట్టగె గ్రామమును దానముచేసెనని పెదతుంబళము శివారుకరకంశ పుర శాసనమునందు గలదు. (1) ఆ తాలూకాలోని గురుజాల యందలి మరియొక శాసనములో సిందవాడి సాయిరములోని ఆదవాని యయినూఱు మంచలు మువత్తాఱు భాగములోని గురిందాల గ్రామము పేర్కొనబడి నది (2).

ఆదవాని సీమ లేక రాజ్యమునందలి గ్రామనామములు నేటిపేర్లు :-

| | శాసనములోని గ్రామములు | నేటి గ్రామ నామములు | తాలూకా |
|---|---|---|---|
| 3. ఆదవాని రాజ్యము | బొమ్మలాపురము | భద్రబొమ్మలాపురము | ఆదోని |
| 4. ఆదవాని దుర్గము | కెరియబెలగల్లు | చెఱువుబెలుగల్లు | కర్నూలు |
| 5. ఆదవానివళితము | కొలేయకల్లు | కోశేకల్లు | ఆదోని |
| 6. ఆదవానిసీమ | బూడగారు | బూదూరు | అదోని |

పై గ్రామ వివరముల ననుసరించి, ఆదవానిసీమ లేక రాజ్యము నేటి ఆదోవి తాలూకాయు, దాని పరిసరము నందున్న కర్నూలు తాలూకా ప్రాంతమైయుండును.

(1) S. I. I. Vol. IX· Part 1 No. 226 (శా.శ. 1054), (2) S· I. I. Vol. IX. Part I No. 240 (శా. శ. 1064) (3) S. I. I. Vol IX. Part II No. 498 (శా.శ. 1436), (5) S. I. I. Vol. IX. part II No. 604 (శా.శ. 1465), (6) S. I. I Vol. IX No 671 శా శ. 1482)

**అఱువేల వెలనాడు**

ఇయ్యది షట్సహస్ర దేశమునకు తెలుగుపేరు. ఆఱువేల గ్రామపరి మితిగల దేశము. కృష్ణానదికి దక్షిణ యొడ్డున నున్నట్లు శాసనములు తెలుపు చున్నవి (చూడుడు. షట్సహస్ర దేశము.)

"స్వస్తిశ్రీ సర్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ధన మహారాజుల ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరంబులు నేటి ప్లవ సంవత్సరంబున వేరేటి దక్షిణంబున యాఱువేల వెలనంటి .... అగ్రహారంబు వలివేరి త్రైపురుష స్థానమున"

శాసనములో పేర్కొనబడ్డ వేరేరు కృష్ణానది; వలివేరు, తెనాలి తాలూకాలోని వలివేరు గ్రామము.

S. I. I. Vol. X. No. 9 శా. శ. 983

ఆఱ్వేలనాడునుండి వచ్చిన నియోగి బ్రాహ్మణులకే యాఱ్వేల వారని పేరు.

కంకంటి పాపరాజు రచించిన ఉత్తర రామాయణ పీఠికలో నాఱ్వేల వారి ప్రతిభ నిట్లభివర్ణించెను.

సీ. అఖిల రాజాధి రాజాస్థాన జనహృద్య
విద్యావిహారు లార్వేల వారు
కల్పకబలికర్ణ కలశార్ణ తోదీర్ణ
వితరణోదారు లార్వేల వారు
సజ్జన స్తవనీయ సతత నిర్వ్యాజహారి
పరోపకారు లార్వేలవారు
ఘనదుర్ఘట స్వామి కార్యనిర్వహణ ప్ర
వీణతాధారు లార్వేలవారు

తే. విమతగర్వాపహారు లార్వేలవారు
లట్టి యార్వేలవారిలో నలఘుకీర్తి
వెలయు శ్రీవత్సగోత్రాబ్ధి వింద హేళి
మహిత గుణశాలి వల్లభామాత్యమౌళి.

నాటికి నేటికినీ యాఱ్వేలనాటి నియోగ బ్రాహ్మణులు కవన, కదన కార్యనిర్వహణములందు కీర్తి గాంచినవారు.

ఆరెభూమి

శ్రీశైల మల్లికార్జున దేవునికి పదమూడవ శతాబ్దమునకు పూర్వము, మహారాజులు, మాండలికులు స్వామికి దానముచేసిన వివిధనాడుల స్థలముల లోని గ్రామములు పేర్కొనబడిన శాసనములలో ఆరెభూమి సుపరిచితం

అనెడు గ్రామము తెలుపబడినది. ఆరెభూమి యనగా మహారాష్ట్రదేశమని యర్థము. కాని యెక్కడనో మహారాష్ట్రదేశ మందలి యొక గ్రామ మీ తెలుగుదేశములోని సుప్రసిద్ధ క్షేత్రస్వామికి దానమిచ్చి యుండుట పొసగదు. ఆంధ్రదేశములోగాని, సామీప్యదేశమగు కర్ణాటదేశ ప్రాంతములో గాని యీ ఆరెభూమి యుండవచ్చును. ఇదమిత్థమని చెప్పుటకు సరియైన ప్రమాణము లభింపలేదు.

S. I. I. Vol. X. No. 504

## ఆరెవీడు

కర్నూలుమండలము నందలి మార్కాపురము తాలూకాలోని గ్రామము. ఆర్వీటి వంశ విజయనగర సామ్రాజ్యాధిపతుల కాణాచి. ఆ మండలములోని సిరివేలుతాలూకా యందలి దిగువ అహోబిలములో వేంచేసిన నృసింహస్వామికి ఆరవీటి వణిజులు కొందఱు ఏడు బంగారు కలశములు మొదలైనవి దానము చేసినట్లు అహోబిలములోని యొక శాసనమువల్ల దెలియుచున్నది. కడప మండలములో రాయచోటి తాలూకాలో నొక ఆరెవేడును, నెల్లూరు మండలములో ఆత్మకూరు తాలూకాలో నొక ఆరెవీడును గలవు. సిరివేలు తాలూకాలోని శాసనమువల్ల, కర్నూలు మండలములోని ఆరెవీడే ఆర్వీటి వంశజుల గృహవాసమునగు వర్తిల్లును (1)

ఈ యారవీటి నేలిన మొదటి ప్రభువు అళియరామరాయల పూర్వుడైన సోమదేవరాజు. ఇతని ప్రతాపములు రామరాజీయము నందిట్లు వర్ణింపబడినవి. (2)

సీ. దండెత్తిచని మహోద్దండ వృత్తిని
గంగినేనికొండ వలిలగాను గట్టి
కందనవోలును గలువకోలును గోట
రాచూరు నెటువంటి రాజులకైన
సాధింపరాని మొసలిమడుగు మఱి యా
తగిరి నగరము సాతానికోట
వరుసతో సాధించి పరమహర్షంబునఁ
దత్తన్మహాజనతతులఁ బ్రోచి

తే. ధరకుఁదొడవని వినుతింపఁదగిన యట్టి
యూరవీటిపురాధ్యక్షుఁ డగుచుఁ దాత
పిన్న నృపసోమదేవుండె యెన్నదగియె
నఖిల సత్కవి సురభూజ మనుచు నెపుడు.

(1) No 581 of Kurnool Dt. Inscriptions of Madras Presidency. Rangachari. (2) రామరాజీయము ప. 182.

**ఆహాఖుపాకనాడు**

"రాపర్తి మంగిరాజుల మహాదేవులు లక్ష్మిదేవులు తమ కొడుకు ఉపేంద్ర రాజులకు నాయురారోగ్యైశ్వర్యాభివృద్ధిగా శ్రీ సింహగిరినాథుని నగరియందు రెండు అఖండ దీపములంగాం పెట్టిన మోదాలు ఎంభయిని ఒక్క దీపదండును నీదేవరకు నై వేద్యార్థముగా నాహాఖు పాకనాండుం గట్టులోని మణపమనెడి ఊరు" సంస్కృత భాగములో 'మణ్డప' మని కలదు.

ఈ రాపర్తి సామంతుల శాసనములు దాక్షారామ దేవాలయమున నున్నవి. మండపమనెడి గ్రామము తూర్పు గోదావరి మండలములో పెద్దాపురము తాలూకాలో గలదు ఆహాఖుపాకనాడనునది ప్రోలునాటికిని చెంగర లేక చాగల్నాటికిని మధ్యప్రదేశమై యుండనోపును.

S I. I. Vol. VI. No. 692 (శ. స. 1186).

**ఉత్కలము**

ఈ దేశము మహాభారత కాలమునుండియు నొక ప్రత్యేక దేశముగా పరిగణింపబడు చున్నది.

మహాభారతము ద్రోణపర్వములో ఉత్కల దేశము పేర్కొనబడినది. కళింగము వేరు. ఉత్కలము వేరు.

"ఉత్కలాః మేకలాః పౌండ్రాః
కలింగాంధ్రాశ్చసంయుగే
నిషాదాశ్చత్రిగర్తాశ్చ
బాహ్లీకాశ్చ జితస్త్వయా"

కాళిదాసు రఘువంశము చతుర్థసర్గలో రఘుమహారాజు దిగ్విజయ సందర్భమున నాతడు ఉత్కలము మీదుగా కళింగాభిముఖుడై పోయెనని వర్ణించెను.

"సతీర్త్వా కపిలాం సైన్యైర్బద్ధద్విరద సేతుభిః
ఉత్కలాదర్శిత పథః కళింగాభి ముఖోయయౌ।"

రాజశేఖరుడు కావ్యమీమాంసలో ఆర్యావర్తములోని పూర్వ దేశముగా నుత్కల జనపదమును పేర్కొనెను.

"తత్రదారణస్యాః పురతః పూర్వదేశః।
యత్రాంగ కళింగ కోసలోత్కల మగధ ముద్గర........"

(సప్తమ దశోధ్యాయమ్)

వరాహమిహిరుడు బృహత్సంహిత పదునాల్గవ యధ్యాయములో ఉత్కలమును పేర్కొనెను.

"ఉదయగిరి భద్రగౌడక పౌండ్రోత్కల కాశి మేకలాంబష్ఠాః।
ఏకపద తామ్రలిప్తక కోసల కోవర్ధ మానాశ్చ॥"

(7 వ శ్లో.)

బనవతి దీర్ఘాసి శాసనములో సంస్కృత భాగమున ఉత్కళమనియు, తెలుగు భాగమున ఆ దేశమునకే ఒడ్డ దేశమనియు ప్రయోగింపబడినది.

"తేనాసౌ చోడ సేనావన దవదహ సేనాళుగ
ప్రాస శస్త్రాగ్నిత్రింశజ్జ్వాల కేనోత్కల గజతుర
గానీకి సీనాథ భూజా।

సీ. శ్రీశకునేణ్ణులు భూపతిపై శైల
నందాబ్జభవ పంఖ్యనొంది వేంగి
దేశంబు గిమిడియ గోసల గిడ్డిసింగి
దేశంబు మఱియొడ్డ దేశమనంగ
జనిన భూపాలు రనని చొచ్చె చలమర్తి
గండడై నెగడిన మండలికుండు
భూమర వంశుండు పాపవనిభభోగి
బణపతి సౌజన్య గుణయుతుండు॥

## ఉత్తమచోడ వలనాడు

ఈ ఉత్తమచోడవలనాటిని పేర్కొన్న శాసనములు గొన్ని గుంటూరు మండలములోని బాపట్లలోను, విశాఖపట్టణ మండలములోని సింహాచలము నందును గాన్పించుచున్నవి. అవి శాలివాహన శకము 1071-1204 నాటివి. కులోత్తుంగ చోడదేవుని పరిపాలనా కాలము నాటివి.

(1) "ఉత్తమ చోడవళనాంటి కమ్మనాంటి ప్రేంపల్లి భావనారాయణ దేవరకు"

(2) "ఉత్తమ చోడవలనాంట్టి కమ్మనాంటి రాజ మాణికపుర మైన ప్రేంపల్లి భావనారాయణ దేవరకు"

(3) కులోత్తుంగ చోడ మణ్డలమున ఉత్తమచోడవలనాణ్టి కమ్మనాణ్టి మధ్యవాడలోని ప్రేంపల్లి శ్రీ భావదేవర గుడి"

(4) "వేంగినాణ్డైన ఉత్తమచోడమణ్డలమున డిమిలనాంటి తొణ్డవాడ జియ్య హారినాంటి"

ఉత్తమచోడవలనాడు కులోత్తుంగ చోడ మండలాంతర్గత మనియు, ఆ వలనాంటిలో ఆంధ్రదేశములో కమ్మనాడు, డిమిలనాడు (చూ. కమ్మనాడు, డిమిలనాడు)గలవనియు దెలియుచున్నది. అనగా ఉత్తరమున సింహాచలము, దక్షిణమున బాపట్ల వఱకు ఉత్తమచోడ వలనాడు వ్యాపించి యుండెను.

(1) S I.I. Vol. VI. No. 136 (శా.శ. 1071). (2) S. I.I. Vol. VI. No. 148 (శా.శ. 1076). (3) S. I. I. Vol. VI. No. 200. (4) S. I. I. Vol. IV. No. 1226(సింహాచలము).

## ఉదయగిరి

నేటి ఒరిస్సా రాష్ట్రములోని గంజాము మండలము నందలి ఉదయగిరి మన్యపు తాలూకాలోని(Agency)ఉదయగిరి. ఈమన్యప్రాంతము దాదాపు అయిదు వందల చదరపు మైళ్ళుగల పర్వతారణ్య ప్రదేశము. కాకతిగణపతి దేవుని కాలమున రేచర్ల రుద్రిరెడ్డి దండనాయకుడైన రాజనాయకుడు కళింగముపై దండువెడలి "బొక్కెరలోని వీరభటావళి ద్రుంచి, గోధుమరాతి తలదెంచి ఉదయగిరి సాధించి వడిరాయనిందోలి దాక్షారామ భీమేశ్వర

ధేవరకతుయ దీపంబులు నిలిపి" నట్లు ఉప్పరపల్లి శాసనమునం జెప్పబడినది. ఈ ఉదయగిరి గంజాము మండలములోనిదే యగుటకు ప్రమాణను, సింహాచల దేవాలయము నందలి శాసనములలో సామంతులను కొందఱు వడిరాయంద్రను గూర్చి తెలుపు కొన్ని శాసనములు గలవు.

దాక్షారామ శాసనము S. I. I. Vol. IV. No. 1117 (శ. స. 1134)
ఉప్పరపల్లి శాసనము H. A. S. No. 3 (శ. స 1157).

### ఉదయగిరి రాజ్యము

నెల్లూరు మండలములోని ఉదయగిరి తాలూకాకు ప్రధాన పట్టణము. ఇదియొక గిరి దుర్గము. నెల్లూరుమండల శాసనసంపుటములలో నా మండలములోని శాసనములలో కెక్కింటియం దుదాహరింపబడినది. ఈ రాజ్యములోని క్రింది గ్రామముల పట్టిక ననుసరించి, దీనివ్యాప్తి తెలుసుకొనగలము(1)

| శాసనములలోనిగ్రామములు | నేటి గ్రామనామము | నేటి తాలూకా | |
|---|---|---|---|
| ఉదయగిరి | ఉదయగిరి | ఉదయగిరి | తాలూకా |
| నెల్లూరు | నెల్లూరు | నెల్లూరు | తాలూకా |
| కొరటూరు | కొరటూరు | ,, | ,, |
| కొడవలూరు | కొడవలూరు | ,, | ,, |
| కృష్ణరాయపట్నం | కృష్ణాపట్నం | ,, | ,, |
| నరియపల్లి | నర్వేపల్లి | ,, | ,, |
| జలదంకి | జలదంకి | కావలి | ,, |
| గండవరం | గండవరం | కోవూరు | ,, |
| కోవూరు | కోవూరు | ,, | ,, |
| వవ్వేరు | వవ్వేరు | ,, | ,, |
| దువ్వూరు | దువ్వూరు | ,, | ,, |
| ప్రభాకరపట్నం | ప్రభగిరిపట్నం | ఆత్మకూరు | ,, |
| ఆతుకూరు | ఆత్మకూరు | ,, | ,, |
| కందుకూరు | కందుకూరు | కందుకూరు | |
| పొదిలి | పొదిలి | పొదిలి | ,, |
| కెణగిరి | కనిగిరి | కనిగిరి | ,, |
| అల్లూరు | అల్లూరు | కోవూరు | ,, |
| రావూరు | రావూరు | కందుకూరు | ,, |

ఉదయగిరి రాజ్యములో నీ క్రింది నాడులు గలవని కొన్ని శాసనములలో వ్రాయబడి యున్నది. (2)

ఉదయగిరి రాజ్యాన పాకనాడు
ఉదయగిరి సంబంధే పాంగనాడాఖ్య సీమః
ఉదయగిరి రాజ్యమందుల బోయ విహారదేశము వీండ్లు
ఉదయగిరి చెల్లియుండేటి పూంగినాంటి స్థళం
ఉదయగిరి రాజ్యానకుం జెల్లే కందుకూరి సీమ.

పై నుదాహరింపబడిన నాడులు, సీమలు, గ్రామములనుబట్టి ఉదయగిరి రాజ్యము నేటి నెల్లూరు మండలములో ఉదయగిరి. నెల్లూరు, కావలి, పొదిలి, కోవూరు, కందుకూరు, కనిగిరి, ఆత్మకూరు ప్రాంతాలమధ్య భూభాగమై యుండెను.

ఈ ఉదయగిరి రాజ్యము విజయనగర సామ్రాజ్య చరిత్రలో మిగుల విఖ్యాతి గాంచిన మండలములలో నొక్కటి. నాటి ఆంధ్ర సారస్వతమునకు వన్నె దెచ్చిన సుప్రసిద్ధ ప్రబంధములందు దీనిని పేర్కొనని కృతికర్తలు లేరు. కృష్ణదేవరాయల ఆముక్తమాల్యదలోని ఆశ్వాసాంత పద్యము నొక్కదాని నుదాహరించుచున్నాను. (3)

"మ. ఇది కర్ణాటధరా ధృతిస్థిర భుజాహేవాకలబ్ధే భరా
డుదయోర్వీధర తత్ప్రత్యర్థికృత నవోప్యపాయ నోష్ణీషర
త్నదృగంచత్పద కృష్ణరాయ వసుధాధ్యక్షోదితాముక్తమా
ల్యద నాశ్వాసము హృద్యపద్యముల నాద్యంబై మహిం బొల్పగున్"

(1) N. I. Udayagiri (21) (2)N.I.C P No 2; N.I.C.P. No. 13. N. Atmakur (39); N. I. Kandukur (28); (30) (3) ఆముక్తమాల్యద.

## ఉదయగిరి సీమ

ఉదయగిరి రాజ్యము విజయనగర సామ్రాజ్యాంత కాలమున వివిధ సీమలుగ విభజింపబడి విస్తీర్ణమునందు చాల చిన్నదై పోయెను.

(1) వుదయగిరి సీమకు చెల్లివచ్చేడి జూటూరు
(2) వుదయగిరి సీమలోని కావలి గ్రామాన

(౪) మాకు అమరం పాలించ్చిన ఉదయగిరి సీమలోను బొమ్మవరం గ్రామం.

పైని పేర్కొనబడ్డ రెండుమూడు సంఖ్యలుగల గ్రామము లా పేరి టనే కావలి, ఆత్మకూరు తాలూకాలలో గలవు.

N. I. Kavali No. 49 (శా. శ. 1558). N. I. Kavali No. 50 (శా. శ. 1558) N I. Atmakur No. 20; 21.(సదాశివరాయలు' శ్రీరంగరాయలనాటి శాసనములు).

## ఉరవకొండ సీమ

అనంతపుర మండలము గుత్తి తాలూకా పెన్న అహోబిలగ్రామము నందలి సదాశివరాయలనాటి యొక కన్నడ శాసనములో ఉరవకొండ సీమ లోని యీ క్రింది గ్రామములు పేర్కొనబడినవి. (1)

| శాసనములోని గ్రామనామము | నేటి గ్రామనామము | తాలూకా | |
|---|---|---|---|
| నింబగలు | నింబగల్లు | గుత్తి | తాలూకా |
| తమ్మాపుర | తిమ్మాపురము | | ,, |
| యరగుడి | ఎర్రగుడి | | ,, |
| హోతూరు | చిన్నహోతూరు | | ,, |
| చికపేపలి | పెద్ద చిన్నపేపలి | | ,, |
| కమలహాళు | కమలపాడు | | ,, |
| ఉరవకొండ | ఉరవకొండ | | ,, |
| తుంబెగనూరు | తుంబెగనూరు | రాయదుర్గము | ,, |
| కలిదేవనహాళ్ళి | కల్లుదేవనహాళ్ళి | ,, | ,, |
| సిరివరము | సిరివరము | అనంతపురము | ,, |

గుత్తి తాలూకా చాబాల గ్రామములోని యొక కన్నడ శాసన ములో ఉరవకొండ సీమలోని తావరగొళ గ్రామము పేర్కొనబడినది. ఆ తాలూకా వేల్పుమడుగులోని యొక శాసనములో వేల్పుడిగె చెప్పబడినది. అది గుత్తి తాలూకాలోని వేల్పుమడుగు గ్రామమే. (2)

పై శాసనములో ఉరవకొండ సీమ హస్తినావతి వళితములో నంత ర్భాగమైన ముడనాటి యందలి రాయదుర్గ వెంఠలోవి ఉరవకొండ సీమ యనియు లేక రాయదుర్గ నాటిలోని ఉరవకొండ సీమయనియు జెప్పబడినది. ఉరవకొండ సీమ గుత్తి తాలూకా రాయదుర్గము, అనంతపురము తాలూకా ప్రాంతభూమి.

సదాశివరాయలనాటి కన్నడ శాసనములు

S. I. I. Vol. IX Part II. No 663 (శా. శా. 1478)
,, ,, ,, No. 661. (శా.శ 1478)
,, ,, ,, No. 652. (శా. శ. 1476)
,, ,, ,, No. 633. (శా. శ 1470)

## ఎమ్మెదలె యఱుసాసిరము

చాళుక్య త్రిభువన మల్ల దేవుని దండనాయకుడగు అనంతపాలరసుని త్రిపురాంతక శాసనములో నతడు బెంగి పన్నిర్చాసిరము, ఎమ్మెదలె యఱుసాసిరము నేలుచుండెనని గలదు.

బెంగి పన్నిర్చాసిర మనగా వేంగి పంద్రెండు వేలు (వేంగి-చూడుడు), ఎమ్మెదలె యఱుసాసిర మనగా ఎమ్మదల యారు వేలని యర్థము. (1)

పశ్చిమ చాళుక్య ప్రభువగు ఆహవమల్లుని సామంతుడొకడు గుంటూరు మండలములోని బాపట్ల తాలూకాలో చేబ్రోలు గ్రామమునందు వ్రాయించిన యొక శిలాశాసనములో నతడు శకవర్షము తొమ్మిదివందల నూట యిరువది యెనిమిదవ సంవత్సరము నాడు దన్నడ యెన్మందల రెండు కోటలు గాల్చి, చేబ్రోలు వచ్చి కుమారస్వామికి మ్రొక్కి యేదియో యొక్క దాన మిచ్చినట్లు చెప్పబడినది. అనంతపాలుని శాసనములోని ఎమ్మెదలయు. చేబ్రోలు శాసనములోని ఎనమదలయు నొక్కటే. దన్నడయే ధరణికోట. ఈ రెండు గ్రామములును గుంటూరు తాలూకాలో గలవు. ఎనమదల వెల నాటిలోని గ్రామము. వెలనాడు షట్సహస్ర ప్రదేశము. లేక ఆఱువేలనాడు, కాబట్టి ఎమ్మెదలె యఱుసాసిర మనగా ఎమ్మదల యాఱు వేలని యర్థమని పైన చెప్పబడినది గావున, నియ్యది వెలనాటిని సూచించుచుండ నోపును (2)

(1) S. I. I. Vol. IX Part 1 No. 213 (క్రీ. శ. 1126).
(2) S. I. I. Vol. IV. No. 102 (క్రీ.శ. 1006).

## ఎరద విషయము (ఎఱద)

ప్రాచీనాంధ్ర కళింగాంతర్భాగ విషయములలో నొకటి. పండ్రెండు, పదమూడవ శతాబ్దములనాటి శాసనములలో దీని ప్రశంస గలదు ఆ శాసనములలో ఎరద (ఎఱడ) విషయములో నీ గ్రామములు గలవు.

| | | |
|---|---|---|
| తాంద్రంగి | తొండంగి | చీపురిపల్లి తాలూకా |
| కరటము | కరాటము | విజయనగరం తాలూకా |
| వెలంగాఱ | వెలగాడ | చీపురిపల్లి తాలూకా |
| ధర్మవరము | ధర్మపురి | విజయనగరం తాలూకా |
| పునక్రెల్ల | కెళ్ళ | విజయనగరం తాలూకా |

విజయనగరం తాలూకా రెల్లివలసలోని శాసనములలో ఎఱడ విషయముదాహరింపబడినది.

ఈ విషయము పై గ్రామ నిర్దేశ స్థలముల ననుసరించి యిప్పటి విశాఖపట్టణ మండలములోని విజయనగరము, చీపురుపల్లి తాలూకా ప్రాంతమై యుండెను.

S.I.I. Vol. VI. సంఖ్య 1052; S. I. I. Vol. X. సంఖ్య 702, 707, 708, 709.

## ఎర్రగుడి

కర్నూలు మండలములో పత్తికొండ తాలూకాయందలి గ్రామము. గుత్తి దుర్గమునకు వాయవ్యమున ఎనిమిదిమైళ్ళ దూరమున గలదు. ఇచ్చటనే ఆరు పెద్ద రాతిబండలపై అశోకచక్రవర్తి శాసనములు చెక్కబడినవి. ఈ రాతిబండలు గల పర్వత ప్రాంతము ఏనకొండ లనియు, నల్లయేనకొండ లనియు వ్యవహరింపబడుచున్నవి ఆంధ్రప్రదేశములో అశోక చక్రవర్తి శాసనములన్నియు నొక చోటనే చెక్కబడిన చారిత్రక ప్రసిద్ధమైన స్థలము. వీని నన్నింటిని ప్రభుత్వము వారు బహుశ్రద్ధతో పరిష్కరించి ప్రచురించియున్నారు.

Erragudi Edicts of Asoka E.I. Vol. XXXII 1957-58 No. 1.

ఏఱువనాడు

ఆంధ్రదేశములో నత్యంత ప్రాచీనమైన దేశ విభాగములలో నొకటి. కర్నూలు జిల్లాలోని కంబము తాలూకా తురిమెళ్ళ గ్రామమున కనతి దూరమున నున్న యొక శాసనములో సత్యాశ్రయ పృథివీవల్లభ మహారాజాధిరాజ విక్రమాదిత్య పరమేశ్వరభట్టారకుల ద్వితీయరాజ వర్షమున గొగ్గి భట్టారకుల దక్షిణ భుజాదండుండును, అలకుమర ప్రియకుమారుడైన ఉజేని పిశాచ నామధేయుడు తురు తటాక తురిమెళ్ళ రాజధానిగ ఏఱువ విషయమును బాలించుచుండెను. (1)

అక్కడనే మరియొక శాసనములో ఏఱువ మహాదేవి యను నామె పేర్కొనబడెను. కడపజిల్లా, రాజంపేట తాలూకా పోలి గ్రామమునందలి శాసనములో కాకతీయుల కాలములో గంగయ సాహిణి అంబదేవ మహారాజు ఏఱువ విషయము మొదలగు కొన్ని ప్రాంతముల కడప తాలూకాలోని వల్లూరు రాజధానిగ నేలుచుండిరి. (2)

నెల్లూరు మండల శాసన సంపుటములలో నొక తామ్ర శాసనములో (అచ్యుత దేవరాయల కాలము నాటిది) కొండవీటి రాజ్యములో ఏఱువ నాడంతర్భాగముగా కొచ్చెర్ల కోట సీమ గలదని వక్కాణింపబడినది.

ఈ కొచ్చెర్లకోట దర్శి తాలూకాలోని కొచ్చెర్లకోట యను చరిత్ర ప్రసిద్ధమైన గ్రామము. (3)

పై విషయముల బట్టియు, త్రాళ్ళ ప్రొద్దుటూరుశాసనమును బూర్తిగ ప్రకటించిన సుప్రసిద్ధ చరిత్రకారు లిరువురును ఏఱువనాడు కమ్మనాటికి పశ్చిమముననను, పాకనాటికి పశ్చిమోత్తరముననను, వల్నాటికి వాయవ్యమున నుండెననియు, నిప్పటి నెల్లూరి జిల్లాలోని పొదిలి, దర్శి తాలూకాలలో గొంత భాగమును, కడప జిల్లాలోని బద్వేలు, సిద్ధవటము తాలూకాలలో గొంతభాగమును, కర్నూలు మండలములోని మార్కాపురము తాలూకా ప్రాంతమును జేరిన దేశమునకు ఏఱువనాడని నిర్ణయించిరి (4)

ఏఱువ తొండయరాజు భార్య మైలమదేవి వ్రాయించిన ద్రాక్షారామ శాసనములలో నొకదానియందు ఏఱువ తొండయ కోడూరు పురవరాధీశ్వరుడని చెప్పబడినది. (5)

కోడూరు కడప మండలము లోనిది. ఏఱువనాటిని పేర్కొనిన ప్రథమాంధ్రకవి దశకుమారచరిత్రమును రెనిగించిన మూలఘటిక కేతన. చోడతిక్కన్నృపతి ప్రతాప వర్ణన సందర్భమున ఆ నృపాలుడు ఏఱువ మన్నీల నోడించినట్లు వర్ణించియున్నాడు.

సీ. బలిమిచేఁ బృథ్వీశు తలద్రుంచె సేవణ
కటక సామంతుల గర్వమణచె
ద్రవిళ మాండలికులందఱఁ దక్కనేలెఁ జో
డని నిజరాజ్య పీఠమున నిలిపెఁ
గర్ణాట విభు నహంకారంబు మాన్పించె
బాండ్యునిచేతఁ గప్పంబుఁ గొనియె
నేఱువ మన్నీల నెఱిపుట్టగా నేలె
వైరి వీరుల వాములూర నోర్చె

తే. త్రిభువనీరాయ పెండారు డుభయ కటక
వీరు డభినవభోజుఁ డాకార మదనుఁ
డవని భార ధౌరేయ మహత్త్వ విజిత
దిక్కటీంద్రుండు చోడల తిక్కన్నృపతి.

(దశకుమార చరిత్ర — పీఠిక)

(1) MER (1949-50)No 257-273,
(2) S.I.I. Vol. X. No. 463 10(శా. శ. 1212)
(3) N. I. C. P. No. (శా. శ. 1458)
(4) తాళ్ళ ప్రొద్దుటూరి శాసనము. భారతి.ఈశ్వర సం॥ మాఘము.
(5) S. I. I. Vol. IV. 1216 (శా. శ. 1048)

## ఏలేరు (ఏలానది)

ఇది తూర్పుగోదావరి మండలములో గుర్తేడు ముఠా సమీపమున మట్టము భీమవరము సమీపమున నున్న దొమ్మకొండ నుండి పుట్టి, రంప మన్యములోనున్న మామిడి సమీపమున కూనేరు, మన్నేరు నదులతో గలసి, ఎర్రవరము గ్రామము దిగువ చీలికలై ప్రవహించుచున్నది. ఒక శాఖ పిఠాపురము తాలూకాతో నుండి పారి ఉప్పాడ సమీపముననున్న శామన్న

పాలెము వద్ద సముద్రములో గలియుచున్నది. ఇంకొకటి పెద్దాపురము తాలూకాలోనుండి ప్రవహించి పెద్దాపురము మీదుగా, సామర్లకోట దగ్గఱ మూడు పాయలై నది. వానిలో నొకటి భీమనది, రెండవది నారాయడు, మూడవది మెరకయేరు నను నామములతో వెలయుచున్నది. ఇయ్యది సామర్లకోట సమీపముననున్న చాళుక్య భీమవరమున కుత్తరమున బ్రవహించుచున్నది. దీనికే ఏలానది యనియు కుమారనది యనియు బేర్లు. భీమేశ్వరపురాణము నందును శాసనములందును బేర్కొనబడినది.

(1) "అల్లాడ భూపాలుని కుమారుండు వేమారెడ్డింగారి దేవులు జియ్యమల్లసానమ్మ...... కుమారారామ చాళుక్య భీమేశ్వర స్థానసమ్మతిని భీమవరము ఉత్తర సమీపాన కుమారనది "

(2) "పాలూరి వీరమనాయని కుమారుడు, యఱమనాయనిగారు యేలానది వల్లనుండి యెలుతుర్తి నది త్రవ్వించి గోనాడ పొలిమేరలోం గాను తెచ్చి గురుగడ్డం గలిపి"

శ్రీనాథుడు భీమేశ్వర పురాణములోని పీఠికాపుర వర్ణనములో ఏలేఱు నిట్లు వర్ణించెను.

సీ. "ఏ పట్టణము ప్రమోల నేలేఱు ప్రవహించు
బృథివికి ముత్యాల పేరువోలె.

(2-52)

తే. నారికేళంపు బుట్ట నెన్నడిమి చాయ
దళములందును బోలె సంతతము బాఱు
వేణికా సారణుల యందు విస్మయముగ
జగతినెక్కడి వేలేటి సాటి నదులు.

(2-53)

ఏలేటి మేటి కాలువలవలన నదీమాతృకంబులగు పంటవలంతి(2-55)

సీ. కొమరేటి కళ్యాణ కమల షండంబుల
సౌరభ్య భారంబు సంతరించి,"

(2-62)

పై పద్యములో 'కొమరేటికి' 'కుమారనద్యాః' అని సంస్కృత భీమేశ్వర పురాణమున గలదు.

(1) S. I. I. Vol V. No. 34 (శ స 1356) S.I.I Vol. V No 37 (శ. స. 1416)

## ఒంగేరు (ఓంకార నది)

ఇది గుంటూరు మండలములోని యొక యేరు. గుంటూరు మండలములోని నరసారావుపేట తాలూకా చేజెర్ల గ్రామమందలి శ్రీ కపోతేస్వర స్థానమందు బుట్టినట్లు పావనామాత్మ్యని నందవరచరిత్రమునందు గలదు. (1)

సీ. వసుధలో శిబిచక్రవర్తి సత్యము ధర్మ

..............................

నపుడు శంకరుండు నరపతి భక్తికి
మెచ్చి తనదు లోకమిచ్చె గరుణ
చంద్రశేఖరుండు చేజెర్లలో గపో
తేశ్వరుండనంగ దేజరిల్లె

గీ. ఆకపోతేశ్వరు స్థానమందు బుట్టి

..............................

నోంకారనదియనంగ

కం. ఆయేటి యుభయ తటముల
బాయక విలసిల్లు మాకు పల్లెలు రెండున్."

బాపట్ల తాలూకా పెదచెఱుకూరు గ్రామములో నొక శాసనమునందు ఆ తాలూకాలోని యినుగర్తి గ్రామానకు పశ్చిమమున 'వొంగేరు' కలదని వ్రాయబడినది. (2)

ఇనుగర్తి గ్రామానకు పొలిమేర సీమా చిహ్నాలు పూర్వతః తుంగభద్ర ఆఙ్నేయతః పులిచింతల మట్టు। యామ్యతః చెల్లంకులపల్లం। నిరురతః చిమలకోడు। పశ్చిమతః వొంగేరు। వాయువ్యతః శ్చిద్రపుపుట్టు। ఉత్తరతః గెలకెడిపల్లి। యీశాన్యతః కొడికెంపాడు॥

నరసారావుపేటలోని అప్పాపుర మండలి శాసనములో నీయోంకార నదీతీరమున త్రిలింగ దేశాలంకారమైన కోటభూమి కమ్మనాంటి సీమా స్థలములోని నాదిండ్లపురము గలదని చెప్పబడినది. (3)

"స్వస్తి సమస్త ప్రశస్తి సహితంబై అనల్పంబైన కల్పారంభ కాలంబున మహావరాహ దంష్ట్రాశిఖరంబున నుద్ధృతంబై పంచాశత్కోటి యోజన విస్తీర్ణంబైన భూమండలంబునందు జంబూద్వీపంబులో భారతవర్షంబున భారతఖండంబునందు శ్రీశైల వాయవ్య సముద్ర పార్శ్వంబున నోంకార నదీ తీరంబునం త్రిలింగ దేశాలంకారంబైన కోట భూమి కమ్మనాంటి సీమా స్థలంబునందు నాదిండ్ల పురంబున."

దీని కిప్పుడు 'ఓగేరు' అని పేరు. ఇది పల్నాడు, నరసారావుపేట తాలూకాలలో ప్రవహించుచు చిలకలూరిపేట వద్ద ట్రంకురోడ్డు క్రిందుగా బాపట్ల తాలూకాలో జేరి, పెదనందిపాడు కొండపాటూరు, ఇనుగర్తి, పెదచెఱుకూరు, పూండ్ల, అప్పికట్ల, గుడిపూడి, బుద్దాము గణన, వరము మీదుగా బోయి నిజాంపట్టణమువద్ద సముద్రములో గలియుచున్నది.

(1) పాపనామాత్యుని నందవర చరిత్రము, తాళపత్ర గ్రంథము సంఖ్య 538.

(2) S. I. I Vol. VI. No 202.

(3) S. I. I. Vol. X. No. 573 (శ. స. 1327)

## ఓంగేరు మార్గము

బుద్ధవర్మ సంతతివాడైన పండని చేబ్రోలు శాసనములో తన పూర్వుండైన బుద్ధవర్మ కాంచీపురీ నాథుడైన త్రిలోచన పల్లవుని గొలిచి ఓంగేఱు మార్గమును బడసెనని యీ క్రింది పద్యములవల్ల దెలియుచున్నది. అతని వంశములోని వాడైన మొదటి పండడు పట్సహస్రావని యేలెననియు నా పద్యమువల్లనే ద్యోతక మగుచున్నది. (1)

"శా. శ్రీనారీపతి పంకజ భవ శ్రీపాద జాతోత్తమ
క్ష్మానాథాంబుజ భాస్కరుండు నిజవంశంబెల్ల దీపింపగా
దీనానాథ కవీంద్ర గాయకులు గీర్తింప గీర్తిశుడై
భూనాథాగ్రణి బుద్ధవర్మ ప్రభతో బుట్టెన్ మహాశౌర్యుడై.

స్రగ్ధర. శ్రీరమ్యశ్మావధూకాంచికి నెనయగు కాంచిపురీనాథు నుగ్రా
కారున్ లలాట నేత్రుస్ గవిజనహితు నుక్కంటి కాడ్వెట్టిం బుణ్యా
చారున్ దద్బుద్ధవర్మే...శ్వరుండు గొలిచి మున్ శాసనం బొందం గర్ణా
టారున్ దొంగేఱు మార్గత్రయము వడసె నాతార చంద్రార్కలీలన్,

ఉ. ఆవిభు నన్వయంబున గుణాఢ్యుడు గండడుపుట్టి వానికిన్
దేవమహీజ దానియగు దేవటి పండడుపుట్టి షట్సహ
స్రావని యేలె తత్సుతు డుదగ్రుడు బిల్లమభీము డంధ్ర ల
క్ష్మీవనితేశుచే బడసె జెల్వగు పంచినికుఱు వృత్తిగాన్."

ఒంగేరు మార్గమును బేర్కొను గొన్ని శాసనములు గలవు.

"ఇందుల బ్రహ్మదేవరకు నొంగేరు మార్గమున దేసట్టు మహాసామ
న్తనం బయ కొడుకు మండలిక గండయ. (2)

"ఓ జీవిమార్గ విషయే ముల్కలపాడు నామ గ్రామం" (3)

"అడువకొలని అయ్యరు నాయకు కొడుకు అప్పన యొంగేఱు మార్గ
మున దేవస్థానము కొమ్మూరి అగస్తేశ్వర మహాదేవరకు" (3)

"శ్రీకృష్ణ వేణానదీతీర దక్షిణ షట్సహస్ర శ్రీమన్మహా మండలే
శ్వర యొంగేఱు మార్గమున నంబిరాజు" (4)

"కృష్ణవేణానదీతీర దక్షిణ షట్సహస్ర విషయాధీశ్వర శ్రీమన్మహా
మండలేశ్వర ఒంగేఱు మార్గమున నంబిరాజు"(5)

"కృష్ణవేణా మహానదీతీర దక్షిణ షట్సహస్ర విషయాధీశ్వర ఒంగేఱు
మార్గమున నంబిరాజు కొడుకు త్రైలోక్య మల్లరాజు". (6)

"శ్రీ భీమేశ్వర మహాదేవరకు ఒంగేఱు మార్గంబున త్రైలోక్య
మల్ల.... జిక్కి భీమరాజు" (7)

"ఒంగిని మార్గమున గనికెపాడు" (8)

"ఒంగిని మార్గ విషయే మటిపూడి గ్రామస్య పూర్వతః" (9)

"పండ్యరాజు ఒంగేఱు మార్గములోని గుంటూరి శ్రీ యగస్తీశ్వర
మహాదేవరకు" (10)

పై శాసనములలో బేర్కొనబడ్డ కొమ్మూరు, గనికపాడు, మట్టిపూడి, బాపట్ల తాలూకాలో గలవు. గుంటూరు గుంటూరు తాలూకాలోనిది.

పై గ్రామస్థల నిర్దేశమును బట్టి ఒంగేఱు మార్గమున కా నామము ఒంగేరను ఏరొకటి గుంటూరు మండలములో నరసారావుపేట తాలూకాలో బుట్టి దక్షిణమున గుంటూరు, తెనాలి, బాపట్ల తాలూకాలగుండ ప్రవహించుచుండెను గావునను, ఆ ఏటికి పార్శ్వమండల భూ భాగమునకు ఒంగేఱు మార్గమని పేరు వచ్చెను. ఒంగేఱు మార్గమనినను, షట్సహస్ర ప్రదేశమనిన నొక్కటియే యని పై శాసనములు ఋజువు చేయుచున్నవి. ఈ ఒంగేఱు గిరి బశ్చిమ వెలనాడు, కమ్మనాంటిలో ప్రవహించుటచే నీ మూడును గలిసి యొంగేఱు మార్గత్రయమని పేరు గలిగియుండ వచ్చును.
(చూడుడు—ఒంగేరు)

(1) S. I. I. Vol. VI. No. 103 (శా. శ. 1067).
(2) S. I. I Vol. X. No 6 (శా. శ. 965).
(3) S. I. I. Vol. X. No, 26
(4) S. I. I. Vol. X. No. 81 (శా. శ. 1041).
(5) S.I.I. Vol. IV. No. 1127, 1128 (శా.శ. 1053, 1081)
(6) E. I I. Vol. VI. No 21 (శా. శ. 1081).
(7) S. I. I. Vol. IV. No 1039 (శా. శ. 1090)
(8) S. I. I. Vol. VI. No. 229.
(9) S. I. I. Vol. VI. No 124 (శా. శ. 1094).

## ఒక్కట్టునాడు

జయంగొండ చోళమండలములో నంతర్భాగమైన కిళైపట్ట నాటిలోనిది. నెల్లూరు మండలములోని గూడూరు తాలూకాలోని మల్లము గ్రామములోని తమిళ శాసనములం దీ విషయము పేర్కొనబడినది.

"జయంగొండ చోళమండలములోని పై యూరిలం గొట్టము నందలి కిళై పట్టనాటి ఒక్కట్టునాటి తిరువంబూరు నామముగల మల్ల గ్రామము.

S.I Gudur (5580) (తమిళ శాసనముల యొక్క సంక్షిప్త విషయ సూచిక.)

## ఒడ్డవాది దేశము (రాజ్యము)

ఒడ్డవాడి యనెడి గ్రామము విశాఖపట్టణ మండలములోని చోడవరము తాలూకాలోనిది. దాని నిప్పుడు వడ్డాదియని పిలుతురు.

మత్స్యవంశపు రాజైన అర్జునదేవ రాజుల దిబ్బడ అగ్రహారము శాసనములో ఒడ్డవాది దేశము పేర్కొనబడినది. దిబ్బడ గ్రామము, దాని సరిహద్దు గ్రామములగు కాకితఖండి, బొడ్డపాడు ఒడ్డవాది దేశములోనివగు చోడవరము తాలూకాలోని కాకెత, బొడ్డపాడు గ్రామములే (1)

ఈ ఒడ్డాది రాజ్యములోనివని యీ క్రింది గ్రామములు శాసనములలో వివరింపబడినవి. (2)

| శాసనస్థ గ్రామ నామము | నేటి గ్రామ నామము | తాలూకా |
|---|---|---|
| గొట్టివాడ | గొటివాడ | |
| జగన్నాథపురం | జగన్నాథపురము | |
| జొంన్నవారం | జొన్నవరము | |
| మామిండపల్లి | మామిడిపల్లి | వీరవల్లి |
| లోపుండి | లోపూడి | (చోడవరము) |
| గొట్లాము | గొట్లాము | |
| చోడవరము | చోడవరము | |
| చింగవరము | సింగవరము | |

ఈ ఒడ్డాది లేక వడ్డాది దేశము పూర్వము కళింగాంధ్ర దేశమునందలి ప్రసిద్ధమైన యొక చిన్న విషయము. ఇప్పటి చోడవరము తాలూకా ప్రాంత భాగము. కాకతీయ, రెడ్డి, విజయనగర రాజుల చరిత్రలో పేర్గాంచినది. శ్రీనాథుని కృతులగు భీమేశ్వర పురాణము కాశీఖండమునందును, పెద్దన కృత మనుచరిత్రయందును పేర్కొనబడినది.

1. E. I. Vol. V. No 14 (శా. శ. 1191).
2. S. I. I Vol. VI. No. 785 (శా. శ. 1297).
858 (శా. శ. 1234).
905 (శా. శ. 1350).
860 (శా. శ. 1283).
981 (శా. శ. 1259).

**ఓంకారనది (మార్గము)**

ఒంగేరునకె ఓంకారమని మరియొక పేరు ఒంగేరు మార్గమునకె ఓంకార మార్గమని మరియొక నామము.

గుంటూరులోని అగస్తీశ్వరస్వామి ఆలయములోని పండరాజు వ్రాయించిన శాసనములో సంస్కృత భాగమందు, ఓంకార మార్గమని తెలుగు భాగమందు ఓంగేఱు మార్గమనిన్ని వ్రాయబడినది. (1)

"ఓంకారారా........తత్తలు వికట। మహామార్గ భూవల్లభో భూత్ ॥
ఒంగేఱు మార్గము లోని గుంటూరి శ్రీ అగస్తేశ్వర మహాదేవరకు ॥"

నాదెండ్ల అప్పమంత్రి చేసిన దానములలో నతడు ఓంకార నదికి సమీపమున నున్న నందిపాడు గ్రామములో శివాలయమును నిర్మించెననుట యొకటి. (2)

"శాకే భవహ్నాని గమేందుగ ధాతృవర్షే నాదిండ్ల తిమ్మ
సచివాత్మ భవాప్పయార్యః ।
ఓంకార నామ సరదంతిక నందిపాటి గ్రామే
శివాలయ మనర్ఘ్యమ సావకార్షీత్ ॥"

శాసన పరిశోధకులు నందిపాడు గ్రామము ఒంగోలు తాలూకాలో నున్న నందిపాడనియు, నయ్యది గుండ్లకమ్మ నదీతీరమున నున్నదనియు వ్రాసియున్నారు.

గుండ్లకమ్మకు ఓంకారనదియని పేరు లేదు. ఈ నందిపాడు, వినుకొండ, గుంటూరు, తాలూకాలలోని గ్రామ మేదైన యుండును.

1. S. I. I. Vol. X No 144 (శ. స 1080).
2. E. I. Vol. V. No. 12. కృష్ణరాయల మంగళగిరి శాసనము (శ. స. 1437).

**ఓంకార భోగము**

మహారాజ ఇంద్రవర్మ జిర్జింగి శాసనములో పేర్కొనబడినది (1)

"త్రికళింగాధిపతి శ్రీమహారాజేంద్రవర్మ। ఓంఖారభోగ సంబంధ జిజ్జికాగ్రామే సర్వ సమవేతాన్ కుటింబినః సమాజ్ఞాపయత్య."

ఈ జిజ్జికగ్రామము నేటి టెక్కలి తాలూకాలోని జిర్జింగి గ్రామమై. ఓంకారభోగము ఆ తాలూకా ప్రాంతమే యైయుండును.

(1) ఇంద్రవర్మ జిర్జింగి తామ్రశాసనము. JAHRS Vol. III' P 49-58.

## ఓరుగల్లు

ఆంధ్రప్రదేశమున (తెలంగాణా) వరంగలుజిల్లాకు ప్రధానగరమగు "వరంగల్" అను నామముతో నేడు వ్యవహరింపబడుచున్నది. శ్రీమన్మహా మండలేశ్వరుడైన కాకతి మొదటి రుద్రదేవమహారాజు తన ప్రథమరాజ ధాని నగరమైన అనుమకొండ విడిచి యోరుగల్లు పురము నిర్మించి యచ్చ టకువచ్చి, యచ్చటినుండి యోరుగంటి రాజ్యము నేలుచున్నట్లు కొలని గణపతిదేవుని శివయోగసారము నందు వ్రాయబడియున్నది.

"తరల. అనుమకొండ పురంబు గాదని - యా విభుం డిల నోరుగ
ల్లను పురంబు ఘటించి యచ్చటి - కచ్చుగా నరు దెంచి య
మ్మనుజనాథుడు నాయకత్వము - మల్లమంత్రికిఁ బిన్నమ
ల్లనకు ధారుణి పెద్ద సంప్రతి - నాతతంబుగ నిచ్చినన్."

ప్రతాపరుద్రయశోభూషణములో ఓరుగల్లు (ఏకశిలానగర) వర్ణన మిట్లున్నది.

"లక్ష్మీనివాస గృహమి త్యఖిలా నరేంద్రా
శ్చార్యాతి భూమి ఖని రిత్యరివీరవర్గాః।
విద్యావిహార పదవీతి చ లబ్ధవర్ణాః
శ్రీకాకతీంద్ర నగరీ మనిశం స్తువంతి॥

వల్లభామాత్యకృత క్రీడాభిరామములో కాసలనాటి గోవిందశర్మయు, నతని బాల్యమిత్రము టిట్టిభసెట్టియు నంధ్రనగర యాత్రోన్ముఖులై ఓరుగల్లు పురము ప్రవేశించు సందర్భమున కవి యా పురము నిట్లు వర్ణించి యున్నాడు.

సీ. సప్తపాతాళ విష్టపమహాప్రస్థాన
ఘంటాపథంబైన గనపపరిఖ
తారకా మండలస్తబకావతంసమై
కనుచూపుగొనని ప్రాకారరేఖ

పుంజీభవించిన భువనగోళము భంగి
సంకులాంగణమైన వంకదార
మెఱుఁగు ఱెక్కలతోడి మేరు శైలముబోలు
వెనుపైఁడి తలుపుల పెద్దగవని
తే. చూచెఁ; జేరెఁ; బ్రవేశించెఁ; జొచ్చెఁ; బ్రీతి
సఖుఁడు దానును రథఘోట శకట కరటి
యూథసంబాధముల కొయ్యనొనరిలుచు
మందగతి నోరుగల్లు గోవిందశర్మ.
(క్రీడాభిరామము పుట. 35)

కాకతి ప్రథమ రుద్రదేవుని కాలమున ఓరుగల్లు నిర్మింపబడి రెండు వందల సంవత్సరములు కాకతీయ సామ్రాజ్యమునకు రాజధానియై ఆంధ్ర నగరమని ప్రఖ్యాతినొంది ప్రతాపరుద్రదేవుని కాలమున క్రీ.శ. 1303, 1310, 1321 సంవత్సరములలో మహమ్మదీయుల దండయాత్రలకులోబడి, నాటి నుండియు యశ్వపతుల గజపతుల వశమైపోయి పూర్వవైభవమును గోల్పోయెను.

ఈ ఓరుగల్లుపురము కాకతి ప్రోలరాజు రాజ్య కాలమున కట్టబడి నట్లు ఐతిహ్య మొకటి కలదు. అనుమకొండనుండి యొక రాత్రివేళ ధాన్యము తెచ్చు బండ్లు తలక్రిందు లయిన నా బండ్లను లేవనెత్తు నెడ ఆ బండ్ల యినుప పట్టాలు బంగారు పట్టాలుగా మారియుండ నా సమాచారము ప్రోలరాజునకు దెలుప నాతడా ప్రదేశమును ద్రవ్వించెను. ఆ ప్రదేశమున భూగర్భములో నొక జ్యోతిర్లింగము కనబడగా నద్దానిని గదలించుటకు సాధ్యముగాక పోవుటచే నచ్చోటనే యొక యాలయము నిర్మింపబడెనట. ఆ ప్రదేశముననే ఓరుగల్లు అను ఏకశిలా నగరము ప్రోలరాజు కట్టించెను.
(ప్రాచీనాంధ్ర నగరములు – వరంగలు)

## కంటకసెల (ఘంటశాల)

ఇయ్యది ప్రాకృత శాసనములలో కంటకసెల, కంటకసోల యని నామములతో నిప్పటి ఘంటశాలగ్రామము పిలువబడుచుండెను. ఇది కృష్ణామండలములోని దివి తాలూకా యందలి ప్రసిద్ధ గ్రామము. ప్రాచీనాంధ్ర నౌకా

జీవనమునకు కూడలి స్థానము. ఈ రేవుపట్టణము నుండియే పూర్వము నేటి బర్మా, కాంబోడియా, జావా, సుమత్రా ద్వీపములకు వర్తకము సాగుచుండెను. ఈ రేవు నుండియే బౌద్ధమత ప్రచారకులు వివిధ దేశములకు పోయి మత ప్రచారము గావించుచుండిరి.

(1) Prakrit Inscriptions from Nagarjunakonda Page 8. and Geographical Names E. I. Vol. XX No. 1

(2) ఘంటశాల చరిత్ర. గొట్టిపాటి వెంకటసుబ్బయ్య.

## కంద్రవాడి (ఉత్తర)

కంద్రవాడియే ప్రాచీన శాసనములలో కండేరువాడి యని పేర్కొనబడినది. ప్రథమ చాళుక్య భీముని బెజవాడ శాసనములో ఉత్తర కండేరువాడిలోని కూకిపఱ్ఱు గ్రామము చెప్పబడెను ఈ కూకిపఱ్ఱు సత్తెనపల్లి తాలూకాలోని డోకిపఱ్ఱు అను గ్రామము. సత్తెనపల్లి తాలూకాలోని ఆగ్నేయ భాగమున ఉత్తర కండేరు వాటికి సరివచ్చును.

(1) E. I. Vol. V. No 16 (A. D.888-918)

(2) E. I Vol. XXIII. No. 25 (తేది లేదు)
రెండవ అమ్మరాజు శాసనము (క్రీ. శ. 945-970)

## కంద్రవాడి (ఈవని)

వెలనాటి విషయములో నంతర్భాగమగు కంద్రవాటిలోని కొంత భాగము. ఈ క్రింది గ్రామములు ఈవని కంద్రవాడిలోనివని శాసనములందుదాహరింపబడెను. ఈమని ప్రధాన గ్రామముగా గల కంద్రవాడి ఈవని కంద్రవాడియై యుండవచ్చును.

| | | |
|---|---|---|
| గుండిమెడ | గుండిమెడ | గుంటూరు తాలూకా. |
| కుఱుంగల్లు | కూరగల్లు | గుంటూరు తాలూకా. |
| ఈవని | ఈమని | తెనాలి తాలూకా. |

S. I. I. Vol. X. No. 109...
" " 112 శా. శ. 1065.

## కంద్రవాడి (కండేఱువాడి విషయము)

తూర్పు చాళుక్యులనాటి శాసనములలోను కోటభూమి నేలిన మండలేశ్వరుల శాసనములలోను కంద్రవాడి పేర్కొనబడినది. ఈ క్రంద్రవాడి విషయమునకు గండేరు రాజధాని. మొదటి చాళుక్య జయసింహుని నిడమఱ్ఱు శాసనములో నిట్లు గలదు. (1)

"శ్రీ జయసింహ మహారాజః గండేఱు వాట్యాం వ్యాఘ్రనద్యశ్చో త్తర తటః వన్నేఱునద్యశ్చ తీరే గండేఱు రాజధాన్యాః పూర్వదిగ్విభాగే గమ్యూతిద్వయే నిడుబఱ్ఱు నామ గ్రామం అధివసతః కుటుంబినః సమవేతా నాజ్ఞాపయతి."

పైన జెప్పబడిన గండేఱు గుంటూరు మండలములోని గుంటూరు తాలూకా యందలి కండేఱు గ్రామము. నిడుబఱ్ఱే నిడమర్రు. ఈ గ్రామము కంతేఱునకు తూర్పున నెనిమిది మైళ్ళలో గలదు. గండేఱు ఃడేరయేకంద్రవాడి. నిడమర్రు వ్యాఘ్రనది కుత్తరమున వన్నేఱు తీరమందున్నది.

రెండవ విజయాదిత్యు నివాశాటిన సములో కండేఱువాటి విషయములోనిదని చెప్పబడిన కొఱ్ఱుపఱ్ఱు గ్రామము, సత్తెనపల్లి తాలూకాలోని కొఱ్ఱుపాడు గ్రామము. (2)

ఈ కంద్రవాడిని పేర్కొన్న మరికొన్ని శాసనములును వానిలో నుదాహరింపబడ్డ గ్రామములు నిందు పొందుపరుపబడినవి.

| శాసనములోని గ్రామము | నేటి గ్రామ నామము | తాలూకా |
|---|---|---|
| (3) క్రంతేఱు | కంతేరు | గుంటూరు |
| (4) గుడ్లపూడి | గుడిపూడి | సత్తెనపల్లి |
| అందుకూరు | అందుకూరు | గుంటూరు |
| కుంచులపల్లి | కుంచెనపల్లి | ,, |
| (5) గుండిమెడ | గుండిమెడ | ,, |
| (6) దుగ్గిఱేలపూండి | దుగ్గిరాల | తెనాలి |
| (7) డావులూరు | దావులూరు | ,, |

| | | |
|---|---|---|
| (8) మందడము | మందడము | గుంటూరు |
| వెలంగపూండి | వెలగపూడి | ,, |
| రావిపూండి | రాయపూడి | ,, |
| పెనుంబాక | పెనుమాక | ,, |
| ఉప్పలపాడు | ఉప్పలపాడు | ,, |

గుంటూరు తాలూకా మాల్కాపురము శాసనములో కంద్రవాడి వెలనాటి విషయములోనిదనియు, దాని కుత్తరమున కృష్ణానది కలదనియు, వ్రాయబడెను. "విషయే వెలినాడాఖ్యే కంద్ర వాట్యాం విశేషతః యదుత్తరేణ వహతి కృష్ణవేణీ మహానదీ."

పై సూచించిన గ్రామసీమానిర్ణయము ప్రకారము కంద్రవాడి, గుంటూరు తాలూకా; సత్తెనపల్లి తూర్పు భాగము; తెనాలి తాలూకా ఉత్తరభాగము కలిపిన సీమయైయుండును.

ఈ కంద్రవాడిలో నంతర్భాగములు (1) కంద్రవాడి (2) ఉత్తర కంద్రవాడి (3) ఈమని కంద్రవాడి (4) దొడ్డి కంద్రవాడి (5) గుడ్ల కంద్రవాడి.

(1) E. I. Vol. XVIII. No. 5.
(2) E. I. Vol. V. No. 16.
(3) E. I. Vol. VI. P. 147-160. (శా. శ. 1104)
(4) S. I. I. Vol. VI. No. 229.
(5) S. I. I. Vol. VI. No. 620
(6) S. I. I. Vol. X. No. 66. (శా. శ. 1056)
(7) S. I. I. Vol X. No. 109 (శా శ. 1063)
(8) S. I. I. Vol. X. No. 395. మాల్కాపుర శాసనము (శా. శ. 1188)

## కంద్రవాడి (గుడ్ల)

ఈ గుడ్ల కంద్రవాడి చాళుక్యరాజైన రెండవ అమ్మరాజు (క్రీ. శ. 945-971) తాడికొండ శాసనమునందు పేర్కొనబడినది.

'అస్యాస్సగ్రామాధి కస్యావధయః
పూర్వతః తూర్ణేటు

ఆగ్నేయతః గారలగుణ్ట
దక్షిణతః లాముపయుత్తరంబున బూరుగు
నైరుత్యతః ఒడ్డగుణ్ట
పశ్చిమతః చయత చైత్య నామతటాకమ్
వాయవ్యతః భీమసముద్ర నామతటాకమ్
ఉత్తరతః ఏనుక ఊాలు
ఈశానతః రేగడు గుణ్ట

కంద్రవాడి (కండేరువాటి) విషయము, మూడు లేక నాలుగు చిన్న చిన్న విషయములుగ విభజింపబడి, ఉత్తర కండేరువాటి విషయమనియు, ఈవని కండేర్వాటి విషయమనియు గుడ్ల కండేర్వాటి విషయమనియు వివిధ నామములతో వెలయుచుండెను. లాము, తాడికొండ, గుంటూరు తాలూకాలోనివి. గుడ్ల కంద్రవాడి అమరావతి ప్రాంతము.

రెండవ అమ్మరాజు (క్రీ. శ. 945-970) తాడికొండ శాసనము.
E. I. Vol. XXIII No. 25

## కంద్రవాడి (దొడ్డ)

రెండవ కోటకేతరాజు అమరావతి శాసనములో దొడ్డి కంద్రవాడి పేర్కొనబడినది. ఈదొడ్డి కంద్రవాడిలో దానమీయబడిన గ్రామము ఒంక దొన. ఈ ఒంకదొనయే ఉయ్యందొనయను నేటి సత్తెనపల్లి తాలూకాలోని గ్రామము. (1)

దొడ్డి కంద్రవాడి అందు ఒంకదొన. దొడ్డి కంద్రవాడిలోను ఒంకదొన.
1. E. I. Vol. VI. No. 15 (శా. శ. 1104).
S. I. I. Vol. VI. No. 236 (శా. శ. 1104)

## కందనవోలు

ఇది నేటి కర్నూలు మండలమునకు ప్రధాననగరమైన కర్నూలు పట్టణమునకు ప్రాచీనరూపము. అరవీటి వంశ మూలపురుషులలో నొకడగు సోమదేవరాజు గెల్చిన సప్తదుర్గములలో నిది యొకటి.

సీ. దండెత్తిచని మహోద్దండవృత్తిని గంగి
నేనికొండ నవలీలగాను గట్టి
కందనవోలును గలువుకోలును గోట
రాచూరు నెటువంటి రాజులకైన
.... .... .... .... .... .... .... .... .... .... ..

అళియరామరాజీకోటను సాధించినట్లును, కందనోలును రాజధానిగ నా ప్రాంతము నేలినట్లును రామరాజీయమునందు వర్ణించబడినది. ఈ విషయమే ద్విపద బాలభాగవతమునందును జెప్పబడినది. అతని సోదరుండగు వెంకటాద్రి కందనోలుపురము రాజధానిగ నా ప్రాంతము పాలించెనని రామరాజీయమునందు వర్ణింపబడినది.

"ఉ. ఏలెను గందనోలుపుర మింద్రసమానుఁడు వెంకటాద్రి భూపాలుఁడు."

Sources of Vijayanagar History, Pages 81,104, 205 and 223.

## కందరపురము (జనపదము)

కందర నృపతి కులసంభూతులును, ఆనందమహర్షి వంశసముద్భూతులునగు ప్రభువుల శాసనములలో కందరపురవరము పేర్కొనబడినది.

దామోదరవర్మ మట్టెపాడు శాసనములో నయ్యది విజయ కందరపురమునుండి యివ్వబడినట్లు వ్రాయబడినది. బాపట్ల తాలూకా చేజెర్లలోని యొక శాసనములో కందరరాజకుమారునిగూర్చి జెప్పిన సందర్భమున కందరపురము చెప్పబడినది.

కందరరాజుల శాసనముల స్థలములు దానమీయబడిన గ్రామములు దిగువ పేర్కొనబడినవి.

| | | | |
|---|---|---|---|
| గోరంట్ల | గోరంట్ల | గుంటూరు | తాలూకా |
| మట్టెపాడు | మట్టెపాడు | ఒంగోలు | ,, |
| తాడ్లికొన్ల | తాడికొండ | గుంటూరు | ,, |
| ఆంతుకూరు | ఆత్మకూరు | ,, | ,, |
| కంగూర | కావూరు | ,, | ,, |
| చేజెర్ల | చేజెర్ల | నరసారావుపేట | ,, |
| ధాన్యకట | ధరణికోట | గుంటూరు | ,, |

పై శాసనములలోని గ్రామములు గుంటూరు నరసారావుపేటలోనివే శాసనపరిశోధకులు గోరంట్ల శాసనములోని 'అంతుకూరు' బెజవాడకు పశ్చిమముననున్న 'గని-ఆతుకూరు' గ్రామమని తలంచిరి. కందరనృపతులు వారి శాసనములలో వారు వెణ్ణానాథులమని చెప్పుకొనుటచేతను, వారు దానమిచ్చిన గ్రామములు కృష్ణకు దక్షిణముననున్న గుంటూరు, నరసారావుపేటతాలూకాలో నుండుటచేతను, వీరు పాలించిన దేశము(జనపదము) గుంటూరు తాలూకాప్రాంతమని చెప్పవచ్చును. కందరపురమును రాజధానిగా వీరు కందరపురవర ద్వితీయజనపదములు పాలించుచుండిరి. గుంటూరు తాలూకాలోని కంతేరు కందరపురమైయుండునని తలంపవచ్చును. కందరపుర జనపద ద్వితీయ మనగా ఉత్తర కండేరువాటియు కోన కండేరువాటియనియు భావింపవచ్చును.

గోరంట్ల శాసనము I. A. Vol. IX P. 102.
మట్టిపాడు శాసనము E. I. Vol. XVII. P. 328,
చేజెర్ల శాసనము S. I. I. Vol. VI. No. 594.

## కందుకూరు (సీమస్థలము)

ఈ గ్రామము నేటి నెల్లూరు మండలములో కందుకూరుతాలూకాకు ప్రధాన గ్రామము. ఇయ్యది నెల్లూరుమండల శాసన సంపుటములలో కందుకూరులోని శాసన సంచయమునందు పేర్కొనబడినది.

(1) కందుకూరు సీమలోని చలమచాల గ్రామము. ఇది నేటి కందుకూరు తాలూకాలోని చలంచాల గ్రామము.

(2) కందుకూరు సీమలోని చుండి గ్రామమునను (ఆ తాలూకాలోని నేటి చుండి గ్రామము.)

(3) ఉదయగిరి రాజ్యాన కుంజెల్లి కందుకూరి సీమలోని పాలేటి దరివి దాని అవి ఆ గ్రామము సర్వమాన్యముగాను.

(4) ఉదయగిరి రాజ్యాన కుంజెల్లె కందుకూరి సీమలోను పాలేటి దక్షిణ తటమునందు జిత్లేశ్వ మూడి అనెడి గ్రామము. (ఇది కందుకూరు తాలూకాలోని గ్రామము.)

(5) ఉదయగిరి రాజ్యమునకుం జెల్లివచ్చి కందుకూరు సీమలోని మూషికనదీ తీరమందు చాంగొల్లు అని అట్టి గ్రామము. (ఇది కందుకూరి తాలూకా లోని చాగొల్లు గ్రామము.)

(6) కందుకూరి స్థలంలోని బముపాడి అని యూరు (ఇది వేంపాడు అను గ్రామము).

(7) కందుకూరు సీమలోను మాకు అమరం నడచెడు ఆనెమడుగు గ్రామాన (ఇది నేటి కావలి తాలూకాలో గలదు)

(8) ఈ కందుకూరు సీమ గజపతుల పరిపాలనములో 130 గ్రామములు గలిగియుండెనని ప్రతాపరుద్రదేవ గజపతిరాయ మహారాయల నెల్లూరి మండల శాసనములబట్టి తెలియుచున్నది.

(9) పాండురంగని అద్దంకి శాసనములో నతడు "కందుకూర్బెజవాడ గావించె మెచ్చి" అని చెప్పబడినది.

ఈ కందుకూరునకు స్కందపురి యనియు, స్కంద స్థానమనియు సంస్కృత నామములు గలవు.

| | | | |
|---|---|---|---|
| (1) | N. I. KanduKur | | ( 5) |
| (2) | ,, | ,, | (20) |
| (3) | ,, | ,, | (30) |
| (4) | ,, | ,, | (77) |
| (5) | ,, | ,, | (78) |
| (6) | ,, | ,, | (84) |
| (7) | ,, | Kavali | ( 1) |

(8) Para 41 of Madras Epigraphical Report 1933 - 34 (Kandukur 28)

### కందూరునాడు

తెలంగాణా శాసన సంపుటములందును వేయిస్తంభాలహనుమకొండ శాసనమునందును కందూరునాడు రాజ్యము పేర్కొనబడినది.

(1) శ్రీమన్మహామండలేశ్వర కందూరి రుద్రియన చోడరాజు రాజ్యాన కొండపల్లి పెద్దచెఱువునకు— నేలకొండపల్లి శాసనము— తెలంగాణా శాసన సంపుటము 1. ఇతర శాసనములు 2.

(2) శ్రీమన్మహా మండలేశ్వర కందూరి ఉదయన చోడమహారాజుల సుంకాధికారులు.... కోడూరి శ్రీస్వయంభూ సోమనాథ దేవరకు . రెండు వందాదిలియలకు— గంగాపురము వద్ద సుంకాన.

(3) కాకతీయ గణపతిదేవ మహారాజు ఓరుంగల్లు మొదటి పట్టాణ ముగా రాజ్యంబు సేయుచుండగా గోన బుద్ధారెడ్డి కొడుకు గణపయ్య .. గందురునాడు వడసి (శ. స. 1136)

(4) శ్రీమద్భీమ రాజనందన స్తోందీఊతోపి కంమూరువిషయే గ్రామం నాయకానుమత్య- నల్లగొండ జిల్లాలోని పానుగల్లు శాసనము.

(5) కందూరోదయ చోడవంశ విలసత్ క్షీరాబ్ధి గర్భోక్ష్భవత్పశై శ్రకాశ్రయ రుద్రదేవ నృపతేః కిం వర్ణ్యతే విక్రమః.

పై శాసనములోని గ్రామములు— కంమూరు పానుగల్లునకు సమీప మున నే యున్నవి. పానుగల్లు నల్లగొండ జిల్లాలోని నల్గొండ తాలూకా లోని గ్రామము. జడ్చెర్ల, గంగాపురము మహబూబునగర జిల్లా మహబూబునగర తాలూకాలోని గ్రామములు. కందుకూరు నల్గొండ తాలూకాయును, దానికి జేరియున్న మహబూబునగర మండలములోని తాలూకా ప్రాంతమునై యుండును.

## కంపిలి రాజ్యము

కంపిలినగరము మైసూరురాష్ట్రమునందలి బళ్ళారిమండలములో తుంగభద్రనదీతటమున బళ్ళారిపట్టణమునకు వాయవ్యదిశను ఇరువది యెని మిది మైళ్ళదూరమునందున్నది. ఇది పూర్వమొకప్పుడు పశ్చిమచాళుక్యరాజు లకు నెలవీడుగ నుండెను. విష్ణువర్ధన విజయాదిత్యుని జాతుంగరామేశ్వ రము కొండపైనున్న నొక కన్నడ శాసనములో నతడు ముప్పదిరెండువేల నోలంబవాడ రాజ్యమును కంపిలినెలవీడుగ పాలించుచున్నట్లుచెప్పబడినది. (1) కుమ్మటమనుదుర్గము కంపిలిరాజ్యములోనిదే. ఆర్వీటి వంశమునకు బూర్వులలో నొక్కడగు తాతపిన్నమరాజు ప్రథమకళత్రసుతుడైన కొటిగంటిరాఘవుడు కంపిలిరాజు సైన్యములపై దండెత్తి, వానిని గెల్చి గండరగౌళి బిరుదము వహించినట్లు, బాలభాగవత ద్విపద కావ్యమునందు వర్ణింపబడినది.

హరికాంతబోలు సూరాంబికయందు
ఘనశౌర్యుఁడీ కొటిగంటి రాఘవుని
గనియె; నతండు సంగ్రామంబునందు
రాజిల్లు కంపిలరాయ సైన్యముల
దేజంబు మెరియంగ దెగువమై గెలిచి
గరిమగై కొనియె నగ్గండరగౌళి
బిరుదంబు సరిన్నృపుల్ పేర్కొని పొగడ.

ఈ కంపిలి రాజ్యమే విజయనగరసామ్రాజ్యమునకు అంకురార్పణ మొనర్చిన ప్రధానమండలము. యాదవబల్లాల మహమ్మదీయ రాజ్యములకు యుద్ధభూమి. తుంగభద్ర కిరుతటముల వ్యాపించిన చిన్నరాజ్యము. పదునాల్గవ శతాబ్ద మొదటిభాగమున మహమ్మదీయులవశమై తర్వాత సంగమ వంశరాజ్యముల హస్తగతమై, విజయనగరసామ్రాజ్యములో లీనమై పోయెను. (2).

(1) E. I. Vol. IV. No. 30 (శ. స. 986),

(2) Kampili-Vijayanagara by Dr. N. Venkataramanlah. Founder of Vijayanagara by S. Srikantayya.

**కంబము మెట్టుపురము**

ఇదియే నేటి వరంగలు జిల్లాలోని కమ్మముమెట్టగ్రామము. శ్రీకృష్ణదేవరాయలు తెలంగాణములో సాధించిన దుర్గములలో నొకటి.

ముక్కుతిమ్మన పారిజాతాపహరణ కావ్యములో రాయల దిగ్విజయముల నిట్లు వర్ణించియున్నాడు.

సీ. ఉదయాద్రివేగ నత్యుద్ధతి సాధించె
విసుకొండ మాటమాత్రన హరించెఁ
గూటము ల్పెదరంగఁ గొండవీ డగలించె
బెల్లముకొండ యచ్చెల్లఁ జెఱిచె
దేవరకొండ యుద్వృత్తి భంగముసేసె
జల్లిపల్లె సమగ్ర శక్తిఁ గూల్చె
గినుకమీఱ ననంతగిరి క్రిందుపడఁజేసె
**గంబముమెట్టు** గ్రక్కున గదల్చె.

గీ. బలనికాయము కాలిమట్టులనడంచు
గటకమును నింక ననుచు నుత్కలము పేశుఁ
డన దినమ్ముగు వెఱచునెవ్వనికి నతఁడు
రాజమాత్యుండె శ్రీకృష్ణరాయవిభుడు.

విజయనగర సామ్రాజ్యము కడపటి కాలములో నియ్యది గోలకొండ నవాబుల వశమయ్యెను. అద్దంకి గంగాధరకవి తపతీసంవరణోపాఖ్యానములో ఇబ్రిహింకుతుబ్ ముల్కు కంబముమెట్టు గైకొనియెనని వ్రాసియున్నాడు.

సీ. పడమటను నవాయిబసవని గాజేసి
యచట గొయ్యలకొండ యావరించె
తమరిమల్లాఖాను దండణంబుగగొట్టి
హరియించె ఖానుగల్లాది గిరులు
ప్రథమదిక్కుల యొద్దెపాత్రసామంతుల
దట్టించె కంబముమెట్టు గొనియె
.... .... .... .... .... .... .... ....
.... .... .... .... .... ... .... ....

దీనికే స్తంభాచలమని సంస్కృతనామము. హరిభట్టు కొలిపాక యెఱ్ఱయామాత్యునకంకితమిచ్చిన వరాహపురాణ కావ్యమునందు కృతికర్త స్తంభాచలగణకగ్రామణి యనిచెప్పి, యీ స్తంభాచలగ్రామమును (కంభముమెట్టు) వర్ణించియున్నాడు.

కం. శ్రీమహిత స్తంభాచల
నామసముద్దామ పట్టణస్థల గణక
గ్రామణికి బంధుహిత ర
ణామణికిఁ గవీంద్రపంకజ నభోమణికిన్.
సీ. వరుణదిగ్వీథి నేపురమునఁ బ్రవహించెఁ
బావవసలిల సంపన్నమున్న
దీపించె నేపురి దోపికామాన సా
స్పదవర్తి చెన్నగోపాలమూర్తి

భాసిల్లె నేవీటఁ బ్రహ్లాదభక్తివి
　　　శ్రాణికొండ నృసింహశార్ఙపాణి
యే పట్టణంబునజూపట్టె హితపద్మ
　　　వనహేళి వీరేశబాలేందుమౌళి.

గీ. చతురచతురంగ బలరత్న సౌధయూధ
బాలగోపుర తోరణసకల వర్ణ
పౌరవారాంగనా జనప్రముఖవస్తు
మేదురంబట్టి కంబముమెట్టుపురము

గీ. ఆంధ్రమండలగిరి దుర్గహారలతకు
విమలనాయకరత్న భావము భజించి
యున్నతోన్నతశైల సంపన్నమగుచు
సకలపుటభేదనముల నెన్నికకునెక్కు.

సీసపద్యములోని మొదటిపాదమునందు వర్ణింపబడిన మున్ననది. మునియేరని తెలుసుకొననగును. ఇది తెలంగాణములో ప్రవహించి కృష్ణానదిని గలియుచున్నది.

వరాహపురాణము అముద్రితము. శ్రీ శేషయ్యగారి ఆంధ్రకవి తరంగిణి హరిభట్టు చరిత్రము నుండి సేకరింపబడినది.

## కడలునాడు (సీమ)

తూర్పుగోదావరీ మండలాంతర్భాగమున శాసనబద్ధమును, సారస్వత ప్రసిద్ధమునగు నాడులలో కడలునాడొకటి. ఈ కడలునాడు ద్రాక్షారామ శాసనములలో పేర్కొనబడినది.

(1) "చోడమండలమున తిరువింజులూరు నాంటిగంజిట్టు పంచనది ముడి గొండదైన వత్సరాయడు వ్యతియిపాత నిమిత్తమునం గడలునాంటి సిలరట్టడికము పదియేడు రాజరాజమాడలు పెట్టవలయు చుట్ట అంతయుం జతుస్సీమములో సర్వసంపదలతోడం గూడ విల్చికొని శ్రీ భీమేశ్వరదేవరకు నిత్యపడి."

(2, శ్రీ భీమేశ్వరదేవరకు గడలునాంటిలోని మంజేటి గంగిరెడ్డి తన వృత్తియైన అలము సర్వసంపదలతో శ్రీ భీమేశ్వరదేవరకు ధారాపూర్వకము చేసి."

శాసనములలో సుదహరింపబడ్డ 'సిల' 'మంజేరు' గ్రామములు కాకినాడ తాలూకా 'శిల' 'మంజేరు' అను గ్రామములే.

(3) శ్రీనాథకవి భీమేశ్వరపురాణము పంచమాశ్వాసములో భీమేశ్వరస్వామి యేలెడు భూభాగములో కడలిసీమను పేర్కొనెను.

గీ. ఏకభోగంబుగాగ నేలేటిగరుసు
గడలిసీమయు గౌతమీగంగ మేన
కప్పురపుగ్రోవి కాశ్మీరఖండ మవధి
యేలె విశ్వకుటుంబి భీమేశ్వరుండు.

(1) S. I .I Vol. IV. No. 1291 (శా. శ. 1100)
(2) S. I. I. Vol. IV. No. 1361 (శా. శ. 1065 .
(3) భీమేశ్వరపురాణము. పంచమాశ్వాసము- పద్యము 89.

## కణియకల్లు (మూనూఱు) నాడు

కణియకల్లు రాయదుర్గము తాలూకా రాయదుర్గ గ్రామమున ఈశాన్యమున పదునేడు మైళ్ళ దూరముననున్న గ్రామము.

ఈ కణియకల్లు మూనూఱుసీమకు గొద్దవాడి ముఖ్యపట్టణము. ఇది యే రాయదుర్గము తాలూకాలోని గోవిందవాడియను గ్రామము. ఈనాడు కళ్యాణిచాళుక్యుల పరిపాలనమునందుండెను. కన్నెమూనూఱు, పెదకంటి మూనూఱు, నఱవాడి అయ్యూఱు, కణియకల్లుమూనూఱు అను నాల్గు సీమలు కృష్ణానదికి దక్షిణతీరమున ఆంధ్రదేశములోని కర్నూలుమండల ప్రాంతములు ఈ నాల్గునాడులు లేక సీమలు కళ్యాణిచాళుక్యుల సామంత మండలేశ్వరుల పాలనమందుండెను.

## కన్నె మూనూఱు (సీమ-నాడు)

కళ్యాణచాళుక్య ప్రభుస్సైన త్రైలోక్యమల్లుని కర్నూలు మండలము లోని నందికొట్కూరుతాలూకా యందలి కొన్ని కన్నడశాసనములలో కన్నెమూనూఱు పేర్కొనబడినది. ఆ శాసనములందలి గ్రామములును వాటి యీనాటి నామములును సూచింపబడినవి. (1)

| శాసనములోని గ్రామము | నేటి నామము |
|---|---|
| దుడ్డియాల | దుద్యాల |
| కుఱుకున్ద | కురుకుంద |
| అతుకూరు | ఆత్మకూరు |
| శివపురము | శివపురము |
| జూవుటూరు | జూటూరు |

అట్లే పై కళ్యాణచాళుక్య ప్రభువులనాటి అలంపురములోని కొన్ని కన్నడశాసనములలో కన్నెమూనూఱుసీమ చెప్పబడినది. (2)

(1) శ్రీ మన్మహామండలేశ్వర చిద్దణచోళ మహారాజరు కన్నె మూనూఱుం పెడకల్లెంటు మాఱునఱవాడియయ్నూఱుం అయనె మూనూఱు మినుసాల్కు నాడుమం.

(2) కన్నెమున్నూఱ బళయవడ్డమానియమ.

(2) కన్నె 300 తుంగభద్రతటియ బెల్ల ఊతిత్రిభోగాభ్యన్తర సిద్ధియుం.

(4) కన్నెమూనూఱ బళియ తుంగభద్రెయతటియ పులినూర త్రిభోగాభ్యన్తరసిద్ధియుం.

రెండవ శాసనమునందు పేర్కొన్న వడ్డమాను నందికొట్కూరు తాలూకాలోని వద్దమాను అను గ్రామమే.

పై వివరములబట్టి విచారింపగా కళ్యాణచాళుక్యుల పాలనమున ఈ కన్నెమూనూఱు సీమ తుంగభద్రానదికి దక్షిణ పార్శ్వమున,నేటి కర్నూలు మండలములోని నందికొట్కూరు తాలూకా, నంద్యాల ప్రాంత భూమి యని చెప్పవచ్చును.

(1) S. I. I. Vol. IX. Part 1. No· 119 (శా·శ. 980)
,, ,, No.121 (శా. శ. 980)
,, ,, No.147 (శా. శ. 1001)

(2) తెలంగాణా శాసనములు - సంపుటములు 2.
అలంపుర శాసనముల సంఖ్య 12, 19, 20, 23.
కళ్యాణచాళుక్య శాసనములు.

**కమలాకరపురము** (చూడుడు-కొలనువీడు)

దీనికే కొలనువీడు, సరసీపురి, పద్మినీపురమనియు నామాంతరములు. కొలని మండలీకులకు రాజధాని. (చూడు-కొలనువీడు)

"స్వస్తిసమస్త జనపరివృతాలంకృతుండునుం గమలాకరపుర వల్లభుండును...... మన్నియదేవేంద్రుడునైన శ్రీమన్మహామండలేశ్వర కొలని మండలిక కేశవదేవరాజులు."

S. I. I. Vol. X No. 262. (శా. శ. 1140).

**కమ్మనాడు** (రాష్ట్రము, విషయము, క్షితి)

కమ్మనాడాంధ్ర ప్రదేశములోని యత్యంత ప్రాచీనమైన నాడులలో నొక్కటి. ప్రాచీన ప్రాకృత, సంస్కృతాంధ్ర శాసనములలో పెక్కింటి యం దుగ్గడింపబడెను.

ఇక్ష్వాకు కులరాజన్యుడైన వీరపురుషదత్తుని జగ్గయపేట ప్రాకృత శాసనములలో నియ్యది కమ్మాకరఠమని చెప్పబడినది. (A)

తర్వాతి శాసనములలో నియ్యది కర్మరాష్ట్రము, కమ్మవిషయము, కమ్మనాడు, కమ్మక్షితి యనియు వ్రాయబడినది.

పల్లవ రాజైన రెండవ విజయస్కందవర్మ ఒంగోడు శాసనములో నిది కర్మారాష్ట్రమనియు, మూడవ కుమారవిష్ణుని చందలూరు శాసనములో కమ్మాక రాష్ట్రమనియు గలదు.

రెండవ పులకేశి కొప్పరము శాసనములో కర్మరాష్ట్రమనియు, సర్వలోకాశ్రయుని చందలూరు శాసనములో కమ్మరాష్ట్రమనియు గలదు.

ఈ క్రింది పట్టికలో శాసనము, దానిలోని గ్రామము, నేటి గ్రామ నామము, తాలూకా వివరింపబడినవి.

| శాసనము | కాలము | రాష్ట్ర నామము | శాసన గ్రామములు | నేటి నామము | తాలూకా |
| --- | --- | --- | --- | --- | --- |
| B. (1) కుమారవిష్ణుని చందలూరు శాసనము | | కమ్మాంక రాష్ట్రము | కవచకారభోగము లోని చెందలూరు | చందలూరు | ఒంగోలు |
| (2) విజయస్కంధవర్మ ఒంగోడు శాసనము | | కర్మ రాష్ట్రము | ఒంగోడు | ఒంగోలు | ఒంగోలు |
| (3) రెండవ పులకేశి కొప్పరము శాసనము | క్రీ.శ. 631 | ,, | ఇర్పలి | | |
| (4) సర్వలోకాశ్రయుని చందలూరు శాసనము | క్రీ.శ. 673 | కమ్మ రాష్ట్రము | చెందలు | చందలూరు | ,, |
| (5) రెండవ అమ్మరాజు మలియంపూడి శాసనము | | కమ్మనాడు | మలియంపూడి<br>ధర్మవరము కల్వకూరు | మైనంపాడు<br>ధర్మవరము<br>కలవలూరు | ,,<br>,,<br>,, |
| (6) రెండవ అమ్మరాజు వేములూరపాడు శాసనము | | కర్మ రాష్ట్రము | అన్మనంగూరు<br>అండెకి | అనుమనమూరు<br>అద్దంకి | ,,<br>,, |
| (7) రెండవ జయసింహుని పెనుకపఱ్ఱు శాసనము | | ,, | | | |
| (8) నన్నిచోడుని డేగరమూడి శాసనము | శా.శ. 1002 | కమ్మనాడు | కొట్యదొన<br>డేంగఅబూడి | కొనిదెన<br>గడేరమూడి | నరసారావుపేట |

| | | | | | |
|---|---|---|---|---|---|
| (9) కన్నడదేవచోడుని మంత్రి మారని తంగెడుమల్లి శాసనము | శా.శ. 1037 | శ్రీశైలప్రాగ్భాగే, కర్మకృతి మహిత కొప్పరగ్రామే | కొప్పరము | కొప్పరము | బాపట్ల |
| (10) కామచోడ మహారాజు కొణిదెన శాసనము | శా.శ. 1059 | కమ్మనాడు | ఉప్పుగుండూరు<br>పెద్దగంజాము<br>కడకుదురు<br>చిన్నగంజాము | ఉప్పుగుండూరు<br>పెద్దగంజాము<br>కడవకుదురు<br>చిన్నగంజాము | బాపట్ల<br>,,<br>,,<br>,, |
| (11) | శా.శ. 1069 | ,, | కొట్టియదొన గుండియపూండి | కొనిదెన | నరసారావుపేట |
| (12) | శా.శ. 1037 | ,, | వ్రేంపల్లి | బాపట్ల | బాపట్ల |
| (13) | శా.శ. 1076 | ఉత్తమచోడవలనాంటి కమ్మనాడు | ,, | బాపట్ల | ,, |
| (14) రాజేంద్రచోడుని అప్పికట్ల శాసనము | శా.శ. 1094 | కమ్మనాడు | అప్పికట్ట | అప్పికట్ల | ,, |
| (15) కాకతి గణపతిదేవుని ఇడుపులపాడు శాసనము | శా.శ. 1131 | కర్మ రాష్ట్రము | ఇడుపులపాడు | ఇడుపులపాడు | ,, |



| | | | | | |
|---|---|---|---|---|---|
| (16) శాసనము గణపతిదేవుని కాలము | శా.శ. 1446 | కమ్మనాడు | కొట్టియదొన | కొనిదెన | |
| (17) కాకతిగణపతిదేవ మహారాజు శాసనము | శా.శ. 1140 | కమ్మనాటిలోని పూర్వసముద్రతీర మ:న మానోపల్లి | గొనసపూడి<br>మానోపల్లి | గొనసపూడి<br>మునుపల్లి | బాపట్ల<br>,, |
| (18) కాకతి రుద్రరాజు శాసనము | శా.శ. 1189 | కమ్మనాడు | ఒలుపలి | వలపర్ల | ఒంగోలు |
| (19) కాకతీయ ప్రతాప రుద్రరాజు | శా.శ. 1215 | ,, | రావినూతుల | రావినూతుల | ,, |
| (20) | | కమ్మ | రాయూరు | | |
| (21) శ్రీశైలములోని శాసనము | శా.శ. 1235 | కమ్మనాడు | నూతులపాడు<br>గొట్టిపాడు<br>ఉప్పలపాడు<br>గొఱపాడు<br>అనుమనంగూరు | | బాపట్ల<br>నరసారావుపేట<br>,,<br>,,<br>,, |
| (22) పంటమైలారురెడ్డి తిరువళిక్కేణి శాసనము. | శా.శ. 1350 | కమ్మ విషయము | తక్కెళ్ళపాడు<br>అద్దంకిసీమ లోనిది | తక్కెళ్ళపాడు | ఒంగోలు |

(23) నరసారావుపేట తాలూకా అప్పాపురములోని పెదకోమటి వేమారెడ్డి కాలమునాటి యొక శాసనములో కమ్మనాటిలోని నాదెండ్ల పుర సీమా నిర్ణయము చేయబడినది.

"జంబూద్వీపంబులో భారత వర్షంబున భారతఖండంబున మేరువు పర్వతంబునకు దక్షిణ దిగ్భాగంబున శ్రీశైల సముద్ర పార్శ్వంబున నోంకార నదీ తీరంబునం త్రిలింగ దేశాలంకారంబైన కోటభూమి కమ్మనాంటి సీమా స్థలంబు నందు నాదెండ్ల పురంబున" (శా. శ. 1327.)

కన్నడభాషలో రత్నత్రయ మను పేరెన్నిక గన్న పంప, పొన్న రన్నలను వారిలో పొన్నడు తన శాంతిపురాణములో తన నివాసస్థలము నిట్లు చెప్పియున్నాడు.

క. వేంగీ విషయద త్రైభుద
నంగళొళగ్గళద విషయ ముపమాతీతం
సంగత సమస్త మత్య్య
త్తుంగ ఫలద్రుమ మమూల్యావస్తునిదానన్.

ఉ. ఆధరణీ వధూతిలక మాధరణీ లలనా ముఖాబ్జ మం
తాధరణీర మైక నవయౌవన మాధరణీ ప్రియాకటా
క్షాదర విభ్రమ భ్రమణ మగ్గళ వగ్గదె కమ్మనాడు వి
ద్యాధరలోకమేనరఱ పోల్వెగబర్కుమె పోలదిర్కుమే.

వ. అల్లియం.

క. పుట్టుదొాదు పుంగనూరొాడ
పుట్టుదుద పరిమిత పురుషగుణగణ మర్థయోళ్
పుట్టుదుదు జినమతంగుడి
గట్టుదుదిళిపుట్టి నాగమయ్యదజియ్యం.

పై పద్యములబట్టి పొన్నడు వేంగి విషయములోని కమ్మనాటి పుంగనూరు వాస్తవ్యుడని తెలియుచున్నది. ఈతడు పదియవశతాబ్ద మధ్యమందున్నవాడు.

(శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు రచించిన
తెలుగు కవుల చరిత్ర పుటలు 93-94)

కమ్మనాటిని బేర్కొన్న ప్రథమాంధ్ర కవి పావులూరి మల్లన.

కం. ఇలఁగమ్మనాటిలోపల
విలసిల్లిన పావులూరి విభుఁడను సూత్రా
కలితాప స్తంబద్విజ
కులతిలకుఁడ వినుత గార్గ్యగోత్రోద్భవుఁడన్.

ఈ పావులూరు బాపట్ల తాలూకాలో యున్నది.

పైని సూచించిన పట్టిక ప్రకారము కమ్మనాడు శ్రీశైలమునకు తూర్పు భాగమున నరసారావుపేట తాలూకా, వెలనాటికి దక్షిణ ప్రాంతములోని బాపట్ల తాలూకా పాకనాటికి ఉత్తరమున ఒంగోలు తాలూకాలోని కొంత భాగము, పడమట గుండ్లకమ్మనదియు, కర్నూలు మండలములోని మార్కాపురము తాలూకాయునుగల భూభాగమని యూహింపవచ్చును.

A. E I. Vol. X. Luden's Lists No. 1202, 1203, 1204,
B. (1) E. I. Vol. VIII P 233-236;
(2) E. I. Vol. XV. P. 250-251;
(3) E I. Vol. XVIII. P. 257-261;
(4) E. I. Vol. VIII. P. 238-239,
(5) E. I. Vol. IX. P. 47-56;
(6) E. I. Vol. XVIII. P. 226-235;
(7) E. I. Vol. XVIII. P 313-316;
(8) S. I. I. Vol. X. No. 58.
(9) S. I. I. Vol. X. No 73.
(10) S. I. I. Vol. VI. No. 606.
(11) S. I. I. Vol. VI. No. 608.
(12) S. I. I. Vol. VI. No. 127.
(13) S. I. I. Vol. VI. No. 136.
(14) S. I. I. Vol. VI. No. 124.
(15) S. I. I. Vol X. No, 248.
(16) S. I. I Vol. VI. No 628.
(17) N. I. Ongole (45).
(18) N. I. Ongole (143).
(19) N. I. Ongole (129).

(20) S. I. I. Vol. VI. No. 235.
(21) S. I. I. Vol. X. No. 504.
(22) E. I. Vol. XVIII. P. 11-1.
(23) S. I. I. Vol. X. No. 573.

## కర్ణాటము

మహాభారతము భీష్మపర్వమునందలి జంబూద్వీప వినిర్మాణపర్వములో దక్షిణాపథజనపదములలో కర్ణాటక మొకటిగా జెప్పబడినది.

అథాపరేజనపదో దక్షిణాభరతవర్షభ
ద్రావిడోః కేరళః ప్రాచ్యాః మూషికోవనవాసకాః
కర్ణాటకా మాహిషకో వికల్యామూషకో స్తథాః ॥

వరాహమిహిరుని బృహత్సంహితలో కర్ణాటము దక్షిణదేశములలో నొకటిగా పేర్కొనబడినది.

కంకణటంకణ వనవాసిశిబిక ఫణికారకొంకణోభరాః ।
ఆ కరవేణోవర్తక దశపురగోనర్ద కేరళకాః ॥
కర్ణాటమహాట విచిత్రకూట నాసిక్యకొల్లగిరి చోళాః
క్రౌంచద్వీప జటాధర కావేర్యో ఋష్యమూకశ్చ ॥

నాల్గవ అధ్యాయము శ్లో. 12-13.

కర్ణాటకము యొక్క సరిహద్దు దేశముల వాత్స్యాయన కామసూత్రములకు వ్యాఖ్యరచించిన జయమంగళుడుకొంత స్పష్టపఱచియున్నాడు.

నర్మదాయా దక్షిణేనదేశో దక్షిణాపథః ॥
తత్రకర్ణాట విషయాత్ పూర్వేణాంధ్ర విషయః ।
నర్మదోకర్ణాట విషయోర్మధ్యే మహారాష్ట్రవిషయః ।
కర్ణాటవిషయ దక్షిణేన ద్రవిడవిషయః ॥

అనగా కర్ణాటకమునకు దూర్పున ఆంధ్రము, ఉత్తరమున మహారాష్ట్రము, దక్షిణమున ద్రవిడదేశమని స్పష్టము.

కర్ణాటకము, కుంతలదేశమునకు మారుపదముగ సంస్కృతాంధ్ర కావ్యములందు వ్రాయబడియుండెను (చూడుడు-కుంతలము).

కర్ణ మనగా కొండలోయయనియు వానిలో నివసించువారు కర్ణాటులనియు, దేశమునకు కర్ణాటమనియు, లేక కర్ - నాడు అనగా నల్ల రేగడి భూమియగుటచే కర్ణాటమనియు, లేక కర్ణులను రాజులు పాలించినదేశమగుటచే కర్ణాటమనియు చరిత్ర కారుల యభిప్రాయమైయున్నది.

## కర్నాడు (కన్నాడు)

శ్రీశైలములోని శాసనములో కర్నాటిలోని కొన్ని గ్రామములు పేర్కొనబడినవి.

| | | |
|---|---|---|
| బీరప్రోలు | బీరవోలు | నందికొట్కూరు తాలూకా |
| శివపురము | శివపురము | ,, |
| కుఱుకుంట | కురుకుంచ | ,, |
| ఇంద్రేశ్వరము | ఇందిరేశ్వరము | ,, |
| నందికుంట | నందికుంట | ,, |
| దండ్యాల | దుద్యాల | ,, |
| వెదురుపాడు | ఎదురుపాడు | ,, |
| తుమ్మలూరు | తుమ్మలూరు | ,, |
| తాటిపాడు | తాటిపాడు | ,, |
| గణపాపురము | గణపురము | ,, |
| ఎడ్డమఠము | ఎర్రమఠం | ,, |
| పాలమఱ్ఱిపాలు | పాలమర్రి | ,, |
| సిద్దేశ్వరము | సిద్దేశ్వరము | ,, |
| కోటివిందాల | కొణిద్యాల | ,, |
| కొఱప్రోలు | కొర్రపోలూరు | ,, |
| గండివేములు | గడివేముల | నంద్యాల తాలూకా |
| చిలుకలగుడిపాడు | చిలపల | ,, |
| పెసఱవాయ | పెసరవాయి | ,, |

పైన చెప్పబడిన దుద్యాల, కురుకుంచ, శివపురము, గ్రామములు కన్నడశాసనములలో కన్నెమూనూఱు సీమలోనివనియు నుదహరింపబడినవి.

కర్ణాట సామ్రాజ్యమేలిన శ్రీ విరూపాక్షరాయల శ్రీశైల తామ్ర శాసనములో చెప్పబడ్డ గ్రామనామములు, వాని నేటి పేర్లు జూడనగును (2)

| శాసనగ్రామము | నేటి నామము | నందికొట్కూరు తాలూకా |
|---|---|---|
| ఆతుకూరు | ఆత్మకూరు | |
| దుద్యాల | దుద్యాల | |
| కరివెన | కరివెన | |
| నందికుంట | నందికుంట | |
| రామాపురము | రామాపురము | |
| పోతురాజుపల్లి | పోతులమడుగు | |

పైన వివరింపబడిన గ్రామముల పట్టిక నేటి వాని ఉనికియు జూచిన కన్నాడు నేటి కర్నూలు మండలములోని నందికొట్కూరు తాలూకా, నంద్యాల తాలూకాలోని కొంతభాగమునైన ప్రాంతము.

(1) S.I.I. Vol. X. No. 503(శా.శ. 1234) కాకతి ప్రతాపరుద్రుడు.
,, No. 504 (శా.శ.1235)
(2) E.I. Vol. XV. P. 815 (శా. శ. 1388)

**కలకడపురము**

ఇది నేటి చిత్తూరుమండలములోని వాయల్పాడు తాలూకాలోని కలకడ గ్రామము. తొమ్మిది-పదియవ శతాబ్దములలో వైదుంబుల పరిపాలనమునందుండెను. వైదుంబరాజులకు కలుకడపురాధీశ్వరులని బిరుదుకలదు. రేనాటికి దక్షిణ ప్రాంతము నేలిన మాండలికులకు ముఖ్యపట్టణము. ఈ మాండలికులకు సిద్ధవటదేవ దివ్యశ్రీ పాదపద్మారాధకులని బిరుదుకలదు. అనగా కలకడ పురాధీశ్వరులు నేటి కడపమండలమునకు దక్షిణభాగమును, చిత్తూరుమండలమున కుత్తరభాగమును బరిమితమగు భూభాగము నేలుచుండి రని చెప్పవచ్చును.

సోమదేవమహారాజు మాచుపల్లి శాసనము E. I. Vol. XXVIII. No. 21 (శ. స. 1178)

## కల్యాణ కటకము

ఇది పూర్వము దక్షిణాపథము నేలిన పశ్చిమచాళుక్యులకు రాజధాని. నైజాము రాజ్యములో గుల్బర్గామండలములోని దుర్గము. ఇయ్యది శాసనములలోను, సారస్వతమునందును కటకమనియు జెప్పబడినది.

కాకతీయ ప్రథమరుద్ర భూపతి రాజ్యమునకు పడమటిదిక్కునకు కల్యాణకటకము మేర.

"రాజ్యంప్రాజ్యం లవణజలధే స్తీరపర్య న్తమస్య శ్రీశైలాంతం ప్రచరతిసదా దక్షిణాశాం సమగ్రాం.

ప్రాతీచ్యాన్తా కటకనికట స్థాయినీరాజ్య లక్ష్మీ కౌబేర్యాశాతట విలసితే మాల్యవ న్తంప్రదేశా" వేయి స్తంభాలగుడి శాసనము, శ్లో. 49.

విజయనగర సామ్రాజ్యమేలిన సాళువవంశ ప్రభువులగు సాళువమంగు, నరసింహారాయ రాజన్యులు కల్యాణకటకమును జయించినట్లు, సాళువ మంగునకు కళ్యాణము రాజధానియైనట్లును, సంస్కృతకావ్యమైన రామాభ్యుదయమునందును, ఆంధ్రజైమినీ భారతమునందును వర్ణితము.

సాళువమంగు :—

అసీత్కల్యాణనగర మావాస స్త స్య భూపతేః ।
ధ్రువం యాద్విశా మేరు శృంగ ప్రాప్తామరావతీ॥

సాళువ నరసింగరాయలు —

కల్యాణకాంచీ కటకశాలినీం కరదాయినీం ।
సకుంతలాం సచోలాంగాం యోభుజ్క్ష్వ ష్మాంసపుండ్రకా॥

అల్లే పిల్లలమర్రి పినవీరభద్రకవి సాళువ నరసింహారాయల ప్రతాప వర్ణన సందర్భమునవితడు కల్యాణనగరమును సాధించినట్లు చెప్పియున్నాడు.

శా. పాంచాల ద్రవిళాంగమాళవ శకప్రాగ్జోతిషక్షోణి భృ
త్పంచాస్య ప్రతివర్ష దత్త వివిధోప గ్రాహ్యరత్నాంశు మ
త్కాంచీ వేంకట శాళహ స్తినగరీ కల్యాణసౌధాంచల
ప్రాంచచ్చాసన సాళ్వశంకిత శశప్రాలేయరుజ్మండలా॥

అల్లసానిపెద్దన మనుచరిత్రలో రాయలు కల్యాణకటకమును సాధించిన విషయమును సూక్ష్మముగ దెల్పియున్నాడు.

ప్రళయఘనాఘన ఘోషజయానక
ఝాంకృతి భీమచపేటలురత్
కలుబరిగీ కటకక్షితి రక్షక
కన్నడరాజ్య రమారమణా.

ద్వితీయాశ్వాసము, పద్యము 81.

ఈ కల్యాణవిజయము రాయవాచకము కృష్ణరాయవిజయము లందును వర్ణింపబడినది.

రామరాజభూషణుండు రామరాయల దిగ్విజయముల వర్ణించునెడల నతడు కల్యాణనగరమును సాధించిన విషయము చక్కగా శ్లేషించియున్నాడు.

శా. విశ్వామిత్రునిఁగొల్చి రాముఁడతఁడుర్విం జెందెఁ గళ్యాణమున్
విశ్వామిత్రులుగొల్వ రాముడితడుర్విం జెందెఁ గల్యాణమున్
శశ్వత్కీర్తులు రాము లయ్యిరువురున్ సాధించు కళ్యాణలా
భైశ్వర్యంబులు ధర్మనిర్మథన ధర్మాలంబన వ్యక్తముల్.

వసుచరిత్రము ౹ ప. ఆ. ప. 47

**కలుబరిగె (గుల్బర్గా)**

ఇది నేటి గుల్బర్గాజిల్లాకు ప్రధాననగరము. మైసూరు రాష్ట్రములో గలసిపోయెను. ఆంధ్రచరిత్రలో ప్రసిద్ధిగాంచిన ప్రాచీనపట్టణములలో నొకటి. రఘుదేవరాజు ఓరుగల్లుశాసనములో దీనియునికి యిట్లుచెప్పబడినది

"జంబూద్వీపే భారతవర్షే। ఆంధ్రదేశాంతర్గత
పశ్చిమదిశాభాగే। కలుబరగ సురత్రాణ।
ఉమ్మైమాళహా। ఓరుంగల్లు రాజ్యే।"

పై శాసనములో చెప్పబడిన 'ఉమ్మైమాళహా' గుల్బర్గానేలిన బహమనీ సుల్తానగు "హుమాయూన్ షా" (క్రీ.శ. 1458-61)

ఈ కలుబరిగెనగరము విజయనగర సామ్రాజ్య చరిత్రమునందు వాసిగాంచిన నగరము. మహమ్మదీయులకును, హైందవులకును జరిగిన

యుద్ధములలో నొకరికడనుంచి మరియొకరు దీనిని యుద్ధములో గెలిచిరి. మనుచరిత్రము, ఆముక్తమాల్యద, రాయవాచకము మొదలైన గ్రంథము లందు ప్రశంసింపబడినది. మనుచరిత్రకారుడు శ్రీకృష్ణదేవరాయలను, "కలుబరిగికటకతుతిరక్షక కన్నడరాజ్య రమారమణా" యని మనుచరిత్ర ద్వితీయాశ్వాసాంత పద్యములలో ప్రశంసించియున్నాడు.

ఈ బహామనీరాజ్యము ఉత్తరమున పెన్గంగ, దక్షిణమున కృష్ణ, తూర్పున గోవా, పశ్చిమమున భువనగిరివఱకు వ్యాపించియుండెను.

Warangal Inscription of Raghudeva E.I. Vol. XXXIII. No. 23 (క్రీ. శ. 1460)

## కళింగదండపాట

సింహాచల శాసనములలో నీ దండపాట పేర్కొనబడినది.

"వారణశికటకాన కౌండిన్యస గోత్రనహరిహరచరణల.... కళింగ దండవాట కటకరగోవా శ్రీ అనంతదాసని నిమితంకను.... అఖండదీపము ఒకటి సమర్పించెను. వీరికుడు జీతానకు జంత్రనాంటిజాంకేటి గుడివాడను జలక్షేత్రము పుటండు కొనిపెట్టెను". (1)

శ్రీకృష్ణదేవరాయల శాసనము :—

"ప్రతాపరుద్రగజపతి మహారాయల చాతనుపుచ్చుకొన్న గ్రామాలు— కళింగదండపాటలోని గ్రామాలు. పెదగాణి గ్రామము।అగణపూడి గ్రామము। గంగవరంపాల్లె। పిన్నఅగ్నిపూడిపల్లె॥ (2)

పైన పేర్కొనబడిన అగనపూడి, గంగవరము గ్రామములు అంగనం పూడి గంగవరము అను అనకాపల్లి తాలూకాలోని గ్రామములు. పెదగాణి విశాఖపట్టణ తాలూకాలోని పెదగాడి యను గ్రామము. మొదటి శాసన ములో నుదాహరింపబడిన జంతుర్నాడు కళింగములో నంతర్భాగము. దండపాటయను దేశవిభాగము గజపతుల పరిపాలనవలన శాసనములందు పేర్కొనబడినది. ఇట్లే కొండవీడుదండపాట, రాజమహేంద్రవరము దండ పాట మొదలైనవి.

(1) S. I. I. Vol. IV. No. 711 (శ.స. 1331)
(2) ,, No. 695 (శ. స. 1441).

## కళింగనగరము

ముఖలింగమను నొక పుణ్యక్షేత్రము పర్లాకిమిడి పట్టణమునకు కిరువది మైళ్ళ దూరమున వంశధారనది యొడ్డున గలదు ఇచ్చట మూడు ప్రసిద్ధమైన శివాలయములు గలవు. అవి మధుకేశ్వర భీమేశ్వర సోమేశ్వరాలయములు. ఈ ముఖలింగమునందలి శాసనములు దక్షిణ హిందూదేశ శాసనములు, అయిదవ సంపుటమునందు ప్రకటింపబడినవి. ఈ శాసనములలో "కాళింగావని నగరే శ్రీ మాన్మధుకేశ్వరాయ", "కాలింగదేశనగరే శ్రీ మన్మధుకేశ్వరాయ;" త్రికళింగావనినగరే శ్రీ మన్మధుకేశ్వరాయ" యనియు జెప్పబడుటచే ముఖలింగమే కళింగనగరమని శాసనపరిశోధకులు నిర్ణయించియుండిరి. కీర్తిశేషులైన గిడుగు రామమూర్తి పంతులుగారు వజ్రహస్తుని నడగాం తామ్ర శాసనమును బరిష్కరించి ప్రకటించుచు, ముఖలింగమే కళింగనగరమని నిరూపించిరి.

(1) E. I. Vol. IV. No. 24. Nadagam Plates of Vajrahasta, Edited By G. Ramamurti Pantulu.

(2) కళింగ సంచిక—ముఖలింగము. శ్రీ భావరాజు వేంకటకృష్ణారావుగారు. పుటలు 195—237.

## కళింగము

కళింగము భరతఖండమునకు బూర్వ సముద్రతీరమున చరిత్ర ప్రసిద్ధిగాంచిన దేశములలో నొకటిగ పురాణేతిహాస, సంస్కృతాంధ్ర సారస్వతములందును, శాసనములందును వర్ణింపబడినది.

శ్రీమద్రామాయణము అయోధ్యాకాండమునందు భరతుడు కేకయరాజునువదలి అయోధ్యకు వచ్చునపుడు కళింగనగరము మీదుగా అయోధ్యను జేరెనని యున్నది. తరువాత కిష్కింధాకాండమున సుగ్రీవుడు వానరులను సీతాన్వేషణార్థము దక్షిణదేశములను బేర్కొనుచు కళింగమును జెప్పియున్నాడు.

శ్లో. ఏకసాహ్వే స్థాణుమతీం వినతేగోమతీం నతీమ్ ।
కళింగనగరే చాపి ప్రాప్యసాలవనం తదా ॥

అయో. 71.16.

శ్లో. విదర్భాన్ ఋషి కాంశ్చైవ రమ్యాన్మాహిషకానపి।
తథావంగాన్కళింగాశ్చ కౌశికాంశ్చసమంతతః ॥

మహాభారతములో దక్షిణదేశములలో నొకటిగా కళింగము చెప్పబడినది. భీష్మపర్వమున జంబూద్వీప విభాగములను జెప్పు సందర్భమున యీ క్రింది శ్లోకములలో కళింగులు చెప్పబడిరి.

తత్రేమే కురుపాంచాలాః శాల్వామాద్రేయ జాంగలాః
శూరశేనాః కలింగాశ్చ బోధామాలో స్తథైవచ ॥

శ్లో. 38.

ప్రోషకాశ్చ కలింగాశ్చ కిరాతానాం చ జాతయః।
తోమరాహింస మార్గాశ్చతథైవ కరభంజకాః।
ఏతేచాన్య జనపదాః ప్రాచ్యోదీచ్యా స్తథైవచ ॥

శ్లో. 96, 97.

మరియు ఆరణ్యపర్వమున ధర్మరాజు తీర్థయాత్రా సందర్భమున.

తతస్సముద్రతీరేణజగామ వసుధాధిపః
భ్రాతృభిస్సహితోవీరః కలింగాన్ప్రతిభారత ॥
ఏతే కలింగాః కౌంతేయ యత్ర వైతరణీనదీ
.......................................
తతః కృతస్వ స్త్యయనో మహాత్మా
యుధిష్ఠిరస్సాగర మభ్యగచ్ఛత్
కృత్వాచ తచ్ఛాసనమస్య సర్వం
మహేంద్రమాసాద్య నివాసమాస ॥

అతడు సముద్రతీరమునుండి కళింగాభిముఖుడై బయలుదేరి వైతరణీ నదియొద్దునకురాగానే, కళింగమును ప్రవేశించి, తర్వాత మహేంద్రపర్వతమును సమీపించి యచ్చట కొంతకాలముండి, తర్వాత గోదావరినదిని దాటి ద్రవిడమండలమును ప్రవేశించెనని యీ పర్వములోనే వ్రాయబడియున్నది.

ద్విజాతిముఖ్యేషు ధనం విసృజ్య
గోదావరీం సాగరగామగచ్ఛత్।
తతోవిపాప్మా ద్రవిడేషురాజన్
సముద్రమాసాద్యచలోకపుణ్యం॥

వనపర్వము, అధ్యాయము 118.

దండిమహాకవికృత దశకుమారచరిత్రము సప్తమోచ్ఛ్వాసములో మంత్రగుప్తచరిత్రములో కళింగదేశము, కళింగనగరము పేర్కొనబడినవి. కేతనకృత ఆంధ్ర దశకుమారచరిత్రము ఏకాదశాశ్వాసములో నీకథ అను వదింపబడినది.

మార్కండేయపురాణములో కళింగము దక్షిణాపథజనపదములలో నొక్కటిగా జెప్పబడినది.

అథాపరేజనపదా దక్షిణాపథవాసినః।
శైలూషా మూషికాశ్చైవ కుసుమానామవాసకాః।
మహారాష్ట్రా మాహిష్కా కళింగాశ్చైవ సర్వశః॥

వాయుపురాణమునందును కళింగము దక్షిణాపథజనపదములలో నొక్కటిగా చెప్పబడినది.

సేతుకామూషికాశ్చైవకుమనా వనవాసిరాః।
మహారాష్ట్రా మాహిషకాః కళింగాశ్చైవ సర్వశః॥

భాగవత పురాణములో బలియను మహారాజునకు దీర్ఘతముడను ఋషి యనుగ్రహమువలన, అంగ, వంగ, కళింగ, సుంహ్మ, పుండ్ర, ఆంధ్ర యను పేర్లుగల ఆర్గురు కుమారులు గల్గిరనియు, వారు తూర్పు దేశమునకు రాజులై, ఆరుదేశభాగములకు తమనామములనే పేర్లుపెట్టి పాలించిరనియు జెప్పబడినది.

కాళిదాసు రఘువంశము చతుర్థసర్గలో రఘుమహారాజు దిగ్విజయము వర్ణించుచు, నతడు ఉత్కళమును దాటి కళింగముమీదుగా వెడలెనని వర్ణించినాడు.

శ్లో. సతీర్త్వా కపిలాం సైన్యైర్బద్ధ ద్విరద సేతుభిః।
ఉత్కలాదర్శిత పథః కళింగాభిముఖోయయౌ॥

శ్లో. 38.

రాజశేఖరుడు కావ్యమీమాంసలో భరతఖండములోని పూర్వ దేశము లోనిదిగా కళింగమును వికదీకరించెను.

'తత్రవారాణస్యాః పురతః పూర్వదేశః। యత్రాంగ కళింగ కోసల తో లోత్కల మగధ ముద్గర విదేహనేపాల పుండ్రప్రాగ్జ్యోతిష తామ్ర లిప్తక మలదమల్లవర్తక సుహ్మబ్రహ్మోత్తర ప్రభృతయో జనపదాః।

పదునేడవ అధ్యాయము. పుట 93.

బౌద్ధ జాతకగాథలో నిది కళింగరట్ఠమని పేర్కొనబడినది. (1)

అశోకుని పదమూడవ శిలాశాసనములో నాతడు కళింగమును జయించినట్లును దానిని తన సామ్రాజ్యములో గలుపుకొనినట్లును చెప్పబడినది.

"అష్టవర్షాభిషిక్తస్యదేవానాం ప్రియస్య ప్రియదర్శినో రాజ్ఞః కళింగా విజితాః। అధ్యర్ధమానం ప్రాణశతసహస్రం యత్తతోఽపవ్యూఢం. శతసహస్ర మాత్రాస్తత్రహతాః; బహుతావత్కామృతాః। తతః పశ్చా దధునా లబ్ధేషు కళింగేషు తీవ్రింధర్మపాలనం........ దేవానం ప్రియస్య."

మాఠర వంశజుడును, వాసిష్ఠీపుత్రుడును, అగు శక్తివర్మ రాగోలు శాసనములో నతడు కళింగాధిపతి యనియు, కళింగవిషయములోని రాకలువ గ్రామమునుండి పిష్ఠపురమునుండి దానమిచ్చెననియు నందు తెలుపబడినది(2)

'సిద్ధిరస్తు స్వస్తి విజయపిష్ఠపురాణ కళింగాధిపతిర్మాగధ కులాలంక రిష్ణుర్వాసిష్ఠీ పుత్రోమహారాజశ్రీ శక్తివర్మా కళింగవిషయే రాకలువ గ్రామే సర్వసమన్వాగతాన్హ పతితో".

ఈ రాకలువ గ్రామము శ్రీకాకుళము జిల్లా, శ్రీకాకుళము తాలూకా లోని రాగోలు గ్రామము. ఈ శక్తివర్మ నైదవ శతాబ్దమువాడు కావున నాటికే కళింగము దక్షిణమున పిష్ఠపురము (నేటి పిఠాపురము) వఱకు వ్యాపించియుండెనని స్పష్టము.

తర్వాత నతని వంశమువారైన అనంత శక్తివర్మ శృంగవరపుకోట శాసనములో నతని తాత గుణవర్మదేవ రాష్ట్రాధిపతి యనియు, తాను కళింగాధిపతి ననియు జెప్పుకొనెను. (2)

"ఓమ్ స్వస్తివిజయ పిష్టపురాధిష్టాన్ మహీమండలవ్యాపి శారదేందుకర నిర్మలగుణస్య దేవరాష్ట్రాధిపతే రనేకసమర సంఘట్ట విజయాధిగత యశసోమహారాజశ్రీ గుణవర్మాన: పరమపౌత్ర: శక్తిత్రయోపేత రాజ్య సంపదో వాసిష్ఠకుల చంద్రవంశ: శ్రీమహారాజ ప్రభంజనవర్మణ: ప్రియపుత్రో స్వబలవిక్రమోపార్జిత భూర్నయ వినయసత్త్వ సంపన్నాధిగత యశోదేవద్విజాతి గురుజనోమధ్యా పసంవర్ధిత మహిమా పరమ మహేశ్వరో మాతాపితృ పదానుధ్యాత: కళింగాధిపతి శ్రీ మహారాజ అనంతవర్మా"

శృంగవరపుకోట, విశాఖపట్టణ మండలము, శృంగవరపుకోట తాలూకాకు కేంద్రము. పిష్టపురమునుగూర్చి పైన వ్రాయబడినది. దేవరాష్ట్రము సముద్రగుప్తుని గయాశాసనమునందును, ప్రథమచాళుక్య భీముని కళింగకోట తామ్రశాసనమునందును బేర్కొనబడినది. దానిలోనే ఎలమంచి కళింగదేశమును బేర్కొనబడినది. ఈ శాసనకాల మైదవశతాబ్దము. అనగా కళింగము దక్షిణమున పిఠాపురము వఱకు వ్యాపించియుండెను.

పై శాసనములోని విషయమే, అనంతవర్మచోడ గంగదేవుని కొన్ని శాసనములలో కళింగదేశ సీమలు తెలుపబడినవి. (4)

"పూర్వస్యాం దిశి పూర్వముత్కల పతిం రాజ్యేవిధాయాద్భుతం
పశ్చాత్పశ్చిమ దిక్తటే విఘటితం వేంగీశమప్యేత యో:
లక్ష్మీచందన మాలికోమివ జయశ్రీ తోరణ స్తంభయో
ర్బద్ధ్వాతిస్మసమిద్ధ కీర్తి విభవ శ్రీగంగచూడామణి:।

అనగా నితడు మొట్టమొదట తూర్పుదిశయందు రాజ్యభ్రష్టుడైన ఉత్కలపతిని రాజ్యమునందు నిలబెట్టి, తర్వాత పశ్చిమదిశయందు విఫలుడైన వేంగీ నృపతిని సహితము నిలుపబెట్టి ఆ యిద్దఱు రాజులను జయలక్ష్మియొక్క తోరణ స్తంభములవలె గావించెను.

పై శాసనములోని విషయమే ఆంధ్రసారస్వతము సమర్థించుచున్నది. మంచన కవి రచించిన కేయూరబాహుచరిత్రలో కొమ్మనమంత్రిని గూర్చి

"కళింగ రాష్ట్రంబులోని యెలమంచిలాదిగా ముప్పదిరెండు విష్ణుప్రతిష్ఠలు వెలయజేసె''నని వర్ణించియున్నాడు. తెనాలి రామకృష్ణ కవి పాండురంగ మాహాత్మ్యములోని నిగమశర్మోపాఖ్యానమందు సభాపతి యను బ్రాహ్మణుని వర్ణించుచు నతడు కళింగదేశాభరణంబగు పీఠికాపురంబధిష్ఠించి సకల మహీ సుపర్వ శ్రేష్ఠుండై వెలసెనని చెప్పియున్నాడు. శ్రీకృష్ణదేవరాయల యాస్థాన కవియగు రాధామాధవకవి విష్ణుమాయానాటకములో మూడవ యాశ్వాసమున బుండరీకుని కథ వర్ణించుచు సుభిక్షమగు దక్షిణదేశమునందలి వివిధ రాజ్యములను గూర్చి వ్రాయు సందర్భమున.

"కాళింగమధ్య దిక్ఖండంబు లాంగూల
శారదానదులచేఁ జాలబండు"

నవి లాంగూల (లాంగుల్య) శారదానదీర్ద్వయ మధ్యదేశము కాళింగ దేశాంతర్భాగమని చెప్పియున్నాడు.

ప్రతాప వీరనరసింహరాయల సింహాచల శాసనములో కళింగదేశము లోని యీ క్రింది గ్రామములు పేర్కొనబడినవి. (5)

"గజపతి ప్రతాపవీర నరసింహరాజుల మహాదేవియైన విష్ణుజీయ్యనం గారి కూతుఱు పార్వతిమహాదేవింగారు తామకు అభిష్టార్థసిద్ధిగాను భోగా నకై కటకభండారమందు మలలు 300 మాళు ప్రవేశముచేసి రజుల శ్రీహస్త పాత్ర ప్రమాణమందును కళింగదేశమందును అనకపల్లి, నావులపల్లి, పళినిక వాడ, ఎడువాక, నాడుమను, ముంమ్మడవాడ క్రమముగా విలిచి సింహా ద్రినాథనికి సమర్పించెను.''

పైని పేర్కొనబడిన అనకపల్లి, నావులపల్లి, పిళినికవాడ నేటి అనకా పల్లి తాలూకాలోని అనకాపల్లి, నాగులపల్లి, పిషిణివాడ గ్రామములు

పండితారాధ్య చరిత్ర, పర్వత ప్రకరణము (పుట 415) శ్రీశైల వర్ణనములో కళింగము సపాదలక్ష గ్రామ సమన్వితమని వర్ణింపబడినది.

"లక్షింపంగ సపాదలక్ష దన్నోజ
మీక్షింపంగ సపాదలక్ష గొంకణము
లక్షింపంగ సపాదలక్ష గళింగ''.

కళింగ విషయములో నీ క్రింది ప్రధాన నగరములు శాసనములందు చెప్పబడినవి.

(1) కళింగ నగరము
(2) దేవపురము
(3) దంతపురము
(4) సారపల్లి
(5) సింఘపురము (సింహపురము)
(6) పిష్టపురము

పైనచెప్పబడిన నగరములలో పిష్టపురము తూర్పుగోదావరి మండలము లోని పిఠాపురము—సింఘపురము శ్రీకాకుళము మండలములో శ్రీకాకుళ తాలూకాలోని సింహపురము, అనగా కళింగము తూర్పుతీరమున ఉత్తరమున శ్రీకాకుళము జిల్లా మొదలు దక్షిణమున తూర్పుగోదావరి జిల్లా వఱకు వ్యాపించియుండెనని చెప్పవచ్చును. (6)

(1) Geography of Early Buddhism by B. C. Law. Page 65
(2) E. I. Vol X I. P. 4-3,
(3 E. I. Vol XXIII. No. 9 (450-500 A. D.)
(4) A. H. R. S. Vol I Part 3. Pages 106-124. (శ. స. 1034)
(5) S. I. I. Vol VI. No. 731 (శ. స. 1328)
(6) E. I. Vol XVIII. No. 32.

## కళింగారణ్యము

ఇది ప్రాచీన బౌద్ధగాథలలో కళింగరణ్ణాయని పేర్కొనబడెను. దక్షిణాపథములోని అరణ్యములలో నొకటి. బందేల్ ఖండ్ మొదలు తూర్పు తీరమున కృష్ణానదివఱకు మధ్యభాగమున వ్యాపించియుండెను. ఇంద్రావతి మొదలు గోదావరివఱకుగల యరణ్యభూమియని చరిత్రకారులలో కొందఱి యభిప్రాయము. ఇది మహానది, గోదావరి మధ్యగల యటవియని యొక చరిత్రకారుని యభిప్రాయము.

Geography of Early Buddhism Page 67,
6)

**కొల్లపట్టణము**

ఇదియే శ్రీనాధుడు వర్ణించిన కొల్లత్తురై అను నామముగల కృష్ణా పట్నము. నెల్లూరుమండలములో గూడూరుతాలూకాలో సముద్రతీరమున పాకనాటిలోనున్న గ్రామము. దీనికి గండగోపాలపట్టణమను నామాంతరము గలదు. ఆ కాలమున నిదియొక రేవుపట్టణము. శ్రీనాధుడు తాత కొల్పట్టణాధీశ్వరుడు.

మ. "కనకక్ష్మాధరధీరు వారిధితటీ కాల్పట్టణాధీశ్వరున్
ఘనునిన్ పద్మపురాణ సంగ్రహకళా కావ్యప్రబంధాధిపున్
వినమత్కాకతి సార్వభౌముఁ గవితావిద్యాధరుం గొల్తుమా
యనుగుం దాతబ్రదాత శ్రీ కమలనాభామాత్యచూడామణిన్"

(1) N. I. Gudur (39) (A.D. 1256-57) Gudur (45) (A.D.) 1279-80.)

(2) పాళీ గ్రంథములలో కొల్లపట్టణమను రేవుస్థలమొకటి తూర్పు సముద్ర తీరమున (Coromandal Coast) నున్నట్లు B. C. Law గారు వ్రాయుచున్నారు. India as described in early Texts of Buddhism and Jainism. P. 78.

**కాసలనాడు**

ఆంధ్రబ్రాహ్మణులలో వివిధశాఖలవారిలో కాసలనాటివారొకరు. కాసలనాడులోని బ్రాహ్మణులే కాసలనాటివారు.

కాసలనాటిని దెల్పు ప్రథమాంధ్ర కావ్యము క్రీడాభిరామము. కాసలనాటి మాధవునికుమారుడును మీసాల అప్పయ్యగారి మేనల్లుడునగు గోవిందమంచనశర్మయు నతనిస్నేహితుడైన టిట్టిభసెట్టియు ఓరుగల్లు ప్రవేశించి, యచ్చటివింతలు తిలకించి, రాత్రిభాగమున కామోపభోగమనుభవించుటయా కావ్యకథావస్తువు. శ్రీనాధుని చాటువులలో కాసలనాటి కాంతల వర్ణనయు గలదు.

కం. కాసల్నాటి శ్రేష్ఠుఁడు
మీసా లప్పయగారిమేనల్లుఁడు ధా
త్రీసురతిలకుఁడు కుసుమశ
రాసనసము డంధ్ర నగరయాత్రోన్ముఖుఁడై.

సీ. ఎందుండి వచ్చితీరు ? కాసల్నాటి
నుండి వచ్చితిమి మే ముత్పలాక్షి.

క్రీడాభిరామము.

ఉ. వీసపుముక్కునత్తు నరవీసపు మంగళసూత్రమమ్మినన్
గాసునురాని కమ్మలర కాసునురానివి పచ్చపూసలుఁ
మాసిన చీరగట్టి యవమానమెసంగఁగ నేడురాగ నా
కాసలనాటి వారి కనకాంగిని చూచితి నీళ్ళరేవునన్.

శ్రీనాథుని చాటువు.

గోలకొండ దుర్గాధ్యక్షుడును, గోలకొండరాజ్య ప్రభువునగు మలికిభరాముని తాలూకుదారైన అమీనుఖానునకు పొన్నిగంటి తెలగనార్యుడు కృతనిచ్చుచు నతడేలు పొట్లచెరువు కాసలనాటిలోనిదని యయాతిచరిత్రము నందిట్లు వర్ణించెను.

ఉ. తామరతంపరై సిరులదార్కొను కాసలనాడు సత్యచిం
తామణి పొట్లచెర్లను సతంబగుచుండ నమీనుఖానుడిం
పామతిలింగ నిల్పి బోడవై బెడగైన మసీదుగాంచి యం
దే మను వెండికొండవయి కేఁగ దలంపక బేసికంటియున్.

యయాతి చరిత్రము.

ఈ పొట్లచెరువు గ్రామము ఆంధ్రప్రదేశము (తెలంగాణము) లోని మెదకు జిల్లా సంగారెడ్డి తాలూకాయందలి గ్రామము. శ్రీశైల మల్లిఖార్జునుని దేవాలయములోని శాసనములో ఈ కాసలనాటికే కుసలనాడని వ్రాయబడినది. ఆ కుసలనాటిలోని 'కలుచెఱులు' 'సానుఙ్ఞల' 'దేవరపల్లి' యను గ్రామములు కరీంనగరజిల్లా సుల్తానాబాదు తాలూకాలోని కలవచెర్లయు, సిరిసిల్ల తాలూకాలోని సిరిసిల్ల, దేవరపల్లియను గ్రామములు.

కాసలనాడనునది తెలంగాణములోని హైదరాబాదు వరంగలుజిల్లాల కుత్తరప్రాంతము. మెదకు, కరీంనగరజిల్లాలోని కొంతభాగము.

S. I. I. Vol X. No. 504 (శా. శ. 1235)

**కిమిడి**

వనపతిలేక బనవతిదీర్ఘాసి శాసనములో నతడు గెల్చిన దేశములలో నిది యొకటి. (శ. స. 997)

సీ. (శ్రీ) శకునేణ్డులు భూపతిపై శైల
నద్ధ్యాబ్ధ భవసంఖ్యనొంది వేంగి
దేశంబు గిమిడియ గోసలగిడ్డిసింగి
దేశంబు ముటి యొడ్డదేశమనంగ
జనిన భూపాలురనని నోర్చె....

కిమిడియనునది నేటి ఒరిస్సారాష్ట్రములో గంజాముమండలములో నొక జమీందారీయైయున్నది. పెద్దకిమిడి, చిన్నకిమిడియని రెండు భాగములుగ విభజింపబడిన చిన్న విషయభాగము.
E. I Vol IV. No. 45.

**కిరణపురము**

చాళుక్యభీముని ధర్మవరము శాసనములో పండరంగని విజయధాటిని వర్ణించు సీసపద్యమునందలి ఎత్తుగీతలో నతడు కిరణపురమును గెల్చెనని వర్ణింపబడినది.

ఆ. కిరణపురము దహాలనిరుతంబు దక్షనాడు
నచలపురము సొచ్చెనచలితుండు
వల్లభుండు గుణకెనల్లుండు పంచిన
పండరంగు మూరె పండరంగు.

ఈ పాండురంగని పై విజయము పూర్వచాళుక్యుల శాసనములలో సహితము పేర్కొనబడినది. ఈకిరణపురము మధ్యప్రదేశములోని బాలెఘాటు జిల్లాయందలి కిరణపురమను గ్రామము.

భారతి విభవ సం॥ చైత్రమాసము -ధర్మవరశాసనములు.

E. I. Vol IU. మల్లపదేవుని పిఠాపురశాసనము No. 33

E. I. Vol IX. మొదటి అమ్మరాజు మలియంపూడి శాసనము. P. 47

## కిల్లెడసీమ

కిల్లెడసీమ విశాఖపట్టణ మండలములోని జంతుర్నాటి యంతర్భాగము. సింహాచలములోని యొక శాసనములో "జంతరనాటి సింగరాజు కొడుకు ప్రతాప కూర్మరాజులు.... . శ్రీ నరసింహస్వామి నాథనికి కిల్లడ సీమలోని గొబ్బూరు ధారా పూర్వకముగాను ఇస్తిమి" యని కలదు. కిల్లడసీమ జంతుర్నాటి లోనిదని చెప్పుట చేతను, జంతుర్నాడు శృంగరవుకోట ప్రాంతమని తెలియుట చేతను, శృంగరవుకోట తాలూకాకు దక్షిణముననున్న అనకాపల్లి తాలూకాలో గొబ్బూరు గ్రామముండుట చేతను ఈ గొబ్బూరు సింహాచలమునకు సమీప గ్రామమౌట చేతను, కిల్లడసీమ అనకాపల్లి తాలూకాలో గొబ్బూరు ప్రాంతమని యూహింప వచ్చును. కిల్లెడ యను గ్రామమున్నదో లేదో తెలియరాలేదు.

శ్రీనాథుడు వీరభద్రారెడ్డి కంకితముగానిచ్చిన కాశీఖండము చతుర్థాశ్వాసములోని ఆశ్వాసాంత పద్యములో నతని విజయముల వర్ణించునెడ "కిల్లెడ"ను బేర్కొనెను.

అసమబాణనిభ విలాస ! యాజిగాండివాయుధా
బసవ శంకరా ! విశుద్ధ పంట వంశ వర్ధనా
కసిమికోట వెంకటాయి కప్పకొండ కిల్లెడా
ద్య సుహృదవనిపాంతరంగ హాలహాల విషానలా !

పై పద్యములోని వెంకటాయి, కసిమికోట గ్రామములు అనకాపల్లి తాలూకాలో నేటి వెంకటాపురము, కసిమికోట గ్రామములు.

S. I. I. Vol VI. No. 1054. (శా. శ. 1383)

## కీరాంభోనిధి (చూడుడు - చిలుక సముద్రము)

## కుండిన నగరము

ఇది కొండవీడునకు పర్యాయనామము. ప్రోలయ వేముని మంచాళ్ళ శాసనములో నతని రాజధాని కుండినపురముగా వర్ణింపబడినది.

శ్లో. సరాజధానీంజగతి ప్రసిద్ధాం శ్రీకుండినీ నామప్రతీమతిష్ఠత్
దిగంతరభూమీశ్వర మౌళిమౌళి మణిద్యుతి జ్యోతిర పాదపంకజః.

"కుండిన నామ నగర ప్రాగ్భాగే భద్రానదీ పశ్చిమతీర ప్రాంతదేశే శ్రీ కృష్ణానదీ పశ్చిమయామ్య దిక్సందిస్థ జనపదేషు ప్రసిద్ధం మంచాళ్యాఖ్య గ్రామమతి ముఖ్యాగ్రహారదానం కర్తుమిచ్ఛన్" గద్య 18.

మంచాళ్ళ గ్రామము నేటి బాపట్ల తాలూకాలోని గ్రామము.
మంచాళ్ళ శాసనము. రెడ్డి సంచిక అనుబంధము. శాసనము.IV(శా.శ. 1262)

**కుండిన సీమ**

కమ్మ ప్రభువైన వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు చేసిన ప్రతిష్ఠలు వర్ణించు నొక చాటుపద్యమునందు బాపట్ల, గుంటూరు, మోటుపల్లి, చింతపల్లి గ్రామములు కుండిన సీమలోనివిగా చెప్పబడెను. బాపట్ల, గుంటూరు గ్రామము లాయా తాలూకాలకు కేంద్రస్థానములు. మోటుపల్లి బాపట్ల తాలూకాలోని ప్రసిద్ధ రేవుపట్టణము. చింతపల్లి సత్తెనపల్లి తాలూకాలోని గ్రామము. ఈ కుండినసీమ పందొమ్మిదవ శతాబ్దములో గుంటూరు మండలములోని గుంటూరు, సత్తెనపల్లి, బాపట్ల తాలూకా ప్రాంతముగా ప్రసిద్ధమై యుండెను.

సీ ఏరాజు కట్టించె నెలమితో నమరావ
తీపుర ప్రాకార గోపురములు
ఏరాజు ఘటియించె హితభద్రగిరి కేళి
కుంభధ్వజస్తంభ గోపురములు
ఏరాజు రచియించె భూరివైకుంఠపు
రస్తంభవర గోపురాలయములు
ఏరాజు నిలిపెఁ బొన్నూరు పట్టణ ధర్మ
కూట ధ్వజస్తంభ గోపురములు,

గీ. మేటి బాపట్ల గుంటూరు మోటుపల్లి
చింతపల్ల్యాది కుండిన సీమ గొన్ని
యూళ్ళ నేత త్ప్రతిష్ఠల నొనరఁ జేసె
నతఁడు శ్రీవెంకటాద్రీంద్రం డతులయశుఁడు.

చాటుపద్య రత్నాకరము. పుట 158.

**కుంతలము**

మహాభారతము భీష్మపర్వము నందలి జంబూఖండ నిర్మాణపర్వములో చెప్పబడిన దక్షిణాపథము నందలి దేశములలో నిదియొకటి.

అథాపరేజనపదాదక్షిణాభరతవర్షభర్షిల్లి కాః కుంతలాశ్చైవ సౌహృ దానలకాననాః కౌకుద్రకో స్తథా చోళాః కొంకణా మాళవానకాః. శ్లో. 59

వరాహమిహిరుడు బృహత్సంహిత పదునారవ అధ్యాయములో కుంతల దేశమును బేర్కొని యాజనపదవాసులను సంకరజాతివారని చెప్పెను.

ద్రవిడ విదేహాంధ్రాశ్మక భాసాపుర కొంకణాః సమన్త్రిషికాః
కుంతల కేరళ దండక కాంతిపుర మ్లేచ్ఛ సంజ్కరజాః. శ్లో॥

రాజశేఖరుడు కావ్యమీమాంసలో దక్షిణాపథ దేశములలో కుంతలమును బేర్కొని కర్ణాటమును జెప్పలేదు.

పరతాదక్షిణాపథః యత్ర మహారాష్ట్ర మాహిష్మక అశ్మక విదర్భ కుంతల క్రథకైశిక సూర్పారక కాంచి కేరళ.... ....ప్రభృతియో జనపదాః.

మార్కండేయ పురాణములో కుంతలము మధ్యదేశములలో నొకటిగా జెప్పబడినది.

మత్స్యాశ్వకూటః కుల్యాశ్చ కుంతలాః కాశీ కోసలాః
అథర్వాశ్చ కళింగాశ్చ మలకాశ్చ వృకైఃసహ

అధ్యాయము 57. శ్లో. 32_35.

కుంతలదేశము మహారాష్ట్ర దేశములోని దక్షిణ మండలములు, మైసూరు రాష్ట్రమునందలి ఉత్తర భాగము, అనగా కర్ణాటదేశమునకు సరివచ్చు భూభాగము. బిల్హణుడు విక్రమాంకదేవ చరిత్రమునందు ఆరవ విక్రమాదిత్యుని కుంతలేంద్రుడనియు, కర్ణాటేంద్రుడనియు వర్ణించి యున్నాడు. కుంతలదేశమునకు వనవాసి ముఖ్యపట్టణము.

సాళువ నరసింహరాయలు రామాభ్యుదయ సంస్కృత కావ్యములో తాను కాంచి, కటక, కుంతల, చోళ, పుండ్రకదేశ పరిమితమగు రాజ్యమును పాలించుచుండినట్లు వ్రాసుకొనెను.

కళ్యాణకాంచీకటక శాలినీం కరదాయినీమ్ ।
సకుంతలాం సచోళాంగాం యోభుజ్ఞ క్ష్మాం సపుండ్రకాం ॥

నందితిమ్మన పారిజాతాపహరణ కావ్యములో విజయనగర సామ్రాజ్యాధీశుని కుంతలేశ్వరునిగ వర్ణించెను. తుళువ నరసింహరాయల ప్రతాపవర్ణన సందర్భమున నతడు కుంతలేశ్వరుడు కష్టములలో నుండగ విద్యాపురమును సాధించెనని ఈ క్రింది సీసపద్యము మొదటి పాదములో వ్రాసియున్నాడు. ఇందలి విద్యాపురమే విజయనగరము.

సీ. కుంతలేశ్వరుడు సిక్కుపడంగ విద్యాపు
రంబు గైకొని నిజప్రౌఢి మెరసె ...

సాళువ, తుళువ రాజ్యములు కుంతలేశ్వరులుగ వర్ణింపబడినట్లే, సంగమ వంశ రాజశ్రేష్ఠుడైన బుక్కరాయలు, గంగాదేవి విరచితమైన కంపరాయ చరిత్ర (సంస్కృత) కావ్యమునందు కుంతలభూమిపాలుడని వర్ణింపబడెను.

సుఖాయమానాం సుతజన్మవార్తా సహర్షమావేదయ తేజనాయ ।
అవాంఛదాత్మానమపి ప్రదాతుం కుతూహలీ కుంతలభూమిపాలః ॥

## కుంతి (నది)

కుండి, బ్రహ్మకుండి, కుండిజా, గుండ్లకమ్మ యను నామములచే ఒరగెడు నదియే కుంతి. ఇది కృష్ణదేవరాయల శాసనములలో పేర్కొన బడినది.

నాదెండ్ల అప్పమంత్రి దానములలో నితడు వినుకొండ కుంతీనది మధ్య ప్రాంతమునందు అప్పాపురమను గ్రామమును తటాక సహితముగా నిర్మించి వినుకొండలోని అంగడి గోపీనాథస్వామికి దానమిచ్చెనని మంగళగిరి శాసనములో గలదు.

శాకాబ్దేనవ వహ్నివార్ధి వసుధాగణ్యేశ్వరేవత్సరే
సుక్షేత్రం వినికొండ కుంతి సరితోర్మధ్యే కియన్మాత్రతః ।
కృత్వా గ్రామవరం తటాక కలితేంచాప్పాపురఖ్యాన్వితం.॥
E. I. Vol VI. No. 12 (శా. శ. 1439.)

## కుందుర్పి సీమ

ఈ సీమను పేర్కొను శాసనములు అనంతపురము మండలములోని కళ్యాణదుర్గము తాలూకా యందలి కంబదూరు, బెలుగుప్ప గ్రామములలో గలవు. అవి కన్నడ శాసనములు.

(1) "కుందురుపియ సీమెయే బాదుగుప్పెయ.... బెళుగుప్ప ఎంబగ్రామక్కే
(2) "కుందురుపియ సీమెయ పూళగణ కంభదూర కెఱయ."
(3) "కుందురుపియ రాజ్యద కంభదూర పడుతణస్థళద జాలుపటి ఎంబ గ్రామ మవనూ."
(4) "కుందురుపియ సీమెయొళగణ కంభదూరస్థళదలూ జాలవటియ గ్రామ, హోసహళ్ళి, అమ్మకెరె, తెగెగల, గాడిదిపాలు, బండె నహళ్ళి."

ఈ కుందుర్పి గ్రామము అనంతపురమునకు నైరృతి దిక్కున 47 మైళ్ళ దూరముననుు, ధర్మవరమునకు పడమట 46 మైళ్ళ దూరమునను, కళ్యాణదుర్గము తాలూకాలో నున్నది. ఇక్కడ ఒక కోట గలదు. నాల్గవ

శాసనములో పేర్కొనబడ్డ గ్రామముల యునికి నిర్ణయింపబడలేదు. హోసహాళి గ్రామము అనంతపురము మండలములో కళ్యాణ దుర్గము తాలూకా కుత్తర మునమున్న రాయదుర్గము తాలూకాలో గలదు. కాబట్టి కుందుర్పిసీమ కల్యాణదుర్గము రాయదుర్గ ప్రాంతముల వ్యాపించి యుండెనని చెప్ప వచ్చును.

(1) No. 478 S. I. I. Vol IX. (వీరనరసింహరాయల కాలము.)
(2) No. 483 " " (రాయసము కొండమరుసయ్య శాసనము. శా. శ. 1434.)
(3) No. 518 " " (రాయసము అయ్యపరసయ్య శాసనము శా. శ. 1447.)
(4) No. 576 " " (అచ్యుతదేవరాయలనాటి శాసనము శా. శ. 1456.)

## కుత్కీల ప్రత్యగుర్వి (గిరిపశ్చిమము, కొండపడుమటి)

కొండపడుమటి దేశమునకే సంస్కృతనామము కుత్కీల ప్రత్యగుర్వి. దుర్జయ కులావతంసుడగు మండభూపతి దండనాథుడైన సోమన ప్రెగ్గడ వ్రాయించిన శాసనములో మండభూపతి కుత్కీల ప్రత్యగుర్వి విభుడని వర్ణింపబడెను.

లక్ష్మీలీలావాసే గుణమణి సరధావన్వయే దుర్జయానాం।
కుత్కీల ప్రత్యగుర్వీ విభురజని జగన్మండనో మండభూపః ॥

S. I. I. Vol IV. No. 927. (శా. శ. 1057)

## కుత్రిదేశము

అనవేమారెడ్డి ద్రుజ్జవరము శాసనములో కుత్రిదేశము పేర్కొనబడినది. 'ఈ ద్రుజ్జవరము 'మలాపహారీతటే కుత్రిదేశే, గ్రామోయమేధతే" అని మలాపహారి యొడ్డున కుత్రీదేశమునందీ గ్రామము వర్ధిల్లుచున్నదని చెప్పబడినది. ఈ ద్రుజ్జవరముశాసనములో పేర్కొనబడిన పెరిశపల్లి, కావవరము,

దగ్గుమిల్లియు గుడివాడతాలూకాలోనే గలవు. ఈ మలాపహారియే పుల్లేరు కావచ్చును. కుర్తిదేశము గుడివాడతాలూకా ప్రాంతము కానోపును. (1)

రెడ్డిసంచిక. అనుబంధము. పుట 31-33.

E. I. Vol XXV. No. 13. అనపోతారెడ్డి కోడూరు శాసనము.

**కుమారగిరి**

కర్నూలుమండలములోని మార్కాపురము తాలూకాలోని త్రిపురాంతకములోని త్రిపురాంతకదేవర యున్న స్థలమునకే కుమారగిరి యని పేరు.

(1) శ్రీ పర్వత శిరోమణి శ్రీమత్ కుమారగిరి త్రిపురాంతకదేవర

(2) శ్రీ పర్వత పూర్వద్వార (శ్రీ) త్రిపురాంతకదేవర

(3) (శ్రీ) త్రిపురాంతకదేవర కుమారగిరి శివులకు

(4) శ్రీ పర్వత పూర్వ దిగ్భాగ....

(5) శ్రీ పర్వత పూర్వద్వార త్రిపురాంతకదేవరకు

(6) శ్రీ పర్వత పూర్వద్వార (శ్రీ) కుమారగిరి నివాసాయ............ త్రిపురాంతకదేవాయ ..

(7) శ్రీ పర్వత శిరోమణి శ్రీ కుమారగిరి (శ్రీ) త్రిపురాంతక మహాదేవర

పై శాసనములబట్టి త్రిపురాంతకము (శ్రీ)శైలమునకు పూర్వద్వారమనియు, త్రిపురాంతకేశ్వరుడు కుమారగిరి నిలయుడనియు స్పష్టము.

త్రిపురాంతకము గొప్ప శైవక్షేత్రములలో నొకటి.

S. I. I. olV X. No. 241 (శ. స. 1107)
" 371 (శ. స. 1182)
" 368
" 400 (శ. స. 1185)
" 407 (శ. స. 1188)
" 465 (శ. స. 1212)
" 553 (శ. స. 1278)

## కుమ్మటము (దుర్గము)

న్యూనిజ్ అను పోర్చుగీసు వర్తకుడు బాటసారియు దీనిని 'క్రిన్మట' యనియు మహమ్మద్ బిన్ తుగ్లక్ దీనిపై దండెత్తకపూర్వము ఆనెగొందిపై దాడి వెడలినపుడా రాజు 'క్రిన్మట'లో తలదాచుకొనుటకు పారిపోయెననియు వ్రాసియున్నాడు. ఈ దుర్గము కంపిలి సమీపముననే యుండెను. (1)

కాకతీయప్రతాపరుద్రుని మంత్రి అన్నయ కంపిలిపై దాడి వెడలి కుమ్మటమును ధ్వంసముచేసెననియు, భీమఖండ కృతిలో శ్రీనాథుడు వర్ణించెను.

సీ. కాకతి క్ష్మాపాల గంధ దంతావళ
        ధ్వజినీ మహాధురంధరుఁ డనంగ
    నవలక్ష కోదండనాథ రాజ్యాంభోధి
        సంపూర్ణ పూర్ణిమా చంద్రుఁడనఁగ
    సంధ్ర భూమండలాధ్యక్ష సింహాసన
        సంప్రతిష్ఠా పనాచార్యుఁడనఁగ
    వీరరుద్రాశేష విశ్వంభరాధీశ
        పృథుల దక్షిణ భుజాపీఠమనఁగ

తే. యవన సంహార విలయ కాలాగ్నియనఁగ
    ధాటి విఘటిత కుమ్మటోద్యానుఁడనఁగ
    విశ్వలోక ప్రశస్తుఁడై వినుతికెక్కె
    నతుల బలసీరి పోలయయన్న శౌరి.

భీమఖండము ప్రథమాశ్వాసము. ప. 49

హంపీ విరూపాక్షదేవాలయమునకు సమీపమున హోసమలె యున్నదనియు, దానిచుట్టును అరణ్యము కలదనియు, ఆ అరణ్య మధ్యభాగమున హోసదుర్గము కలదనియు, దాని సమీపముననే కుమ్మటము లేక కుమ్మట దుర్గము కలదనియు దెలియుచున్నది. (2)

(1) Forgotten Empire Page 292–299.
(2) Kampili and Vijayanagara by Dr. N. Venuataramanaiah P. 2–3.
(3) Founders of Vijayanagara Page 87.

## కురకరాష్ట్రము

ఈ రాష్ట్రము దానార్ణవుని కుమారుడగు ఇంద్రవర్మ వ్రాయించిన పుర్లి శాసనములో పేర్కొనబడినది. శ్రీమద్దానార్ణవసూనుః శ్రీ మన్మహా రాజేంద్రవర్మా కూరకరాష్ట్రే ఖుక్కుకురుచ్ఛేద కర్షకోన్కుటంబినః సమాజ్ఞాపయతి' అని ఇంద్రవర్మ కూరకరాష్ట్రములోని ఖుక్కుకుర గ్రామ కర్షకుల నాజ్ఞాపించినట్లున్నది. ఈ ఖుక్కుకుర గ్రామము పాలకొండ తాలూకాలోని బుక్కూరు గ్రామము. ఈ రాష్ట్రము నేటి విశాఖపట్టణ మండలములోని పాలకొండ తాలూకాప్రాంతము. వరాహ వర్తనీ విషయమునకు పశ్చిమ ప్రాంతమై యుండనోపు.

E. I. Vol XIV. P No. 362 పుర్లి శాసనము.

## కురవాటము

సాలంకాయన రెండవ నందివర్మ కంతేరు శాసనములో మొట్ట మొదట పేర్కొనబడినది. కుద్రహార విషయములోని కురువాడ గ్రామ నివాసులకు స్వామిదత్తుడను బ్రాహ్మణునకు పండ్రెండు నివర్తనముల భూమి దానము చేసెనని గలదు. (1)

ఈ కురవాటమే ముమ్మడి నాయకుని శ్రీరంగము శాసనమందును, కోరుకొండ శాసనమందును నతడాదేశమును బాలించుచుండెననియు నయ్యది గోదావరీ యుభయతోయము ప్రాంత దేశమనియు దెలుపబడినది.(2)

1. ప్రథితోభయ గోదావరీ మధ్యప్రాంతేషు
 మహిత సౌభాగ్యవాన్
 పాలయతి ముమ్మడీంద్రశ్శృంగఅ కుఅ
 వాటకోట వానరాన్.

2. పాటారకోన, కురవాటక చెంగరాదీన్
 గోదావరీ ముభయతోయ ముపాంతదేశాన్
 జిత్వావనాంచల జలస్థల దుర్గరమ్యా
 నేకః ప్రశాస్తి చిరమప్రతి శాసనస్సః

ఈ కురవాట ప్రాంత నిర్ణయమునకు క్రీడాభిరామము ప్రబల ప్రమాణము. మధుమావతి భావికాల జన్మమును గూర్చి యొక జోగి వ్రాసినదని చెప్పిన పద్యములో నీ మధుమావతి తర్వాతి జన్మమున ద్రాక్షారామమున చిన్నిపోతి యను వేశ్యకాంతయై పుట్టుననియుఁ తర్వాత నీమె కురువాటికా దేశమందు చెంచుకత్తెయై జన్మించుననియు నా గ్రంథమున గలదు. ఆ పద్యములో కురువాటికయనునది వేంగిమండలములోని తమ్మిలేరు ప్రాంత భూమి యని స్పష్టముగ వ్రాయబడినది. ఈ తమ్మిలేరు ఏలూరునకు సమీపముగఁ బ్రవహించు నొక ప్రసిద్ధమైన యేరు. పై శాసనోదాహరణమును బట్టి "కురువాటిక యనునది గోదావరి దక్షిణతటమున తమ్మిలేరు పరిసర ప్రాంతమని చెప్పవచ్చును. నందివర్మ కంతేరు శాసనములో కురవాడ వేంగికి సమీపమున నున్న కురవాడయేగాని, గుడివాడ తాలూకాలోని కూరాడ కాజాలదు.

సీ. అలకాపురంబున నంగారవర్ముడన్
గంధర్వపతి కన్యకమలపాణి
యాదివ్య గంధర్వికపరావతారంబు
మధుమావతోర్గంటి మండలమున
నా సుందరాంగి ద్రాక్షారామమునఁ బుట్టు
భువనమోహిని చిన్నిపోతి యనఁగ
నట్టి సత్ స్త్రీజాతి యా సానికూతురు
చిరకాలమున సదాశివునిగూడి

గీ. పావనంబైన తమిలేటి పరిసరమున
వేఁగి కురునాటికా దేశ విపినభూమి
గోవులను వేరిటఁ జెంచు కులమునందు
గడిమి కత్తులయమ్మునాఁ గలుగఁ గలదు.

క్రీడాభిరామము పుట 79, (శృంగార గ్రంథమాల),

(1) T. A. H. R. S Vol V. P. 24
(2) E. I. Vol XVI. P 83-96 (శా. శ. 1368)
S. I. I. Vol X No. 554. (శా. శ. 1363)

## కులవంతని

శ్రీ కూర్మము శాసనములలో నీ విషయము పేర్కొనబడినది. "కలింగ మండలాగ్రిత మైన కులవం త్తనియ నకరానలీటి మధుకేశ్వర దేవర స్థానాపతియైన రామీశ్వర అండారి." ఇందు తెలుపబడిన మధుకేశ్వరుడు ముఖలింగములోని మధుకేశ్వరుడు. ఈ శాసనములోని వరాహావంతవి వేఱుగ చెప్పబడినది. కులవంతని కోలవంతని లేక వరాహావంతని కాకపోవచ్చునను ఇయ్యది నేటి ఒరిస్సా రాష్ట్రములోని పర్లామిడి తాలూకా ప్రాంతమై యుండును.

S. I. I. Vol V. No. 1290 (శ. స. 1152)

## కులోత్తుంగ చోడపట్టణము

ఇది విశాఖపట్టణమునకు ప్రాచీన నామము. కులోత్తుంగ చోడచక్ర వర్తి ఉత్తరమున కళింగము వఱకు దాడివెడలి, చోళ వేంగి, కళింగ రాజ్య ముల ఆయా రాజ్యములకు రాజప్రతినిధుల నేర్పరిచెను. ఆ కాలముననే విశాఖ పట్టణమునకు "కులోత్తుంగ చోడపట్టణము" అని పేరిడెను. ఈ క్రిందివి రెండును విశాఖపట్టణములోని శాసనములు.

(1) శ్రీమదనంత వర్మదేవర ప్రవర్ధమాన విజయ రాజ్య సంవత్సరం బులు నేటి శకవరుషంబు 1113 ... శ్రీమతు విశాఖపట్టణమైన కులోత్తుంగ చోడ పట్టణమున నగరము పన్నిద్దఱును.

(2) స్వస్తిశ్రీ శకవర్షంబులు 112 ... శ్రీమన్మహా మండలేశ్వర కులో త్తుంగ పృథ్వీశ్వర మహారాజుల .... .... వ్యాపారి .... ఇచ్చిన శాసనము. విశాఖపట్టణమైన కులోత్తుంగ చోడ పట్టణమున.

(1) S. I. I. Vol X. No. 651.

(2) S. I. I. Vol X. No. 211.

## కులోత్తుంగచోడమండలము

ఈ మండలమును బేర్కొన్న ఆంధ్రదేశములోని శాసనముల వివరము.

(1) కులోత్తుంగ చోడమండలమున గంగంగొండ చోడ వలనాణ్టి సకల మంతనినాటి రాజనారాయణ విన్నగరాబు వారికి,

(2) స్వస్తి సమస్త భువనాశ్రయ శ్రీ పృథివీవల్లభ మహారాజాధిరాజ రాజపరమేశ్వర పరమభట్టారక రవికులతిలక చోడకులశేఖర పాణ్డ్య కులాంతక సమస్తరాజాశ్రయ రాజరాజేంద్ర వీరమహేంద్ర విక్రమచోడ విజయాభరణ శ్రీ రాజకేసరి. వర్మ పెర్మాడిగలు గంగా కావేరీ పర్యంతం సప్తమో విష్ణువర్ధనులైన శ్రీ మత్త్రిభువన చక్రవర్తి శ్రీ కులోత్తుంగ చోడ దేవర ప్రవర్ధమాన దివ్యసంవత్సర 37....ముదిగొండ చోడ బ్రహ్మమారాయణ్డు కులోత్తుంగ చోడ మండలమున ఉత్తమ చోడ వలనాణ్టి కమ్మనాణ్టి దుద్య వాడలోని ప్రేంపల్లి భావనారాయణ గుడి.

రాజరాజ నరేంద్రుని కుమారుడు రాజేంద్రచోడుడు మాతృ మాతా మహారాజ్యమైన చోళరాజ్యమును పితృపైతామహ రాజ్యమైన వేంగీ రాజ్య మును, కులోత్తుంగ బిరుద నామము వహించి, యీ రెండు రాజ్యములను గంగైకొండ చోళపురము రాజధానిగ దక్షిణదేశము నుండియే పరిపాలన మారంభించి వేంగి రాజ్యమునకు వీని కుమారుల రాజప్రతినిధులుగ బంపెను. వేంగి రాజ్యము చోడరాజ్యములో నంతర్భాగమైపోయెను. ఆనాటి వేంగి నాటి తెలుగు శాసనములలో నీ ప్రాంతము కులోత్తుంగ చోడమండలమని వ్యవహరింపబడెను. దానిలో నంతర్భాగములు ఉత్తమచోడ వలనాడు, గంగైకొండచోడ వలనాడులు. (మూడు ఉత్తమచోడ వలనాడు-గంగైకొండ చోడ వలనాడు.)

(1) S. 1. I. Vol VI. 200 బాపట్ల.
(2) S. I I. Vol V No. 66. చాళుక్య భీమవరము.

## కృష్ణ (నది)

ఇది పశ్చిమసముద్రమునకు నలుబదిమైళ్ళ దూరమున మహారాష్ట్ర ములో మహాబలేశ్వరమునకు సమీపమున 1౦-1౦ [illegible]

రేఖాంశమునకును మధ్య పడమటికొండలలో (సహ్యాద్రి) భూమట్టమునకు దాదాపు 4500 అడుగుల యెత్తున ఆవిర్భవించి కొంతదూరము దక్షిణముగా ప్రవహించి. పిమ్మట తూర్పు ముఖమై మహారాష్ట్ర ఆంధ్రప్రదేశములగుండ ప్రాకి తూర్పుకనుమలను (మహేంద్ర పర్వతములను) జేర్చి రెండుపాయలుగా వీడి పూర్వసముద్రములో కలియుచున్నది. దీని పొడవు దాదాపు 1000 మైళ్ళు. దీని యెడమప్రక్కన పదునైదు కుడివైపు నాలుగు ఉపనదులు కలవు.

ఈ నది పుట్టినచోట నిమ్నోన్నతమైన యొక కొండప్రక్క మహాదేవుని దేవాలయము గలదు. ఈ దేవళములోపల నొక చెఱువు గలదు. ఈ తటాకములోనికి గోముఖరూపమైన యొక గిండినుండి పరిశుద్ధమైన జలమెప్పుడును వెడలుచుండును. ఇదియే కృష్ణానది జన్మస్థానమని చెప్పుదురు. దీనినే యక్కడి ప్రజలు 'కృష్ణాబాయి' యని పిలుతురు.

ఈ ప్రదేశమునుండి కృష్ణ సతారాజిల్లాలో ఆగ్నేయమూలగా నూటనలుబదియైదు మైళ్ళు ప్రవహించిన పిమ్మట దక్షిణ మహారాష్ట్రదేశముగుండా మరి పదిమైళ్ళు పారి, పశ్చిమమున నుండి వెణ్ణా (వర్ణ—వెణ్ణ) నదిని జేకొనుచున్నది. ఈ రెండునదులు కలియుటచేతనే ఈ నదికి కృష్ణవెణ్ణాయని పేరు కల్గెను. తర్వాత దక్షిణ మహారాష్ట్రమునుండి మరి నూటయేబది మైళ్ళు ప్రవహించిన పిమ్మట ఘటప్రభ, మాలప్రభయను ఉపనదులు దీనిని జేరుకొనుచున్నవి. మరికొంతదూరము డెబ్బదిమైళ్ళు ఈశాన్యమూలముగాను, తర్వాత ఆగ్నేయమూలముగాను ప్రవహించిన పిమ్మట, వాయవ్యమూలనుండి ఉపనదులలో ప్రసిద్ధమైన భీమరథి దీనిని గలియుచున్నది. ఇంకొక ఎనుబదిమైళ్ళు ఆగ్నేయమూలగా ప్రవహించిన పిమ్మట కుడిప్రక్కన నైఋతి దిక్కునుండి సంగముకడ తుంగభద్ర దీనిని గలియుచున్నది. భీమరథి తర్వాత తుంగభద్ర కృష్ణ ఉపనదులలో పెద్దది; ప్రసిద్ధమైనది. తర్వాత నల్లమలల ప్రక్కను శ్రీశైలము మీదుగా ఈశాన్యమూలగా ప్రవహించి ఎడమప్రక్కను పాలేరు అను ఉపనదిని గలిసికొని, అటుపిమ్మట నైఋతి మూలగా వంగి తూర్పు సముద్రమును గలియుచున్నది.

తుంగభద్రను గలిసిన తర్వాత నెడమ ప్రక్క ఆంధ్రప్రదేశము (తెలంగాణము) నుండి దిండి, పెద్దవాగు, మూసి, అను ఉపనదులను కలుపుకొనుచున్నది.

ఈ మూసినది యొడ్డుననే ఆంధ్రప్రదేశ్ రాజధాని హైదరాబాదుగలదు. కృష్ణ ఉత్తరాంధ్రమైన తెలంగాణమును, దక్షిణాంధ్రమైన రాయల సీమను, దన దక్షిణ వామ స్రవంతీ బాహువులచే నేకీకృతముగావించి, ఉభయ పార్శ్వములందు నివసించు అఖిలాంధ్ర ప్రజానీకమున కభయహస్త మిచ్చి సంరక్షించుచున్నది.

భవనాశియను ఉపనదియొకటి కర్నూలు మండలమున నల్లమలలలో పుట్టి సిద్ధాపురము, ఆత్మకూరు, పెంటకోట, జూటూరుగ్రామములగుండా ప్రవహించి సంగమేశ్వరము వద్ద కృష్ణను గలియుచున్నది.

## పౌరాణిక గాథలు

పద్మపురాణములో కృష్ణానది నామోత్పత్తిని గూర్చి చమత్కారమైన యొక కథ గలదు. పూర్వమొకప్పుడు బ్రహ్మ సహ్యగిరి శిఖరమున యజ్ఞ మొకటి చేయ సంకల్పించి వేల్పులనెల్ల నాహ్వానించెను. సుముహూర్త సమయమునకు జ్యేష్ఠభార్యయైన స్వరయను నామె రాజాలకపోవుటచే, కనిష్ఠభార్యయైన గాయత్రిని దక్షిణ పార్శ్వమున గూర్చుండబెట్టుకొని దీక్షా విధి సాగించెను. అంతట స్వర యేతెంచి యజ్ఞదీక్షను గైకొనిన గాయత్రిని, యచట సమావిష్టులైన సమస్త దేవతానివహమును జూచి కోపోద్దీపితయై వారలనందరిని నదులుగ నుద్భవింపుడని శపించెను. తర్వాత సవతులిద్దఱు కయ్యమునకు దార్కొని యొకరికొకరు శాప ప్రతిశాపముల నిచ్చుకొనిరి. గాయత్రి కోపించి స్వరను నిమ్నగబుట్టుమని శపించెను. అంతట సమావేశులైన హరిహరాదులు భయపడి తాము నదీరూపములు దాల్చినచో లోకము లెల్లను లుప్తమై పోవుననియు శాప ముపహరించుకొమ్మనియు స్వరను వేడిరి. ఆమెయు పశ్చాత్తాపము నొంది తన శాపమునకు తిరుగులేదు గావున బ్రహ్మ విష్ణు మహేశ్వరాదులు స్రవంతులుగ భూలోకమున బుట్ట వలయుననియు, దానును సవతియు నట్లేయాదు మనియు బ్రత్యుత్తరమిచ్చెను. అంత మహావిష్ణువు కృష్ణానదిగను, మహేశ్వరుడు వేణ్ణానదిగను, బ్రహ్మ కకుద్మతిగను మిగిలిన నిర్జరులెల్లరు వివిధ నదీరూపములను దాల్చి సహ్యపర్వత శిఖరములనుండి పూర్వవాహినులుగ నుద్భవించిరి. పై కథలో రెండు సత్యమైన భౌతిక వృత్తాంతములు గలిగియున్నవి. కృష్ణసహ్య పర్వతమునుండి

బుట్టుటయు, కృష్ణయు, వేణ్ణయు గలసి కృష్ణవేణ్ణ లేక కృష్ణవేణి యాటయు నను రెండు విషయములు వ్యక్తపరుపబడినవి.

మత్స్య వామన పురాణములలో కృష్ణ హవ్యవాహనుని పదునాలు భార్యలలో నొకదానిగ వ్రాయబడెను.

విష్ణు పురాణము రెండవ అధ్యాయములలో సహ్యా పర్వతమునుండి పుట్టు నదులలో కృష్ణవేణి యొకటిగ చెప్పబడినది.

"గోదావరీ భీమరథీ కృష్ణవేణ్యాది కాస్తదా
సహ్యపాదోద్భవా నద్యః స్మృతాః పాపభయాపహా"

రాజశేఖరుని కావ్యమీమాంసలో పదియేడవ అధ్యాయమున దక్షిణా పథమునందలి నదులలో వేణా నది లుదాహరింపబడెను.

"నర్మదా, తాపీ, పయోష్ణీ, గోదావరీ, కావేరీ, భీమరథీ, వేణా (వేణీ), కృష్ణవేణా (కృష్ణవేణి) వంజులా, తుంగభద్ర, తామ్రపర్ణి, ఉత్పలావతీ, రావణ గంగాద్యా నద్యః"

రాజశేఖరుడ కృష్ణవేణీ వేణీ నదులు వేర్వేరుగా వ్రాసియున్నాడు. వేణీ భీమరథి తుంగభద్రయు కృష్ణకు ఉపనదులు. వేణి కృష్ణతో గలసిన పిమ్మట ఈ నదికి కృష్ణవేణి యను నామమేర్పడెను.

## కృష్ణానది-రామాయణ మహాభారతములు

కృష్ణ రామాయణములో వర్ణింపబడలేదు. మహాభారతములో గృష్ణ వేణి పేర్కొనబడినది.

(1) అరణ్యపర్వము ద్వితీయాశ్వాసమునందు పుణ్యతీర్థముల సందర్భమున—

వ. "తొల్లి శతక్రతుండు మూఁడు క్రతువుల సేయుట జేసి పవిత్రం బయిన కృష్ణవేణియందు దేవ ప్రావంబాడిన సర్వపాప వినాశంబగును."

(2) భీష్మపర్వము ప్రథమాశ్వాసములో భరతవర్షములోని నదుల వివరించు పట్టున—

వ. "గంగయు, దుంగభద్రయు, వేత్రవతియు, గృష్ణవేణియుఁ బెన్నయు, యమునయు, దమసయు, శరావతియు, గావేరియు, నర్మదయు, బాహుదయు, సరయువును, శతద్రువును వితస్తయు, విపాశయు, తామ్రపర్ణియు నను మహానదులు"

పద్మపురాణము ఉత్తర ఖండము అధ్యాయము 118 నుండి శ్రీ పిసుపాటి చిదంబరశాస్త్రిగారు తెనిగించిన కృష్ణానదీ జన్మఘట్టమునుండి యీ క్రింది పద్యములుదాహరింపబడుచున్నవి.

సీ. మానిని చాక్షుషమన్వంతరమునఁ బూ
 ర్వము సహ్యగిరి శిఖరమున బ్రహ్మ
సంకల్పమొనరించి జన్నంబు సేయ మా
 ర్గమున రావించి నిర్జరులనెల్ల
స్వజ్యేష్ఠ సతియైన స్వరరామి సుముహూ
 ర్త సమయమునకు సర్వసమ్మతముగ
నారంభ మొనరించె నాత్మ కనిష్ఠ భా
 ర్యయగు గాయత్రితో నధ్వరంబు

గీ. నంతటను స్వరయేతెంచి యజ్ఞదీక్ష
గొన్న గాయత్రి నచ్చోటనున్న సకల
దేవతలఁ జూచి క్రోధ సందీప్త యగుచు
నెఱ్ఱవాఱంగ నేత్రము లిట్టులనియె.

గీ. అను భావ్యము గాకుండఁగఁ
జనదే నాటికిని గూడ జలిపిన కర్మం
బని పల్కి నిమ్నగలుగాఁ
గను శాపంబిచ్చె నచటగల వారలకున్.

గీ. అపుడు గాయత్రి రోషతామ్రాక్షి యగుచు
నోసి దుర్బుద్ధి శపియింప నుచితమగునె
నీకె భర్తయె పరమేష్ఠి నాకుఁగాదె
యగును నీవును నిమ్నగవని శపించె.

సీ. అంతట హరిహరాద్యఖిల దేవతలును
హా హా నినాదంబు లావహిల్ల
దేవి, మేమెల్ల నదీరూపములు దాల్ప
లు ప్తమైపోవె ; ముల్లోకములును
శాపం బుడువు మని స్వరను బ్రార్థింపఁగ
నెదను పశ్చాత్తాప మొదవనామె
యనిమిషులార యజ్ఞారంభమున వినా
యకుని బూజింపమి నయ్యెనిట్లు

గీ. కాని నా వాక్కు తిరుగదు గాన మీరు
స్వాంశములచేత నిమ్నగలు గండు పొందు
స్వాంశముల నేను గాయత్రియాపగాత్వ
మొంది సావిత్రి యను ఖ్యాతి నొందగలను.

వ. అని వచించి యూరకుండుటయు నంత స్వస్వాంశంబులచే విష్ణువు కృష్ణానదీత్వంబును, మహేశ్వరుండు వేణ్యానదీత్వంబును బ్రహాకకుద్మతీత్వంబును నిర్జరులెల్లరు బహువిధ నదీ రూపంబులు బడసి సహ్యాద్రి శిఖరంబుల నుండి పూర్వవాహినులుగను, తత్పత్నులు స్వాశంబులచేఁ బశ్చిమవాహినులు గను బ్రవహింపఁ దొడంగిరి.

## కృష్ణానది - వసుచరిత్ర

రామరాజభూషణుడు వసుచరిత్రలో కృష్ణానది కా పేరెట్లు సంభవించెనో చమత్కరించి యిట్లు వ్రాసియున్నాడు. ఈ పద్యములో మూడు వందల సంవత్సరముల ఆంధ్ర చరిత్ర ఆంధ్ర మహమ్మదీయ పరస్పర యుద్ధముల ఫలితము సంక్షిప్తముగ జెప్పెననుటలో నతిశయోక్తి యేమియును లేదు. తిరుమలరాయల తమ్ముడగు రఘునాథరాయలు తురుష్కుల సైన్యముల రూపుమాపించుట జేసి, వారి భార్యలు ఏడువగా వారి కాటుక కంటి నీరు ప్రవాహమై కృష్ణలో గలియుటజేసి యా నదీ జలము నల్లనగుట వల్ల కృష్ణకు కృష్ణాంకము (నల్లబడుటచే) గలిగెనట.

శా. యాదోరాశి గభీరమూర్తి రఘునాథాధీశు దుర్దండ బా
హా దర్పాంధ సపాద మల్కిక నిజామానీకముల్ ద్రుంప జ
న్యా దూరస్థితి బారు కృష్ణకును గృష్ణాంకంబు నాడబ్బె బి
ట్బి దివ్యన్నయనాబ్జకజ్జల జలాఖిల ప్రవాహంబునన్.

ఈ వాహినియే ముష్కర తురుష్క వాహినీ నివహముల కడ్డుపడి దక్షిణాపథము నందలి యాంధ్ర దేశములో కాలు నిలువకుండ జేసినది.

## కృష్ణానదికి ప్రాచీన శాసనములలో పేర్లు

### ప్రాకృతము

(1) కణ్ణబెమ్నా — ఖారవేలుని హాతిగుంఫ శాసనము.
(2) కరబెణా — నాసిక్ గుహా శాసనము (10)
(3) కన్హవణ్ణా — రాష్ట్రకూట రాజగు మూడవ కృష్ణుని శాసనము.

### ఇతర శాసనములు - సంస్కృత నామములు

(4) కృష్ణవెణ్ణ — రాష్ట్రకూట రెండవ గోవిందరాజు శాసనము.

### ఆంధ్రదేశములోని కొన్ని తెలుగు శాసనములు

(5) కృష్ణవేణ్ణ — 'క్రిష్ణవేణ్ణా నదీతీర పట్సహస్ర విషయాధీశ్వర'
(6) కృష్ణవేణ్ణ — కృష్ణావేణ్ణా నదీతీర పట్సహస్ర విషయాధీశ్వర'
(7) కృష్ణవేణ్ణ — యద్వారవధ్వః పయసాం విహారే,
కుర్వంతి పేనస్తన కుంకుమేన।
ఖువస్ససింధూర పరాగ యోగాం
సీమంత రేఖామిత కృష్ణవేణ్ణాం.
(7) కృష్ణవేణి — శ్రీ నరసింహ దేవునికి శ్రీకృష్ణవేణీ నదీ తీరమందు.

**కృష్ణకు ఆంధ్ర కర్ణాట, ద్రవిడ భాషలలో దేశ్య నామములు.**

కృష్ణకు ఆంధ్రభాషలో "పేరేఱు" అనియు, కన్నడ భాషలో "పేర్దొఱె" అనియు ద్రవిడ భాషలో "పేరాఱు" అనియు శాసనములవల్ల విదితము. పేరు + ఏఱు; పేరు + తొఱె: పేరు + ఆఱు అను మూడిటికి ఒకటే అర్థము. పేరనగా పెద్ద యని అర్థము. ఆఱు, తొఱె, ఏఱు సమానార్థము.లు ఏఱనగా నది ప్రవాహము.

(9) పేరేఱు — "స్వస్తిశ్రీ సర్వలోకాశ్రయ శ్రీవిష్ణువర్ధన మహారాజుల....శకవర్షంబులు 983 శేంటి ప్లవ సంవత్సరంబున పేరేటి దక్షిణంబున యాఱువేల వెలనంటి ........ గ్రహారంబు".

(10) పెర్దొఱె

(11) పేరాఱు — సుందర పాండ్యుని శాసనము.

(1) E I. Vol X. (క్రీ. పూ. 152)
(2) E. I. Vol XIII. P. 78.
(3) E. I. Vol IX. P. 236 (క్రీ. శ. 959)
(4) E. I. Vol VI. P. 208 (క్రీ. శ. 730)
(5) S. I. I. Vol IV No. 1127 (శా. శ. 1053)
(6) S. I. I. Vol IV. No. 1128. (శా. శ. 1081)
(7) S. I. I. Vol IV No. 809 (శా. శ. 1180)
(8) S. I. I. Vol. X. No. 363. (శా. శ. 1181)
(9) S. I. I. Vol. X. No 177. (శా. శ. 983)
(10) Historical Inscriptions of Southern India p. 69.
(11) M. E. 12 1913-4 Para 18

**కెంబావి**

ఆముక్తమాల్యద పంచమాశ్వాసాంత పద్యములో శ్రీకృష్ణదేవరాయలు కెంబావి యను స్థలమున మహామ్మదీయులను మర్దించెనని వర్ణింపబడినది.

మ. ఇది యంద్రోక్తి యదార్థనామ యవనా
స్పృక్పూర్ణ కెంబావి వా
రిద పద్ధత్యవరోధివ్రవలయ
శ్రేణీ విఘాతక్రియా
స్పద సేనాగ్రద కృష్ణరాయ మహిభృ
త్సంజ్ఞాస్మదాముక్త మా
ల్యద నాశ్వాసము పంచమంబమరు
హృద్యంబైన పద్యంబులన్.

ఇది నేటి మైసూరు రాష్ట్రములో రాయచూరు మండలములో నున్నది. E. I. Vol. XII. P. 291-92

**కొండనతవాడి**

దీనికే కొన్నాతవాడి యనియు బేరు. ఈ కొండ నతవాడి సీమ నేటి గుంటూరు మండలములోని సత్తెనపల్లి తాలూకా పశ్చిమ ప్రాంతమని ఈ దిగువ నుదాహరించిన శాసన గ్రామపట్టిక వలన తెలిసికొనవచ్చును. ఇది కోట రాజుల పాలనము నందుండెను.

| శాసనములోని గ్రామము | నేటి గ్రామనామము | తాలూకా |
|---|---|---|
| గింజపాడు | గింజపల్లి | సత్తెనపల్లి |
| చల్లగర | చల్లగరిగె | ,, |
| తాడివాడ | తాడివాయి | ,, |
| కుంటమద్ది | కుంటమద్ది | ,, |
| ఉప్పలపాడు | ఉప్పలపాడు | ,, |
| అమ్మలపూడి | ఉప్పలపాడు | ,, |
| కోగల్లు | కోగంటి పాలెము | ,, |
| మోగల్లు | మునుగోడు (?) | ,, |

E. I. Vol. VI. No. 15 (శా. శ. 1104)
S. I. I. Vol. X. No. 199 (శా. శ. 1104)
S. I. I. Vol. VI. No. 229
S. I. I. Vol. VI. No. 236 (శా. శ. 1104)
E. I. Vol. III. P. 102

**కొండపడుమటి దేశము**

చోడ చక్రవర్తులకు సామంతులైన కొండపడుమటి మండలేశ్వరుల శాసనములు గుంటూరు మండలమున గలవు. ఈ కొండపడుమటి దేశము నందు డెబ్బది మూడు గ్రామములు గలవని శాసనములందు దెలుపబడినది.

(1) స్వస్తి సమధిగత పంచమహాశబ్ద మహామండలేశ్వర వీరమహేశ్వర కుళోత్తుంగ చోళదేవ దివ్య శ్రీ పాదరాధక.................. - ........ వివేక పద్మాసనగిరి పశ్చిమ శాసన నామాది సమస్త ప్రశస్తి సహితుండైన శ్రీమన్మహా మండలేశ్వర బుద్ధ నరేంద్రుడు.

(2) గిరి పశ్చిమ శాసన.................. శ్రీ మన్మహా మండలేశ్వర కొండ పడ్మటి బుద్ధరాజు.

(3) ఆశీచ్చతురాబ్ధి జననావతంసః శ్రీ బుద్ధవర్మాకృత పుణ్య కర్మా సంగ్రామ రంగే నిజనాథ వర్మా సంవాదితాశేష; కవీంద్ర శర్మాః। త్రిసప్తతి గ్రామవతీం మహీం మహీపతిః ప్రసాదోపనతాం నతాహితః। గిరి ప్రతీచీన్ని జలాంఛ నైస్య వాలయామాస విలాస వానః॥

ఈ కొండపడుమటి దేశమునకే సంస్కృత రూపములు గిరి పశ్చిమ దేశము, గిరి ప్రతీచీ దేశము, కుత్కిల ప్రత్యగుర్వి యనునవి. కొండవీటి కొండకు పశ్చిమ దిశలోనున్న దేశమునకే కొండపడుమటి దేశమని పేరు. కొండపడుమటి మండలాంతర్గత గ్రామపట్టిక యీ దిగువ సూచింపబడినది.

| శాసనస్థ గ్రామము | నేటి గ్రామనామము | తాలూకా |
|---|---|---|
| (4) సంక్రాంతిపాడు | సంకురాత్రిపాడు | నరసారావుపేట |
| జీడివ్రూండి | జూపూడి | సత్తెనపల్లి |
| గేతెపల్లి | కేతవరము | ,, |
| దువుపాడు | దొండపాడు | నరసారావుపేట |
| ఎఱ్ఱగుంటల | ఎఱ్ఱగుట్లపాడు | సత్తెనపల్లి |
| (5) సత్తెనపల్లి | సత్తెనపల్లి | ,, |
| చింతపల్లి | చింతపల్లి | ,, |
| మేడికొండూరు | మేడికొండూరు | ,, |
| కొంకిపఱ్ఱు | కోకివఱ్ఱు | ,, |

| | | |
|---|---|---|
| (6) కావూరు | కావూరు | నరసారావుపేట |
| (7) పాముఃలపాడు | పాముఃలపాడు | గుంటూరు |
| (8) సిరిపురము | శిరిపురము | సత్తెనపల్లి |
| (9) నాదెండ్ల | నాదెండ్ల | నరసారావుపేట |
| (10) చెంచెలూరు | సాతులూరు | ,, |

పై పట్టిక ననుసరించి కొండపడుమటి దేశము సత్తెనపల్లి తాలూకా లోని,తూర్పు భాగము, నరసారావుపేట, గుంటూరు తాలూకాలోని కొంత భాగముసై యుండవలెను.

(1) S. I. I. Vol VI No 677;

(2) S I. I. Vol VI. No. 678; (శా. శ. 1070)

(3) S. I. I. Vol VI. No. 683 (శా. శ. 1065)

(4) S. I. I. Vol VI. No. 229.

(5) E. I. Vol VI. No. 15. (శా. శ. 1104)

(6) S. I. I. Vol IV. No. 918

(7) S. I. I Vol X No. 98.

(8) S.I.I. Vol X. No. 177 (సిరిపురము పంద్రెండు పూండ్లు శా. శ. 1093.)

(9) E. I. Vol VI. No. 26. (కొండపడుమటి బుద్ధరాజు చందవోలు శాసనము-శా. శ. 1093. ; (నాదెండ్ల శాసనముల పట్టిక);

(10) S. I. I Vol X. P. 97. (శా. శ. 1057)

**కొండపల్లి (మూనూరునాడు రాజ్యము దండపాట)**

కృష్ణా మండలములోని బెజవాడకు తొమ్మిది మైళ్ల దూరముననున్న యొక గిరిదుర్గము. త్రిపురాంతకములోని పశ్చిమ చాళుక్య చక్రవర్తి త్రిభువన మల్లదేవుని కన్నడ శాసనములో నతని సామంత నాయకుడగు గోవిందరస కొండపల్లి మూనూరును బాలించుచుండెనని వ్రాయబడి యున్నది. (1)

పశ్చిమ చాళుక్యుల పరిపాలనానంతరమున నియ్యది కాకతీయుల, రెడ్ల, గజపతుల; విజయనగరాధీశుల వశమయ్యెను. కొండపల్లినాడు, రాజ్యము, దండపాట యని వివిధకాలములలో నీ సీమ వర్తిల్లెను.

మొదటి కాకతి రుద్రదేవుని త్రిపురాంతకము తెలుగు శాసనములో నా మహారాజు త్రిపురాంతక దేవర అంగరంగ భోగాలకు కొండపల్లినాంటి లోని కృష్ణవేణి తీరమందు రేవూరను గ్రామము ధారా పూర్వకముగ దానమిచ్చెనని కలదు. (2)

కొండవీటి రెడ్ల ప్రభుత్వ కాలములో పెదకోమటి వేమారెడ్డి తన సోదరుడగు మాచారెడ్డికి కొండపల్లి స్థలమును పరిపాలించుటకు నేర్పాటు గావించెనని బలిజేపల్లి శాసనములో గలదు. (3)

తస్యానుజో వేమనృపస్య మాచక్షితీశ్వరో లబ్ధ మహీ విభాగః।
శ్రీకొండపల్లీం నిజరాజధానీం కృతసుఖీదివ్యతి ధర్మధుర్యం॥

ఈ గిరిదుర్గమును సీమను గజపతులు విజయనగర రాజులు, బహమనీ సుల్తానులు కైవశము గావించుకొనుటకు జేసిన యత్నములు శాసనబద్ధములు. సారస్వత నిబంధనములు.

కృష్ణా మండలములోని పెదకళ్లేపల్లి శాసనములో నీ కొండపల్లి స్థలము కొండపల్లి దండపాట యని చెప్పబడినది. (4)

కొండపల్లిలోని సుల్తాన్ కులీకుతుబుషా శాసనములో (శా.శ. 1452) నతడు కొండపల్లి రాజ్యము చేకొననవధరించి నట్లు తెలుపబడినది.

ఆంధ్ర సారస్వతములోని యీ క్రింది యుదాహరణములు ఈ గిరి దుర్గము యొక్క ప్రాధాన్యమును వెల్లడించుచున్నది.

మ॥ ఇది పాత్ర ప్రవరేశ్వర ప్రభృతి బంహిష్ఠోత్కళా నీక గు
ప్త దివిస్పృక్ప్రటు యంత్ర కొండపల్లి హృద్యాబ్జవాసి కద్రూజ దీ।
ప్యదు దారోద్యమ కృష్ణరాయనృప సంజ్ఞాస్మత్కృదా ముక్తమా
ల్యద నాశ్వాసము హృద్యపద్యము తృతీయంబై మహిం బొల్పగున్.

ఆముక్తమాల్యద-శ్రీకృష్ణదేవరాయలు.

సీ. ప్రభవించెనే వీటి పర్వతాగ్రంబున
నరిగిరీశ్వరుండు శ్రీనాయకుండు
వసియించె నేవీటి వర్ణితసాలాంత
రమున మూలస్థాన రాజమౌళి

యుదయించె నేవీటి యుత్తరాశాతట
భూషణీకృతనింబ పుట్టలమ్మ
వరియించె నేవీటి వలదిశాకోణంబు
నందు గుబ్బటల మైలారమూర్తి.

తే. వినుతిగాంచిరి యేవీట విప్రరాజు
వైశ్యశూద్రాది బహువిధవర్ణ సమితి
యట్టి పురరత్న మొప్పు భవ్యాంబుజాత
మండితామర తరువల్లి కొండపల్లి.

(ఎఱ్ఱయ-సకలనీతికథావిధానము 1-12)

సీ. కటకేశ్వరుని దోలి కైవసంబుగ జేసె
కొండంత జయముతో కొండపల్లి
.... .... .... .... .... ...

గీ. అష్టదిగ్రాజులును తన కరియుగోరు
వెట్టుకాపుల జేసి మువ్వేటుగొనియె
ఇతర ధరణీతలాధీశు లెవ్వరీడు
పృథివి కుతుపనవమలక చక్రేశ్వరునకు.

శా॥ శివిన్ హైదరుఖాను దుర్దవిడి వాడ్డీలన్ విఖాళించుచో
నావేళన్ పెదకొండపల్లి కడజన్య క్షోణి దీ
షావైయార్తులు వాహినీపతి హరిశ్చంద్రుండు మార్కొన్నచో
జీవగ్రాహము గాగ బట్టుకొనె నక్షీణ ప్రభావోన్నతిన్.

— తపతీ సంవరణోపాఖ్యానము.

(1) S. I. I. Vol IX Part I. No. 213 (A.E. 1126)
(2) S. I. I. Vol XI No. 241 (శ.స. 1107)
(3) శృంగార శ్రీనాథము అనుబంధము -
(4) S. II I. Vol VI. No. 80.
(5) S. I. I. Vol Xo. 745 (శ.స. 1452)

## కొండవీటి దండపాట

ప్రతాపరుద్ర గజపతి కాలమునాటి బాపట్ల తాలూకాలోని కొమ్మూరు గ్రామము నందలి శాసనములో శ్రీశైలములోని మల్లికార్జున దేవరకు బాహుబలేంద్ర మహాపాత్రుడు దుర్గాప్రసాద కొండవీటి దండపాట కొమ్మూరు, వొరుగాండి, రావిపాడు, గోంగులమూండి యను నాల్గు గ్రామములు స్వామి యమృత పళ్లకు దానము చేసెనని చెప్పబడినది. (1)

"శ్రీప్రతాప రుద్రదేవ గజపతి మహారాయులుం గారు దుర్గాప్రసాద కొండవీడు దండపాటలోను, అమృతపళ్లకుం శెల్లివచ్చి......కొమ్మూరు, వొరుగాండి, రావిపాడు, గోంగులమూడి యీ నాలుగు గ్రామాలలోను"

పై గ్రామములు కొమ్మూరు, వరగాని, రావిపాడు, గొనసపూడి యను నేటి నామములతో బాపట్ల తాలూ కాలో గలవు. కొండవీటి సీమకే కొండవీటి దండపాట యని నామాంతరము. గజపతుల కాలములో విజయనగర సామ్రాజ్యములో కృష్ణ కిరువంకల వారు సాధించిన విజయనగర సామ్రాజ్య సీమలకు దండపాటలని పేరు పెట్టిరి.

(1) S. I. I. Vol X. No. 738. (Undated)

## కొండవీడు (రాజ్యము, విషయము, సీమ)

కొండవీ డాంధ్రదేశములో వాసిగాంచిన గిరి దుర్గములలో నొక్కటి. గుంటూరు మండలములో నరసారావుపేట తాలూకాలో నరసారావుపేటకు తూర్పున పదమూడు మైళ్ళ దూరమున నున్నది. కొండపై రెండు కోటలును, క్రిందను ఒక కోటయుగలవు.

ప్రోలయ వేమారెడ్డి కుమారుడు అనపోతారెడ్డి తన రాజధానిని అద్దంకినుండి కొండవీటి దుర్గమునకు మార్చి దానిని బలవత్తరముగ జేసెను.

తతోన్న పోత నృపతిః । పటుః పాలన కర్మణి
ఆవాల యత్తస్య పుత్రః । తదంతేంధ్ర వసుంధరామ్
కొండవీడుం రాజధానీం సచిత్రామ కల్పయత్
దృష్ట్వా ద్వష్టాపి వైచిత్రమ భూద్యస్యోస్యః స్వవిస్మయః ॥

ఉచ్చైశ్శ్రవతుల్యా బలైస్తురంగై కల్పద్రుమా శ్చైశ్చ వదాన్య వరై ।
రంభోపమానై రమిణీ జనైశ్చ సాభాతి భూమావమరావ తీవ ॥
సోన్నపోత నృపస్స్యేవ నిర్మితాయాం పురిస్థితః
కుర్వన్ హేమాద్రి దానాని చిరంభువమ పాలయత్ ।

మద్యమా పురశాసనము రెడ్డిసంచిక పుట 41.

ఈ కొండవీడెంత బలిష్ఠమైన దుర్గమో ఈ క్రింది చాటుపద్య వర్ణనము వలన విశదమగును. ఇది శ్రీనాథుని చాటువని చెప్పుదురు.

సీ. పరరాజ గిరిదుర్గ వలవైభవ శ్రీల
గొనకొని చెడనాడు కొండవీడు
పరిపంధి రాజన్య బలముల బంధించి
కొమరు మించిన జోడు కొండవీడు
ముగురు రాజులకును మోహంబు పుట్టించు
గుఱుతైన యతిత్రాడు కొండవీడు
చటుల విక్రమకళా సాహసంబొనరించు
కుటిలాత్ములకు గాడు కొండవీడు

గీ. జవన ఘోటక సామంత సరసవీర
భట నటానేక హాటక ప్రకటగంధ
సింధురారవ మోహనశ్రీల దనరు
కూర్మి నమరావతికి జోడు కొండవీడు.

రాజధానీ ప్రశంసాత్మకమగు నొక ననుస్య చాటుపద్యమణిమంజరిలో గ్రోడీకరింప బడినది.

ఉ. ఘోటక ఖోట హాట కురు కొంకణ సింధు మరాట లాటక
ర్ణాట కళింగ వంగ ద్రవిళాంగ విదేహ కరూశ దుర్గముల్
సాటియె యన్న వేమ విపులా విభుఁడేలిన దుర్గమైన యా
ఘోటక హాటక ప్రకట కుంజర ఘాటికి కొండవీటికిన్.

కృష్ణరాయల కొండవీటి శాసనములో 'అంగరంగ భోగాలకున్ను' అమృత పండ్లకున్ను, పూర్వాన సాగివచ్చిన వేంబల్లె గ్రామము సాగించి. మైదవోలు గ్రామము సమర్పించి కొండవీటి సీమలోను సుంఖము' అని కొండవీటి సీమ

లోని వేంబల్లె, మైదవోలు గ్రామములు పేర్కొన బడినవి. ఈ రెండు గ్రామములు గుంటూరు తాలూకాలోని వేమల్లిపాడు, నరసారావు పేట తాలూకాలోని మైదవోలునై యున్నవి. (1)

గుంటూరు మండలములోని బాపట్ల తాలూకా బాపట్లలో రాయల నాటి మరియొక శాసనములో బాపట్ల కొండవీటి విషయములో గలదని చెప్పబడినది. "శ్రీకృష్ణ వేణ్యాంభసిః.... సంప్రతి కొండవీడు విషయే బాపట్ల సంజ్ఞేపురే" (2)

పదునాఱవ శతాబ్దమునాటి నెల్లూరు మండలములోని ఒంగోలు తాలూకా యందలి ఒంగోలు శాసనములో కొండవీటి రాజ్యము, సీమకు చెల్లివచ్చె గ్రామము లుదాహరింపబడినవి. (3)

(1) కొండవీటి రాజ్యమున కుచెల్లివచ్చె అద్దంకి సీమలోని బొల్లావల్లి

(2) కొండవీటి సీమకు చెల్లివచ్చె అద్దంకి సీమలోని మల్లవరం అనే గ్రామము.

(3) కొండవీటి రాజ్యంలోని అద్దంకి అమ్మనంబ్రోలి సీములోని చదలు వాడ శ్రీ రఘునాయకులకు.

ఒంగోలు శాసనములో పేర్కొనబడిన అద్దంకి, అమ్మనంబ్రోలు, చదలు వాడ, బొల్లావల్లి, మల్లవరం, గ్రామములు ఒంగోలు తాలూకాలోనే గలవు.

పై శాసనము వివరముల బట్టి విజయనగర సామ్రాజ్యములో కొండ వీడు రాజ్యము, కృష్ణానదికి దక్షిణ దిక్కున, కర్నూలు జిల్లాకు పూర్వమున గుంటూరు మండలము, దక్షిణమున నెల్లూరుమండలము(ఉదయగిరి రాజ్యము పూర్వ సముద్రమధ్య ప్రాంతమైయుండెను.)

(1) కృష్ణరాయల కొండవీడు శాసనము.
E. I. Vol VI No, 22 No.22. (శా.శ. 1442)

(2) S. I. I. Vol No. 146.

(3) (i) N. I. Ongole (15) (శా.శ. 1467)
(ii) Ongole (21) (శా.శ. 1467)
(iii) Ongole (29) (శా.శ. 1488)

ఉచ్చైశ్శ్రవతుల్యా బలైస్తురంగైః కల్పద్రుమా బైశ్చ వదాన్య వర్యైః ।
రంభోపమానైః రమిణీ జనైశ్చ సాభాతి భూమావమరావతీవ ॥
సోన్నపోత నృపస్స్యైవ నిర్మితాయాం పురిస్థితః
కుర్వన్ హేమాద్రి దానాని చిరంభువమ పాలయత్ ।

మద్యమా పురశాసనము రెడ్డిసంచిక పుట 41.

ఈ కొండవీడెంత బలిష్ఠమైన దుర్గమో ఈ క్రింది చాటుపద్య వర్ణనము వలన విశదమగును. ఇది శ్రీనాథుని చాటువని చెప్పుదురు.

సీ. పరరాజ గిరిదుర్గ వలవైభవ శ్రీల
గొనకొని చెడనాడు కొండవీడు
పరిపంథి రాజన్య బలముల బంధించి
కొమరు మించిన జోడు కొండవీడు
ముగురు రాజులకును మోహంబు పుట్టించు
గుఱుతైన యరిత్రాడు కొండవీడు
చటుల విక్రమకళా సాహసంబొనరించు
కుటిలాత్ములకు గాడు కొండవీడు

గీ. జవన ఘోటక సామంత సరసవీర
భట నటానేక హాటక ప్రకటగంధ
సింధురారవ మోహనశ్రీల దనరు
కూర్మి నమరావతికి జోడు కొండవీడు.

రాజధానీ ప్రశంసాత్మకమగు నొక ననుస్య చాటుపద్యమణిమంజరిలో గ్రోడీకరింప బడినది.

ఉ. ఘోటక ఖోట హాట కురు కొంకణ సింధు మరాట లాటక
ర్ణాట కళింగ వంగ ద్రవిళాంగ విదేహ కరూశ దుర్గముల్
సాటియె యన్నవేమ విపులా విభుఁడేలిన దుర్గమైన యా
ఘోటక హాటక ప్రకట కుంజర ఘాటికి కొండవీటికిన్.

కృష్ణరాయల కొండవీటి శాసనములో 'అంగరంగ భోగాలకున్ను' అమృత పండ్లకున్ను, పూర్వాన సాగివచ్చిన వేంబల్లె గ్రామము సాగించి. మైదవోలు గ్రామము సమర్పించి కొండవీటి సీమలోను సుంఖము' అని కొండవీటి సీమ

లోని వేంబల్లె, మైదవోలు గ్రామములు పేర్కొన బడినవి. ఈ రెండు గ్రామములు గుంటూరు తాలూకాలోని వేమల్లిపాడు, నరసారావుపేట తాలూకాలోని మైదవోలునై యున్నవి. (1)

గుంటూరు మండలములోని బాపట్ల తాలూకా బాపట్లలో రాయల నాటి మరియొక శాసనములో బాపట్ల కొండవీటి విషయములో గలదని చెప్పబడినది. "శ్రీకృష్ణ వేణ్యాంభసిః.... సంప్రతి కొండవీడు విషయే బాపట్ల సంజ్ఞేపురే" (2)

పదునారవ శతాబ్దమునాటి నెల్లూరు మండలములోని ఒంగోలు తాలూకా యందలి ఒంగోలు శాసనములో కొండవీటి రాజ్యము, సీమకు చెల్లివచ్చె గ్రామము లుదాహరింపబడినవి. (3)

(1) కొండవీటి రాజ్యమున కుచెల్లివచ్చె అద్దంకి సీమలోని బొల్లాపల్లి

(2) కొండవీటి సీమకు చెల్లివచ్చె అద్దంకి సీమలోని మల్లవరం అనే గ్రామము.

(3) కొండవీటి రాజ్యంలోని అద్దంకి అమ్మనంబ్రోలి సీమలోని చదలు వాడ శ్రీ రఘునాయకులకు.

ఒంగోలు శాసనములో పేర్కొనబడిన అద్దంకి, అమ్మనంబ్రోలు, చదలు వాడ, బొల్లాపల్లి, మల్లవరం, గ్రామములు ఒంగోలు తాలూకాలోనే గలవు.

పై శాసనము వివరముల బట్టి విజయనగర సామ్రాజ్యములో కొండ వీడు రాజ్యము, కృష్ణానదికి దక్షిణ దిక్కున, కర్నూలు జిల్లాకు పూర్వమున గుంటూరు మండలము, దక్షిణమున నెల్లూరుమండలము(ఉదయగిరి రాజ్యము పూర్వ సముద్రమధ్య ప్రాంతమైయుండెను.)

(1) కృష్ణరాయల కొండవీడు శాసనము.
E. I. Vol VI No, 22 No.22. (శా.శ. 1442)

(2) S. I. I. Vol No. 146.

(3) (i) N. I. Ongole (15) (శా.శ. 1467)
(ii) Ongole (21) (శా.శ 1467)
(iii) Ongole (29) (శా.శ. 1488)

## కొరవి దేశము

కొరవి గ్రామము తెలంగాణములోని వరంగల్లు జిల్లా యందలి మాను కొండకు సమీపమున నున్నది. పూర్వ చాళుక్య ప్రభువైన విక్రమాదిత్యుని కొమారుడగు ప్రథమ చాళుక్య భీమవిష్ణువర్ధనుని సామంతుడైన కుసుమాయుధుని కొరవి శాసనము ననుసరించి, యీ కొరవి దేశము పూర్వ చాళుక్య ప్రభువుల వశమునందుండెనని తెలియుచున్నది. తర్వాత నీ ప్రాంతము కాకతీయుల హస్తగతమయ్యెను. తెలంగాణములోని గూడూరు శాసనము ప్రకారము విరియాల వంశజుడగు ఎఱ్ఱభూపతి కాకతి బేతన్నృపాలుని శత్రువును నిర్జించి, యీ బేతవసుధాధిపుని కొఱవి దేశమునందు ప్రతిష్ఠిపెననియు తెలియుచున్నది. కొఱవి దేశము నతవాటికి పశ్చిమమున నున్నది. ఈ దేశమునకు పడుమటి దిక్కున అనుమకొండ విషయము.

తెలంగాణా శాసనములు. ప్రథమ సంపుటము ఇతర శాసనములు. కొఱవి శాసనము.

H. A. S. No. 19. Warangal. 8. కొఱవి శాసనము.

గూడూరు శాసనము. తెలంగాణా శాసనములు-ప్రథమ సంపుటము.

కాకతీయ శాసనములు - No. 55.

H. A. S. No. 13. శాసన సంఖ్య - 23.

## కొలను (వీడు)

ఇయ్యదియే రెండవ పులకేశి జయించిన "కూనాలము".

సన్నద్ధ వారణ ఘటాస్థగితాంతరాలం
నానాయుధక్షత నరక్షత జాంగరాగం
ఆసేజ్జలం యదవమర్దితమభ్రగర్భం
కౌనాలమరోదిత సాంధ్యరాగం. (1)

దండిమహాకవి తన దశకుమార చరిత్రములో నాంధ్రదేశమును వర్ణించుచు నందొక మహాసరస్సు గలదనియు నది యాంధ్రనగరికి సమీపమున నున్నదనియే వ్రాసియున్నాడు.

ప్రాయాసిపంచ దినైః కైశ్చి దంధ్రనగరం తస్య
నాత్యాసన్నే సలిలరాశి సదృశస్య కలహంస
గణ దళిత నళినదళ సంహతిగళిత
కింజల్క శకల శారస్య సారసశ్రేణి శేఖరస్య
సరస్తీర కాననే కృత నికేతనస్థితః. (2)

ఇదియే పశ్చిమ గోదావరి మండలములోని కొల్లేరు సరస్సు. ఈవీడొక జలదుర్గము. దీనికే సరసీపురి యనియు పద్మినీపుర మనియు పేర్లు (చూడు- కమలాకరపురము.)

వెలనాటి రాజేంద్రచోడని సిరిపురము శాసనములో నతడు కొలను జయించి దాని మండలీకుడైన భీముని జంపెనని చెప్పబడ్డది. (3)

చం. ఇలవెలనాటి గొంక వసుధేశు తనూభవుడైన చోడ భూ
తల పదిచోడ పట్టము ముదంబున గట్టి భుజాబలంబునన్
గొలను జయించి యందు రిపుకుంజరు భీముని జంపి యాంధ్ర భూ
తలము పదారువేలు సతత స్థితినేలె సురేంద్ర లీలలన్.

పృథ్వీశ్వరుని పిఠాపురశాసనములో నియ్యది యిట్లు వివర్ణింపబడినది (4)

శ్లో. యేనాంభోరాశి భీమ భ్రమిత జలమిలద్గ్రాహపాఠీన సంఘ
ప్రేంఖత్కల్లోల మాలాకలుషమనిమిషైః ఖాతమాదౌ సరస్తత్
నిశ్శేషం శోషయిత్వావధి జలధి జలం కుంభయో
నిర్వ్యదాద్యో భీమో భీతిం వితన్వన్
ద్రుతమివ జగతాం రావణో రాఘవేణ. (శ్లో. 45.)

శ్రీనాథుడు భీమేశ్వర పురాణములో కొలని ప్రతాపరుద్రుడు ఆరేటి గ్రామమును బెండపూడి అన్నమంత్రికి అగ్రహారముగ దానమిచ్చెనని చెప్పియున్నాడు.

చం. కొలని ప్రతాపరుద్రనృప కుంజరుచేత నరేడుసారణీ
సలిల వివర్ధమాన బహుసస్య సమాకులనగ్రహార మై
వెలయ విభాకరగ్రహణ వేళదగంగ బరిగ్రహించి బం
ధుల భరియించె నన్నవిభుతో సరియెట్లు ప్రధానులెవ్వరున్.
(ఆ. 1. ప. 49)

పై పద్యములో చెప్పిన ఆరేడు గ్రామము పశ్చిమ గోదావరి మండలములోని ఆరేడు గ్రామమే. వీరి శాసనములు భీమవరము, తణుకు తాలూకాలలో గలవు. కొలను మండలము పశ్చిమ గోదావరి మండలములోని ఏలూరు, భీమవరము, తణుకు తాలూకా ప్రాంతము. (5)

ఈ కొలనువీడు వేంగి మండలములోని యంతర్భాగము. (6)

(1) రెండవ పులకేశి అయిహోలు శాసనము.

E. I. Vol. VI P-1-12 (క్రీ. శ. 634-635)

(2) దశకుమార చరిత్ర. (మంత్రగుప్త చరిత్రము)

(3) S. I. I. Vol X. No. 177. (శా. శ. 1093)

(4) E. I. Vol IV. No. 4. (శా. శ. 1108)

(5) S. I. I. Vol X. No. 83. (శా. శ. 1047)

S. I. I. Vol X. No. 126. (శా. శ. 1073)

S. I. I. Vol X No. 206. (శా. శ. 1117)

S. I. I. Vol X. No. 262. (శా. శ. 1140)

S. I. I. Vol X No 301. (శా. శ. 1165)

A. R. S. I. E. 1935-36. Para 82 (Page 71).

## కొలనుపాక

కొలనుపాక ఆంధ్రప్రదేశములోని నల్గొండ జిల్లాలోని గ్రామము. ఇది పూర్వమొకప్పుడు జైన క్షేత్రమై తరువాత సుప్రసిద్ధ శైవ క్షేత్రముయ్యెను.

తమిళ శాసనములలో నియ్యది 'కులపాక, కొల్లిపాకె, కొల్లిపాక్కై' అనియు పేర్కొనబడినది. రాజేంద్రచోడు డీ దేశముపై దండెత్తి యద్దానిని గెల్చెనని యతని తమిళ శాసనములందు బెక్కుంటు వర్ణింపబడినది.

ఈ కొలనుపాక కళ్యాణి చాళుక్యుల వశమై వారి యధికారము క్రింద సామంతదండనాథులు కొలనుపాక రాజధానిగ కొలనుపాక యేల్పాసిరము (ఏడువేలు) అనగా కొలనుపాక సప్తసహస్ర పరిమితిగల దేశమును పాలించుచుండిరి.

తర్వాత కొలనుపాక కాకతీయుల వశమై వారి పాలనమునకు లోబడి యుండెను. తెలంగాణా శాసనముల సంపుటములో ప్రచురింపబడిన శాసనముల వల్ల విదితమగుచున్నది.

కొలనుపాక కన్నడ శాసనములో పశ్చిమ చాళుక్య ప్రభువగు త్రిభువన మల్ల విక్రమాదిత్యుని కుమారుడగు కుమార సోమేశ్వరుడు తన సామంతుడగు కొలనుపాక ఏడువేలును కొలనుపాక రాజధానిగ పాలించు స్వామి దండనాయకుని విజ్ఞాపనమున పానుపుర గ్రామమును జైనదేవతయగు అంబికాదేవి యంగరంగ భోగార్థము సమర్పించెను.

"శ్రీమన్మహామణ్డలేశ్వరం చాళుక్య గంగ పెర్మాడి కుమార సోమేశ్వర దేవర్మహా ప్రధానం మనె పెర్గడె కొల్లిపాకె యెళ్చాసిరద దండనాయకం స్వామియయ్యగ బిన్న పదిం నిజరాజధాని కొల్లిపాకెయ........... అంబికాదేవి యంగ భోగ రంగ భోగం గళిగె పాళుల బళియ పానుపులం యెంబూరం సర్వనమస్యం ....ధారాపూర్వకం మాడి కొట్టన్."

పై కుమార సోమేశ్వరుని కాలమునాటిదే యగు మరియొక శాసనములో నతడు కొల్లిపాకనాడు మొదలైన నాడుల నేలుచు, తన మంత్రుల విన్నపము వలన స్వయంభూదేవరకు జైనబసదికి కొన్ని గ్రామములు దానమిచ్చిన విషయము తెలుపబడినది. ఈ శాసనములో "కొల్లిపాక నాడనియు" నియ్యది కొల్లిపాక యేళ్చాసిరమనియు జెప్పబడినది.

కాకతీయ రుద్రాంబ కాలమునాటి కొలనుపాకలోని యొక సంస్కృత శాసనములో కాకతి సామంతుడగు పోతినాయకుడు కొలిపాక నేలుచుండెనని తెలుపబడినది.

S. I. I. Vol. I Pages 96; 99.
S. I. I. Vol. III Page 390.

తెలంగాణా శాసనములు సంపుటము - 1. పుట 80. (కాకతీయ శాసనములు.)

తెలంగాణా శాసనములు సంపుటము-పుటలు 138-141. (చాళుక్య కన్నడ శాసనము.)

తెలంగాణా శాసన సంపుటము-2. పుటలు 54-55 (కళ్యాణి చాళుక్యుల కన్నడ శాసనములు.)

**కోటభూమి**

కోటభూమి చారిత్రక భూగోళము నరసరావుపేట తాలూకా అప్పాపురములోని యొక శాసనములో సంపూర్ణముగా వివరింపబడినది. (1)

"స్వస్తి సమస్త ప్రశస్తి సహితంబై అనల్పంబైన కల్పారంభ కాలమున మహావరాహదంష్ట్రా శిఖరంబున నుద్ధృతంబై పంచాశత్కోటి యోజన విస్తీర్ణంబైన భూమండలంబునందు జంబూద్వీపంబులో భారతవర్షంబున భారత ఖండంబునందు మేరువు పర్యంతంబును దక్షిణ దిగ్భాగంబున శ్రీశైలవాయ సముద్ర పార్శ్వంబున వోంకార నదీ తీరంబునం త్రిలింగ్గ దేశాలంకారంబైన కోటభూమి."

కోట యనునది ధరణికోటను సూచించును. కోటభూమీశులకు రాజధాని. రెండవ కోట కేతరాజు అమరావతి శాసనమున నతని బిరుదావళి ఈ క్రింది విధమున నీయబడినది. (2)

"స్వస్తి చతుస్సముద్ర ముద్రిత నిఖిల వసుంధరా పరిపాలక, శ్రీమత్త్రిణయన పల్లవ ప్రసాదిత కృష్ణవేణ్ణానదీ దక్షిణ షట్సహస్రావనీ వల్లభ భయలోభ దుర్లభ చోళచాళుక్య సామంత మదానేకప మృగేంద్ర విభవామరేంద్ర శ్రీమదమరేశ్వరదేవ దివ్య శ్రీపాద పద్మారాధక పరబల సాధక శ్రీధాన్య కటక పురవరాధీశ్వర ప్రతాపలంకేశ్వర.... నన్ని మార్తాండ నామాది సమస్త ప్రశస్తి సహితం శ్రీమన్మహా మండలేశ్వరులు కోట కేత రాజులు"

పై బిరుదావళి కోటభూమి లేక కోట దేశము షట్సహస్రావని లేక ఆరువేలనాడని తెలియగలము. కోటభూమీశు లొసగిన దానశాసనములలో కొండపడుమటి, కొండనతవాడి, కంద్రవాడి సీమలలోని గ్రామములు పేర్కొనబడినవి. కావున కోటభూమిలో నా యా సీమలు గలిపి ఉన్నవని తెలిసికొనవచ్చును. (చూడుడు షట్సహస్రావని - కొండపడుమటి దేశము - నతవాడి - కంద్రవాడి సీమలు.)

పెదకోమటి భూపాలుని అమీనాబాదు శాసనములో (3)

సీ. శాకాబ్దములు సహస్రమును నిన్నూట తొం
బదియొనిమిది యగు భవ్యసంఖ్య

గలిగి యొప్పారెడు నల సంవత్సరంబున
మాఘమాసము పూర్ణిమాదినమున
విశ్వోత్తరుం డనవేమభూపాలుండు
దమ కులస్వామిని కమృత కిరణ
రేఖావతంసకు శ్రీమూలగూరమ్మ
కఖిల జగన్మాత కంగరంగ
గీ భోగసంసిద్ధ కని ధారవోసియిచ్చె
గ్రామములు మూడు శ్రీ కోటభూమియందు
పడిదరము మూలగూరంబన పలకలూరు
దానఖచరేంద్రు డాచంద్రతారకముగ.

అమీనాబాదు శాసనములో పేర్కొనబడిన మూడు గ్రామములు.

| | | |
|---|---|---|
| (1) | మూలంగూరు | అమీనాబాదుకు ప్రాచీన నామము, సత్తెనపల్లి తాలూకా. |
| (2) | పడిదరము | పణిదెము, సత్తెనపల్లి తాలూకా. |
| (3) | పలకలూరు | పెద్దపలకలూరు గుంటూరు తాలూకా |

సత్తెనపల్లి తాలూకాలోని పెద్దమక్కెనలోని రెండు శాసనములలో కోటభూమిలోని పెదమక్కెనయు చింతలపూడియు పేర్కొనబడినవి. పెద మక్కెన నేటి పెదమక్కెనయే. చింతలపూడి తెనాలి తాలూకాలోని చింతలపూడి గ్రామమే (4)

మడికి సింగన కవి వాశిష్ఠ రామాయణములో నీ కోటభూమి నిట్లు వర్ణించియున్నాడు.

సీ. అతఁడు తిక్కన సోమయాజుల పుత్త్రుఁడై
కొమరారు గుంటూరు కొమ్మవిభుని
పుత్త్రిఁ జిట్టాంబిక బుధలోక కల్పక
వల్లి వివాహమై వైభవమున
భూసారమగు కోటభూమిఁ గృష్ణానదీ
దక్షిణ తటమున ధన్యలీల
నలరారు రావెల యను నగ్రహారము తన
కేక భోగ్యంబుగా నేలుచుండి

(1) S. I. I. Vol X. No. 573. (శ. స. 1327)
(2) E. I. Vol VI. No. 15. (శ. స. 1104)
(3) శాసన పద్యమంజరి, సంఖ్య 68. (శ. స. 1298) ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక, సంపుటి 9. పు. 319-25.
(4) No. 331. (శ.స. 1339)
No. 332. (శ. స. 1423)
M. E. R. for 1931 - 33.

## కోన (దేశము, మండలము, రాష్ట్రము, స్థలము)

దీనికే నేడు కోనసీమయని వ్యవహారసిద్ధమగు నామము. తూర్పు గోదావరి మండలములోని అమలాపురము. రాజోలుతాలూకాలలో గౌతమీ వశిష్ఠనదుల మధ్యభాగము. శాసనములలో నియ్యది రెండేఱులనది విషయ మనియు సింధు యుగ్మాంతర దేశమనియు వర్ణింపబడినది.

మల్లి దేవుని పిఠాపుర శాసనములో నితని పూర్వుడును ముమ్మడి భీముని కుమారుడును నగు రాజపరేండు కోనమండలాధీశుడని చెప్పబడినవాడు. (1)

శ్రీమాన్ రాజపఱేండు క్ష్మానాథః కోనమండలాధీశః
ఉపయేమే యః కులజే లక్ష్మీతొండాంబికే దేవ్యౌ॥ శ్లో. 10.

పై రాజపరేని కుమారుడైన రాజేంద్రచోడుని ద్రాక్షారామ శాసనములో నొకదానియందు శ్రీరామేశ్వర దేవునకు, "ఏలవియ" "నడుపుంబూడి" "ముక్రోమల"యను గౌతమీతీర దేశములోని గ్రామముల దానమొసంగెనని తెలియుచున్నది. (2)

అనవేమారెడ్డి నడుపూరుశాసనములో "శాకాబ్దే రసరత్నభాను గణితే గ్రస్తేవిధౌ రాహుణాకార్తిక్యాం విజయేశ్వ రస్యపురతః శ్రీ గౌతమీ రోధసి విప్రేభ్యః పరమన్న వేమనృపతిః శ్రీ వేమసాన్యః స్వయః పుణ్యార్థ నడుపూరు సంజ్ఞక మదాద్గ్రామం సకోణస్థలే" అని కోణస్థలములోని గౌతమీ తీర మండలి నడుపూరు గ్రామము దానమీయబడినట్లు వ్రాయబడినది. (3)

కాటయవేముని తొత్తరమూడి శాసనములో కోనదేశే గ్రహారోయం ఖ్యాతి మల్ల వరాభిదం। తీరేచ వృద్ధ గౌతమ్యాః పుణ్యో ముక్తీశ్వరాంతికే॥ అని కోనదేశమండలి మల్లవరము, ముక్తేశ్వరమును పేర్కొనబడినవి. (4)

కోన భీమరాజు భార్యయైన పద్మావతి వ్రాయించిన ద్రాక్షారామ శాసనములో నామె భీమేశ్వరదేవునికి "ఖుండెనపల్లి" గ్రామము దానము చేసినట్లు గలదు. (5)

కోరుకొండ రాజ్యమునేలిన ముమ్మడి నాయకుడు ఉభయగోదావరీ మధ్యప్రాంతమునందలి కోన, పానార, కురవాట, చెంగర సీమల నేలుచుండె నని యతని శ్రీరంగము, కోరుకొండ శాసనములవల్ల తెలియనగును. (6)

| శాసన స్థలగ్రామము | నేటిగ్రామనామము | తాలూకా |
|---|---|---|
| పలవియ | పలివెల | రాజోలు |
| నడుపుంబూడి | నడుపూడి | అమలాపురము |
| ముక్రోమల | ముక్కామల | ,, |
| నడుపూరు | నడుపూడి | ,, |
| మల్లవరము | తొత్తరమూడి (సివారు) | ,, |
| ముక్తీశ్వరము | ముక్తీశ్వరము | ,, |
| ఖుండెనపల్లి | గున్నేపల్లి | ,, |
| తొత్తడిమూండి | తొత్తర మూడి | ,, |

(1) E.I. Vol IV.P.83. (శా. శ. 1117)
(2) S. I. I. Vol IV. No. 1150. (శా. శ. 1060)
(3) E. I.Vol III. P. 286 (శా. శ. 1296)
(4) E. I. Vol IV. P. 324 (శా. శ. 1333)
(5) S. I. I. Vol IV. No. 1286 (శా. శ. 1153)
(6) E. I. Vol XIV. P. 83. (శా. శ. 1368)
(7) S. I. I. Vol X. No. 554. (శా. శ. 1363)

## కోరుకొండ

కోరుకొండ రాజమహేంద్రవరమునకు పండ్రెండు మైళ్ళ దూరమున నున్న యొక వనదుర్గము. ఈ కోరుకొండ సీమకు ఉత్తరమున తూర్పు గోదావరి మండలములోని మన్నె ప్రాంతమును దక్షిణమున గుద్రవార విషయమును, తూర్పున ప్రోల్నాడును, పడుమట గౌతమియు సరిహద్దులు. మంచికొండరెడ్లు కోరుకొండ రాజధానిగ చెంగలి, కోన, పానార విషయముల బాలించిరి. (1)

కోరుకొండ రాజధానిగ పై సీమలను బాలించిన ముమ్మడినాయకుని పాలనమున నతని యాహ్వానమున పరాశర భట్టను వైష్ణవ శిఖామణి కోరుకొండకు వచ్చి, ముమ్మడి నాయకునకు నతని సోదరునకు వైష్ణవ మిచ్చెను. ముమ్మడికి రంగవర్ధనుడని నామకరణ మొనర్చెను. ఈ వైష్ణవగురుడు తన మరణ కాలమున ముమ్మడినాయకుని బిలిచి తాను చనిపోయిన పిమ్మట నృసింహస్వామి రూపముతో కోరుకొండపై వెలసెదనని చెప్పి మరణించెను. తరువాత లక్ష్మియను వేశ్యకు పరాశరభట్టు స్వప్నమున దర్శనమిచ్చి కోరుకొండపై వెలసితినని చెప్పెను. ఈ స్వప్న వృత్తాంతము ముమ్మడేంద్రునకామె చెప్పగా, దేవాలయ నిర్మాణమునకై యామెకు సహాయమొనర్చెను. లక్ష్మి దాసియే నృసింహమూర్తిని కోరుకొండపై ప్రతిష్ఠను గావించెను. కోరుకొండకీ కారణమున పరాశరశైలమని పేరు. ఈ దేవాలయము శా. స. 1275లో నిర్మింపబడినది. (2)

కోరుకొండకే వేదాద్రి యని పేరు. శ్రీనాథుడు కాశీఖండ కృతిలో దన కవితావైభవమునకు గారణముల నిట్లు చెప్పుకొన్నాడు.

సీ. ఆంధ్రక్షమామండలాఖండలుండైన
వేమభూపతి కృపావీక్షణంబు
ఘ[illegible]డెరాయాంక సద్గురు రాజశేఖరేశ్వ
రస్వామి పదసమారాధనంబు

కమలాద్రినిలయ మార్కండేయ శివమౌళి
చంద్రాంశు నవసుధాసార ధార
వేదాద్రి నరసింహ విపులవక్షస్థలీ
కల్హారమాలికా గంధలహరి
గీ. కారణంబులు నుద్బోధకములుగాగ
సంభవించిన సాహిత్య సౌష్ఠవమున
వీరభద్రేశ్వరు ప్రబంధ విభునిజేసి
కాశికాఖండము దెనుంగుగా నొనర్చు.

పిఠాపురము తాలూకా మధురపూడిలోని కాటయవేమారెడ్డి శాసనములో "స్వస్తిశ్రీ శకవరుషంబులు 1317 అగు నేటి తారణ సంవత్సర పుష్య బ॥ 10 గురువారమునాటి మకర సంక్రాంతి పుణ్య అమునందు కాటమ రెడ్డి వేమారెడ్డిగారు తమ కులస్వామి అయిన కొమరగిరిరెడ్డిగారికి అక్షయ సుకృత మౌనట్టుగాను మధురపూడి కొమరగిరి వరదుని పేరను వేదాద్రి శ్రీనరసింహ దేవరకు ఆచంద్రార్క స్థాయిగాను ధారవోసి సమర్పణ జేసిరి" యని గలదు. (3)

పడమటి గోదావరి జిల్లా నరసాపురము తాలూకా లక్ష్మనేశ్వర గ్రామములోని శ. స. 1365 నాటి యొక శిలాశాసనములో మారినేని రామానాయనింగారు రాజమహేంద్రవరమున కుత్తరముగాను, గౌతమికి తూర్పుగాను ఉన్న వేదాద్రిలోని నృసింహస్వామి దేవాలయ మంటపములోని పరాంకుశుని విగ్రహము ప్రతిష్ఠించెననియు, దేవునకు కొంత భూమిని సర్వ మాన్యముగా నిచ్చెననియు దెలుపబడినది. (4)

ఈ శాసనము ననుసరించి, కోరుకొండకు వేదాద్రియను నామము రూఢియైనట్లు స్పష్టము.

(1) E. I. Vol XIV. P. 93-96.
(2) S. I. I. Vol X. No. 554. (కోరుకొండ శాసనము)
(3) రెడ్డిరాజుల యజ్ఞాత శాసనములు - రెడ్డి సంచిక.
(4) No. 15 of M. E. R. for 1943-44, 44-45 (శ. స. 1365) (చూడుడు కోరుకొండ కైఫీయతు)

## కోలువర్తని విషయము

ఈ విషయము కళింగమేలిన పూర్వగాంగరాజుల శాసనములలో పేర్కొనబడినది.

| | |
|---|---|
| మూడవ వజ్రహస్తుని బొడ్డపాడు శాసనము | "కోలువర్తనివిషయే అవరేంగాఖ్య గ్రామః" (1) |
| అతనిదేయగు చిక్కాలవలస శాసనము | "కోలువర్తనివిషయేకోకుద్దమాఖ్య గ్రామః" (2) |
| దేవేంద్రవర్మ చీడివలస శాసనము | "కోలువర్తన్యాం కన్దలివాడ గ్రామ నివాసినః కుటుంబినః" (3) |
| మూడవ వజ్రహస్తుని నడగాము శాసనము | "కోలువర్తని విషయేనుగిల గ్రామః ప్రదత్తః" (4) |

బొడ్డపాడు శాసనములోని అవరెంగ గ్రామము నేటి పర్లాకిమిడి తాలూకాలోని అవలింగిగ్రామము. చిక్కాలవలస శాసనములోని కోకుద్దము శ్రీకాకుళము తాలూకాలోని కుద్దాము, కోలువర్తని విషయమునకే వరాహవర్తని విషయమని నామాంతరము (చూడుడు-వరాహావర్తని విషయము.) శాసనపరిశోధకుల యభిప్రాయము ప్రకారము కోలువర్తనియే వరాహవర్తని విషయము. నేటి శ్రీకాకుళము, టెక్కలితాలూకా ప్రాంతము. పర్లాకిమిడితాలూకా సహితము చేరియుండును.

(1) భారతి అక్షయ సంవత్సర వైశాఖ మాస సంచిక.

(2) భారతి సంపుటము 2. సంచిక 2.

(3) ఆంధ్ర పరిశోధకమండలివారి త్రైమాసిక సంచిక సంపుటము 2. సంచిక 2.

(4) E. I. Vol IV. No. 24. (979)

## క్రోష్టుకవర్తని విషయము

ఇయ్యది కళింగమేలిన పూర్వ గంగరాజుల శాసనములలో పేర్కొనబడినది.

| | |
|---|---|
| హస్తివర్మ ఉర్లాము శాసనము | "క్రోష్టుకవర్తన్యాం హం ద్రో లక గ్రామె" (1) |

| | |
|---|---|
| దేవేంద్రవర్మ శ్రీకాకుళము శాసనము | "క్రోష్టుకవర్తన్యాం సరవుమటంబే పొప్పంగిక గ్రామే .... (కురుడింబి గ్రామమునరిహద్దులలో నొకటి(2) |
| ఇంద్రవర్మ సంతబొమ్మాళి శాసనము | "క్రోష్టుకవర్తన్యాం హరిభట గ్రామే" (3) |
| అనంతవర్మ ధర్మలింగేశ్వర స్వామి శాసనము | "కోష్టిక వర్తన్యాం తాలెత్తరసర్వ సమవేతాంకుటింబినః" (4) |
| ఇంద్రవర్మ అంధవరము శాసనము | క్రోష్టుకవర్తనిలోని తోటవాటక గ్రామము (5) |
| వజ్రహస్తుని అంతవరము శాసనము | క్రోష్టుకవర్తనిలోని గోష్టవాడ (6) |

పై శాసనములలోని పొప్పంగిక, కురుడింబి గ్రామములు నేటి పర్లాకిమిడి తాలూకాలోని పొప్పంగి కురుడింబి గ్రామములు. అనంతవర్మ ధర్మలింగేశ్వరస్వామి యాలయశాసనములు పర్లాకిమిడి తాలూకా గ్రామము లభించినవి. అంధవరము శాసనములలోని తోటవాటకయు గోష్ఠవాడయు శ్రీకాకుళము తాలూకాలోని తోటాడ, గోటివాడ గ్రామములై యుండును. క్రోష్టుకవర్తని వేరు - కోలవర్తని వేరు. క్రోష్టుకవర్తని కళింగములో నేటి పర్లాకిమిడి తాలూకాలో కొంతభాగమును, శ్రీకాకుళము తాలూకాలో కొంత భాగమునై యుండెనని తలంపవచ్చును.

(1) E. I. Vol XVII. P. 332.
(2) E. I, Vol III. P. 131.
(3) E. I. Vol XXV. P. 195.
(4) A. H. R. S. Vol II. Parts 3-4.
(5) C. P. Nos. 5of 1951-52 of Indian Epigraphical Report.
(6) C. P. No. 7 of 1951-52.

క్షీరనది (1)

పాలేరునకు సంస్కృత రూపము, కృష్ణానదికి ఉపనది. కృష్ణామండలములో నందిగామ తాలూకాలోనుండి, జగ్గయ్యపేట మీదుగా ప్రవహించి

కృష్ణానదిలో రావిరేలదగ్గఱ కలియుచున్నది. దీనికి శాసనములలో క్షీరనది యని పేరు. నతవాటి సీమలో ప్రవహించెడు ప్రసిద్ధతరంగిణి.

పరోపకార సంపత్తి సిద్ధయే పుణ్యవృద్ధయే
తుల్యాం క్షీరనదీ కుల్యాం కావేర్యా కృతవానసౌ ।

S. I. I. Vol X. No. 259 శ. స. 1133. చాగిపోతరాజు మంత్రి శాసనము. నందిగామ తాలూకాలోని అనుమంచిపల్లె.

## క్షీరనది (2)

ఈ రెండవ క్షీరనది నెల్లూరుమండల శాసనములందు పేర్కొనబడినది. ఇదియు పాలేరునకు సంస్కృతరూపము.

(1) శ్రీశైల శిఖర ఆగ్నేయభాగే పంచాదశ యోజన విస్తార యామభూమి సమీపక్షీరవాహినీ మాకేటిసంగమపుణ్యతీర సంగమేశ్వరదేవ,

(2) శ్రీ కూడలి సంగమేశ్వర మహాదేవుని అమృతపళ్ళకు ఒడ్డుంగట్టి చెన్నుని పాదగ్రామద్వయం క్షీరనది మాకేణి కూడలి సంగమంలోను.

(3) ఉదయగిరి రాజ్యానకుం జెల్లె కందుకూరు సీమలోను పాలేటి దక్షిణ తటమునందును జిల్లేళ్ళమూడి అనెడు గ్రామము.

ఈపాలేరు నెల్లూరుమండలములో వెలిగొండలలో కనిగిరితాలూకాలో నుద్భవించి, కనిగికి, కందుకూరు తాలూకాలలో ప్రవహించి కందుకూరు తాలూకాలోని పాకలవద్ద సముద్రమును గలియుచున్నది.

N. I. Kandukuri (8); (10) and (77)

## గండికోట ( దుర్గము; సీమ )

ఇది కడపమండలము లోని జమ్ములమడుగు తాలూకాయందలి సుప్రసిద్ధమైన గిరిదుర్గము. పినాకినిగండికి కుడివైపున సముద్రమట్టమునకు 1670 అడుగుల యెత్తుననున్నది. దీని ప్రక్క పినాకిని రెండు మూడు మైళ్ళ పొడవున గండికోసి అందు లోతుప్రవాహాముగ రెండువందల యడుగులయెత్తుననీరెగుర గొట్టుచు, నురుగుల గ్రక్కుచు దుర్గమునకు పెట్టని కందకమై యొప్పుట జేసి యీ దుర్గము భేద్యమై యలరారు చున్నది.

నంది మల్లయ ఘంట సింగయ్యా కవులు సాళువ నరసింహారాయల సేనాని యగు తుళువ నరసింహారాయలకు కృతినిచ్చిన వరాహపురాణ కావ్యమునందు కృతిపతి తండ్రియైన ఈశ్వరనాయకుని వర్ణించునెడ నతడు జయించిన దుర్గములలో గండికోట యొకటి యనియు వర్ణించిరి.

సీ. ఉదయాద్రి భేదించె హుత్తరి నిర్జించె
గండికోటపురంబు గదలంద్రవ్వె
.... .... .... .... ....
... .... .... ....
.... .... .... .... ....

గీ. రాయచౌహత్తమల్ల ధరావరాహ
మోహన మురారి బర్బర బాహు సాళ్వ
నారసింహ ప్రతాప సన్నహను డగుచు
విశ్వహితకారి తిమ్మయ యీశ్వరుండు.

శ్రీకృష్ణదేవరాయలు సకలదళసమేతుడై గుత్తి గండికోట మార్గముగా ఉదయగిరికి వచ్చి యా దుర్గమును స్వాధీన పఱచుకొనినట్లు రాయవాచకము నందు గలదు.

అళియ రామరాయలు గండికోట దుర్గము నవలీలగా గెల్చినట్లు రామరాజీయము నందు కలదు.

తే. నలకవిభు తిమ్మరాజు సేనలను ద్రుంచి
గుత్తి పెనుకొండ మలయగండికోటఁగంద
వోలు పురమాద వేనవలీలఁ గెలిచి
దొలుదొలుత రామనృపతి దోర్బలము మెఱసె.

ఈ గండికోట దుర్గము, లేక సీమ విజయనగర సామ్రాజ్య కాలములో ప్రసిద్ధికెక్కె. నేటికడపమండలములోని బద్వేలు, జమ్మలమడుగు, ప్రొద్దుటూరు, కమలాపురము తాలూకా ప్రాంతము నావరించి యుండెనని. యీ సీమలోని గ్రామముల యునికినిబట్టి తెలియుచున్నది. ఈ దిగువ పట్టికను జూడుడు.

కృష్ణానదిలో రావిరేలదగ్గఱ కలియుచున్నది. దీనికి శాసనములలో క్షీరనది యని పేరు. నతవాటి సీమలో ప్రవహించెడు ప్రసిద్ధతరంగిణి.

పరోపకార సంపత్తి సిద్ధయే పుణ్యవృద్ధయే
తుల్యాం క్షీరనదీ కుల్యాం కావేర్యా కృతవానసౌ ।

S. I. I. Vol X. No. 259 శ. స. 1133. చాగిపోతరాజు మంత్రి శాసనము. నందిగామ తాలూకాలోని అనుమంచిపల్లె.

## క్షీరనది (2)

ఈ రెండవ క్షీరనది నెల్లూరుమండల శాసనములందు పేర్కొనబడినది. ఇదియు పాలేరునకు సంస్కృతరూపము.

(1) శ్రీశైల శిఖర ఆగ్నేయభాగే పంచాదశ యోజన విస్తార యామభూమి సమీపక్షీరవాహినీ మాకేటిసంగమపుణ్యతీర సంగమేశ్వర దేవ'

(2) శ్రీ కూడలి సంగమేశ్వర మహాదేవుని అమృతపళ్ళకు ఒడ్డుంగట్టి చెన్నని పాదగ్రామద్వయం క్షీరనది మాకేణి కూడలి సంగమంలోను.

(3) ఉదయగిరి రాజ్యానకుం జెల్లె కందుకూరు సీమలోను పాలేటి దక్షిణ తటమునందును జిల్లేళ్ళమూడి అనెడు గ్రామము.

ఈపాలేరు నెల్లూరుమండలములో వెలిగొండలలో కనిగిరితాలూకాలో నుద్భవించి, కనిగిరి, కందుకూరు తాలూకాలలో ప్రవహించి కందుకూరు తాలూకాలోని పాకలవద్ద సముద్రమును గలియుచున్నది.

N. I. Kandukuri (8); (10) and (77)

## గండికోట ( దుర్గము; సీమ )

ఇది కడపమండలము లోని జమ్ములమడుగు తాలూకాయందలి సుప్రసిద్ధమైన గిరిదుర్గము. పినాకినిగండికి కుడివైపున సముద్రమట్టమునకు 1670 అడుగుల యెత్తుననున్నది. దీని ప్రక్క పినాకిని రెండు మూడు మైళ్ళ పొడవున గండికోసి అందు లోతు ప్రవాహముగ రెండువందల యడుగుల యెత్తుననీరెగుర గొట్టుచు, నురుగుల గ్రక్కుచు దుర్గమునకు పెట్టని కందకమై యొప్పుట చేసి యీ దుర్గమభేద్యమై యలరారు చున్నది.

నంది మల్లయ ఘంట సింగయ్యా కవులు సాళువ నరసింహారాయల సేనాని యగు తుళువ నరసింహారాయలకు కృతినిచ్చిన వరాహపురాణ కావ్యమునందు కృతిపతి తండ్రియైన ఈశ్వరనాయకుని వర్ణించునెడ నతడు జయించిన దుర్గములలో గండికోట యొకటి యనియు వర్ణించిరి.

సీ. ఉదయాద్రి భేదించె హుత్తరి నిర్జించె
గండికోటపురంబు గదలంద్రవ్వె
.... .... .... .... ....
... .... .... ....
.... .... .... .... ....

గీ. రాయచౌహత్తమల్ల ధరావరాహ
మోహన మురారి బర్బర బాహు సాళ్వ
నారసింహ ప్రతాప సన్నహను డగుచు
విశ్వహితకారి తిమ్మయ యీశ్వరుండు.

శ్రీకృష్ణదేవరాయలు సకలదళసమేతుడై గుత్తిగండికోట మార్గముగా ఉదయగిరికి వచ్చి యా దుర్గమును స్వాధీన పఱచుకొనినట్లు రాయవాచకము నందు గలదు.

అళియ రామరాయలు గండికోట దుర్గము నవలీలగా గెల్చినట్లు రామ రాజీయము నందు కలదు.

తే. నలకవిభు తిమ్మరాజు సేనలను ద్రుంచి
గుత్తి పెనుకొండ మలయగండికోటఁగంద
వోలు పురమాద వేనవలీలఁ గెలిచి
దొలుదొలుత రామనృపతి దోర్బలము మెఱసె.

ఈ గండికోట దుర్గము, లేక సీమ విజయనగర సామ్రాజ్య కాలములో ప్రసిద్ధికెక్కె. నేటికడపమండలములోని బద్వేలు, జమ్మలమడుగు, ప్రొద్దుటూరు, కమలాపురము తాలూకా ప్రాంతము నావరించి యుండెనని. యీ సీమలోని గ్రామముల యునికినిబట్టి తెలియుచున్నది. ఈ దిగువ పట్టికను జూడుడు.

| | | | | |
|---|---|---|---|---|
| గండికోట సీమ | చెర్నాలుసీమలోని ప్రొద్దుటూరు పయిండాల ప్రొద్దుటూరు సమీపమున కడపజిల్లా నున్న రామేశ్వరములో రామయ దేవరకు దాన మిచ్చిన శాసనము. | ప్రొద్దుటూరు తాలూకా | శ.స.1446 | శ్రీకృష్ణదేవరాయలశాసనము(1) |
| గండికోటదుర్గం | బెస్తవేముల | జమ్మలమడుగు తాలూకా | 1437 | కృష్ణదేవరాయల శాసనము (2) |
| గండికోటసీమ | కాట్రగడ్డ | కట్టేరుగండ్ల బద్వేలు తాలూకా | 1448 | కృష్ణదేవరాయల శాసనము (3) |
| ,, | చినకామెర్ల | జమ్మలమడుగు తాలూకా | 1455 | అచ్యుతరాయల శాసనము (4) |
| ,, | యర్రగుడిపాడు | కమలాపురము తాలూకా | 1471 | సదాశివరాయల శాసనము (5) |
| ,, | పెదకామెర్ల | జమ్మలమడుగు | 1475 | సదాశివరాయల శాసనము (6) |
| ,, | బండలకుంట | ,, | 1460 | సదాశివరాయల శాసనము (7) |

(1) No. 395 of M. E. R. 1904-05.
(2) No. 351 of M. E. R. 1932-33.
(3) No. 401 of M. E. R. 1925-26.
(4) No. 356 of M. E. R. 1932-33.
(5) No. 99 of M. E. R. 1929-30.
(6) No. 375 of M. E. R. 1932-33.
(7) No. 357 of M. E. R. 1932-33.

## గుంటుపల్లి

పశ్చిమ గోదావరి మండలములో ఏలూరు తాలూకా కామవరపుకోట కారుమైళ్ళు దూరముననున్న అత్యంతప్రాచీనమైన బౌద్ధారామముగల గ్రామము. ఈ గ్రామసమీపమున చైత్యాలయములు, విహారములు, స్తూపములు బయలు పడెను. క్రీస్తుపూర్వము రెండవ శతాబ్దమునాటి లిపిలో నున్న శాసన మొకటి యచ్చట లభించెను. ఇచ్చట బయలుపడిన శిలావిగ్రహములు, శిలాపేటికలు, బంగారు భిక్షాపాత్ర మొదలైనవి మద్రాసు మూజియము నందున్నవి.

## గుండ్లకమ్మ (నది)

ఈ గుండ్లకమ్మనదికి కుంతి, కుండికుండిజ, కుండిప్రభా, బ్రహ్మకుండి యనియు నామాంతరములు. కర్నూలు మండలములో నల్లమలలలో గుండ్ల బ్రహ్మేశ్వరము వద్ద నావిర్భవించి, జంపిలేరు, ఎనుమలేరు అను ఉపనదులను జేర్చుకొని, కంబము గ్రామమును జుట్టుకొని వచ్చి, ఉత్తరాభిముఖమై పూర్వదిశకు ప్రవహించునపుడు వెలిగొండ అడ్డుపడుటచే, నెల్లూరు మండలములోని పొదిలి తాలూకాకు పశ్చిమయెల్లయై దర్శి డివిజన్‌కు నైఋతిదిక్కుగా నేర్పడి, మార్కాపురము తాలూకాలో నలుబది మైళ్ళు ప్రవహించి, కర్నూలు మండలమును వీడి, గుంటూరు మండలములోని వినుకొండకు పదిమైళ్ల దూరమున నున్న ముమ్మడివరము సమీపమున తూర్పు దిక్కుగా తిరిగి, మరల దక్షిణ దిక్కై ఒంగోలు తాలూకా గుండా ప్రవహించి పెద్ద దేవరంపాడు వద్ద సముద్రమును గలియుచున్నది. ఈ గుండ్లకమ్మ కిరుప్రక్కల పూంగినాడున్నది.

## గుడివాడ

కృష్ణామండలములోని గుడివాడ తాలూకాకు కేంద్రస్థానము. బెజవాడకు తూర్పున పాతిక మైళ్ళ దూరమున నున్నది. ఇచ్చట ప్రాచీన బౌద్ధస్తూప మొకటి బయలుపడినది. నాల్గు శిలా పేటికలు లభించినవి. ఆంధ్ర శాతవాహన రాజుల నాణెములెన్నో నిచ్చటదొరికినవి. ఆంధ్రదేశములో ప్రాచీన బౌద్ధాగారములలో నొకటి. ఘంటశాల, గుడివాడ భట్టిప్రోలు మొదలగునవి తక్కిన ప్రాచీన బౌద్ధాగారములు "అలెగ్జాండరు రీ" యను నాతడీ ప్రాంతముల దొరికిన నాణెములగూర్చి యొక చిత్రపటమును ముద్రించి, వానిని గూర్చి యిట్లు వ్రాసియున్నాడు.

"ఈ నాణెములు సీసముతో చేయబడినవి. కొన్ని 101, మరికొన్ని 65, వేఱొకటివి 29 వడ్లగింజల యెత్తునుగలవు. ఆ నాణెములపై యోడలు దోనెల బోలి ధనురాకారముగ చిత్రింపబడినవి. కొన్ని నాణెములపై యోడలు కుడివైపునకు, కొన్నింటిపై నెడమవైపునకు చిత్రింపబడెను. వానిపై యోడ కొయ్యలు, త్రోకులు సహితము స్పష్టముగ ముద్రింపబడి యుండెను. ఈ యోడ ప్రతిమ లన్నియు నిలువుగ మధ్యకు జీల్చిన నెట్లగుపడునో యట్లే ముద్రింపబడినవి."

Archaeological Survey of India. New imperial Series. South Indian Budhistic Antiquities; the Krishna dt. Chap. XII. Gudivada.

## గుత్తి (రాజ్యము, సీమ.)

విజయనగర సామ్రాజ్యాధీశులైన శ్రీ వీర నరసింహరాయల, కృష్ణదేవరాయల సదాశివరాయల నాటి శాసనములలో గుత్తిసీమ లేక రాజ్యము పేర్కొనబడినది.

(1) "గుత్తి రాజ్యములోను పెంన్నబడి తాడిపరతి రామేశ్వర దేవరకు పెన్నంబడి స్థలంలోని నెలదలపాడు"

(2) "గుత్తిరాజ్యంలోనున్ను అందుకు గుత్తిసీమనున్ను పెన్నంబడి శీమంనున్ను"

(3) "గుత్తిసీమలోని ఇగుదూరి పొలమేరను గజలింమ్మాపుర గ్రామాను"

(4) గుత్తిసీమలోని పెన్నబూటూరు.

(5) గుత్తిరాజ్యములోని పెన్నయ మాగాణిలోని చాగలె.

(6) జగతాపి గుత్తిసీమలోని పెన్నబడి మాగాణి యందలి కుమ్మెత్త

(7) గుత్తిరాజ్యములోని పెన్నమాగాణి సీమయందలి పెదపప్పూరు.

(8) గుత్తిరాజ్యములోని పెన్నబడి సజ్జలదిన్నె.

గుత్తి ఆంధ్రప్రదేశములోని అనంతపుర మండలము నందలి గుత్తి తాలూకాకు ముఖ్యనగరము. ఇదియొక బలిష్ఠమైన గిరిదుర్గము. అనంత

ప్రాయాసిపంచ దినైః కైశ్చి దంధ్రనగరం తస్య
నాత్యాసన్నే సలిలరాశి సదృశస్య కలహంస
గణ దళిత నళినదళ సంహతిగళిత
కింజల్క శకల శారస్య సారసశ్రేణి శేఖరస్య
సరస్తీర కాననే కృత నికేతనస్థితః. (2)

ఇదియే పశ్చిమ గోదావరి మండలములోని కొల్లేరు సరస్సు. ఈవీడొక జలదుర్గము. దీనికే సరసీపురి యనియు పద్మినీపుర మనియు బేర్లు (చూడు-కమలాకరపురము.)

వెలనాటి రాజేంద్రచోడని సిరిపురము శాసనములో నతడు కొలను జయించి దాని మండలీకుడైన భీముని జంపెనని చెప్పబడ్డది. (3)

చం. ఇలవెలనాటి గొంక వసుధేశు తనూభవుడైన చోడ భూ
తల పదిచోడ పట్టము ముదంబున గట్టి భుజాబలంబునన్
గొలను జయించి యందు రిపుకుంజరు భీముని జంపి యాంధ్ర భూ
తలము పదారువేలు సతత స్థితినేలె సురేంద్ర లీలలన్.

పృథ్వీశ్వరుని పిఠాపురశాసనములో నియ్యది యిట్లు వర్ణింపబడినది (4)

శ్లో. యేనాంభోరాశి భీమ భ్రమిత జలమిలద్గ్రాహపాఠీన సంఘ
వ్రేంఖత్కల్లోల మాలాకలుషమనిమిషైః ఖాతమాదౌ సరస్తత్
నిశ్శేషం శోషయిత్వావధి జలధి జలం కుంభయో
నిర్వ్యదాధ్యో భీమో భీతిం వితన్వన్
ద్రుతమివ జగతాం రావణో రాఘవేణ. (శ్లో. 45.)

శ్రీనాథుడు భీమేశ్వర పురాణములో కొలని ప్రతాపరుద్రుడు ఆరేటి గ్రామమును బెండపూడి అన్నమంత్రికి అగ్రహారముగ దానమిచ్చెనని చెప్పియున్నాడు.

చం. కొలని ప్రతాపరుద్రనృప కుంజరుచేత సరేడుసారణీ
సలిల వివర్ధమాన బహుసస్య సమాకులనుగ్రహార మై
వెలయ విభాకరగ్రహణ వేళదగంగ బరిగ్రహించి బం
ధుల భరియించె నన్నవిభుతో సరియెట్లు ప్రధానులెవ్వరున్.
(ఆ. 1. ప. 49)

పై పద్యములో చెప్పిన ఆరేడు గ్రామము పశ్చిమ గోదావరి మండలములోని ఆరేడు గ్రామమే. వీరి శాసనములు భీమవరము, తణుకు తాలూకాలలో గలవు. కొలను మండలము పశ్చిమ గోదావరి మండలములోని ఏలూరు, భీమవరము, తణుకు తాలూకా ప్రాంతము. (5)

ఈ కొలనువీడు వేంగి మండలములోని యంతర్భాగము. (6)

(1) రెండవ పులకేశి అయిహోలు శాసనము.
E. I. Vol. VI P-1-12 (క్రీ. శ. 634-635)
(2) దశకుమార చరిత్ర, (మంత్రగుప్త చరిత్రము)
(3) S. I. I. Vol X. No. 177. (శా. శ. 1093)
(4) E. I. Vol IV. No. 4. (శా. శ. 1108)
(5) S. I. I. Vol X. No. 83. (శా. శ. 1047)
S. I. I. Vol X. No. 126. (శా. శ. 1073)
S. I. I. Vol X No. 206. (శా. శ. 1117)
S. I. I. Vol X. No. 262. (శా. శ. 1140)
S. I. I. Vol X No 301. (శా. శ. 1165)
A. R. S. I. E. 1935-36. Para 32 (Page 71).

**కొలనుపాక**

కొలనుపాక ఆంధ్రప్రదేశములోని నల్గొండ జిల్లాలోని గ్రామము. ఇది పూర్వమొకప్పుడు జైన క్షేత్రమై తరువాత సుప్రసిద్ధ శైవ క్షేత్రమయ్యెను.

తమిళ శాసనములలో నియ్యది 'కులపాక, కొల్లిపాకె, కొల్లిపాకై' అనియు పేర్కొనబడినది. రాజేంద్రచోడు డీ దేశముపై దండెత్తి యద్దానిని గెల్చెనని యతని తమిళ శాసనములందు బెక్కుచోట్ల వర్ణింపబడినది.

ఈ కొలనుపాక కళ్యాణి చాళుక్యుల వశమై వారి యధికారము క్రింద సామంతదండనాథులు కొలనుపాక రాజధానిగ కొలనుపాక యేల్పాసిరము (ఏడువేలు) అనగా కొలనుపాక సప్తసహస్ర పరిమితిగల దేశమును పాలించుచుండిరి.

తర్వాత కొలనుపాక కాకతీయుల వశమై వారి పాలనమునకు లోబడి యుండెను. తెలంగాణా శాసనముల సంపుటములో ప్రచురింపబడిన శాసనముల వల్ల విదితమగుచున్నది.

కొలనుపాక కన్నడ శాసనములో పశ్చిమ చాళుక్య ప్రభువగు త్రిభువన మల్ల విక్రమాదిత్యుని కుమారుడగు కుమార సోమేశ్వరుడు తన సామంతుడగు కొలనుపాక ఏడువేలును కొలనుపాక రాజధానిగ పాలించు స్వామి దండనాయకుని విజ్ఞాపనమున పానుపుర గ్రామమును జైనదేవతయగు అంబికాదేవి యంగరంగ భోగార్థము సమర్పించెను.

"శ్రీమన్మహామణ్డలేశ్వరం చాళుక్య గంగ పెర్మాడి కుమార సోమేశ్వర దేవర్మహా ప్రధానం మనె పెర్గెడె కొల్లిపాకె యెళ్చాసిరద దండనాయకం సాయిమయ్యిగ బిన్న పదిం నిజరాజధాని కొల్లిపాకెయ.........
అంబికాదేవి యంగ భోగ రంగ భోగం గళిగె పొళల బళియ పానుపుటం యెంబూరం సర్వనమస్యం ....ధారాపూర్వకం మాడి కొట్టన్."

పై కుమార సోమేశ్వరుని కాలమునాటిదే యగు మరియొక శాసనములో నతడు కొల్లిపాకనాడు మొదలైన నాడుల నేలుచు, తన మంత్రుల విన్నపము వలన స్వయంభూదేవరకు జైనబసదికి కొన్ని గ్రామములు దానమిచ్చిన విషయము తెలుపబడినది. ఈ శాసనములో "కొల్లిపాక నాడనియు" నియ్యది కొల్లిపాక యేళ్చాసిరమనియు జెప్పబడినది.

కాకతీయ రుద్రాంబ కాలమునాటి కొలనుపాకలోని యొక సంస్కృత శాసనములో కాకతి సామంతుడగు పోతినాయకుడు కొలిపాక నేలుచుండెనని తెలుపబడినది.

S. I. I. Vol. I Pages 96; 99.
S. I. I. Vol. III Page 390.

తెలంగాణా శాసనములు సంపుటము - 1. పుట 80. (కాకతీయ శాసనములు.)

తెలంగాణా శాసనములు సంపుటము-పుటలు 138-141. (చాళుక్య కన్నడ శాసనము.)

తెలంగాణా శాసన సంపుటము-2. పుటలు 54-55 (కళ్యాణి చాళుక్యుల కన్నడ శాసనములు.)

## కోటభూమి

కోటభూమి చారిత్రక భూగోళము నరసరావుపేట తాలూకా అప్పాపురములోని యొక శాసనములో సంపూర్ణముగా వివరింపబడినది. (1)

"స్వస్తి సమస్త ప్రశస్తి సహితంబై అసల్పంబైన కల్పారంభ కాలమున మహావరాహదంష్ట్రా శిఖరంబున నుధృతంబై పంచాశత్కోటి యోజన విస్తీర్ణంబైన భూమండలంబునందు జంబూద్వీపంబులో భారతవర్షంబున భారత ఖండంబునందు మేరువు పర్యంతంబును దక్షిణ దిగ్భాగంబున శ్రీశైలవాయ సముద్ర పార్శ్వంబున వోంకార నదీ తీరంబునం ద్రిలింగ దేశాలంకారంబైన కోటభూమి."

కోట యనునది ధరణికోటను సూచించును. కోటభూమీశులకు రాజధాని. రెండవ కోట కేతరాజు అమరావతి శాసనమున నతని బిరుదావళి ఈ క్రింది విధమున నీయబడినది. (2)

"స్వస్తి చతుస్సముద్ర ముద్రిత నిఖిల వసుంధరా పరిపాలక, శ్రీమత్రిణయన పల్లవ ప్రసాదిత కృష్ణవేణ్ణానదీ దక్షిణ షట్సహస్రావనీ వల్లభ భయ లోభ దుర్లభ చోళచాళుక్య సామంత మదానేకప మృగేంద్ర విభవామరేంద్ర శ్రీమదమరేశ్వరదేవ దివ్య శ్రీపాద పద్మారాధక పరబల సాధక శ్రీధాన్య కటక పురవరాధీశ్వర ప్రతాపలంకేశ్వర....నన్ని మార్తాండ నామాది సమస్త ప్రశస్తి సహితం శ్రీమన్మహా మండలేశ్వరులు కోట కేతరాజులు"

పై బిరుదావళి కోటభూమి లేక కోట దేశము షట్సహస్రావని లేక ఆరువేలనాడని తెలియగలదు. కోటభూమీశు లొసగిన దానశాసనములలో కొండపడుమటి, కొండనతవాడి, కంద్రవాడి సీమలలోని గ్రామములు పేర్కొనబడినవి. కావున కోటభూమిలో నా యా సీమలు గలిపి ఉన్నవని తెలిసికొనవచ్చును. (చూడుడు షట్సహస్రావని - కొండపడుమటి దేశము - నతవాడి - కంద్రవాడి సీమలు.)

పెదకోమటి భూపాలుని అమీనాబాదు శాసనములో (3)

సీ. శాకాబ్దములు సహస్రమును నిన్నూట తొం
బదియొనిమిది యగు భవ్యసంఖ్య

గలిగి యొప్పారెడు నల సంవత్సరంబున
మాఘమాసము పూర్ణిమాదినమున
విశ్వోత్తరుం డనవేమ భూపాలుండు
దమ కులస్వామిని కమృత కిరణ
రేఖావతంసకు శ్రీమూలగూరమ్మ
కఖిల జగన్మాత కంగరంగ
గీ భోగసంసిద్ధ కని ధారవోసియిచ్చె
గ్రామములు మూడు శ్రీ కోటభూమియందు
పడిదరము మూలగూరంబన పలకలూరు
దానఖచరేంద్రు డాచంద్రతారకముగ.

అమీనాబాదు శాసనములో పేర్కొనబడిన మూడు గ్రామములు.

| | | |
|---|---|---|
| (1) | మూలంగూరు | అమీనాబాదుకు ప్రాచీన నామము. సత్తెనపల్లి తాలూకా. |
| (2) | పడిదరము | పణిదెము, సత్తెనపల్లి తాలూకా. |
| (3) | పలకలూరు | పెద్దపలకలూరు గుంటూరు తాలూకా |

సత్తెనపల్లి తాలూకాలోని పెద్దమక్కెనలోని రెండు శాసనములలో కోటభూమిలోని పెదమక్కెనయు చింతలపూడియు పేర్కొనబడినవి. పెద మక్కెన నేటి పెదమక్కెనయే. చింతలపూడి తెనాలి తాలూకాలోని చింతలపూడి గ్రామమే. (4)

మడికి సింగన కవి వాశిష్ఠ రామాయణములో నీ కోటభూమి నిట్లు వర్ణించియున్నాడు.

సీ. అతఁడు తిక్కన సోమయాజుల పుత్త్రుఁడై
కొమరారు గుంటూరు కొమ్మ విభుని
పుత్త్రిఁ జిట్టాంబిక బుధలోక కల్పక
వల్లి వివాహమై వైభవమున
భూసారమగు కోటభూమిఁ గృష్ణానదీ
దక్షిణ తటమున ధన్యలీల
నలరారు రావెల యను నగ్రహారము తన
కేక భోగ్యంబుగా నేలుచుండి

(1) S. I. I. Vol X. No. 573. (శ. స. 1327)
(2) E. I. Vol VI. No. 15. (శ. స. 1104)
(3) శాసన పద్యమంజరి, సంఖ్య 68. (శ. స. 1298) ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక, సంపుటి 9. పు. 319-25.
(4) No. 331. (శ.స. 1339)
No. 332. (శ. స. 1423)
M. E. R. for 1931 - 33.

## కోన (దేశము, మండలము, రాష్ట్రము, స్థలము)

దీనికే నేడు కోనసీమయని వ్యవహారసిద్ధమగు నామము. తూర్పు గోదావరి మండలములోని అమలాపురము. రాజోలుతాలూకాలలో గౌతమీ వశిష్ఠనదుల మధ్యభాగము. శాసనములలో నియ్యది రెండేఱులనడి విషయమనియు సింధు యుగ్మాంతర దేశమనియు వర్ణింపబడినది.

మల్లిదేవుని పిఠాపుర శాసనములో నితని పూర్వుడును ముమ్మడి భీముని కుమారుడును నగు రాజపరేండు కోనమండలాధీశుడని చెప్పబడినవాడు. (1)

శ్రీమాన్ రాజపఱేండు క్ష్మానాథః కోనమండలాధీశః
ఉపయే మేయః కులజే లక్ష్మీతొండాంబికే దేవ్యౌ॥ శ్లో. 10.

పై రాజపరేని కుమారుడైన రాజేంద్రచోడుని ద్రాక్షారామ శాసనములో నొకదానియందు శ్రీరామేశ్వర దేవునకు, "ఏలవియ" "నడుపుంబూడి" "ముక్రోమల"యను గౌతమీతీర దేశములోని గ్రామముల దానమొసంగెనని తెలియుచున్నది. (2)

అనవేమారెడ్డి నడుపూరు శాసనములో "శాకాబ్దే దసరత్నభాను గణితే గ్రస్తేవిధౌ రాహుణా కార్తిక్యాం విజయేశ్వ రస్యపురతః శ్రీ గౌతమీ రోధసీ విప్రేభ్యోః పరమన్న వేమనృపతిః శ్రీ వేమసానాన్యః స్వసుః పుణ్యార్థ నడుపూర్వ సంజ్ఞక మదాద్గ్రామం సకోణస్థలే" అని కోణస్థలములోని గౌతమీ తీర మండలి నడుపూరు గ్రామము దానమీయబడినట్లు వ్రాయబడినది. (3)

కాటయవేముని తొత్తరమూడి శాసనములో కోనదేశే గ్రహారోయం ఖ్యాతి మల్లవరాభిదం। తీరేచ వృద్ధ గౌతమ్యాః పుణ్యో ముక్తీశ్వరాంతికే॥ అని కోనదేశమండలి మల్లవరము, ముక్తేశ్వరమును పేర్కొనబడినవి. (4)

కోన భీమరాజు భార్యయైన పద్మావతి వ్రాయించిన ద్రాక్షారామ శాసనములో నామె భీమేశ్వర దేవునికి "ఖుంటెనపల్లి" గ్రామము దానము చేసినట్లు గలదు. (5)

కోరుకొండ రాజ్యమునేలిన ముమ్మడి నాయకుడు ఉభయగోదావరీ మధ్యప్రాంతమునందలి కోన, పానార, కురవాట, చెంగర సీమల నేలుచుండె నని యతని శ్రీరంగము, కోరుకొండ శాసనములవల్ల తెలియనగును. (6)

| శాసన స్థల గ్రామము | నేటి గ్రామనామము | తాలూకా |
|---|---|---|
| ఏలవియ | ఏలివెల | రాజోలు |
| నడుపుంబూడి | నడుపూడి | అమలాపురము |
| ముక్రోమల | ముక్కామల | ,, |
| నడుపూరు | నడుపూడి | ,, |
| మల్లవరము | తొత్తరమూడి (సివారు) | ,, |
| ముక్తీశ్వరము | ముక్తీశ్వరము | ,, |
| ఖుంటెనపల్లి | గున్నేపల్లి | ,, |
| తొత్తడిమూండి | తొత్తర మూడి | ,, |

(1) E.I. Vol IV.P.83. (శా. శ. 1117)
(2) S. I. I. Vol IV. No. 1150. (శా. శ. 1060)
(3) E. I.Vol III. P. 286 (శా. శ. 1296)
(4) E. I. Vol IV. P. 324 (శా. శ. 1333)
(5) S. I. I. Vol IV. No. 1286 (శా. శ. 1153)
(6) E. I. Vol XIV. P. 83. (శా. శ. 1368)
(7) S. I. I. Vol X. No. 554. (శా. శ. 1363)

## కోరుకొండ

కోరుకొండ రాజమహేంద్రవరమునకు పండ్రెండు మైళ్ళ దూరమున నున్న యొక వనదుర్గము. ఈ కోరుకొండ సీమకు ఉత్తరమున తూర్పు గోదావరి మండలములోని మన్నె ప్రాంతమును దక్షిణమున గుద్రవార విషయమును, తూర్పున ప్రోల్నాడును, పడుమట గౌతమియు సరిహద్దులు. మంచికొండరెడ్లు కోరుకొండ రాజధానిగ చెంగలి, కోన, పానార విషయముల బాలించిరి. (1)

కోరుకొండ రాజధానిగ పై సీమలను బాలించిన ముమ్మడినాయకుని పాలనమున నతని యాహ్వానమున పరాశర భట్టను వైష్ణవ శిఖామణి కోరుకొండకు వచ్చి, ముమ్మడి నాయకునకు నతని సోదరునకు వైష్ణవ మిచ్చెను. ముమ్మడికి రంగవర్ధనుడని నామకరణ మొనర్చెను. ఈ వైష్ణవగురుడు తన మరణ కాలమున ముమ్మడినాయకుని బిలిచి తాను చనిపోయిన పిమ్మట నృసింహస్వామి రూపముతో కోరుకొండపై వెలసెదనని చెప్పి మరణించెను. తరువాత లక్ష్మియను వేశ్యకు పరాశరభట్టు స్వప్నమున దర్శనమిచ్చి కోరుకొండపై వెలసితినని చెప్పెను. ఈ స్వప్న వృత్తాంతము ముమ్మడేంద్రునకామె చెప్పగా; దేవాలయ నిర్మాణమునకై యామెకు సహాయమొనర్చెను. లక్ష్మి దాసియే నృసింహమూర్తిని కోరుకొండపై ప్రతిష్ఠను గావించెను. కోరుకొండకీ కారణమున పరాశరశైలమని పేరు. ఈ దేవాలయము శా. స. 1275లో నిర్మింపబడినది. (2)

కోరుకొండకే వేదాద్రి యని పేరు. శ్రీనాథుడు కాశీఖండ కృతిలో దన కవితావైభవమునకు గారణముల నిట్లు చెప్పుకొన్నాడు.

సీ. ఆంధ్రక్షమామండలాఖండలుండైన
వేమభూపతి కృపావీక్షణంబు
ఘోడెరాయాంక సద్గురు రాజభీమేశ్వ
రస్వామి పదసమారాధనంబు

కమలాద్రినిలయ మార్కండేయ శివమౌళి
చంద్రాంశు నవసుధాసారధార
వేదాద్రి నరసింహ విపులవక్షస్థలీ
కల్హారమాలికా గంధలహరి
గీ. కారణములు సుదోధకములుగాగ
సంభవించిన సాహిత్య సౌష్ఠవమున
వీరభద్రేశ్వరు ప్రబంధ విభునిజేసి
కాశికాఖండము దెనుంగుగా నొనర్తు.

పిఠాపురము తాలూకా మధురపూడిలోని కాటయవేమారెడ్డి శాసనములో "స్వస్తిశ్రీ శకవరుషంబులు 1327 అగు నేటి తారణ సంవత్సర పుష్య బ॥ 10 గురువారమునాటి మకర సంక్రాంతి పుణ్యకాలమునందు కాటమరెడ్డి వేమారెడ్డిగారు తమ కులస్వామి అయిన కొమరగిరిరెడ్డిగారికి ఉభయ సుకృత మౌనట్టుగాను మధురపూడి కొమరగిరి వరదుని పేరను వేదాద్రి శ్రీనరసింహ దేవరకు ఆచంద్రార్క స్థాయిగాను ధారవోసి సమర్పణ జేసిరి" యని గలదు. (3)

పడమటి గోదావరి జిల్లా నరసాపురము తాలూకా లక్ష్మీనేశ్వర గ్రామములోని శ. స. 1365 నాటి యొక శిలాశాసనములో మారినేని రామానాయనింగారు రాజమహేంద్రవరమున కుత్తరముగాను, గౌతమికి తూర్పుగాను ఉన్న వేదాద్రిలోని నృసింహస్వామి దేవాలయ మంటపములోని పరాంకుశుని విగ్రహము ప్రతిష్ఠించెననియు, దేవునకు కొంత భూమిని సర్వమాన్యముగా నిచ్చెననియు దెలుపబడినది. (4)

ఈ శాసనము ననుసరించి, కోరుకొండకు వేదాద్రియను నామము రూఢియైనట్లు స్పష్టము.

(1) E. I. Vol XIV. P. 93-96.
(2) S. I. I. Vol X. No. 554. (కోరుకొండ శాసనము)
(3) రెడ్డిరాజుల యజ్ఞాత శాసనములు - రెడ్డి సంచిక.
(4) No. 15 of M. E. R. for 1943-44, 44-45 (శ. స. 1365) (చూడుడు కోరుకొండ కైఫియతు)

## కోలువర్తని విషయము

ఈ విషయము కళింగమేలిన పూర్వగాంగరాజుల శాసనములలో పేర్కొనబడినది.

| | |
|---|---|
| మూడవ వజ్రహస్తుని బొడ్డపాడు శాసనము | "కోలువర్తనివిషయే అవరేంగాఖ్య గ్రామః" (1) |
| అతనిదేయగు చిక్కాలవలస శాసనము | "కోలువర్తనివిషయేకోకుద్దమాఖ్య గ్రామః" (2) |
| దేవేంద్రవర్మ చీడివలస శాసనము | "కోలువర్తన్యాం కన్దలివాడ గ్రామ నివాసినః కుటుంబినః" (3) |
| మూడవ వజ్రహస్తుని నడగాము శాసనము | "కోలువర్తని విషయేనుగిల గ్రామః ప్రదత్తః" (4) |

బొడ్డపాడు శాసనములోని అవరెంగ గ్రామము నేటి పర్లాకిమిడి తాలూకాలోని అవలింగిగ్రామము. చిక్కాలవలస శాసనములోని కోకుద్దము శ్రీకాకుళము తాలూకాలోని కుద్దాము, కోలువర్తని విషయమునకే వరాహవర్తని విషయమని నామాంతరము (చూడుడు-వరాహవర్తని విషయము.) శాసనపరిశోధకుల యభిప్రాయము ప్రకారము కోలువర్తనియే వరాహవర్తని విషయము. నేటి శ్రీకాకుళము, టెక్కలితాలూకా ప్రాంతము. పర్లాకిమిడితాలూకా సహితము చేరియుండును.

(1) భారతి అక్షయ సంవత్సర వైశాఖ మాస సంచిక.

(2) భారతి సంపుటము 2. సంచిక 2.

(3) ఆంధ్ర పరిశోధకమండలివారి త్రైమాసిక సంచిక సంపుటము 2. సంచిక 2.

(4) E. I. Vol IV. No. 24. (979)

## క్రోష్టుకవర్తని విషయము

ఇయ్యది కళింగమేలిన పూర్వ గంగరాజుల శాసనములలో పేర్కొనబడినది.

| | |
|---|---|
| హస్తివర్మ ఉర్లాము శాసనము | "క్రోష్టుకవర్తన్యాం హంద్దోలక గ్రామె" (1) |

| | |
|---|---|
| దేవేంద్రవర్మ శ్రీకాకుళము శాసనము | "క్రోష్టుకవర్తన్యాం సరవుమటంబే పొప్పంగిక గ్రామే .... (కురుడింబి గ్రామమునరిహద్దులలో నొకటి(2), |
| ఇంద్రవర్మ సంతబొమ్మాళి శాసనము | "క్రోష్టుకవర్తన్యాం హరిభట గ్రామే" (3) |
| అనంతవర్మ ధర్మలింగేశ్వర స్వామి శాసనము | "క్రోష్టిక వర్తన్యాం తాలెత్తరసర్వ సమవేతాంకుటింబినః" (4) |
| ఇంద్రవర్మ అంధవరము శాసనము | క్రోష్టుకవర్తనిలోని తోటవాటక గ్రామము (5) |
| వజ్రహస్తుని అంతవరము శాసనము | క్రోష్టుకవర్తనిలోని గోష్టవాడ (6) |

పై శాసనములలోని పొప్పంగిక, కురుడింబి గ్రామములు నేటి పర్లాకిమిడి తాలూకాలోని పొప్పంగి కురుడింబి గ్రామములు. అనంతవర్మ ధర్మలింగేశ్వరస్వామి యాలయశాసనములు పర్లాకిమిడి తాలూకా గ్రామము లభించినవి. అంధవరము శాసనములలోని తోటవాటకయు గోష్ఠ వాడయు శ్రీకాకుళము తాలూకాలోని తోటాడ, గోటివాడ గ్రామములై యుండును. క్రోష్టుకవర్తని వేరు - కోలవర్తని వేరు. క్రోష్టుకవర్తని కళింగములో నేటి పర్లాకిమిడి తాలూకాలో కొంతభాగమును, శ్రీకాకుళము తాలూకాలో కొంత భాగమునై యుండెనని తలంపవచ్చును.

(1) E. I. Vol XVII. P. 332.
(2) E. I, Vol III. P. 131.
(3) E. I. Vol XXV. P. 195.
(4) A. H. R. S. Vol II. Parts 3-4.
(5) C. P. Nos. 5of 1951-52 of Indian Epigraphical Report.
(6) C. P. No. 7 of 1951-52.

క్షీరనది (1)

పాలేరునకు సంస్కృత రూపము, కృష్ణానదికి ఉపనది. కృష్ణామండల ములో నందిగామ తాలూకాలోనుండి, జగ్గయ్యపేట మీదుగా ప్రవహించి

కృష్ణానదిలో రావిరేలదగ్గఱ కలియుచున్నది. దీనికి శాసనములలో క్షీరనది యని పేరు. నతవాటి సీమలో ప్రవహించెడు ప్రసిద్ధతరంగిణి.

పరోపకార సంపత్తి సిద్ధయే పుణ్యవృద్ధయే
తుల్యాం క్షీరనదీ కుల్యాం కావేర్యా కృతవానసౌ ।

S. I. I. Vol X. No. 259 శ. స. 1133. చాగిపోతరాజు మంత్రి శాసనము. నందిగామ తాలూకాలోని అనుమంచిపల్లె.

## క్షీరనది (2)

ఈ రెండవ క్షీరనది నెల్లూరుమండల శాసనములందు పేర్కొనబడినది. ఇదియు పాలేరునకు సంస్కృతరూపము.

(1) శ్రీశైల శిఖర ఆగ్నేయభాగే పంచాదశ యోజన విస్తార యామభూమి సమీపక్షీరవాహినీ మాకేటిసంగమపుణ్యతీర సంగమేశ్వరదేవ',

(2) శ్రీ కూడలి సంగమేశ్వర మహాదేవుని అమృతపళ్ళకు ఒడ్డుంగట్టి చెన్నని పాదగ్రామద్వయం క్షీరనది మాకేణి కూడలి సంగమంలోను.

(3) ఉదయగిరి రాజ్యానకుం జెల్లె కందుకూరు సీమలోను పాలేటి దక్షిణ తటమునందును జిల్లేళ్ళమూడి అనెడు గ్రామము.

ఈపాలేరు నెల్లూరుమండలములో వెలిగొండలలో కనిగిరితాలూకాలో నుద్భవించి, కనిగిరి, కందుకూరు తాలూకాలలో ప్రవహించి కందుకూరు తాలూకాలోని పాకలవద్ద సముద్రమును గలియుచున్నది.

N. I. Kandukuri (8); (10) and (77)

## గండికోట ( దుర్గము ; సీమ )

ఇది కడపమండలము లోని జమ్ములమడుగు తాలూకాయందలి సుప్రసిద్ధమైన గిరిదుర్గము. పినాకినిగండికి కుడివైపున సముద్రమట్టమునకు 1670 అడుగుల యెత్తుననున్నది. దీని ప్రక్క పినాకిని రెండు మూడు మైళ్ళ పొడవున గండికోసి అందు లోతుప్రవాహముగ రెండువందల యడుగుల యెత్తుననీరెగుర గొట్టుచు, నురుగుల గ్రమ్ముచు దుర్గమునకు పెట్టని కందకమై యొప్పుట చేసి యీ దుర్గమ భేద్యమై యలరారు చున్నది.

నంది మల్లయ ఘంట సింగయ్య కవులు సాళువ నరసింహరాయల సేనాని యగు తుళువ నరసింహరాయలకు కృతినిచ్చిన వరాహపురాణ కావ్యమునందు కృతిపతి తండ్రియైన ఈశ్వరనాయకుని వర్ణించుచునెడ నతడు జయించిన దుర్గములలో గండికోట యొకటి యనియు వర్ణించిరి.

సీ. ఉదయాద్రి భేదించె హుత్తరి నిర్జించె
గండికోటపురంబు గదలఁద్రవ్వె

.... .... .... .... ....

... .... .... ....

.... .... .... .... ....

గీ. రాయచౌహత్తమల్ల ధరావరాహ
మోహన మురారి బర్బర బాహు సాళ్వ
నారసింహ ప్రతాప సన్నాహు డగుచు
విశ్వహితకారి తిమ్మయ యీశ్వరుండు.

శ్రీకృష్ణదేవరాయలు సకలదళసమేతుడై గుత్తిగండికోట మార్గముగా ఉదయగిరికి వచ్చి యా దుర్గమును స్వాధీన పఱచుకొనినట్లు రాయవాచకము నందు గలదు.

అళియ రామరాయలు గండికోట దుర్గము నవలీలగా గెల్చినట్లు రామరాజీయము నందు కలదు.

తే. సకలవిభు తిమ్మరాజు సేనలను ద్రుంచి
గుత్తి పెనుకొండ మలయగండికోటఁగంద
వోలు పురమాద వేసవలీలఁ గెలిచి
దొలుదొలుత రామనృపతి దోర్బలము మెఱసె.

ఈ గండికోట దుర్గము, లేక సీమ విజయనగర సామ్రాజ్య కాలములో ప్రసిద్ధికెక్కి. నేటికడపమండలములోని బద్వేలు, జమ్మలమడుగు, ప్రొద్దుటూరు, కమలాపురము తాలూకా ప్రాంతము నావరించి యుండెనని. యీ సీమలోని గ్రామముల యునికినిబట్టి తెలియుచున్నది. ఈ దిగువ పట్టికను జూడుడు.

| | | | | |
|---|---|---|---|---|
| గండికోట సీమ | చెర్నూలుసీమలోని వయిండాల ప్రొద్దుటూరు సమీపమున నున్న రామేశ్వరములో రామయదేవరకు దాన మిచ్చిన శాసనము. | ప్రొద్దుటూరు తాలూకా కడపజిల్లా | శ.స.1446 | శ్రీకృష్ణదేవరాయల శాసనము(1) |
| గండికోటదుర్గం | బెస్తవేముల | జమ్మలమడుగు తాలూకా | 1437 | కృష్ణదేవరాయల శాసనము (2) |
| గండికోటసీమ | కాట్రగండ్ల | కట్టేరుగండ్ల బద్వేలు తాలూకా | 1448 | కృష్ణదేవరాయల శాసనము (3) |
| ,, | చినకామెర్ల | జమ్మలమడుగు తాలూకా | 1455 | అచ్యుతరాయల శాసనము (4) |
| ,, | యర్రగుడిపాడు | కమలాపురము తాలూకా | 1471 | సదాశివరాయల శాసనము (5) |
| ,, | పెదకామెర్ల | జమ్మలమడుగు | 1475 | సదాశివరాయల శాసనము (6) |
| ,, | బండలకుంట | ,, | 1460 | సదాశివరాయల శాసనము (7) |

(1) No. 385 of M. E. R. 1904-05.
(2) No. 351 of M. E. R. 1932-33.
(3) No. 401 of M. E. R. 1925-26.
(4) No. 356 of M. E. R. 1932-33.
(5) No. 99 of M. E. R. 1929-30.
(6) No. 375 of M. E. R. 1932-33.
(7) No. 357 of M. E. R. 1932-33.

## గుంటుపల్లి

పశ్చిమ గోదావరి మండలములో ఏలూరు తాలూకా కామవరపుకోట కారుమైళ్ళు దూరముననున్న అత్యంతప్రాచీనమైన బౌద్ధారామముగల గ్రామము. ఈ గ్రామసమీపమున చైత్యాలయములు, విహారములు, స్తూపములు బయలు పడెను. క్రీస్తుపూర్వము రెండవ శతాబ్దమునాటి లిపిలో నున్న శాసన మొకటి యచ్చట లభించెను. ఇచ్చట బయలుపడిన శిలావిగ్రహములు, శిలాపేటికలు, బంగారు భిక్షాపాత్ర మొదలైనవి మద్రాసు మ్యూజియము నందున్నవి.

## గుండ్లకమ్మ (నది)

ఈ గుండ్లకమ్మనదికి కుంతి, కుండి, కుండిజ, కుండిప్రభా, బ్రహ్మకుండి యనియు నామాంతరములు. కర్నూలు మండలములో నల్లమలలలో గుండ్ల బ్రహ్మేశ్వరము వద్ద నావిర్భవించి, జంపిలేరు, ఎనుమలేరు అను ఉపనదులను జేర్చుకొని, కంబము గ్రామమును జుట్టుకొని వచ్చి, ఉత్తరాభిముఖమై పూర్వదిశకు ప్రవహించునపుడు వెలిగొండ అడ్డుపడుటచే, నెల్లూరు మండలములోని పొదిలి తాలూకాకు పశ్చిమయెల్లయై దర్శిడివిజన్‌కు నైఋతిదిక్కుగా నేర్పడి, మార్కాపురము తాలూకాలో నలుబదిమైళ్ళు ప్రవహించి, కర్నూలు మండలమును వీడి, గుంటూరు మండలములోని వినుకొండకు పదిమైళ్ల దూరముననున్న ముమ్మిడివరము సమీపమున తూర్పు దిక్కుగా తిరిగి, మరల దక్షిణ దిక్కై ఒంగోలు తాలూకా గుండా ప్రవహించి పెద్దదేవరంపాడు వద్ద సముద్రమును గలియుచున్నది. ఈ గుండ్లకమ్మ కిరుప్రక్కల పూంగినాడున్నది.

## గుడివాడ

కృష్ణామండలములోని గుడివాడ తాలూకాకు కేంద్రస్థానము. బెజవాడకు తూర్పున పాతికమైళ్ళ దూరమున నున్నది. ఇచ్చట ప్రాచీన బౌద్ధస్తూప మొకటి బయలుపడినది. నాల్గు శిలాపేటికలు లభించినవి. ఆంధ్ర శాతవాహన రాజుల నాణెములెన్నో నిచ్చటదొరికినవి. ఆంధ్రదేశములో ప్రాచీన బౌద్ధాగారములలో నొకటి. ఘంటశాల, గుడివాడ భట్టిప్రోలు మొదలగునవి తక్కిన ప్రాచీన బౌద్ధాగారములు "అలెగ్జాండరు రీ" యను నాతడీ ప్రాంతముల దొరికిన నాణెములగూర్చి యొక చిత్రపటమును ముద్రించి, వానిని గూర్చి యిట్లు వ్రాసియున్నాడు.

"ఈ నాణెములు సీసముతో చేయబడినవి. కొన్ని 101, మరికొన్ని 65, వేఱొకటివి 29 వడ్లగింజల యెత్తునుగలవు. ఆ నాణెములపై యోడలు దోనెల వోలి ధనురాకారముగ చిత్రించబడినవి. కొన్ని నాణెములపై యోడలు కుడివైపునకు, కొన్నింటిపై నెడమవైపునకు చిత్రింపబడెను. వానిపై యోడ కొయ్యలు, మ్రోకులు సహితము స్పష్టముగ ముద్రింపబడి యుండెను. ఈ యోడ ప్రతిమ లన్నియు నిలువుగ మధ్యకు జీల్చిన నెట్లగుపడునో యట్లే ముద్రింపబడినవి."

Archaeological Survey of India. New imperial Series. South Indian Budhistic Antiquities; the Krishna dt. Chap. XII. Gudivada.

## గుత్తి (రాజ్యము, సీమ.)

విజయనగర సామ్రాజ్యాధీశులైన శ్రీ వీర నరసింహరాయల, కృష్ణ దేవరాయల సదాశివరాయల నాటి శాసనములలో గుత్తిసీమ లేక రాజ్యము పేర్కొనబడినది.

(1) "గుత్తి రాజ్యములోను పెంన్నబడి తాడిపరతి రామేశ్వర దేవరకు పెన్నంబడి స్థలంలోని నెలదలపాడు"

(2) "గుత్తిరాజ్యంలోనున్ను అందుకు గుత్తిసీమనున్ను పెన్నంబడి శీమంనున్ను"

(3) "గుత్తిసీమలోని ఇగుదూరి పొలమేరను గజతింమ్మాపుర గ్రామాను"

(4) గుత్తిసీమలోని పెన్నజూటూరు.

(5) గుత్తిరాజ్యములోని పెన్నయ మాగాణిలోని చాగలె.

(6) జగతాపి గుత్తిసీమలోని పెన్నబడి మాగాణి యందలి కుమ్మెత్త

(7) గుత్తిరాజ్యములోని పెన్నమాగాణి సీమయందలి పెదపప్పూరు.

(8) గుత్తిరాజ్యములోని పెన్నబడి సజ్జలదిన్నె.

గుత్తి ఆంధ్రప్రదేశములోని అనంతపుర మండలము నందలి గుత్తి తాలూకాకు ముఖ్యనగరము. ఇదియొక బలిష్ఠమైన గిరిదుర్గము. అనంత

పురము మండల మధ్యమునుండి తాడిపర్తి సమీపముననే పెన్నానది ప్రవహించుచున్నది. పెన్న కిరువంకలనుండు ప్రదేశమునకే పెన్నబడి, పెన్న మాగాణి, పెన్నయమాగాణి యని పేర్లు. పై శాసనములలో నుదహరింపబడిన గ్రామము లన్నియు తాడిపత్రి తాలూకాలో గలవు. గుత్తిరాజ్యము అనంతపుర మండలములోని గుత్తి తాడిపత్రి తాలూకా ప్రాంతమని యూహింపనగును.

(1) S. I. I. Vol VI. No. 802 (శ. స. 1431)
(2) S. I. I Vol IV. No 808 (శ. స 1429)
(3) S. I. I. Vol IV. No. 808 (శ. స. 1435)
(4) No. 9. A. R. E. 1947-48. (శ. స. 1449)
(5) No. 2. A. R. E. 1947-48.
(6) No. 15. A. R. E. 1947-48. (శ. స. 1475)
(7) No. 16. A. R. E. 1947-48. (శ. స. 1475)
(8) No. 20. A. R. E. 1947-48. (శ. స. 1438)

## గుద్రవారము (గుద్రవారద్వయము)

ఇయ్యది శాసనములలో కూడాహారమనియు, గుద్రహారమనియు, గుద్దవాడనాడనియు కాలక్రమమున బేర్కొనబడినది. ఈ విషయము శాలంకాయన, బృహత్ఫలాయన, విష్ణుకుండిన, చాళుక్య, వెలనాటిచాళుక్య రాజన్యుల శాసనములలో వివరింపబడినది. మచిలీపట్టణమునకు వాయవ్యమున నాల్గుమైళ్ళ దూరమున ఘంటశాలకు ఆరుమైళ్ళదూరముననున్న గూడూరను పేర విలసిల్లెడి గ్రామమే యీ విషయమునకు ప్రధానగ్రామము. దీనిని బట్టియే యీ విషయమున కాపేరు పరిఢవిల్లెను. ఈ గ్రామమే "కూడూర" యని అమరావతి శాసనమందు పేర్కొనబడినది. ఇదియే టోలమీ (Ptolemy) పేర్కొన్న కుడ్డూరము.

(1) బృహత్ఫలాయన జయవర్మ కొండమూడి శాసనము.
"విజయఖంధావారానగరా కూడూరాతో కూడూరహారె గామం పాంటూరమ్"

(2) శాలంకాయన రెండవ నందివర్మ కంతేరుశాసనము.
"నందివర్మే కుద్రహారే విషయే కురువాడ గ్రామే"

(9)

(3) శాలంకాయన స్కందవర్మ కంతేరుశాసనము.

"విజయ స్కందవర్మాణా వచనాత్కూదూహార చింతపురే (చిత్తపురే)"

(4) విష్ణుకుండిన మాధవవర్మ పొలమూరు శాసనము.

"గుద్దవాడి విషయే దళియాపావితీరే పులుంబూరు నామగ్రామః మయిండవాటికి దక్షిణత సీమాంతే"

(5) మూడవ విజయాదిత్యుని బందరు శాసనము.

"విజయాదిత్య మహారాజః గుద్రవారవిషయే నివాసినేవ రాష్ట్రకూట ప్రముఖాన్ కుటుంబినః ఇత్థం అజ్ఞాపయతి........ తస్మై వినయాడి శర్మణే చంద్రగ్రహణ నిమిత్తే సర్వకర పరిహారకృత్య ట్రండపఱునామ గ్రామోదత్తః — తస్యా వధయః పూర్వతో దక్షిణతశ్చ అంగలూరు, పశ్చిమతః వెల్పూరు, ఉత్తరతః చవిటపఱు.

(6) రెండవ చాళుక్య భీముని బందరు శాసనము.

గుద్రవారవిషయ నివాసినో వంగిపఱు మహాగ్రామవాస్తవ్యో.... శ్రీ విద్దమయ్య క్రమకో విప్రానాం....తస్మై ఆకులమన్నాడు నామగ్రామ పశ్చిమదిశః....

(7) రెండవ అమ్మరాజు బందరుశాసనము.

గుద్రవార విషయ నివాసినో ....బొడ్డియనామ్నే పాంబఱు నామగ్రామస్య దక్షిణాశ్యాందిశి....

(8) మొదటి జయసింహుని పెదమద్దాలిశాసనము.

గుద్రహారవిషయే మద్దావల్లి పూర్వపార్శ్వే పెనుక పఱునామ గ్రామ ...

(9) రాజరాజు కోరుమిల్లి శాసనము.

గుద్దవాడివిషయనివాసినో కోరుమెల్లి నామగ్రామ పూర్వతః.... దక్షిణతః వానపల్లియు సమృతనియాయు మామడ్డేటియు సీమయేవ.... నెరుతియః గోధావరియసీమా—

(10) మల్లిదేవుని పిఠాపురశాసనము.
"గుద్దవాడివిషయః జీదియూరునామగ్రామో"

(11) వెలనాటి పృథ్వీశ్వరుని పిఠాపుర శాసనము.
పృథ్వీశ్వరుని పూర్వులలో నొకడగు రెండవ కుడ్యవర్మ చాళుక్యవిమలాదిత్యునిచే గుద్రవార ద్వయమును బడసెనని చెప్పబడినది.

తతస్తాహోయ సంతుష్టః కుడ్యవర్మ మహీభృతే.
విమలాదిత్య భూపాలా గుద్రవారద్వయంవదౌ ॥

(శ్లో. 18)

(12) ద్రాక్షారామములోని గుద్దవాడినాటిని పేర్కొన్న కొన్ని శాసనములు.

1. గుద్దవాడినాణ్టి పెదడాకిరేమి.
2. గంగగొణ్ణ చోడవాలనాణ్టి గుద్దవాదినాణ్టి పెద్దడాకిరేమి.
3. గుద్దవాదినాంటి క్రుందుటంరట్టడము ........ వెల్లయందుల పన్నస.

(13) సింహాచలములోని కొప్పులకాపయ నాయకుని కుమారుడు ప్రోలయ శాసనములో కాపయ కృష్ణాగౌతమీ పరివృతమైన గుద్రవాటి కధిపతియని వ్రాయబడెను.

కృష్ణా గౌతమీ వాహినీ పరివృతా గుద్రవాటీ శో
నరాధీశ కుంజర కర్ణచామరయశాః శ్రీకాపయాఖ్యోన్నృపః॥

(14) గుడివాడ (గుడివాడ తాలూకా కృష్ణాజిల్లా)లోని రెండు శాసనములలో గుడివాడ గుద్రవారము లేక గుద్రారాశములోని గ్రామమని తెలుపబడినది. గుడివాడనుబట్టియే గుద్రహారమున కాపేరు వచ్చినదనియు, గుడివాడకే కుందేశ్వరమని పేరుగలదనియు, శాసనపరిశోధకుల యభిప్రాయమై యున్నది.

E. Vol IV Page 34.

## శాసనోద్దిష్ట గ్రామనామముల పట్టిక

| | | |
|---|---|---|
| పాంటూర | పెందుర్ర | బందరు తాలూకా |
| కురువాడ | కురువాడ | ఏలూరు తాలూకా |
| చింతపుర | చింతపల్లె | ,, |
| పులుంబూరు | పొలమూరు | రామచంద్రపురము |
| మయిండవాడి | మహేంద్రవాడ | ,, |
| దళియవాని | తుల్యభాగ (ఏరు) | ,, |
| ట్రింశపఱు | తటివరు | గుడివాడ |
| అంగలూరు | అంగలూరు | ,, |
| వెల్వూరు | వేల్వూరు | ,, |
| ఆకులమన్నాడు | ఆకులమన్నాడు | బందరు |
| పాంబఱ్ఱు | పామర్రు | గుడివాడ |
| మర్ద్రాపల్లి | పెదామద్దాలి | ,, |
| పెనుకపఱు | పారుపూడి | ,, |
| కోరుమిల్లి | కోరుమిల్లి | రామచంద్రపురము |
| వానపల్లి | వానపల్లి | రాజోలు (?) |
| జోదియూరు | జోదూరు | రామచంద్రపురము |
| పెద్దడాకిరేమి | ద్రాక్షారామము | ,, |
| క్రుందురు | కుందూరు | ,, |
| వెల్ల | వెల్ల | ,, |
| గుడివాడ | గుడివాడ | గుడివాడ తాలూకా |

పై పట్టిక ననుసరించి గుద్రవార మనునది గుడివాడ బందరు తాలూకా (కృష్ణామండలము) రామచంద్రపురము తాలూకా (తూర్పు గోదావరిజిల్లా) అనగా కృష్ణాగోదావరి పరివృతమైన కొంత భూభాగమని పరిగణింప వచ్చును. గుద్రవారద్వయ మనగా, కృష్ణా మండలములోని ప్రాచీనమైన కూడూహార విషయ మొకటి, తర్వాత విష్ణుకుండిన పూర్వచాళుక్య శాసనములలో గోదావరి మండలములోని రామచంద్రపురము తాలూకాలో నొకటి యని యెన్న వచ్చును. అవి తరువాత చోళ చాళుక్యుల కాలములోని గంగై కొండచోడ వలనాంటిలో నంతర్భాగమయ్యెను.

(1) E. I. Vol VI. No. 31.
(2) J. A. H. R. S. Vol Part 1.
(3) ,, ,, ,,
(4) ,, ,, ,, VI.
(5) E. I. Vol No. 16-B.
(6) ,, ,, ,, 16-E.
(7) ,, ,, ,, 16-F.
(8) I. A. May 1884. (Vol XIII)
(9) I. A. Vol. XIV. C. LIII.
(10) E. Vol IV. No. 33.
(11) E. I. Vol. IV No. 4.
(12) (1) S. I. I. Vol IV No. 1015 శా. శ. 1006).
(2) ... ... ... 1018.
(3) ... ... ... 1231.
(13) S. I. I. Vol VI. No. (శా. శ. 1232)
(14) S. I. I. Vol V. No. 211 (శా. శ. 1158)

220

గూడూరు

ఇది మచిలీపట్నమునకు వాయవ్యమున నాల్గుమైళ్ళ దూరమునను, తూర్పు సముద్రమునకు ఏడుమైళ్ళ దూరమునను నున్న ప్రాచీనకాలమునాటి రేవుస్థలము. కృష్ణానదీ ముఖద్వారమున ప్రఖ్యాతి నొందిన వర్తకస్థానము. ఇచ్చటినుండి రోమ్, చీనా, బర్మా, కాంబోడియా, మలాకా, జావా దేశములకు వర్తక వ్యాపారము విరివిగ సాగుచుండెను.

ఇది ప్రాచీనకాలమున బృహత్ఫలాయనులకు రాజధాని. దీనినే టోలమీ యను నాతడు "కొడ్డూర"మని పేర్కొనినాడు.

(1) Mc Crindle-Ancient India as described by Ptolemy-P. 68.
(2) Dubreiul-Ancient History of Deccan. P. 85-88
(3) The Successors of Satavahans. P. 46-48

## గోదావరి

ఆర్యావర్తములో భాగీరథివలెనే దక్షిణాపథంలో దక్షిణగంగనా వెలసిన గౌతమీగంగ ప్రసిద్ధమైనది. సహ్యాద్రి పర్వతములనబడు పడమటి కనుమలలో మహారాష్ట్రదేశమునందలి నాసికమండలములోని త్రియంబక స్థానమునందుపుట్టి, నాసికనగరము ప్రక్కనుండి ప్రవహించి, పైఠాను (ప్రతిష్ఠానము) నగరమును చుట్టి, మహారాష్ట్రదేశమును వదలి, ఆంధ్రప్రదేశమున కుత్తరమున నిజామాబాద్ కరీంనగర జిల్లాలకు ఉత్తరదిశగాను, ఆదిలాబాదుజిల్లాకు దక్షిణదిశగాను ప్రవహించి, వరంగల్లు, ఖమ్మముమండలములకు తూర్పుదిక్కుగా పోయి, తూర్పు పడమటిగోదావరి జిల్లాల మధ్యభాగముగా ప్రవహించి రాజమహేంద్రవరముకడ నేడుపాయలై తూర్పుసముద్రమును గలియుచున్నది. దీనికుత్తరమున పైన్‌గంగ, ప్రాణహిత, ఇంద్రావతి, శబరి ముఖ్యమైన ఉపనదులు. మంజీరానది దక్షిణమున మెదకు, నిజామాబాద్ మండలములలో ప్రవహించి, నిజామాబాద్ మండలములో బోధన్ తాలూకా కుత్తరమున, ఉత్తర వాహినియై గోదావరిని గలియుచున్నది.

రామాయణము కిష్కింధాకాండమునందు ఆంధ్రాదిదేశప్రశంస సందర్భమున దక్షిణదేశమునందలి నదులలో గోదావరి చెప్పబడినది.

సహస్రశిరసం వింధ్యం నానాద్రుమ లతాయుతం
నర్మదాంచ నదీం దుర్గాం మహోరగనిషేవితాం ।
తతో గోదావరీ రమ్యాం కృష్ణవేణీం మహానదీం
వరదాంచ మహాభాగాంచ మహోరగనిషేవితాం॥

మహాభారతములో భీష్మపర్వములోని భారతీయ నద్యాదికథనములో గోదావరి పేర్కొనబడినది.

గోదావరీం నర్మదాంచ బాహుదాంచ మహానదీమ్
శతద్రూం చంద్రభాగాంచ యమునాంచ మహానదీమ్ ॥

రాజశేఖరుడు కావ్యమీమాంసలో గోదావరిని దక్షిణాపథములోని నదులలో నొక్కటిగా చెప్పియున్నాడు.

"నర్మదా తాపీ పయోష్ణి గోదావరీ కావేరీ
భైమరథీ వేణా కృష్ణవేణా వంజులా
తుంగభద్రా తామ్రపర్ణీ ఉత్పలావతీ
రావణ గంగాద్యానద్యాః ।

(పదునేడవ అధ్యాయము.)

మార్కండేయ పురాణములో గోదావరి సహ్యపాదోద్భవయని చెప్పబడినది.

గోదావరీ భీమరథీ కృష్ణవేణ్యా తథాపరా
తుంగభద్రా సుప్రయోగా వాహ్యా కావేర్యథాపగా
సహ్యపాద వినిష్క్రాంతా ఇత్యేతాః సరిదుత్తమాః

విష్ణుపురాణములో సహితము పై విధమునే చెప్పబడినది.

గోదావరీ భీమరథీ కృష్ణవేణ్యాది కాస్తథా
సహ్యపాదోద్భవా నద్యః స్మృతాః పాపభయాపహాః ।

నన్నయభట్టు మహాభారతాది పర్వమున నర్జునుని తీర్థయాత్రా సందర్భమున కళింగదేశమును, పురుషోత్తమ క్షేత్రమును, మహేంద్ర పర్వతమును జెప్పి తర్వాత వేంగీదేశ విభవము నిట్లు వర్ణించెను. దానిలో గోదావరిని దక్షిణగంగయని చెప్పెను.

సీ. దక్షిణగంగనాఁదద్దయు నొప్పిన
గోదావరియు జగదాదియైన
భీమేశ్వరంబును బెడఁగగుచున్న శ్రీ
పర్వతంబును జూచి యుర్విలోన
ననఘమై శిష్టాగ్రహార భూయిష్టమై
ధరణీ సురోత్తమాధ్వర విధాన
పుణ్య సమృద్ధమై పొలుచు వేగీదేశ
విభవంబు జూచుచు విభుడుదక్షి

తే. ణాంబురాశి తీరంబున కరిగి
దురితహారియైన కావేరి మహాసముద్ర
సంగమంబు భూసురేశ్వరుల కభిమ
తార్థ దానంబుఁజేసి కృతార్థుఁడగును.

శ్రీనాథమహాకవి భీమేశ్వరపురాణము తృతీయాశ్వాసములో గోదావరి నది నిట్లు వర్ణించియున్నాడు.

సీ. త్ర్యంబకాచల శిఖాగ్రమునందు నుదయించి
పొదలి యార్యావర్త భూమిఁ దఱిసి
మలఁగి దండకవనీ మధ్యభాగమున నా
ప్రస్రవణాచల ప్రస్థ మొఱసి
పట్టిస శ్రీవీరభద్రేశు సేవించి
తిలసోమనాథు మందిరము డాసి
యేచి యనంత భోగేశ్వర స్థానంబు
రుద్రపాదములపైఁ ద్రోవగాఁగ

తే. కోటిపల్లీశు కోమలాంఘ్రులకు మ్రొక్కి
కుండలాముఖ క్షేత్రంబు గుస్తరించి
భీమమండలి డాపలఁ బెట్టుకొనుచు
గౌతమీగంగ లవణాబ్ధిఁ గౌఁగిలించె.

తెలంగాణ వాస్తవ్యులైన కవులు గోదావరిని గౌతమీగంగయని వర్ణించిరి.

బమ్మెరపోతరాజు బమ్మెరలో నివసించి యేకశిలానగరమున భాగవత రచనమునకు బండితులచే ననుజ్ఞాతుడైనటుల భాగవతములో వ్రాసియున్నాడు. ఆ సందర్భమున గోదావరికి గం యనియే పేరిడియుండెను.

"అని మరియు మదీయ పూర్వజన్మ సహస్రసంచిత తపః ఫలంబున శ్రీమన్నారాయణ కథాప్రపంచ విరచనా కుతూహలుండనై, యొక్క రాకానిశాకాలంబున సోమోపరాగంబు రాకంగని సజ్జనానుమతంబున నభ్రంకషశుభ్ర సముత్తంగ భంగయగు గంగకుం జనిక్రుంకులిడి వెడలి మహనీయ మంజుల పులినతలంబున మహేశ్వర ధ్యానంబు సేయుచుఁ గించిదున్మీలిత లోచనుండనై యున్న యెడ……"

మడికిసింగన పద్మపురాణము అష్టమాశ్వాసములో శ్రీరాముడు గోదావరిని శపించి యనుగ్రహించిన కథ పట్టున గంగాపదము గోదావరికిఁ బర్యాయపదముగ ప్రయోగించియున్నాడు.

"గంగా ప్రవాహంబును గూర్చి యత్తీర్థస్నాతులకుం బునరావృత్తి లేని విష్ణుపదంబు బొందుటకు సంశయింప వలదని గంగాశబరీ సంగమస్నాన విశేషంబుఁ జెప్పి మునిగణంబు వీడ్కొని గంగననూనయించి యచ్చటు వాసి చని"

## గోదావరి మాహాత్మ్యము

పరమేశ్వరుడు గంగనుస్మదన నుత్తమాంగమున జటాజూటమునందునిచి యామె యందెక్కువ మక్కువ గలిగి యుండుటజూచి పార్వతి సహింపలేక పోయెను. ఆమె మహేశ్వరుని గంగను విడనాడుమని వేడుకొనినను, రసికుడగు నతడందుల కియ్యకొనలేదు. అంత యామె చింతించి, వినాయకుని, కుమార స్వామిని, జయను బిలిచి వారితో దన యభిప్రాయము నెఱిగించి భగవంతుని గంగను విడనాడజేయుటకు దేవాసుర యతులకైనను, మీకైనను, సాధ్యము కాదనియు, దాను హిమవన్నగమునకు బోయి దీర్ఘకాలము తపము చేయుట వల్లగాని, లేక హతకిల్బిషులును పుణ్యమూర్తులును, తపోధనులునగు బ్రాహ్మణ పుంగవుల చేతగాని తన యభీష్టము నెరవేరదనియు, జెప్పెను. వినాయకుడు తల్లిమాటలను విని యీ కార్యము తమ ముగ్గురిచేత, నిర్వర్తింపబడగలదని ప్రత్యుత్తరమిచ్చెను.

అంత భూలోకము నందనావృష్టి సంభవించెను. బ్రాహ్మణులందఱును బ్రహ్మగిరి యందలి గౌతముని పుణ్యాశ్రమమును జొచ్చి, యచ్చట నా మహాముని తపోబలము వలన సకల సుఖోపభోగముల ననుభవించుచుండిరి. అతని యాతిథ్యము త్రైలోక్యవిఖ్యాతిని గాంచెను. గౌతమునికి యసాధ్యమైన కార్యములేదని తెలియవచ్చెను. ఈ సంగతి విఘ్ననాయకుడు విని తల్లిని జూచి తాను కుమారస్వామి, జయనుగూడి గౌతమాశ్రమమునకుబోయి, యాతని యాచించిగాని, మరియే యుపాయము చేతనైననుగాని, శంభు నారాధింపజేసి తండ్రి ప్రియురాలియగు గంగను జటాజూటమునుండి విడిచిపెట్టు ప్రయత్న మొనర్తుననిచెప్పి, బ్రాహ్మణరూపధారియై గౌతమాశ్రమమునకు వెడలెను. గౌతముని యాశ్రమమునందు గొన్ని దినములుగడపి వినాయకుడు మహర్షుల నందఱను జూచి, గౌతముని యాశ్రమమునందు సకలసుఖముల ననుభవించితి మనియు, క్షామము వీడి దేశము సుభిక్షముగా నుండుటచే నింక గౌతమున్

యాశ్రమము నందుండుట భావ్యము కాదనియు, గావున వారివారి స్థానము లకు వెడలి పోవుటయే కర్తవ్యమని యుద్బోధించెను. కాని గౌతముడు కృతాంజలియై వారినందఱను దన యాశ్రమములో నుండునట్లు ప్రార్థించి, వారిని సాగనంపుటకు సమ్మతింపలేదు. అంత వినాయకుడు జయను రహస్య ముగా బిలచి గోరూపధారిణియై గౌతమాశ్రమమును జొచ్చి, యాయాశ్రమము లోని శాలిధాన్యమును దినివేయుమనియు నతడు జూచి యదలించిన యెడల భూమిపై మృతినంకినట్లు కూలుమని చెప్పెను. ఆ ప్రకారము జయ గోరూప ధారిణియై పంటను బాడుచేయుచుండుట జూచి గౌతముడు గడ్డిపోచతో గోవునదలింపగా హాహాకారముతో నేలపై గూలెను. గౌతముడా దృశ్యమును జూచి నిశ్చేష్టుడై పోయెను. ఏ పాపమెఱుగని గౌతముని మహర్షులు చూచి, యింక నా యాశ్రమమునందుండుట దగదనియు, దాము వెడలిపోయెద మనియు జెప్పగా గౌతముడు విచారచేతస్కుడై వారితో దానేమి యొనర్చిన యెడల పాపనిష్కృతిని బొందగలనని వేడెను. అంత బ్రాహ్మణరూపధారి యగు వినాయకుడు గౌతముని జూచి మహేశ్వర జటాజూటమునందున్న గంగను దెచ్చి, గోవునభిషేకించి యావెను జీవింపజేయుమని చెప్పెను అందులకు గౌతముడు సమ్మతించెను.

సర్వేషాం మతేనాయం వదిష్యత్యతి బుద్ధిమాన్
ఏతద్వాక్యం తవాస్మాకం ప్రమాణంకురు గౌతమ
బ్రాహ్మణైః ప్రేష్యమాణో సౌ గౌతమేనచ ధీమతా
విఘ్నకద్బ్రహ్మవపుషా ప్రాహ సర్వానిదంవచః

వినాయక ఉవాచ॥

సర్వేషాం మతేనాహం వదిష్యామి యథార్థవత్
అనుమన్యంతు మునయోర్మద్వాక్యం గౌతమోపిచ
మహేశ్వర జటాజూటే బ్రాహ్మణోఽవ్యక్త జన్మనః
కమండలుస్థితం వారి తిష్ఠతీతిచ శుశ్రుమః
తదానయస్వ తరసా తపసా నియమేనచ
తేనాభిషించ భగవన్ గామేనాం భువమాగతాం
తతోవత్స్యామహేసర్వే పూర్వవత్తవవేశ్మని
ఇత్యుక్తవతి విప్రేంద్రే బ్రాహ్మణానాంచ సంసది

తత్రా పతత్పుష్ప వృష్టిర్జయ శబ్దోభ్యవ ర్తత
తతఃకృతాంజలిర్భూత్వా గౌతమో వాక్యమబ్రవీత్
తపసోహి ప్రసాదేన దేవవిప్ర ప్రసాదతః
భవతాంచ ప్రసాదేన మత్సంకల్పోపిసిధ్యతాం.

మునులు వారి వారి యాశ్రమములకు వెడలి పోయిన వెంటనే గౌతముడు మనసా ధ్యానించి యిది యంతయు లోకోపకారము కొఱకును, శంభుని ప్రీతి నిమిత్తమును, పార్వతి ప్రేరణము చేతను, గంగను దీసికొను వచ్చు నుపాయమని గ్రహించి భార్యాసమేతుడై వృషభధ్వజుని గూర్చి ప్రార్థించుటకై కైలాసమునకు వెళ్ళెను.

గౌతముడు కైలాస శిఖరమునందుండి, యీశ్వరుని గూర్చి ఘోర తపము నాచరించి, యాతని ననేక విధముల స్తుతించెను. పరమేశ్వరుడు గౌతముని తపమునకు సంతుష్టినిపొంది, సాక్షాత్కరించి, కావలసిన వరముల గోర్కొనుమని చెప్పెను. అంత గౌతముడు జటాజూటములోని గంగను బ్రహ్మగిరి యందు విడువుమని శివునిగోరగా నా వరము నిచ్చెను. గౌతముడును జటాజూటములోని గంగను బ్రహ్మగిరికి గొనిపోయెను. ఇదియే గౌతమీ గంగ భూలోకమునం దవతరించిన కథ.

ఇమాం జటాస్థాం ప్రవరాం పావనీం లోకమాతరమ్
తవప్రియాం జగన్నాథ ఉత్సృజ బ్రహ్మణోగికా
సర్వాసాం తీర్థభూతాతు యావత్యాగంగామనీ
బ్రహ్మహత్యాది పాపాని మనోవాక్కాయజానిచ
స్నానమాత్రేణ సర్వాణి విలయం యాంతుశంకర.
.... ... .... .... ....
తతోగతే భగవతి లోకపూజితే
తదాజ్ఞయా పూర్ణమనాస్య గౌతమః
జటాంసమాదాయ సరిద్వరాన్వితాం
సురైర్వృతో బ్రహ్మగిరిం జగామ

(చూడుడు - సప్తగోదావరి)

(గౌతమీ మహాత్మ్యము - బ్రహ్మాండ పురాణాంతర్గతము. సంస్కృతము - తెలుగు లిపి - ముద్రణము 1896 సం.)

## గోలకొండ తీరము

పూర్వ సముద్రతీరముననున్న ఆంధ్రప్రదేశము గోలకొండ నవాబుల వశమైన తర్వాత, గోలకొండ రాజ్యమునకు పశ్చిమమున రాకపోకలకు రేవొకటిలేనందున; వర్తకవ్యాపార, వలసల, నిమిత్తము వీరికి తూర్పుతీరమున రేవొకటి గావలసియుండెను. పరిపాలనా సౌకర్యమునకై వీరు జయించిన వేంగీ కళింగప్రాంతములను నాల్గు సర్కారులుగా విభజించి, వానిపై నొక సుబేదారుని నియమించి, యాతనికి మచిలీపట్టణము రాజధాని గావించిరి. నాటి నుండియు, నీ రేవు ప్రవర్ధమానమయ్యెను. ఇచ్చటనే వారొక నౌకాదళమును నిర్మించిరి. ఉత్తర సర్కారుల నంటియున్న సముద్రతీరమునకు గోలకొండతీరమని పేరు గోలకొండ నవాబుల వాణిజ్యపోషణమువల్లనే కల్గెను.

Nilakanta Sastri. A History of South India. P. 47.
ప్రాచీనాంధ్ర నౌకా జీవనము. భావరాజు వెంకటకృష్ణరావు.

## గోలకొండ (దుర్గము - రాజ్యము)

తెలంగాణములోని విఖ్యాత గిరిదుర్గము. హైదరాబాదునకు పడమరగా అయిదుమైళ్ళ దూరముననున్నది. ఆంధ్రప్రదేశములో నొకప్పుడు మహావైభవమనుభవించి నేడు నామమాత్రావశిష్టమైన బలిష్ఠమైన కోటలలో నొకటి. మూడుమైళ్ళ పొడవుగల రాతిగోడతో నిర్మింపబడిన ప్రాకారము గలది. ఈ కోటకు 87 బురుజులు గలవు. ఇవి కాకతీయుల కాలమున నిర్మింపబడి, క్రీ. శ. 1364 సంవత్సర ప్రాంతముల బహమనీ సుల్తానుల వశమై, తర్వాత క్రీ శ. 1518లో కులికుతుబ్ షా వశమయ్యెను. ఈ గోలకొండకు మొదట మహమ్మదునగరమను పేరుండెను.

ఆంధ్రదేశమున మల్కిభరామ్ (క్రీ. శ. 1530-1580) అను పేర ప్రసిద్ధి గాంచిన ఇబ్రహీం కుతుబుషా కాలములో గోలకొండ రాజ్యము విస్తరించి, ఆంధ్రసాహిత్య పోషణమునకు ఆశ్రయమయ్యెను. ఈతని కాలముననే అద్దంకి గంగాధరకవి తపతీసంవరణోపాఖ్యానమను పద్యకావ్యము రచించి యితనికి కృతినిచ్చెను. ఈతని కాలమున గోలకొండరాజ్య మెట్లు వ్యాప్తిని గాంచెనో, కవి యిట్లు వర్ణించియున్నాడు.

సీ. పడమటను నహాయి బసవనిగాఁ జేసి
యచట గొయ్యలకొండ నావరించె
దమరి మల్లాఖాను దక్షిణంబునఁ గొట్టి
హరియించెఁ గానుగల్లాదిగిరుల
నుత్తరంబున బరిదోడి పాఱఁగఁద్రోలి
మెతుకుదుర్గం బాక్రమించి మించె
బ్రథమ దిక్కున నొడ్డి పాత్ర సామంతుల
ధట్టించి కంభముమెట్ట గొనియె

గీ. నతని బోగడంగఁ దగదె యాచతురనీతి
రూఢిగిరి దుర్గలుంఠన ప్రౌఢతేజు
వాహళిఖరాదిరోహ రేవంతమూర్తి
కుతుబుశాహిని క్ష్మాపాలు గుణవిశాలు.

ఈ కాలముననే పొన్నికంటి తెలగన్న యయాతిచరిత్రమను అచ్చ తెలుగు కావ్యము రచించి గోలకొండ తాలూకాదారగు అమీన్ ఖాన్‌నకు కృతినిచ్చెను. యయాతిచరిత్రము ప్రథమాశ్వాసములో గోలకొండ నతడిట్లు వర్ణించెను.

సీ. తెలుగంటి దొరరాల తెగలదీఱునకోట
నిగనిగల్ నలుగడల్ నిండియుండ
దమ్ములవిందు రాకొమ్మల దగదగల
వేలుపుఁ బ్రోలిర్లు విరియఁజేయఁ
గ్రొత్తడంబుల కెంపు క్రొత్తడంబులరంగు
నింగికి దోపువన్నియలు నింపఁ
గదలి యానవి చిల్వపడతి చాలగడిత
తెలినీటి నే ప్రొద్దుఁ గలసియుండ

గీ. మిసిమి బంగారుమేడల మీది యొడల
నిడినముత్యాలుఁ జుక్కలుఁ దడఁబడంగఁ
దెలియకెల్లరు వెలుగంద నలరునెపుడు
మేలువజీర్ల గమికొండ గోలకొండ.

గోలకొండ రాజ్యము మల్కిభరామ్ తర్వాత నతని కుమారుని, మనుమని కాలమున అత్యున్నతస్థితి వహించి, నేడు ఆంధ్రప్రదేశముగా వెలయుచున్న భూభాగమంతయు గోలకొండ రాజ్యముగా పరిఢవిల్లెను. ఇందులకు ఆనాటి శాసనములే ప్రమాణములు.

(1) శ. సం. 1452 కొండపల్లి మహమ్మద్ షా శాసనము.

(2) ,, ,, ,, ,,

(3) శ. సం. 1499 మల్కాపురము - ఇబ్రాహీమ్‌షా శాసనము.

(4) శ. సం. 1505 జుత్తిగ (తణుకు తాలూకా) మహమ్మద్ కులీకుతుబ్ షా

(5) శ. సం. 1512 బొడగులో (నేటి గంజాము మండలము - ఒరిస్సా రాష్ట్రము) కులీకుతుబ్ షా శాసనము

(6) శ. సం. 1514 అమీనాబాదు (గుంటూరుజిల్లా) మహమ్మద్ కులీపాదుషా శాసనము.

(7) శ. సం. 1522 ధర్మవరము ( ఒంగోలు తాలూకా ) మహమ్మద్ షా శాసనము.

(8) శ. సం. 1524 జాగర్లమూడి ( తెనాలి తాలూకా ) మహమ్మద్ కులీకుతుబ్ షా శాసనము

(9) శ. సం. 1526 సింహాచలము (విశాఖపట్టణ మండలము) మహమ్మద్ కులీకుతుబ్ షా శాసనము.

(10) శ. సం. 1582 అనుంపల్లి (గుత్తి తాలూకా) అజరతిహ నవాబు శాసనము.

(11) శ. సం. 1580 దేవులచెరువు (మదనపల్లి తాలూకా) అజరీతి శాసనము.

(12) శ. సం. 1600 లేపాక్షి (హిందూపురము తాలూకా) సుల్తాన్ అబ్దుల్ హసాన్ శాసనము.

పైశాసనములలోని వివరముల ననుసరించి నేటి ఆంధ్రప్రదేశ భూభాగమునందలి వివిధ మండలములన్నియు ఆనాడు గోలకొండ రాజ్యాంతర్గతములే యని తెలియనగును.

గోలకొండరాజ్యము పతనము క్రీ. శ. 1682లో సంభవించెను. తర్వాత మొగలాయి చక్రవర్తుల వశమయ్యెను.

గోలకొండ కుతుబుషాహి రాజన్యుల పై శాసనములు S. I. I. Vol X సంఖ్య 748–771 లలో ప్రకటింపబడినవి.

## గోవిందవాడి

చాళుక్య మహారాజైన రెండవ జగదేకమల్లుని అనంతపురము మండలములోని మడకశిర తాలూకా కొర్రేవు గ్రామములోని యొక శాసనములో నతని సామంతుడగు బొమ్మదేవ చోళ మహారాజు గోవిందవాడి నేలుచు ఆ గ్రామములోని కమ్మకేశ్వరదేవరకు నందాదీపము దానముచేసెనని వ్రాయబడినది.

ఈ గోవిందవాడి కర్ణాటికా శాసన సంపుటములందు పేర్కొనబడినది. సరియైన సీమానిర్ణయము చేయుటకు దగిన విషయములు చేకూరలేదు. గోవిందవాడికి సీమలు నిర్ణయించు శాసన మొకటి మాత్రముదాహరింపబడినది. దక్షిణాంధ్ర-మైసూరు రాష్ట్రములలో నంతర్భాగము.

E. C. Vol II No. 397. (కన్నడ శాసనముల పుటలు 175–177).

## గోస్తనీనది

ప్రాచీన పావనవార లేక పానారసీమ గుండా ప్రవహించిన యొక యేరు. పశ్చిమ గోదావరి మండలములో తణుకు తాలూకా జుత్తిక గ్రామములోని శాసనములలో పేర్కొనబడినది.

(1) శాకాబ్దె నయనేభఖేందు గణితే గూఢస్తనీతీరగే
తస్మిన్ పావనవారదేశ లలితే శ్రీదుత్తి కాఖ్యేపురే॥

(2) శాకాబ్దె భుజదంతిఖేందు గణితే శ్రీపోతనాఖ్యః ప్రభుః
ప్రాదాత్పావినవార విషయే గోధస్తనీ తీరగే దుత్తి కనామ్నె

ఈ గోస్తనీ యిప్పుడు తణుకు భీమవరము తాలూకాలలో పడమటి గోదావరి డెల్టాలో నొక కాలువగా మార్పు చెందియున్నది

ఈ గోస్తనీ నదీ సంభవము—తత్ప్రాశస్త్యమును గూర్చి యిటీవల తణుకు పంచాయతీ సోవనీర్ ప్రచురణములో గొంత వ్రాయబడినది.

వాయు పురాణాంతర్గత గోస్తనీ మాహాత్మ్యమునుండి కొంత భాగము చెప్పబడినది. ధర్మాత్ముడగు పృథుచక్రవర్తి గోరూపధారిణియైన భూదేవి-దుష్టుల భయముచే బ్రహ్మలోకమునకు బోవుచుండగా నామెను నిల్పి, అభయమిచ్చి యామె గర్భమున ధరించియున్న ఓషధులను మొదలైనవానిని గ్రహించి, దేశమును సస్యసంపన్నముగా జేసి ధర్మపరిపాలనము జేసెనట. గోరూపిణియగు భూదేవి నాలుగు స్తనములనుండి నాలుగుపయోధులను స్రవింపజేయగా నాపయోధారా పూరము గోస్తనీ నదీ నామముచే వ్యవహరింపబడెనట.

1. S. I. I. Vol X. No. 146 (శ. స. 1082)
2. ,, ,, (శ. స. 1082)
3. తణుకు పంచాయతీ సోవనీర్

ఘనగిరి (చూడుడు-పెనుగొండ)

చంద్రగిరి (రాజ్యము)

నేటి చిత్తూరు మండలమందలి చంద్రగిరి తాలూకాకు ప్రధానపట్టణము. పూర్వము తొండమండలమందలి తిరువెంగడ కొట్టములోని వైకుంఠ వలనాటిలోని యంతర్భాగము. తర్వాత జయంగొండ చోళమండలములో గలసిపోయెను. విజయనగర సామ్రాజ్య కాలమున నీభాగము ప్రసిద్ధినొంది, యిది యొక రాజ్యమునకు కేంద్రస్థానమయ్యెను. దక్షిణమున నాటి కొండవీటి ఉదయగిరి, చంద్రగిరి రాజ్యములు తెలుగునాటిని సుప్రసిద్ధ రాజ్యములు.

సాళువ నరసింహరాయలు శ్రీ వేంకటాద్రినాథ దయావర్ధిత రాజ్యలబ్ధుడౌటచే నితడు చంద్రగిరి నెలవీడుగా నొనర్చి చంద్రగిరి రాజ్యమేలెను.

విశమ్యతస్యేతి వచోనిరూపం నృపాల సింహోఽతితరాం ప్రహృష్టః
ఆరాధానైవ హారేర్నివాస మైచ్ఛత నృపశ్చంద్రగిరౌ నగర్యామ్॥

నెల్లూరు మండల శాసనములలో నొకదానియందు (అచ్యుత రాయల కాలము నాటిది) "చంద్రగిరి రాజ్యంలోను మాకు నాయంకరానకుం జెల్లె తూర్పు వడనాండి సీమలోని అచ్యుతాపుర ప్రతినామమైన నేల్లటూరును చిరుమనంబాడిని బంకాడ...."అని చెప్పబడినది. పై గ్రామములు గూడూరు

తాలూకాలో గలవు. చంద్రగిరి రాజ్యము తూర్పున నెల్లూరు మండలములోని దక్షిణ ప్రాంత సముద్రతీరము వఱకు వ్యాపించి యుండెను.

శ్రీకృష్ణదేవరాయల కాలముననున్న రాజ్యములు ఈ క్రింది శ్లోకములో చెప్పబడినవి.

ఘనగిర్యాఖ్యరాజ్యేచ గుత్తిరాజ్యేచ విశ్రుతే
రాజ్యేకందనవోలరాజ్యే గండికోటస్థ లోపిచ
సిద్ధవట్టారాఖ్యయో సిద్ధపో త్తపిసీమాఖ్య విశ్రుతే
చంద్రగిరాఖ్య రాజ్యస్య నామమండల సీమని

.... .... .... .... ....

అచ్యుతదేవరాయలిచ్చటనే పట్టాభిషిక్తుడయ్యెను తిరుమలదేవరాయల కాలమున వేంకటపతిరాయ లిచ్చటనే సామంత పాలకుడుగా నుండెను.

మ॥ హరుఁడా తారకశైల దుర్గమున నధ్యాసీనుఁడై రాజశే
ఖర విఖ్యాతి వహించు చంద్రగిరి దుర్గంబాదు శ్రీవేంకటే
శ్వరుఁ డొప్పెన్ బహురాజశేఖర సదాసంసేవ్యుఁడై యారయి
ద్ధర బంచేలికవాసి తద్గిరులకుం దద్వల్లభ శ్రీలకున్.

(వసుచరిత్రము. ప్ర. ఆ. ప. 81)

తిరుపతి శాసన సంపుటములలో నీ క్రింది గ్రామములు చంద్రగిరి రాజ్యములోనివని తెలుపబడినవి.

1. చంద్రగిరి రాజ్యములోని వైకుంఠ వలనాటిలోని అనిపురము
2. చంద్రగిరి రాజ్యములోని ఎలంబాకము
3. చంద్రగిరి రాజ్యములోని నారాయణపురము
4. చంద్రగిరి రాజ్యములోని కివైపడై నాటి

(1) వంజిప్పాకము
(2) మల్లిమల
(3) నేరులక్కన్
(4) భీమాపురము

౬. చంద్రగిరి రాజ్యములోని
(1) విలంజివేలు
(2) తణికై నాడు
(3) కుణవర్ధన కోట్టము

పై గ్రామము లన్నియు చిత్తూరు మండలములోని చంద్రగిరి. కాళహస్తి తాలూకాలలో గలవు.

(1) N. I. Gudur 107 (శ. స. 1452)
(2) A History of Tirupathi Vol II. P. 2, 6, 10, 288.

## చంద్రభాగానది

చాగి బేతరాజు మాచెర్ల (మహాదేవి తటాకము) శాసనములో (శ. స. 1031)

సపవ మహాదేవి తటాకే చంద్రభాగానదీ ప్రదేశ
ఆతుకూరిమార్గ సమీపే దశనివర్తన పరిమితాం ప్రాదాన్॥

ఇయ్యది పల్నాటి సీమలోని ముఖ్యనదులలో నొక్కటి. దీనికి చంద్రవంక యని నామాంతరము. దక్షిణమున నుండి ఉత్తరాభిముఖమై కృష్ణానదిలో గలియుచున్నది.

S. I. I. Vol X. No. 66.

## చక్రకొట్టమండలము

ఛిందకుల రాజగు మధురాంతకుని శా.శ. 987 నాటి రాజపుర తామ్రశాసనములో నీ మండల నామము పేర్కొనబడినది. ఈ చక్రకొట్టము బస్తరు రాజ్యములోని రాజపురమున కెనిమిది మైళ్ళ దూరమునను న్న చిత్రకోటమను గ్రామము. ఈ శాసన ప్రకారము భ్రమరకోట్య మండలములోని రాజపుర మను గ్రామమును మధురాంతక దేవునిచే మేడిపోతుడను వానికి దానమీయబడినది. ఈ దానమునకు సాక్షులు చక్రకోట్య మండలములోని శ్రీధారేశ్వర, మధుశేలి, నాగహస్తి, కరణదారియా, యనువారలు. శాసన పరిష్కర్తలు చక్రకోట్య మండలమునకే భ్రమరకోట్య మండలమను పేరై యుండవచ్చునని సెలవిచ్చిరి.

పూర్వ చాళుక్య ప్రభువైన మూడవ విజయాదిత్యుడు గెల్చిన చక్ర కోటమును, చోళరాజైన రాజేంద్రచోళుడు జయించిన సక్కర కొట్టమును చోళచాళుక్య రాజైన కులోత్తుంగ దేవచోళుడు ముట్టడించిన చక్రకోటము నొక్కటియే. దీనినే బిల్హణుడు విక్రమాంకదేవ చరిత్రములో పశ్చిమ చాళుక్య విక్రమదేవచక్రవర్తి విజయధాటిలో గెల్చిన మండలములలో చక్రకోటమనెను. అదియే యీ చక్రకొట్టము.

E. Vol IX Rajapura Gopper Plates of Madhurantaka-deva. No. 23. (A. D. 1065).

## చీకటి

ఈ చీకటి (సీమ) సింహాచలము శాసనములో నొకదానియందు పేర్కొనబడినది. తూర్పు గంగరాజగు అనంతవర్మ వీరశ్రీనరసింహదేవర గంగవంశ అమాత్యుడగు అనంతజియ్య సింహాచల నృసింహునికి పూర్వ దత్తములైన పాఅతలగాము విషయములోని కోడూరు, జమ్ము అను రెండు గ్రామములు-చీకటిలో కోడూరును జమ్మును-బొబ్బిలిలోని మధుపాడ, పోఅూము, కిండానపల్లి కోడాముగా ఊళ్ళు అయిదును స్వామి అవసరాలకు చెల్లునట్లుగా దానము చేసెను. ఈ శాసనము శ. స. 1203 నాటిది. అప్పటికే చీకటి యొక చిన్న సీమగా నుండెనని యూహింపవచ్చును. దీనినే అల్లాడ వేమారెడ్డి తన దిగ్విజయములో స్వాధీన పఱచుకొనెను.

S. I. I. Vol V1 No. 1118.

## చీకూరవిషయము

తూర్పు గోదావరి మండలములోని చోడవరము తాలూకా శరభవరమను గ్రామమున దొరికిన ఎనిమిదవ శతాబ్దమునాటి సంస్కృత శాసనములో నిది పేర్కొనబడినది.

"ఓం స్వస్తి శ్రీ విజయ చీకూర పురాత్ ....చీకూర విషయాధిపతిః పులక గ్రామాణ్యాయుక్త కాశ్చైవ ఆజ్ఞాపయః।"

ఈ శాసనములో దాత పేరు లేదు ప్రతిగ్రహీత హారితగోత్రుడైన హారిశర్మయను బ్రాహ్మణుడు. దాన మొసంగబడిన గ్రామము పులక. శాసన పరిశోధకులు దీనిని గుర్తింపలేరు. చీకూరపురము చోడవరము

తాలూకాలోని చీడేరు. పులక లేక పులోక యనునది. ఈ తాలూకాలోనిదే గుయ పలకూరు అను పల్లె. చీరూర విషయము నేటి తూర్పు గోదావరి మండలములోని చోడవర ప్రాంతమునగల మన్నె దేశము.

E. I. Vol XIII P 104-105

చెంగఱ

కోరుకొండ రాజ్యము నేలిన ముమ్మడి నాయకుడు ఉభయ గోదావరితట ప్రాంత భూములగు కోన, పానార, కురవాట, చెంగఱ సీమల పాలించుచుండెనని యతని శాసనములో వక్కాణింపబడినది.

(1) ప్రథితోభయ గోదావరీ మధ్య ప్రాంతేషు మహిత సౌభాగ్య
వాన్ పాలయతి ముమ్మడీంద్ర శ్చెంగఱ కురవాటకోనపానరాన్
(2) పానార, కోన, కురవాటక, చెంగరాదీన్
గోదావరీ ముభయ తోయము పాంత దేశాన్
జిత్వా వనాచల జలస్థల దుర్గరమ్యా
నేకః ప్రశాస్తి చిర మప్రతి శాసనం ॥

చాళుక్య భీమవరములోని యొక శాసనమునందొక దాత "చెంగనాంటి స్థలములోని సమత్తుపూడి జాలగని యొకటి చాళుక్య భీమేశ్వర దేవరకు నగరు కట్టను ధారవోసి" యీయబడినట్లు వ్రాయబడినది. సమత్తుపూడి, పెద్దాపురము తాలూకాలోని మత్రుపూడియను గ్రామము. చెంగఱయే నేడు తూర్పుగోదావరి మండలములో చాగల్నాడని వ్యవహరింప బడుచున్నది. ఇయ్యది యా మండలములో రాజమహేంద్రవరము, పెద్దాపుర తాలూకాలలోని మన్యప్రాంతము.

1. ముమ్మడి నాయకుని శ్రీరంగము శాసనము E. I. Vol XIV. P. 8896 (క్రీ. శ. 1368)

2. ముమ్మడి నాయకుని కోరుకొండ శాసనము. S. I. I. Vol X. No. 554. (క్రీ. శ. 1368.)

3. సింగనాయకుని అక్కలపూండి శాసనము. E. I. Vol XIII. No. 24. (క్రీ. శ. 1368)

4. S. I. I. Vol V No. 43.

## చెదుపులినాడు

నెల్లూరు మండలములోని రాపూరు తాలూకాలోని పాలిచెర్లపాడు గ్రామమందలి వీరతిరుక్కోలణీ దేవుని తలారి యగు దామనాయకుని శాసనములో నతడును, అతని భార్యయు, చెదుపులి నాటిలోని పాలచేల నుందు శ్రీమతుభుజబల మల్లిఖార్జున మహాదేవరకును గుడి యెత్తించెనని గలదు పాలచేలను గ్రామమే పాలిచెర్లపాడు. చెదుపులినాడా ప్రాంతమే యైయుండవచ్చును.

N. I. Rapur (47) (శ. స. 1133)

## చెర్బూరిదేశము

కాకతీయ గణపతి మహారాజు కాలమునాటి మంథెన శిలాశాసన ములో నీ చెర్బూరి దేశము పేర్కొనబడినది. ఈ శాసనములో కాకతీయ గణపతిదేవ మహారాజు యొక్క సమ్మతితో చెర్బూరిదేశ పాలకుడగు అల్లుం ప్రోలరాజు, గణపతిదేవ మహారాజు పురోహితుడైన మంచిభట్టోపాధ్యాయు లకు భూదానము చేసినట్లు వ్రాయబడినది.

"కాకతీయ గణపతిదేవ మహారాజానుమత్యా చెర్బూరిదేశపాలకేన ధర్మమతినా అల్లుప్రోలాజేన గణపతిదేవ మహారాజ పురోహితాయ త్రిభు వన విద్యాచక్రవర్తి మంచిభట్టోపాధ్యాయ గోదావరీ ప్రాణహితో సంగమే.... దేశోదత్తః" (1)

గోదావరీ ప్రాణహితా నదులు అదిలాబాద్ మండలములో చిన్నూరు తాలూకాలో చిన్నూరునకు తూర్పున ఆరుమైళ్ళ దూరముననున్న శిరోంచ గ్రామము దగ్గఱ కలియుచున్నవి. చిన్నూరు తాలూకాకు గోదావరి దక్షిణముననను, ప్రాణహిత తూర్పునను బ్రవహించుచున్నవి. శాసనములోని దేశము, నేటి చిన్నూరు తాలూకా ప్రాంతము. (2)

(1) E. I. Vol XXXIV. No. 13 Inscription Manthani.

(2) Imperial Gazetter. Hyderabad State Warangal Division - Adilabad District Page 32.

## చోడపాండ్యపురము

ఇది ఘంటశాలకు నామాంతరము. కులోత్తుంగ చోడుని కాలము నాటి శాసనములు.

(1) ఘంటశాల యయ్న చోడపాండ్య పురమున
(2) ఘంటశాలయైన చోడపాండ్యపురము.
(3) ఘంటశాలయైన చోడపాండు పురము.

ఘంటశాల కృష్ణా మండలములోని దివి తాలూకాలోని గ్రామము. చాళుక్య చోళు లాంధ్రదేశ పాలకులుగ నున్న కాలమున వారి పేరనే మండలములు గ్రామములు వెలయింపజేసిరి.

(చూడుడు కంటకసెల-ఘంటశాల)

1. S. I. I. Vol V No. 115. (శ. సం. 1066)
2. ,, ,, 140. (శ. సం. 1079)
3. ,, ,, 145. (శ. సం. 1081)

## జంతఋనాడు

విశాఖపట్టణమండలములోని సింహాచల దేవాలయములోని శాసనము లందు పేర్కొనబడినది.

| శాసనము | నేటి గ్రామస్థల నిర్దేశము | |
|---|---|---|
| 1. జంతఋనాటి డెబ్బదింటిలోని వీర నారాయణ పురము (శా.శ. 1109) | వీరనారాయణం | శృంగవరపుకోట తాలూకా |
| 2. జంతుర్నాటి జాంకేటి గుడివాడ (శా. శ. 1331) | గుడివాడ | ,, |
| 3. జంతుర్నాటి ప్రతాప చింగరాజులు సమర్పించిన కొలువులులకు మరపు కోలు గంగానారాయణ చెఱువు వెనుక క్షేత్రము. (శా. శ. 1353) | లక్కవరపు కోట | ,, |

| | | | |
|---|---|---|---|
| 4. జంతఋనాటి మారందపల్లి జల క్షేత్రము. (శా.శ. 1370) | మార్లాపల్లె | ,, | |
| 5 జంతుర్నాటి సీమలోను ఉత్తరాపల్లి | పుత్తరావిల్లి | ,, | |
| 6. జంతఋనాణ్టి వీరసవర నాద దేవండు బ్రోణి. | బోని | భీమునిపట్టణము తాలూకా | |

శ్రీనాథుడు కాశీఖండములో అల్లాడ వేమారెడ్డి విజయముల నిట్లు వర్ణించి యున్నాడు.

సీ. సప్తమాడియరాజ్య చంద్రబింబాననా
చికురవల్లరులపై జన్నిపువ్వు
ఝూడె జంతుర్నాటి జననాథ శుద్ధాంత
కుచకుంభముల మీఁది కుంకుమంబు.

పై గ్రామములన్నియు శృంగవరపుకోట తాలూకా యందుండుట చేతను ఒకటి భీమునిపట్టణము తాలూకా యందుండుట చేతను, జంతఋనాడు నేటి విశాఖపట్టణ మండలములోని శృంగరపుకోట తాలూకా ప్రాంత ప్రదేశమని యూహింప వచ్చును.

1. S. I. I Vol VI. No. 1189.
2. ,, ,, ,, 711.
3 ,, ,, ,, 925.
4. ,, ,, ,, 913.
5. ,, ,, ,, 698.
6. ,, Vol X ,, 724.

## జననాథ నగరి

ఇది చాళుక్య చోళ్య ప్రభువులకు కుల రాజధాని. రాజరాజ ముమ్మడి చోడుడు క్రీశ. 1076 సంవత్సరమున నిచ్చట పట్టాభిషిక్తుడయ్యేను. రాజరాజ చోడగంగ పరాంతకదేవుడు జననాథపురము నుండియే రాజ్యపాలనము గావించిరి.

రాజరాజ చోడగంగుని టేకి తామ్రశాసనములో[1]

"శ్రీ చోడగంగదేవః సకల ధరాతల సామ్రాజ్యలీలా సుఖమనుభవన్ కదాచిత్ కుల రాజధాన్యాం జననాథ నగర్యాం"

అని జననాథనగరి తనకుకులరాజధాని గాగలదని వ్రాయించెను.

ద్రాక్షారామము లోని కొన్ని శాసనములలో జననాథపురము పేర్కొన బడినది.

(1) జననాథనామ నగరే .... .... స్వస్తిశ్రీ కులోత్తుంగ చోడదేవరైన శ్రీ రాజరాజదేవర విజయరాజ్య సంవత్సరంబులు .... జననాథపురమున శక వర్షంబులు 1072—

(2) పరాంతక చక్రవర్తి - ఏష జననాథ పురీయాం ప్రధాన ప్రసాదాంత ర్వర్తిన్యభిషేకమంటపే .... శా. శ. (1039)

ఈ జననాథ నగరి, ద్రాక్షారామ సమీపమునను న్న జగన్నాయకుల పాలెము. దీనిచే ద్రాక్షారామమని శాసన పరిశోధకులు గుర్తించిరి.

(1) రాజరాజ చోడగంగుని టేకి శాసనము.
E. I. Vol. VI. No. 35. (శ. క. 1006)
(2) S. I. I. Vol VI. No. 1091.
(3) ,, ,, ,, 1384.

## ఝాడె (ఝాడు)

ఈ ఝాడె లేక ఝాడు అను గ్రామము సోంపేట తాలూకాలోని ఝాడు లేక ఝాడుపూడి యను స్థలము. శా.శ. 1294 సంవత్సరము నాటిది యగు ఝాడుపాల పడిరాయని శాసన మొకటి సింహాచల శాసనము లందు గలదు. దానిలో "స్వస్తిః శ్రీ శాకాబ్దేభి నందదుర్యమణి పరిమితే శుక్లపక్షే నభస్యే రాకాయాం సోమవారే సకల గుణగణాలంకృతో ఝాడుపాలః ప్రాదా దాచంద్రతారం విమలతర యశాః పుణ్య సంతాన వృద్ధై శ్రీమత్సింహాద్రి చూడామణి హరయే చంద్ర శుభ్రాతపత్రం ॥

ధనంజయ గోత్రుండును గోపాల నాయంకర కుమారుడు నగు ఝాడుపాల పడిరాయుడు సింహాద్రి దేవరకు ధనళ ఛత్రము చేసెనని గలదు.

శ్రీనాథుడు భీమేశ్వరపురాణములో వీరభద్ర వేమారెడ్ల కనుగు మంత్రి యగు బెండపూడి అన్నామాత్యు నభివర్ణించు సందర్భమున వీరభద్ర వేమారెడ్లు సప్తమాడియరాయ ఝాడియక్ష్మా పాలవందిత శ్రీపాద వన రుహులనియు, లింగన మంత్రి వర్ణించు నెడ నతడు ఝాడేశవన సప్తమాడె బారుహ దొంతి వంతునాది క్షితీశ్వరుల గెలిచె ననియు వ్రాసియున్నాడు.

**S. I. I. Vol VI No. 1110.**

## టెంకణము (తెంకణము)

అనంతపురము మండలము అనంతపురము తాలూకా తాడిపత్రి గ్రామములోని రామేశ్వరాలయమునందు శా. శ. 1120 నాటి శ్రీ మహా మండలేశ్వర ప్రతాపకుమార ఉదయాదిత్య మహారాజు వ్రాయించిన కన్నడ శాసనములో నీ టెంకణ దేశము పేర్కొనబడినది. ఈ శాసనము ఆంధ్ర దేశ ప్రాచీన చారిత్రిక భూగోళ విషయమున కమూల్యమైనది.

నవరత్న భరిత జలచర
నివహ పరితుభిత బహుళ కల్లోలరవ
ప్రవి ఘూర్ణమాన లవణా
ర్ణవ పరివృత మనిపుద్రంటు జంబూద్వీపం ॥

అముశత సహస్ర యోజన గదిత సువిస్తార మాగి సమవృత్తా కారది సిర్పుడడలు మధ్యప్రదేశ దోళ్మంధరాద్రి సొగయిసి తోర్కు.

మేరు మహామహీ ధరద తెంకణ భారత వర్షదోళుగునో
హోరి యిదెంచిన నొళ్పకుంతల దేశద పూర్వభాగ దోళు
సారి మరప్పుదంధ్ర ధరణీతల వందదజొందె తెంకణా
ధారణి యల్లి పెన్నపరినాడు నిరంతర ఒప్పితోఅగుం॥

జంబూద్వీపములో భరతవర్షమునందు కుంతలదేశమునకు పూర్వదిక్కున ఆంధ్రదేశమందు తెంకణ రాష్ట్రములో పెన్న పరినాడొప్పి యుండెనని పై కన్నడ పద్యముల భావము.

కవిరాజశిఖామణి నన్నిచోడుడు కుమారసంభవ ప్రస్తావనలో తాను తెంకణా (టెంకణా) దిత్యుడనని, చెప్పుకొన్నాడు. ఈ తెంకణము (తెంకణము) ను గూర్చి తెలుగు కావ్యములలోని మొదటి ఉదాహరణ మిదియే కావచ్చును.

శాసనములలో తెంకణాదిత్య బిరుదాంకితులలో రేనాడేలిన వెంకయ చోడమహారాజు ప్రథముడు గానోపును. ఈ శాసనము పదియవ శతాబ్దము నాటిది రెండవవాడు కోనిదెన చోడులలో ప్రసిద్ధుడైన త్రిభువన మల్లదేవ చోడ మహారాజు, ఇతనికి తెంకణాదిత్య బిరుద మున్నట్లు గుంటూరు జిల్లా నరసరావుపేట తాలూకా కోనిదెన గ్రామము నందలి శంకరస్వామి దేవాలయములో నిట్టు లిఖింప బడినది. "ఆదిత్య వంశతిలకుండు తెంకణా దిత్యుండు ఊర్జితుండు ఆ త్రిభువనమల్ల ధాత్రీనాథుండు". ఆ దేవాల యములోని కాకతీయ గణపతి చక్రవర్తి సామంతుడుగ కమ్మనాడేలిన రెండవ జోపిలి సిద్ధికి తెంకణాదిత్య బిరుద మున్నట్లు వ్రాయబడినది.

తెంకణము - కర్నాటికి దక్షిణమునను, పాకనాటికి పడుమటను, ములికినాటి కుత్తరమునను, ఇప్పటి అనంతపురము మండలములోని తాడిపత్రి తాలూకా ప్రాంతమై యుండును.

(1) S. I. I. Vol IV. No. 798.
(2) S. I. I. Vol VI No. 624.
(3) ,, ,, ,, 628.
(4) దొంగల సాని శాసనము త్రిలింగ రజతోత్సవ సంచిక.

## దహాల (నిరుతము)

చాళుక్య భీముని ధర్మవరము శాసనము నందు పాండురంగని విజయ సంరంభ ప్రశంసలో పేర్కొనబడినది.

ఆ. వె. కిరణపురము దహాల నిరుతంబు దహెనాడు
నచలపురము నొచ్చె నచలితుండు
వల్లభుండు గుణకె నల్లుండు పంచిన
పండరంగు చూరె పండరంగు.

ఈ డహాలదేశము పూర్వము చేదిమండల మనబడు దేశము. మధ్యప్రదేశములోని బందేలు ఖండప్రాంతపుదేశ విభాగము. డహాలనిరుత మనగా డహాల మండలములోని నైర్ఋతి భాగము.

1. ధర్మవర శాసనము:- భారతి విభవ సం॥ చైత్రమాస సంచిక శ్రీ సోమశేఖర శర్మగారిచే పరిష్కృతము.

2. శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారి వ్యాసములు. భారతి సంపుటము 23. సంచిక 10, 24, 8, 11.

## తంగెడసీమ (విషయము)

తంగెడ గుంటూరు మండలములో పల్నాటి తాలూకాలోని గ్రామము. ఈ సీమలోనిదని పేర్కొనబడిన గ్రామముల పట్టిక నీ దిగువ నియ్యబడినది శాసనములు సదాశివరాయుల కాలమునాటివి.

| | | |
|---|---|---|
| గుత్తికొండ | గుత్తికొండ | పల్నాడు తాలూకా |
| వేముల గడ్డ | వేముల గడ్డ | ,, |
| జానపాడు | జానపాడు | ,, |

కాకునూరి అప్పకవి (క్రీ. శ. 1656) తంగెడుసీమ నిట్లు వర్ణించి యున్నాడు.

"భరతవర్షంబున భరతఖండంబున
మంగళోర్విని కర్మమహిత భూమి
మలయ వింధ్యాచల మధ్యమంబునఁ గృష్ణ
యామ్యతీరమున బ్రహ్మాశ్రమమున

దండకాటవి నంధ్రాభిధాన పుణ్య
దేశమున శ్రీగిరీశాన్యదిశను గొండ
వీటి పడమటఁ దంగెడువిషయమునను"

తంగెడసీమను నిర్జర
గంగాసమనాగ నిమ్నగాపూర్వమునం
పింగళిపుర దక్షిణమున
రంగుగ నెలకొన్న గోపరత్నంబునకున్

(అప్పకవీయము 1-84, 101)

M. E R. 1925-26 No. 8 373. 376, 377.
,, 1929-30 No. 52, 59, 53

**తరుణాసిరి**

శ్రీనాథుని హరవిలాసమున అవచితిప్పయసెట్టి వర్తకవ్యాపార మొనర్చిన దేశములలో చెప్పబడినది.

మ. తరుణాసిరి, తవాయి, గోవ, రమణా
స్థానంబులం జందనా
గరు కర్పూర హిమాంబు కుంకుమ రజః
కస్తూరికాద్రవ్యముల్
శరధిన్ గప్పలి జోగు వల్లిపలికా
సమ్మాన్నల్ దెప్పించు నే
ర్పరియై వైశ్యకులోత్తముం డవచి తి
ప్పండల్పుడే యిమ్మహిన్.

ఇందు పేర్కొనబడిన తరుణాసిరి నేటి బర్మామండలములోని టెనాసిరమను సముద్రతీర దేశము. పదునాల్గవ శతాబ్దములో సయామ్ (థైలాండు) రాజులపరిపాలనములో నున్న దేశములందొకటి. ఆ పేరటనే ఒక లంకయు, పట్టణమును గలవు.

Indian Antiquary Vol XXIII. P. 100. Some remarks on Kalyani Inscriptions.

**తఱెనాడు**

మొదటి చాళుక్య భీముని ధర్మవరము శాసనములో

ఆ. వె. కిరణపురము డహాల నిరుతంబు దఱెనాడు
నచలపురము సొచ్చె నచలితుండు
వల్లభుండు గుణకె నల్లుండు పంచిన
పండరంగు చూరె పండరంగు

ఈ తఱెనాడు మైసూరు రాష్ట్రములోని, కర్ణాటికా శాసన సంపుటము అందును మైసూరు రాష్ట్రి శాసన నివేదిక అందును "తొఱెనాడని" పేర్కొన బడినది. మైసూరు మండలములోని చామరాజనగర తాలూకా నరసింహ మంగలమను గ్రామములోని యొక శాసనములో హోయిసల మూడవ బళ్లాల దేవుని దండనాయకులు తొఱెనాడేలుచుండగా వారా గ్రామమును దగ్గ్రామమునందలి రామనాథ దేవునికి దానము చేసెనని చెప్పబడినది. ఆ గ్రామ సరిహద్దులలో సరగూరు, తగడూరు పేర్కొనబడినవి. ఈ సరగూరు కబ్బని నదీ దక్షిణ తీరమున మైసూరునకు ముప్పదియారు మైళ్ల దూరమున గలదు ఈ తొఱెనాడా ప్రాంత భూ భాగమై యుండవచ్చును.

ఎఱగంగని బ్రిటిష్ మ్యూజియము తామ్ర శాసనములో నతడు తొఱె నాడు. కొంగలనాడు ఏలుచుండెనని వ్రాయబడెను. ఈ తొఱెనాడు అయిదు వందల గ్రామ పరిమితియని "తొఱెనాడు అయినూరుమ్" అని దానిలోనే చెప్పబడినది. ఇంతకన్నను విషయనిర్ధారణమునకు వీలు కలుగలేదు. భావి పరిశోధనవల్ల గాని తెలియనేరదు.

1. ధర్మవర శాసనము. శ్రీ సోమశేఖర శర్మగారిచే పరిష్కృతము. భారతి విభవ సం॥ చైత్రమాస సంచిక.

2. ఎఱగంగని శాసనము. I. A. I. Vol XIV-CL VII. British Musium Plates of Ereganga.

3. నరసింహ మంగల శాసనము.
My. A. R. 1937. Page 202.

**తవాయి (చూడుడు-తరుణాసీరి)**

శ్రీనాథుని హరవిలాసములో ఆవచి తిప్పయసెట్టి వర్తకవ్యాపార మొనర్చిన దేశము లలో నొకటిగా చెప్పబడినది. ఇయ్యది బంగాళాఖాతమున బర్మాతీరముననున్న యొక చిన్న ద్వీపము. పదునాల్గవ శతాబ్దమున ఇయ్యది సయామ్ (థైలాండు) ప్రభువుల పరిపాలనమున నుండెను.

Indian Antiquary Vol XXIII P. 100. Some remarks on Kalyani Inscriptions.

**తాలాడినాడు**

ఈ తాలాండినాడు ఎఱద విషయములో నంతర్భాగము.

(1) ఎఱద పంపున తాలాండి పంద్రెణ్టికి లోనైన ధర్మవోరము

(2) ఎఱద పంపున తాలంక నంద్రట్టిలోనికి తటరాన

(3) ఎఱద పంపున తాలండచోప గంగ దేవరకు

(4) తాలాడు నాంటి కలువచేఱు

ధర్మవోరము, కలువచేఱు గ్రామములు నేటి విశాఖపట్టణము జిల్లా విజయనగరము తాలూకాలోని ధర్మపురి, కలవచెర్ల గ్రామములు. తాలాడి నాడు విజయనగరము తాలూకాలోని కొంతభాగమై యుండును.

1. S. I. I. Vol X. No. 702. (S. 1071)
2. S. I. I No. 707 (S. 1075)
3. S. I. I. No. 708 (S. 1075)
4. S. I. I Vol VI. No. 957. (S. 1219)

**తిగుళభూమి**

పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి సాళువ నరసింహరాయల దిగ్విజయములను వర్ణించునెడ, నతడు తిగుళ భూమిని జయించెనని యీ క్రింది సీస పద్యములో వర్ణించెను. (1)

సీ. తిగుళ భూములు తెంకులుగ జరించిన దొడ్డ
చెవుల పోతులనెల్లఁ జెండిపైచి

తిగుళ = తిగళ; ద్రవిడ - ద్రావిడ. Tamil Country
(Kittel-A Kannada - English Dictionary.)
తిగుళ భూమి యనగా తమిళ దేశమని యర్థము.

(1) Sources of Vijayanagar History P. 86.

## తిరుపతి

మహేంద్రపర్వతముల యందలి నల్లమలకొండల వరుసలో నీ తిరుపతి చిత్తూరుమండలములో చంద్రగిరితాలూకా యందున్న సుప్రసిద్ధ పుణ్య క్షేత్రము. ఈ తిరుపతికొండలు నేడు కొండలుగా విభజింపబడినవి. అవియెవనగా (1) వరహాచలము (2) అంజనాచలము (3) నారాయణాచలము (4) వృషభాచలము (5) సింహాచలము (6) గరుడాచలము (7) శేషశైలము.

వేంకటాచల మహాత్మ్యములో నీ శేషాద్రి యిట్లు వర్ణింపబడెను.

"ఆ శేషుండప్పుండరీకాక్షునకు దండప్రణామంబు లాచరించి పర్వతాకారంబు గొంచె. అప్పర్వత ప్రమాణంబు చెప్పెదవినుము దశయోజన విస్తీర్ణంబై ముప్పదియోజనంబులు నిడివి గలిగియుండునట్టి శేషాఖ్యనొందిన మహాద్రి ఫణప్రదేశంబు వెంకటాద్రియు, మధ్యప్రదేశంబు అహోబిలంబును, బుచ్ఛంబు శ్రీశైలంబును నగుచుండ...."

ఈ పుణ్యక్షేత్రము భరతఖండమునందు నాడును నేడును సుప్రసిద్ధమై యొప్పుచున్నది.

సీ. మాళవ నేపాళ మళయాళ బంగాళ
చోళ కొంకణ సింధు శూరసేన
సౌవీర కుంతల శక కళింగ కిరాత
కోసల కేకయ కుకుర సాళ్వ

ద్రవిడ పుళింద విదర్భ మహారాష్ట్ర
బర్బరాభీరాంధ్రపాండ్య మగధ
కాంభోజ కొంకణ కాశ్మీర ముఖ్య దే
శస్థులు వేంకటాచలము చేరి

తే. పుష్కరిణిలో మునింగి శ్రీభూవరాహ
దేవు నీక్షించి వేంకటదేవుగాంచి
సకల వస్తువులర్పించి సంతసించి
యాడుచుం బాడుచుందు రనయమందు.

ఈ పురవర్ణనము ఇట్లు గావింపబడినది.

సీ. ఘనగోపురములు ప్రాకారమంటపములు
తేరులు సత్పుణ్యతీర్థములును
కమలాప్తకిరణ సంకలితంబులై ప్రకా
శించుచుం డెడు హేమశిఖరములును
పావన పరివార దేవాలయంబులు
మహిమనొప్పు విరక్తమఠవరములు
రంగత్తురంగ మాతంగ తురంగము
ల్గ్రామరాదు బహుసాధు గోగణములు

తే. ముద్దుగాఁబల్కు శుకపికములును నీల
కంఠములును మరాళసంఘాములు మఱియు
ఫలవనంబులు తులసికాదళ సుమములు
క్రిక్కిఱిసి యుండు వేంకటగిరిని నెపుడు.

తిరుపతికి వెంగడమని పేరు. వేంకటేశ్వరస్వామికి తమిళాంధ్ర శాసనములలో తిరువేంగడనాథుని నామము. ఈ ప్రాంతమునకే తిరువేంగడ కొట్టమని ప్రాచీన తమిళశాసనములలో గలదు. ఈ తిరువేంకటకొట్టము మొదట తొండమండలము తర్వాత జయంగొండ చోళమండలము, అటుపిమ్మట రాజేంద్ర చోళమండలములో నంతర్భాగమయ్యెను. ఆయా రాజన్యుల పరిపాలనకాలమున మండలముల పేర్లుమార్పుచెందినవి. తిరువెంగడకొట్టములో నంతర్భాగము కుడవూరునాడు. కుడవూరునాటిలో తిరుపతి దాని ప్రాంత

గ్రామములు గలవు ఈ కుడవూరునాటికే తిరుక్కుడవూరునాడని నామాంతరము.

వెంగడమను దేశము తమిళనాటికి ఉత్తరపుటెల్ల. వెంగడమను కొండ యుండుటవల్ల నీ ప్రాంతమునకు వెంగడమను పేరు వచ్చియుండును. ఈ వెంగడమునకే వెంగోరాష్ట్రమని పేరు వచ్చియుండెనని యూహింపవచ్చును. పల్లవరాజైన రెండవసింహవర్మ మాంగడూరు శాసనములో వెంగోరాష్ట్రము పేర్కొనబడినది. నెల్లూరి మండలములో సూళూరుపేటలోని తురంగీశ్వర స్వామి యాలయములో వ్రాయబడిన తమిళశాసనములో పై యూరిలం కొట్టములోని వెంగనాంటిలోని సురలూరనియెడిసింగలంతపురమని సూళూరు పేట పేర్కొనబడుటవల్ల వెంగనాడు లేక రాష్ట్రము దక్షిణనెల్లూరు మండలము, చెంగల్పట్టు జిల్లా ఉత్తరభాగము, చిత్తూరు మండలములోని చంద్రగిరి, కాళహస్తి తాలూకాలు గల ప్రాంతమైయుండనోపును.

నెల్లూరు మండలములోని ఉదయగిరి యందలి శాసనములో తిరుపతి వెంకటేశ్వరునకు వెంగడనాథుడనియె పేరు గలదు. సాళువ తుళువ ఆర్వీటి వంశ విజయనగర సామ్రాజ్యాధీశులొసగిన శాసనములలో వేంకటేశ్వరునకు తిరువెంగడ లేక తిరువెంగళనాథుడనియు పేర్లు. తిరుపతి విజయనగర సామ్రాజ్యాధీశుల చంద్రగిరి రాజ్యమునందుండెను. సాళువ, తుళువవంశ విజయనగర సామ్రాజ్యాధీశులు వేంకటేశ్వరప్రసాద లబ్ధరాజ్య వర్ధనులు. అందును శ్రీకృష్ణదేవరాయలకు వేంకటేశ్వరుడు ఇష్టదైవము.

(1) A History of Tirupathi Vol I and II.
(2) వేంకటాచల మహాత్మ్యము - (తెలుగు) తరిగొండ వెంకమాంబ.
(3) N. 1. Sullurpet (4); Udayagiri (6).
(4) South Indian Inscriptions Vol IV. No. 282; 283; 294; 295 (శ్రీకృష్ణదేవరాయల శాసనములు)

## తుంగభద్ర - 1

తుంగయు, భద్రయు నను రెండు నదులు కలిసి తుంగభద్ర యను నామమునో నీ నది వెలయుచున్నది మైసూరు మండలములో నైరృతి దిక్కున కొండలలో నుద్భవించి, రెండు నదులును షిమోగా జిల్లాలో కూడలి దగ్గఱ

సంగమించును తర్వాత మైసూరురాష్ట్రముగుండా ప్రవహించి, ఆంధ్రప్రదేశ మున కర్నూలు మండలమున కుత్తర దిక్కుగా పారి, తూర్పు దిశైక కృష్ణా నదిలో కూడలి సంగమము వద్ద కలియుచున్నది. దీని పొడవు నాలుగువందల మైళ్ళు. కర్నూలు పట్టణము వద్ద హంద్రీ యను ఉపనదితో కలియుచున్నది.

ఈ తుంగభద్రా తీరముననే హంపీ విరూపాక్షక్షేత్రము, విజయనగరము కంపిలినగరము, ఆనెగొందియు, కర్నూలు పట్టణములును గలవు.

దీనికే పంపానది యనిపేరు. రామాయణ కాలమున నీనది కా పేరు గల్గియుండెను. దీనికి సమీపముననే పంపా సరోవరము గలదు.

రామాయణము అరణ్య కాండము డెబ్బదినాల్గు, డెబ్బదియైదవ సర్గలలో పంపా సరోవరము, పంపానదీ వర్ణనలు గలవు.

ఆజగామ తతః పంపాం లక్ష్మణేనసహాభిభూః
సదదర్శతతః పుణ్యాముదార జనసేవితాం
నానాద్రుమలతాకీర్ణ పంపాం పానీయ వాహినీమ్
పద్మైస్సౌగంధికైస్తామ్రాం శుక్లాం కుముదమండలైః
.... .... .... .... ....
అస్యాస్తీరేతు పూర్వోక్తః పర్వతో ధాతుమండితః
ఋశ్యమూక ఇతిఖ్యాతః పుణ్యః పుష్పిత పాదపః

## తుంగభద్ర - 2

ఈ నది యీ కాలమున నామమాత్రావశిష్టమైయున్నది. గుంటూరు మండలములోని ప్రాచీనాంధ్ర శాసనములందు పేర్కొనబడినది. కృష్ణకు దక్షిణ తీరమున సీతానగర కొండల ప్రాంతమునుండి ప్రవహించు బాపట్ల తాలూకాలో సముద్రమునుగలియు నొక యేరు. ఇది కృష్ణాడెల్టా నిర్మాణము నందు కొంత దూరము పంట కాలువగాను, మురుగు కాల్వగాను నుపయోగింపబడినది.

(1) అనంతరము తుంగభద్రాదేవి పశ్చిమతః పొలిమేర కుట, అనంతరము నైరిత్యాం తుంగభద్రాదేవి దక్షిణ ముఖమైన మదుక.

(2) తుంగభద్ర పశ్చిమ ప్రవాహముగాను పాఱున, దక్షిణ భాగాన నిడుంబ్రోలి పొలము.

(3) తుంగభద్రా దక్షిణ తీరవాసిని శ్రీ విశ్వేశ్వర మహాదేవాయ కమ్మనాంటి విషయే అప్పికట్ల గ్రామస్య పూర్వతః.

(4) కనకుఱితి తూర్పుపొలాన తుంగభద్రదరి చింతలపూడి.

(5) ఇనువర్తి గ్రామానకు పొలిమేర సీమా చిహ్నాలు

పూర్వతః తుంగభద్ర

కనుకుర్తి గ్రామానకు సీమా చిహ్నాలు

పూర్వతః తుంగభద్ర

పశ్చిమతః తుంగభద్ర

పైని వివరింపబడిన శాసనములలోని గ్రామములు, తెనాలి బాపట్ల తాలుకాలలో గలవు. పూర్వకాలమున నీ యేరు వెలనాటిలోను కమ్మనాటిలోను ప్రవహించి యుండెను.

S. I. I. Vol X No 261 (శ. స. 1136.)
S. I. I. Vol VI No 118, 120, 124, 202.

## తురమర విషయము

ఆంధ్రప్రదేశము నందలి అనంతపురము మండలము నందలి ప్రాచీన మండల విభాగము. ఇయ్యది పెన్నానదికి ఉత్తరమునకున్న గుత్తి తాలూకా ప్రాంతమైయున్నది. ఈ విషయము ప్రాచీన బాణరాజుల శాసనములలో పేర్కొనబడినది బలికుల తిలక నరసింహ బాణాధిరాజుకుమారుడైన విక్రమాదిత్య బలిఇంద్ర బాణరాజు గుత్తితాలూకా కొండుపల్లి శాసనములో నతడు తురమర విషయమును పాలించుచుండెనని తెలుపబడినది. (1) ఆ తాలూకాలోని బేతపల్లి గ్రామమందలి యొక శాసనములో బాణరాజొకడు తురమర విషయమును పాలించుచుండెనని తెలుపబడినది. (2) బాదామి చాళుక్యుల కాలమునాటి మైసూరు రాష్ట్రమునందలి షిమోగాజిల్లా సొరాబు గ్రామమున లభించిన యొక తామ్రశాసనములో తొరమార(తురమర) విషయమునందలి

చిత్రసేన్ గ్రామముదాహరింపబడినది. (3) ఈ శాసనమునందలి గ్రామములు నేటి గుత్తి తాలూకాలో గలవు. కావున తురమర విషయము నేటి గుత్తి తాలూకాలోని కొంత ప్రాంతమై యుండెననుటకు సందేహములేదు.

(1) No. 359 of 1920 M. E. R.
(2) S I. I. Vol IX. Part I. No. 47 (కన్నడ శాసనము)
(3) (a) Gazetteer of Bombay Presedency Vol 1. Part II. P. 369 (s' 614)
(4) M. E. R. 1920-21 Part II Para 2.

## తూర్పునాడు

బాపట్లలోని భావనారాయణ స్వామివారి యాలయ శాసనములో "ఉత్తమచోడ వలనాంటి తూర్పునాంటి మునుండూరి జక్కిరెడ్డి"యని తూర్పునాడు పేర్కొనబడినది. ఈ మునుండూరు కావలి తాలూకాలోని మునునూరు గ్రామము. తూర్పునాటిని గూర్చి చెప్పబడిన యొక చాటు పద్యము గలదు. ఈ తూర్పునాడు ఆంధ్రదేశము గుంటూరు మండలము లోని నెల్లూరులోని సముద్రప్రాంత తూర్పు భాగమునకే వర్తించునని తోచెడివి.

సీ. శ్రీరామపతి పేళ్లు దొరలు రాచకోమాళ్లు
వెలమనాయళ్లు చేవెళ్లు గోళ్లు
కాళ్లను బాంకోళ్లు కడు నోరసిగముళ్లు
వింత కట్టుకుమాళ్లు బంతికూళ్లు
చెవుల పోగుల జోళ్లు చేయాకె పదిమూళ్లు
మాట వ్యక్తపు నోళ్లు వేటకాళ్లు
వెలిరారు మగనాళ్లు పెనుబాలకావళ్లు
గొల్ల బోయళ్లు పైఁ దెల్ల జోళ్లు
గీ. చాలు మామిళ్లు కాళ్లు వజ్రాల రాళు
నీళ్లు గల యూళ్లు నడవి కుందేళ్లు లేళ్లు
మహాలు కట్టళ్లు పాతళ్లు మాను జోళ్లు
మెప్పు నడవళ్లు తూర్పున నుప్పుమళ్లు.
S. I. I. Vol VI No. 179

**తెలుఁగాణము (తెలంగాణా)**

ఆంధ్ర ప్రదేశములోని పూర్వము హైదరాబాదు రాష్ట్ర భాగమునకు, కృష్ణ కుత్తర భాగమైన ఆంధ్రభూమండలమునకు తెలుగాణమని పేరుండెను.

పదునేనవ శతాబ్దాంతము నందుండిన వెన్నెలకంటి సూరనకవి రచించిన విష్ణుపురాణములో కృతిపతియైన రాఘవరెడ్డియు, నతని జనకుడు నుదయగిరి రాజ్యపాలకులుగా నుండిరి. రాఘవరెడ్డి పూర్వీకులలో నొకడగు బసవభూపాలుడు తెలుగాణ భూములలోని మన్నెవారిచేత గప్పములు గొన్నట్లు కవి వర్ణించి యున్నాడు.

సీ. కటకాధిపతియైన గజపతి రాజుచేఁ
బ్రతిలేని పల్లకి పదవి నొందె
మహిమచేఁ గర్ణాట మండలాధిపుచేత
గడలేని రాజ్యభాగములు గాంచెఁ
బ్రౌఢ పౌరుషమున రాజిల్లి మెఱయగా
మలక వజీర్ల కమ్మలికఁ జేసెఁ
దెలుఁగాణ భూములఁగల మన్నెవారిచే
బలవంతమునను గప్పములు గొనియె

గీ. జాటు ధాటీ నిరాఘాట ఘోటకావ
ళీఖురోద్ధూత నిబిడ ధూళీవిలిప్త
మండితాశాంగనా కుచమండలుండు
బాహుబలశాలి తమ్మయ బసవవిభుడు.

క్రీ. శ. 1510 సంవత్సరమునాటి ప్రతాపరుద్ర గజపతి వెలిచెర్ల శాసనములో నతడు తెలుంగాణా దుర్గములను గెల్చినట్లు వర్ణింపబడినది. (1)

సభాపతి దక్షిణ భూమిపాలాన్ విజిత్యాది శ్రాణన పారిజాతః
అనన్య సాధారణ సాహస శ్రీర్జగ్రాహ పశ్చాత్తెలుంగాణ దుర్గాన్॥
శ్రీకృష్ణదేవరాయల తిరుపతి శాసనములోనతని దిగ్విజయములలోను(2)

"మరిన్ని కళింగదేశ దిగ్విజార్థమై బెజవాడకు విచ్చేసి కొండపల్లి దుర్గమును సాధించి ఆ దుర్గం మీదనున్న ప్రహారరాజు శిరశ్చంద్రమహా

పాత్రుండు బోడజీనమప పాత్రుండు............ మొదలయిన వారినించి జీవగ్రాహంగాను పట్టుకొని వారికి అభయదానం ఇచ్చి *అనంతగిరి, ఉంద్రకొండ, ఉర్లకొండ, అరువపల్లి, జల్లిపల్లి, కందికొండ, కప్పలువాయి నల్లగొండ; కంభంమెట్లు, కనకగిరి, శంకరగిరి, యివి మొదలయిన తెలంగాణ్య దుర్గాలు ఏకఘాటిని కైకొని సింహాద్రి పొట్నూరికి విచ్చేసి.... .... .... .. ....

అని విజయధాటిలో పైని వివరింప బడిన తెలంగాణ దుర్గములను బట్టుకొనెనని తెలువబడినది.

మహమ్మదీయ చరిత్రకారులు ఈ తెలుంగాణ భూమినే తిలింగా, తెలింగ, తెలింగాణాయని వారి చరిత్రలలో వ్రాసియున్నారు. ఇప్పటికిని నైజాము ప్రభుత్వములో నుంతెడి ఆంధ్రప్రదేశమును తెలంగాణా యనియే వ్యవహార సిద్ధమై యున్నది. (3)

(1) వెలిచెర్ల శాసనము. భారతి. ధాత సం॥ శ్రావణమాసము. శ్రీవంగోలు వెంకటరంగయ్యగారు పరిష్కరించిరి.

(2) తిరుపతి శాసనము. (శ.స. 1438) No. 80 of Tirupati Devasthanam Inscriptions, Vol 3. P. 178-179.

(3) The Early Muslim Expansion in South India. by Dr. N. Venkataramanaiah.

**తెలుగుదేశము**

పురాణములలో నత్యంతప్రాచీనమైన వానిలో నొకటియగు మార్కండేయ పురాణములో కూర్మ విభాగ ప్రకరణములో తెలుగు దేశము పేర్కొనబడినది.

తిలింగా కుంజరి దరీ కచ్ఛవా సాశ్చరయే జనాః
తామ్రపర్ణి తథాకు క్షితి కూర్మస్య దక్షిణః

మార్కండేయపురాణము విశేష పరిశ్రమతో పరిశీలించి, ప్రకటించిన పర్గిటార్ (Pargiter) దొరగారు తిలింగ పదము తెలుగు దేశమును సూచించుచున్నదని వ్రాసిరి.

(Bibliothaca-Indica. P. 367)

అట్లే వాయుపురాణములో మధ్య దేశములోని జనపదములలో నొక్కటిగ తిలింగుల జనపదము చెప్పబడినది.

అర్ధపాశ్చా తిలింగాశ్చ మగధాశ్చ వృకైఃసహా
మధ్యదేశా జనపదాః ప్రాయశోఽమీ ప్రకీర్తితాః ।

ఈ పురాణమునందే ఆంధ్రులను దక్షిణాపథ జనపద వాసులలో నొకరిగ జెప్పబడెను. వాయు పురాణమునందు చెప్పబడిన తిలింగులు, మార్కండేయ పురాణమునందు జెప్పబడిన తిలింగులు, తెలుగు వారినే సూచించును.

పదమూడవ శతాబ్దమున దేవగిరి పాలించిన యాదవ రాజులగు మహాదేవ రామచంద్ర నరేంద్రుల కడ మంత్రిగా నుండిన హేమాద్రి తన వ్రత ఖండములో తెలుగు దేశమునకు తిలింగ పదమే వాడియున్నాడు. (1)

తిల్లింగాధిపతేః పళోర్విశసనం రుద్రస్య రౌద్రాకృతేః
కృత్వాపూరుష మేధయజ్ఞ విధినోలబ్ద స్త్రిలోకే జయః ।
తైలింగ క్షితిపాల తూలనిచయ ప్రక్షేప ఝంఝానిలో
గర్జద్గూర్జర గర్వ పర్వతభిదాదంభోలి దోర్విక్రమః ।

పైని క్రోడీకరింపబడ్డ ప్రమాణములంబట్టి తెలుగు దేశమునకు తిలింగ పదమే మొదట వ్యాప్తిలో నుండెనని చెప్పవచ్చును.

తమిళ కర్ణాట శాసనములలో తెలుంగ పదమే ప్రప్రథమమున పేర్కొనబడెను. పదునొకండవ శతాబ్దారంభము నందలి కొన్ని తమిళ శాసనములలో తెలుంగులు, తెలుంగ రాజులు పేర్కొనబడిరి.

క్రీ. శ. 1022 నాటి యొక తమిళ శాసనములో వేంగిగంగ మండల మహాదండనాయకుడైన మారాయుడు చేర, తెలుంగ, రట్టుగ, కోంకణ, తుళువరాజుల జయించినట్లు తెలుపబడినది. (2)ఆ సంవత్సరమునాటిదేయగు మరియొక తమిళ శాసనములో (మొదటి పరకేసరి రాజేంద్రచోళుని పదియవ పరిపాలనా సంవత్సరము నాటిది.) కళింగులతోను, ఓడ్డియులతోను, తెలుంగులతోను యుద్ధము పేర్కొనబడినది. (3) కర్నాటక శాసన సంపుటములోని యొక కన్నడ శాసనమందు కొంగల్వ రాజొకడు తెలుగు దేశమును జయించెనని వ్రాయబడినది. (4) అనగా మొదట తిల్లంగ, తెలుగు పదములే పురాణము లందును, శాసనము లందును వ్యాప్తియందుండెను.

శా. శ. 1280 నాటి ముమ్మడినాయకుని శ్రీరంగము తామ్ర శాసనములో తిలింగ దేశసీమా నిర్ణయమిట్లు వర్ణింప బడినది. (5)

హిమాచలా దాలవణోద మేతత్ ఖండం
భువో భారత వర్షమాహుః
తత్రాపి తద్భరతస్య ఖండం చరంతి య
త్రాశ్రమ వర్ణ ధర్మాః॥
పశ్చాత్పు స్తాదపి యస్య దేశో ఖ్యాతా మహా
రాష్ట్ర కళింగ సంజ్ఞా
అవాగురల్ పాండ్యక కన్య కుబ్జా దేశ
స్మత త్రా స్తి తిలింగ నామా ॥

భరత వర్షములోని తెలింగ దేశమునకు సరిహద్దులు :— ఉత్తరమున కన్యాకుబ్జము, దక్షిణమున పాండ్య దేశము, పశ్చిమమున మహారాష్ట్రము.

అట్లే ప్రోలయనాయకుని విలస తామ్రశాసనములో తెలుగు దేశము సీమానిర్ణయ మీ విధమున గావింప బడినది. (6)

తస్యాశ్చ రత్నగర్భాయాః సర్వస్యా మధ్య వర్తినమ్
జంబూద్వీపం విదుర్దేశం లవణాంబుధి వేష్టితం ॥
ద్వీపేపి తస్మిన్ నవధా విభక్తే హిమాచలాద్దక్షిణ
మా సముద్రం

భాగంభువో భారత వర్షమాహుః ఫలంతి కర్మాణి కృతానియత్ర॥
భాషా సమాచర భిదావిభిన్నైర్దేశైరనేకై ర్బహుధా విభక్తై
వర్షేప తస్మిన్ కమనీయవాస స్త్రిలింగ నామాసచకా స్తిదేశః ।

పండితారాధ్యచరిత్రము పర్వత ప్రకరణములో తెలుగు దేశము నవలక్ష గ్రామ పరిమితమగు దేశమని పాలకురికి సోమనాథుడు చెప్పియు న్నాడు

గ్రమమొంద జాలం ధరం బష్టలక్ష
ప్రమిత చౌదహాలక్ష బంగాళభూమి
గుఱు సప్తదశలక్ష గుజరాష్ట్రభూమి

మఱు యష్ట దశలకు మాళవభూమి
జానొంద నవలి పంచద్రావిళముల
లో నవలకు వెలుంగు.........." (పర్వత ప్రకరణము.)

(1) Early History of the Deccan P. 195-96
(2) No. 5 of 1895 (M E. R.)
(3) No. 30, 31 1917 (M. E. R.)
(4) E. C. Vol IX P. 19
(5) E. I. Vol XIV P. 83. 30. (శ్రీరంగము శాసనము)
(6) E. I. Vol XXXII No. (విలస శాసనము)

## తొండమండలము (విషయము - నాడు)

'తొణ్ణనాడైన జయంగొణ్డ చోడమణ్డలమున వెంగణ్డి కోట్టమున మరుదాల నాటక్కమున'

ఈ తొండమండలమునకు తుండకవిషయ మనియు, తొండమండల మనియు బేర్లు. ఇయ్యది ద్రవిడ (ద్రమిళ) దేశమునకు, పల్లవుల కాలము నుండియు నేర్పడిన క్రొత్తనామము. పల్లవ రాష్ట్రమునకు తమిళమున తొండైనాడని పేరు.

సువర్ణముఖీనదికి దక్షిణమునను దక్షిణ పినాకినీ నదికి ఉత్తరమునను తూర్పు కనుమలకు తూర్పు సముద్రమునకు మధ్యమునను గల ప్రాంతభూమి. ఇప్పటి నెల్లూరి మండలములోని దక్షిణ భాగము, మద్రాసు రాష్ట్రములోని చెంగల్పట్టు జిల్లాయంతయును ఉత్తర దక్షిణ ఆర్కాడు జిల్లాలలోని కొంత భాగమునై యుండెను.

J. O. R Vol XII Part IV P. 364 - 370.

## త్రికళింగము

పూర్వగాంగ ప్రభువులలో నత్యంత ప్రాచీనుడైన మహారాజ ఇంద్ర వర్మ జిర్జింగుశాసనములో నతడు "త్రికళింగాధిపతి శ్రీమహారాజేంద్రవర్మ" యని చెప్పబడెను. ఇతడారవ శతాబ్దమువాడు. పూర్వ చాళుక్యరాజుల శాస

నములలో దాము వేంగిరాజ్యమును త్రికళింగ సహితముగా నేలిరని వ్రాసి కొన్నారు. మొదటి అమ్మరాజు మచిలీపట్నము శాసనములో చాళుక్య భీముని కుమారుడైన విజయాదిత్యుడు త్రికళింగాటవీయుక్తముగు వేంగిదేశమును పది యారు మాసములు పాలించి, దివంగతుడయ్యెనని వ్రాయబడినది.

"తత్సూనుర్విజయాదిత్యః షణ్మాసాన్ వేంగిమండలం త్రికళింగాటవీ యుక్తం పరిపాల్యదివంయయౌ"

రెండవ అమ్మరాజు వేంగదేశమును త్రికళింగదేశ సహితముగ రక్షించెనని మఱియొక శాసనముగలదు.

"తస్యమహేశ్వర మూర్తేః భీమ భూపతేః ఉమాసమానాకృతేః లోక మహాదేవ్యాః కుమారాభఃఖలు యస్మభవదమ్మ రాజాఖ్యః అనోసమ్యద్ధర్మ న్యాయేన వేంగిదేశం త్రికళింగ సహితం రక్షతిస్మ"

చాళుక్యశాసనములోని త్రికళింగాటవియే ప్రాచీన బౌద్ధధర్మ గ్రంథ మగు మిళిందపథమునందు పేర్కొనబడిన "కళింగారణ్యా" లేక కళింగారణ్యా మేయనియు, దీనికి వాయవ్యమున ఇంద్రావతియు, నైర్రృతి దిక్కున గోదా వరి నదియు నెల్లలనియు కన్నింగామ్‌దొర నిర్ణయించెను. రేప్సన్ పండితుడు అరణ్యము మహానదికి, గోదావరికి మధ్యనున్న అటవీభూమియని చెప్పి యున్నాడు.

పూర్వగాంగ భూపతులు తాము త్రికళింగాధిపతులమని చెప్పుకొన్నారు. మూడవ వజ్రహస్తుని చిక్కాలవలస శాసనము, అతనిదేయగు గంజాము శాసనము, అనంతవర్మ చోడగంగుని బొడ్డపాడు, కొర్ని శాసనములు పై విషయము, వ్యక్తపఱుచుచున్నవి. చరిత్ర పరిశోధకులు, శాసనపరిష్కర్తలు, ఈ త్రికలింకము వేఱు, కలింగము వేఱు అనియు, త్రికళింగమనునది మహేంద్ర పర్వతమునకు పశ్చిమమునను, మహానది కుత్తరమునను, లాంగుల్యనదీజన్మస్థల ప్రాంతమునగు దేశమనియు, కళింగమునకు పశ్చిమప్రాంతారణ్య భూభాగ మనియు నిర్ణయించియున్నారు.

త్రికళింగమనగా మూడు కళింగములుగావనియు, కాంగోడ, ఉత్కళ, కళింగములు గలసిన (మూడు దేశములు) భూభాగము కాదనియు, త్రికళింగాధి

పతులని పేరొందిన భూపతులలో కటకమునేలిన సోమ వంశీయులును, కాలచురివంశజులగు చేదిరాజులును గలరనియు, నియ్యది కళింగాంతర్భాగము కాదనియు, పరిశోధకుల సిద్ధాంతము.

(1) ఇంద్రవర్మ జిర్జింగిశాసనము. J.A.H. R.S.Vol III.Part I.

(2) E. I, Vol V. Page 131.

(3) ,, Vol XIV. P. 137.

(4. Geography of Early Buddhism P. 67.

(5) మూడవ వజ్రహస్తుని చిక్కాలవలస శాసనము భారతి రక్తాక్షి సం. మాఘ మాసము.

(6) E I. Vol XXIII. No. 11. మూడవ వజ్రహస్తుని గంజాము శాసనము. శాసన పరిష్కర్తల త్రికలింగ దేశ సీమావిషయచర్చ.

(7) అనంతవర్మ చోడగంగుని బొడ్డుపాడు శాసనము. భారతి. సంపుటి 3. సంచిక 5.

(8) అనంతవర్మ చోడగంగుని కొర్ని శాసనము. భారతి సంపుటము 2. సంచిక 2.

(9) 'Trikalinga' J. A. H. R. S. Vol I. Part 16-23.

## త్రిలింగ దేశము

బ్రహ్మాండపురాణములో నీ దిగువ శ్లోకము త్రిలింగదేశ సీమానిర్ణయము వ్యక్తపఱచుచున్నది.

శ్రీశైల భీమ కాళేశ మహేంద్రగిరి సంయుతం
ప్రాకారాంతు మహత్కృత్వాత్త్రీణి ద్వారా మపాకరోత్

దీని ప్రకారము త్రిలింగ దేశము శ్రీశైలము భీమేశ్వరము (ద్రాక్షారామము) కాళేశ్వరము (మంథెన కాళేశ్వరము) మహేంద్ర పర్వతములు ఎల్లలుగాగల భూ భాగమని నిర్ణయము.

కాకతి ప్రతాపరుద్రుని యాస్థానపండితుడగు విద్యానాథకవి ప్రతాపరుద్రీయ నాటక ప్రకరణములో త్రిలింగ దేశము శ్రీశైల, ద్రాక్షారామ, కాళేశ్వర మధ్యభూమి యని యిట్లు వర్ణించెను.

స్వామిం త్రిలింగదేశ పరమేశ్వరః
యైర్దేశ స్త్రిభిరేష యాతి మహతీం ఖ్యాతిం త్రిలింగాఖ్యయా
యేషాం కాకతి రాజకీర్తి విభవైః కైలాసశైలాః కృతాః
తేదేవాః ప్రసరత్ప్రసాదమధురా శ్రీశైల కాళేశ్వర
ద్రాక్షారామ నివాసినః ప్రతిదినం త్వచ్ఛ్రేయ సే జాగ్రతు.

బ్రహ్మాండపురాణము ననుసరించి యాంధ్ర విష్ణువను వాడు శ్రీశైలము, భీమేశ్వరము, కాళేశ్వరము మహేంద్ర పర్వతములతో గూడఁ గలియునట్లుగాఁ బ్రాకారములు నిర్మించి యా మూఁటిని ద్వారములుగా జేసెననియు ఈ ద్వారము లందీశ్వరుడు శూలపాణియై ప్రమథ గణములచేఁ గొలువబడుచు లింగ రూపములను దాల్చి యుండెననియు ఆంధ్ర విష్ణువు సురల సహాయమును బొంది దానవాగ్రేసరుడగు శంభునితో బదమూడు యుగములు యుద్ధము చేసి వాని నిహతుని గావించి గోదావరీ తటము నందలి ఋష్యాశ్రమములలో వాని నివాసము నాక్రమించి కొనెననియు అప్పటి నుండియు నీ దేశము త్రిలింగమను పేర బఱగుచున్నదని తెలియుచున్నది.

విద్యానాథకవికి నూఱుసంవత్సరములతర్వాతనుండినవిన్నకోటపెద్దన్న విశ్వేశ్వర భూపతి కంకిత మిచ్చిన కావ్యాలంకార చూడామణిలో త్రిలింగ దేశసీమా నిర్ణయను ప్రతాపరుద్రీయమున జెప్పబడినట్లే కావించియుండెను

క. ధర శ్రీ పర్వత కాళే
శ్వర ద్రాక్షారామ సంజ్ఞ వఱలు త్రిలింగా
కరమగుట నంధ్ర దేశం
బరుదారఁ ద్రిలింగ దేశమునఁ జను గృతులన్.

విన్నకోట పెద్దనకు సమకాలికుడును రెడ్డిభూమీశ్వరుఁడును నైన పెద్దకోమటి వేమభూపాలుని యాస్థాన కవియునైన వామన భట్టబాణుడు రచించిన వేమభూపాలీయములో అద్దంకి త్రిలింగ జనపదమునకు రాజధాని యని యిట్లు వర్ణించెను.

అస్తి సమధిక కృష్ణా గోదావరీ స్రోతః సముదాయనదీ మాతృకాయమాణః విశ్వంభరా భ్రూలతాను కారిసేతు లేఖైః అనేకై స్తటాకై శ్శోభితః సముపచిత సకల ధర్మలింగః త్రిలింగో నామజనపదః ।

తత్రఖలు రాజధానీ బభూవ శాఖానగరసహస్ర సంబాధ పరిసరోనర్వ భువన నిర్మాణ మాత్ర్యకేవ విశ్వ సృదః కార్తవీర్య తనురివ అవిరల కలభా సితా అద్దంకినామధేయానగరీ ।

కవిసార్వభౌముడైన శ్రీనాథుడు పెదకోమటి వేమభూపాలునికడ విద్యాధికారిగ నుండెను. వామనభట్టబాణుడును శ్రీనాథుడును సమ కాలికులు. శ్రీనాథుడు రాజమహేంద్రవరము రాజధానిగా తెలుగు దేశ మును పాలించిన వేమారెడ్డి, వీరభద్రారెడ్ల యాస్థానమునకు వచ్చి వారిచే సన్మానింపబడి, భీమేశ్వర పురాణాది గ్రంథములను రచించెను. వీరభద్రా రెడ్డికి మంత్రియగు బెండపూడి అన్నమంత్రి కంకిత మిచ్చిన భీమేశ్వర పురా ణములో త్రిలింగ దేశమును బెక్కుతడవల ప్రశంసించెను.

"పంట మహాన్వయంబు సింహవిక్రమ నగర దువ్వూరు గండవరాది పట్టణంబులు నిజనివాసంబులుగా ... ... భూపాల గ్రామణుల త్రిలింగ భూమండలాఖండలులను ప్రోలయవేమాన్నపోత అన్నవేమ కుమారగిరీ శులం బూజ్యసామ్రాజ్య పీఠస్థులం గాంచె"

పైవిధమున రెడ్డిరాజుల త్రిలింగ భూపాలురుగా వర్ణించెను.

సింగయ నాయకుని అక్కలపూడి శాసనము (శా. శ. 1290) లో త్రిలింగ దేశమిట్లు వర్ణింపబడెను.

దేశోస్సహస్రం భరతస్య ఖండే దీవ్యంత్యఖిలవస్తుశస్తాః
తేషాం శిరోభూషణమే వదేశో త్రిలింగ నామాసుకృతైక సీమా ।

పెదకోమటి భూపాలుడు విశ్వేశ్వర పండితునకు వెలనాటి సీమలో తుంగభద్రానది తీరమందున్న ఆలపాడు గ్రామము నగ్రహారముగా నిచ్చిన సందర్భమున శ్రీనాథ విరచిత శాసనములో వెలనాడు త్రిలింగదేశాంతర్గ తమని వ్రాయబడినది.

ప్రదాత్త్రిలింగ విషయే వెలనాండా మనోరమే
తుంగభద్రా తరంగిణ్యాం ప్రాక్తీరే పర్యవస్థితం ॥

మరియు వైద్య శిఖామణి యైన సింగనార్యునకు వెలనాటి సీమలో కృష్ణాతీర మందుండిన పొన్నుపల్లి గ్రామమును దానమిచ్చిన సందర్భమున శ్రీనాథ విరచిత పొన్నుపల్లి శాసనములో

ప్రాదా త్త్రిలింగ విషయే వెల్నాడో దివిసీమని
కృష్ణవేణ్యా స్తరంగిణ్యాః ప్రతీరే పర్యవస్థితం
పొన్నుపల్లా హ్వాయం గ్రామం నిధానం సర్వ సంపదాం ।

అని త్రిలింగ విషయ లోని వెలనాటి దివిసీమ యందలి కృష్ణానదీ తీరముననున్న పొన్నుపల్లి గ్రామ మభివర్ణింపబడినది.

నరసారావు పేట తాలూకాలోని అప్పాపుర గ్రామ శాసనములో నీ త్రిలింగదేశ చారిత్రక భూగోళ మీ విధమున వివరింప బడినది.

స్వస్తి సమస్త ప్రశస్తి సహితంబై అనల్పంబైన కల్పారంభ కాలమున మహావరాహ దంష్ట్రా శిఖరంబున నుద్ధృతంబై పంచాశత్కోటి యోజన విస్తీర్ణంబైన భూ మండలంబునందు జంబూ ద్వీపంబులో భారత వర్షంబున భారత ఖండంబున మేరు పర్వతంబునకు దక్షిణ దిగ్భాగంబున శ్రీశైల వాయ సముద్ర పార్శ్వంబున నోంకార నదీ తీరంబున త్రిలింగ దేశా లంకారంబైన కోట భూమి కమ్మనాంటి సీమా స్థలంబునందు నాదిండ్ల పురంబున........"

పైవివరముల బట్టి, త్రిలింగ దేశములో వెలనాడు, కోటభూమి, కమ్మనా డంతర్భాగములని తేలుచున్నది.

అక్కలంపూడి శాసనము, E. I. Vol XIII P 259. (శ. స. 1290)
ఆలపాడు శాసనము E. I. Vol XI P 316, 319 (శ. స. 1335)
అప్పాపుర శాసనము S. I. I. Vol X No. 578. (శ. స. 1327)
పొన్నుపల్లి శాసనము

## దండెనగోవ (నది)

దండెనయనునది దిండికి మారుపేరు. ఈ దిండినది కృష్ణకు ఉపనది. (చూడుడు కృష్ణానది)

"దండెనగోవ-బ్రహ్మకుండీ కృష్ణవేణ్ణా గోదావరీ
మహానదీ తటద్వయ తన్మధ్యదేశ దత్తానేకాగ్రహార"

అమరావతిలోని వేమారెడ్డిశాసనములో వేమారెడ్డి బిరుదావళిలో నొకటి.

S.I.I,Vol VI. No. 225 (శ స. 1283)

## దంతపురము

కళింగములో నత్యంత ప్రాచీన నగరములలో దంతపుర మొకటి, బౌద్ధజైన వాఙ్మయములలో నుదాహరింపబడినది. బౌద్ధ జాతకగాథలలో నీ పట్టణము కళింగరట్టమునకు రాజధానియని చెప్పబడినది. విశాఖపట్టణ మండలములోని శ్రీకాకుళము తాలూకా శ్రీకాకుళము రైలు స్టేషనునకు పదిమైళ్ళ దూరముననున్న దంతపురము కోటయే ప్రాచీన దంతపురమని ఆధునిక చరిత్రకారుల యభిప్రాయము. ఇప్పుడచ్చట పెద్ద దిబ్బ గలదనియు, నీ దిబ్బ విస్తీర్ణము చూచినచో నచ్చట పూర్వమొక పెద్ద కోటయై యుండు ననియు నూహింపబడుచున్నది. బుద్ధుని పూర్వ జన్మలను వివరించు జాతకకథల నాటికే దంతపురముండుటవల్ల, నీ పట్టణము బౌద్ధయుగమునకు బూర్వమునే యుండెనని తలంపబడుచున్నది.

ఈ దంతపురము కళింగపట్టణమని కొందఱును, పూరీజగన్నాథమని మరికొందఱును, రాజమహేంద్రవరము అని వేఱొకరును వ్రాసియున్నారు. కాని ఈ నిర్ణయములు సరి కావని తెలియుచున్నది.

తథాగతుని దంతధాతు చరిత్ర-శ్రీ సోమేశ్వరశర్మగారి వ్యాసము.

## దళియవావి

ఇది తుల్యభాగకు ప్రాచీననామము. విష్ణుకుండి ప్రథమ మాధవవర్మ (ఆంధ్రసాహిత్య పరిషత్తువారు ప్రకటించినది) తామ్రశాసనములో పులుంబూరు (పొలమూరు) దళియవాది తీరమందున్నదని తెలుపబడినది (చూడుడు - తుల్యభాగ)

"గుద్ధవాడి విషయే దళియవావితీరే పులుంబూరు నామ గ్రామః

J. A. H. R. S. Vol VI. P. 17; The Successors of Satavahanas Appendix IV.

## దిమిలసీమ

ఈ దిమిల గ్రామము విశాఖపట్టణమండలములోని యెలమంచిలి గ్రామమునకు మూడు మైళ్ళ దూరముననున్నది. ప్రాచీన కళింగదేశములోని

యుత్యంత ప్రాచీనమైన నాడులలో నొకటి. ప్రథమ కుబ్జ విష్ణువర్ధనుని చీపురుపల్లి శాసనమున దిమిలసీమలోని కలవకొండ గ్రామమును తన రాజ్య కాలము యొక్క పదునెనిమిదవ సంవత్సరములో శా. శ. 555 శ్రావణ శుద్ధ పూర్ణిమనాడు దానము చేసెనని కలదు ఈ కలవకొండయే కలవలపల్లి. సర్వసిద్ధి తాలూకాలో గలదు. ద్రాక్షారామములోని కులోత్తుంగ చోడ దేవుని కాలమునాటి యొక శాసనములో "శ్రీకులోత్తుంగ చోడదేవర దివ్య సంవత్సరములు 49 యగు శ్రీమద్ వేంగినాండమున ఉత్తమ చోడమణ్డల మున డిమిలనాంటి తొణ్డవాడ శియ్యవారినాటి శ్రీ పరాంతకేశ్వర మహాదేవరకు" అని దిమిలనాడు వేంగినాణ్డులోని ఉత్తమ చోడమణ్డలములో నంతర్భాగమని చెప్పబడినది.

I. A. Vol XX, P. 15 & 69. S. I. I. Vol IV. No. 1226.

దూపాటిసీమ

"శ్రీమత్ శాయపనాయకాన్వయమణేః గంగమనాయాధిపతుః
పౌత్రః శ్రీగిరి మండలావనచణః శ్రీ వెంకటాద్రి ప్రభోః
పుత్రోగంగపనాయకస్సుచరితో మాదాల గోత్రోద్భవః
కృత్వాగ్రామ సమర్పణం రచయిని స్థిత్యై శిలాశాసనం।
మద్వంశ బాహా వైభవ సంతతపరిపాలితాం
గుర్రవుపాల గ్రామం తద్గ్రామం (?) చన్నరాయని పల్ల్యాఖ్యాం
గార్ల దిన్నెగ్రామంచ కటారువాని పల్ల్యాఖ్యాం

.. .... ....

శ్రీ చన్నరాయదివ్య శ్రీ మచ్చరణారవింద యుగళాయ
కృష్ణార్పణని సహస్రం విజ్ఞాపితమేత దీప్సితం హిమయా"

పై శాసనము వేంకటపతిరాయల కాలమునాటి దూపాటి సీమనేలు శాయపనాయని వెంకటాద్రినాయనగారు నిర్మాణము చేసిన వెంకటాద్రి పాలెములోని శ్రీ చెన్నకేశవస్వామి దేవాలయము సందలి శాసనము. (దూపాటికైఫియతు నుండి యెత్తి వ్రాయబడినది.)

పై కైఫీయతులో నుదాహరింపబడిన ఏొక దానపత్రములో దూపాటి సీమలో బద్దవీటి గ్రామము పేర్కొనబడినది.

పై చెప్పబడిన దూపాడు, గురవుసాల, కటారువాని పల్లె, బద్దివీడు (బడ్వీడు) దద్దనాల గ్రామములన్నియు, కర్నూలుమండలములోని మార్కాపురము తాలూకాలో గలవు. దూపాటిసీమయు నాప్రాంతమే.

దూపాటి కైఫీయతు-B.G.O.M.L. Vol XIII. No. 2.

## దేవరాష్ట్రము - దేవరట్టము

ఈ రాష్ట్రము విశాఖపట్టణమండలములోని ప్రాచీన రాష్ట్రములలో నొకటి. సముద్రగుప్తుడు తూర్పుతీరమున జయించిన దేశములలో దేవరాష్ట్ర మొకటి. ఇది మొదట సముద్రగుప్తుని అలహాబాదు శాసనములో పేర్కొన బడిన విషయము చరిత్ర ప్రసిద్ధము.

"కౌసలక మహేంద్ర, మహాకాంతారక వ్యాఘ్రరాజ, కౌరాళక మంతరాజ, పైష్ఠపురక మహేంద్ర, గిరికొట్టూరకస్వామి దత్త, ఎరణ్డపల్లక దమన, కాంచేయకవిష్ణుగోప, అవముక్తకనీలరాజ, వైంగేయక హస్తివర్మ, పాలక్కకోగ్రసేన, దైవరాష్ట్రకకుబేర, కౌస్థలపురక ధనంజయ," అని సముద్రగుప్తుడు జయించిన దక్షిణాపథ రాజ్యములు, రాజన్యులనామములు శాసనమునందు వివరింపబడినవి. మొదటి చాళుక్య భీముని కళింకోట తామ్ర శాసనములో ఎలమంచి కళింగమును, దేవరాష్ట్ర(రట్ట)మును పేర్కొనబడినట్లు శాసనపరిశోధక నివేదికలో గలదు. ఈ ఎలమంచి కళింగము దేవరాష్ట్రము లోనిది.

ఈ దేవరాష్ట్రము పిష్టపురమునుండి కళింగమును పరిపాలించిన వాసిష్ఠ కుల జనపాలకుడగు అనంతవర్మ శాసనములో నతడు దేవరాష్ట్రపతినని చెప్పుకొనెను. "ఓమ్", స్వస్తివిజయ పిష్టపురాధిష్టాన్ మహీమండల వ్యాపి శారదేందుకర నిర్మల గుణస్యదేవ రాష్ట్రాధిపతేరనేక సమరసంఘట్టవి జయాధి కత యశసో మహారాజశ్రీ గుణవర్మ్మనః పరమపౌత్రః శక్తిత్రయోపేత రాజ్య సంపదో వాసిష్టకుల చంద్రమశః శ్రీ మహారాజ ప్రభంజనవర్మణః

ప్రియపుత్రః....మాతాపితృ పదానుధ్యాతః కళింగాధిపతి (శ్రీ) మహారాజ అనంతవర్మా''. ఈ శాసనకాలము క్రీ. శ. అయిదువందల శతాబ్దాంతము; చాళుక్యభీముని కళింకోట శాసనమునకు బూర్వమున పుట్టినది.

(1) సముద్రగుప్తుని అలహాబాదుశాసనము(కళింగ సంచికానుబంధము).
(2) M.E.R. 1908-09. Para 59.
(3) E.I.Vol 23. No. 9.

## దేశ్యాయకొండపట్టనము

ఇది మోటుపల్లికి నామాంతరము. "మోటుపల్యాభిధానే దేశ్యాయ క్కొండ పట్టనే మహతి''

E.I.Vol XII. P. 188. AD 1244-45 గణపతిదేవుని మోటుపల్లి శాసనము.

## దొంతి

ఈ దొంతి రాజ్యమును జేర్కొన్న ప్రథమాంధ్రకవి మడికి సింగన. ఇతడు రచించిన పద్మపురాణోత్తర ఖండముయొక్క కృతినేతయైన కందనామాత్యుడు రామగిరి పట్టణాధీశుడైన ముప్పడి భూపతికి మంత్రియు, దండాధీశుడునై యుండెను. ఆ ముప్ప భూపతివంశ విశేషములు వర్ణించు సందర్భమున "విభవ విలాస విక్రమ విజయ విఖ్యాతులం బ్రసిద్ధుండైన ముత్తభూపాలుండు తనకు సహాయుండుగా గౌతమీ దక్షిణంబున బరమ పావనమగు సబ్బినాటి రాష్ట్రంబున రామగిరి పట్టణంబు రాజధానిగ పురందర విభవుండై రాజ్యంబు చేయుచు, నిరువేత్తుగండ గోపాల కాంచీ రక్షపాలక, చోడరాజ్య స్థాపనాచార్య. దొంతిమన్నియ విభాళన, చలమర్తి గండ....నానాబిరుద విఖ్యాతుండునగు ముప్ప భూపాలుం''డని, ముప్ప భూపాలుడు దొంతి మన్నె విభాళుడైనట్లు వర్ణించియున్నాడు.

ఈ కవియే వాసిష్ఠ రామాయణమునందు కందనామాత్యుని గూర్చి యిట్లు వ్రాసియున్నాడు.

"తొల్లి హరిభక్తిరసావేశంబునఁ గతిపయాతురాఖ్యాన చాపలంబునఁ జేసి విష్ణువిభవాభిరామ కథాప్రభూతంబులగు పద్మపురాణోత్తర ఖండంబును,

భాగవత దశమస్కంధంబును దెమంగున రచించి యప్పుణ్య పురాణంబులకుఁ గృతిపతిగా నేపుణ్యుఁ బ్రార్థింతునోయని విచారించి, గంధగజవారణ గండ గోపాల, చలమర్తిగండ, రాయగజకేసరి, దొంతిమన్నె విభాళాది నానాబిరుద విఖ్యాతులం బ్రసిద్ధుండగు.... ముప్ప భూపాలుని మాన్యమంత్రివరధుర్యుండును నగు కందనామాత్యుండు" అని మరల ముప్ప భూపాలునికి దొంతి మన్నె విభాళన బిరుదును జెప్పియున్నాడు.

ఈ దొంతిమన్నె భూపాలురను రెడ్డిరాజులు గెలిచినట్లు శ్రీనాథుని కృతులవల్ల దెలియుచున్నది.

అల్లాడరెడ్డి విజయదాటీ సంరంభము వర్ణించునెడ "ఝూడె జంతు ర్నాటి జననాథ శుద్ధాంత కుచకుంభముల మీది కుంకుమంబు" బారవాదొంతి భూపాల లీలావతీ గండ స్థలంబులఁగలికి నవ్వల" అనియు.

గీ॥ దూరమంతంత బారహా దొంతిమన్నె
సప్తమాడియ రాజన్య సమితి మ్రొక్క
రాయవేశ్యాభుజంగ సంగ్రామపార్థ
గాయ గోవాళ వేమనక్ష్మాధవునకు.

అనియు,

మ॥ బలవద్బారహా దొంతిమన్నె ధరణీ పాలావరోధాంగనా
విలసన్మంగళసూత్ర రక్షణ కళావిఖ్యాత కారుణ్య ః

అనియు కాశీఖండములో దొంతిమన్నె ధరణీపతుల రెడ్డిరాజులు గెల్చి నట్లు చెప్పియున్నాడు.

భీమఖండ కృతిలో లింగన మంత్రి ప్రతాపమును వర్ణించునెడ మరల దొంతి క్షితీంద్రుల బేర్కొనెను.

సీ॥ ఝూడెళవనసప్తమాడె బారహా
దొంతివంతునాది క్షితీశ్వరుల గెలిచి.

ఈ దొంతి యను పట్టణము బస్తరు రాజ్యములోని జగదలపురమునకు నరువది మైళ్ళ దూరముననను, బారసూరమునకు దక్షిణమున నరువది మైళ్ళ దూరముననను, డాకినీ శంఖినీ నదుల సంగమ స్థానమందును నున్న దంతెవాడ.

ఈ దంతెవాడలోని తెలుగు శాసనములు పదియవ దక్షిణ హిందూదేశ శాసన సంపుటములం దీయబడినవి ఇచ్చట దంతేశ్వరీ దేవాలయము గలదు. ఈ దంతె (దత్తివాడ) క్షితీశులు కాకతీయ ప్రతాపరుద్రుని సోదరుడగు అన్నమరాజు సంతతివారమని శాసనములలో వ్రాసుకొన్నారు. ప్రతాప చరిత్రములో ప్రతాపరుద్రునికి అన్నమదేవుడను తమ్ముడు గలడని చెప్పబడినది. దిక్పాల దేవుని దంతెవాడ శాసనమును బట్టి, యీ యన్నమరాజు ప్రతాపరుద్రుడు నష్ట రాజ్యుడై శివసాయుజ్యమును బొందిన పిమ్మట యవన భయముచే దండ కారణ్య నికట బస్తరు రాజ్యమునందు రాజ్యమేర్పఱచుకొనెను. ఈదత్తెవాడ యొకప్పుడు చిందకుల రాజన్యులకు రాజధానిగ నుండెను.

(1) E. I. Vol IX. No. 19
(2) E. I. Vol XII. No. 80
(3) S. I. I. Vol X. No. 646, 648

## ద్రవిడమండలము

నాగార్జునకొండ ఇక్ష్వాకుల ప్రాకృత శాసనములలో నీ దేశమునకు దమిళమనియు, ఖారవేలుని హాతిగుంఫ శాసనములో త్రమిరమనిన్ని, కీర్తివర్మ శాసనములో ద్రమిళమనిన్నీ పేర్లు గలవు. త్రమిరమె తమిరమై తరువాత తమిళమయ్యెను. ద్రమిళమే ద్రవిడమయ్యెను. ద్రవిడమండలమునకు ఉత్తర మున సువర్ణముఖ నదియు, దక్షిణమున దక్షిణాపినాకినియు, పడమట తూర్పు కనుమలును, తూర్పున సముద్రము సీమలై యుండెను. అనగా నిప్పటి నెల్లూరి మండలములోని దక్షిణ ప్రాంతమును, మద్రాసు రాష్ట్రములోని చెంగల్పట్టు జిల్లాయును, ఉత్తర, దక్షిణార్కాడు మండలములలోని గొంత భాగమునై వ్యాపించియుండెను. ద్రావిడ మండలమన్నను తొండమండలమన్న నొకటియేయని శ్రీ యమ్. వేంకటారామయ్యగారభిప్రాయ పడియున్నారు.

బాపట్ల తాలూకాలోని నాయనిపల్లి గ్రామమునందలి చెన్నకేశవస్వామి యాలయములో కాకతి గణపతిదేవుని దిగ్విజయము వర్ణించు నొక శాసన ములో, "నీతడు పరమండళములు సాధించి దక్షిణ దిగ్భాగమున నెల్లూరు గాంచి తద్విరోధులైన పడిహారి బయ్యన తిక్కనలఁ వెరసిన క్షాత్రవశిరంబులం

గండుక క్రీడా వినోదము సలిపి ద్రవిళ మండలమున కుత్తుంగ రాజేంద్ర చోడది'' అని ద్రవిళమండలనాథుడైన రాజేంద్రచోడుని గెల్చెనని (?) చెప్పబడినది.

(1) E. I. Vol XX. No. 1 దమిళ Geographical Names of Prakrit Inscriptions from Nagarjunikonda.

(2) E. I. Vol XX. No. 7. Item 35 త్రమిర. Hathigumpha Inscription.

(3) S. I. I. Vol X. No. 376 గణపతిదేవుని శాసనము.

(4) J. O. R. Vol XII. Part IV. Ancient Political Geography by Dr. M. Venkatramayya.

(5) Damila and Damilaratta-P. 76 - Geographical Essays. Vol I. B. C. Law.

## ద్రాక్షారామము

తూర్పుగోదావరి మండలములో రామచంద్రపురము తాలూకా యందలి సుప్రసిద్ధ శైవక్షేత్రము. దీని ప్రాచీననామము డాకరేమి. ద్రాక్షా రామ భీమేశ్వరస్వామి యాలయములో నున్న శాసనములలో నిది గంగ గొండవలనాంటి గుద్దవాడినాంటి పెద్దడాకరేమియని చెప్పబడినది.

పదునొకండవ శతాబ్ది చివరికాలమునాటి శాసనములలో నియ్యది దక్షపురియనియు, దాక్షారామమనియు వ్రాయబడెను. డాకిరేమి, దాక్షా రామమై ఇప్పుడిది ద్రాక్షారామమని పిలువబడుచున్నది.

ద్రాక్షారామములోని శాసనములు దక్షిణ హిందూదేశ శాసన సంపుటము IV.

సంఖ్య 1015 పెద్దడాకిరేమి. (శ. స. 1008)

1016 డాకిరేమి (శ. స. 1009)

1020 "ద్రాక్షారామేశ్వరాయ త్రిభువనగురవే భీమనాథాయ—" (శ.స. 1040)

గంగ గొండవలనాంటి గుద్దవాదినాంటి పెద్దడకరేమి శ్రీ భీమేశ్వర దేవరకు

1060 దక్షపురి (సంవత్సరము చెప్పబడలేదు)

ఆంధ్రదేశము త్రిలింగాఖ్యమగుటకు త్రిలింగములలోను దాక్షారామ భీమలింగ మొకటి (చూడుడు త్రిలింగము) యై యుండుటయే కారణము.

శ్రీనాథమహాకవి స్కాందపురాణమందలి గోదావరి ఖండాంతర్గత శ్రీమద్దాక్షారామ భీమేశ్వర మాహాత్మ్యము తెనిగించి, రాజమహేంద్రవరము రాజధానిగా దెలుగుదేశమును బరిపాలించిన వేమారెడ్డి వీరభద్రారెడ్ల మంత్రియగు బెండపూడి అన్నమంత్రి కంకితమిచ్చెను.

దాక్షారామ భీమేశ్వరుని గూర్చి మురారి అనర్ఘరాఘవ నాటకము సప్తమాంకములోను, రాజశేఖరుడు బాలరామాయణ నాటకము దశమాంకములోను బ్రశంసించియున్నారు.

దక్షుని సవనాగారమగుటచే నీ ప్రదేశమునకు దక్షారామమని పేరు వచ్చినట్లు భీమేశ్వర పురాణమున జెప్పబడినది.

కం. దక్షుని సవనాగారము
దక్షారామంబు శివుడు తన్మధ్యమునన్
సాక్షాత్కరించి యుండుట
మోక్షము భోగంబు బ్రాఁతె ముజ్జగములకున్.

భీమ. ఆశ్వాసము 2 ప. 16.

దాక్షారామము ప్రాచీన బౌద్ధ ఆరామములలో నొక్కటియై, ఇచ్చట యొక స్తూపము నిర్మింపబడి, బౌద్ధమత మాంధ్రదేశమున నిర్మూలింపబడి శైవమతము విజృంభించెడు కాలమున నీ బౌద్ధస్తూప మొక శివాలయముగా మార్పుచెంది యుండెననుటకు నిచ్చట భీమేశ్వరలింగమె ప్రబల సాక్ష్యము. ఇది పంచారామములలో నొకటి.

## ద్రావిడపంచకము

గుంటూరుమండలములోని నరసరావుపేట తాలూకా బోప్పూడిలోని నన్నిచోడుని (శా. శ. 1019) యొక శాసనములో నితని పూర్వుడైన జటాచోడుడు ద్రవిడ పంచకమును గెల్చెనని చెప్పబడినది.

ఆ ధాత్రీశేషు రవివంశేషు కేషుచిత్ ।
ఆయోధ్యాధిపతి ప్యాసీజ్జటా చోడమహీపతిః ।
రాజ్యైపాజ్య విభూతి కేథిక గుణ స్తత్రాభిషిక్త స్తతః ।
కృత్వా దిగ్విజయం జయశ్రియమయం ప్రాప్యప్రతాపోత్కటః ।
జిత్వా ద్రావిడపంచకంచ నృపతి స్తద్వీర యూరోఖ్యయా
విఖ్యాతే నగరే శసాసవసుధాం ధర్మేణశర్మాన్వితః ॥

ఈ ద్రావిడపంచకము లేవియన (1) ద్రావిడ (2) కర్ణాట (3) ఘూర్జర (4) మహారాష్ట్ర (5) తెలుగుదేశములు.

S. I. I. Vol. VI. No. 651. (శా. శ. 1009)

## ద్వీపము

ఇది వెలనాటిలో నంతర్భాగము. కృష్ణామండలములోని దివీతాలూకాకు సంస్కృతనామము

(1) కావేస్మి నృపశేఖరో గణపతి క్షోణీపతి ర్లీలయా
జిత్వాచోళ కళింగ సేవణ బృహత్కర్ణాట లాటాధిపాన్
రక్షన్దక్షిణ సింధు వింధ్య నగయోర్మధ్యక్షమా మండలం
సద్వీపం వెలనాండుదేశ మఖిలం స్వాయత్తమే వాకరోత్

(2) ఏతాః శ్రీయన్నపోతః పితురదితముదాము క్తయే
ద్వీపజేతా దాక్షారామేశ్వరాయ ద్వీపకరచరణా సంగినః
పంచఘంటాః । (శ. స. 1278)

పై శాసనములలో గణపతిదేవుడు, అనపోతారెడ్డి ద్వీపమును గెల్చినట్లు తెలుపబడినది.

E. I. Vol III.
S. I. I. Vol IV. No. 1337.

## ధాన్యవాటి

వేమారెడ్డి అమరావతి శాసనములో ధాన్యవాటి (ధరణికోట) యిట్లని వర్ణింపబడినది.

శాకాబ్దే గుణహస్తినేత్ర వసుధా సంఖ్యే ప్లవే వత్సరే
మాసే శ్రావణికేసితే ఫణిదినే వాచస్పతేవాసరే ।
రాకాధళ కిరీటరత్న నికరైః ర్నీరాజితాంఘ్రి ద్వయస్య
శ్రీమానమనేశ్వరో భువిపునర్నిత్యః ప్రతిష్ఠాపితః ॥
యత్పాదాంబుజలీల షట్పదత యాత్రైలోక్య సంసేవిత
శ్రీ మాన్భాతి పురందరోది విశచీదండస్థలీమండనం ।
బ్రహ్మాయం పరిపూజ్య సర్వజగతాం స్రష్టా ప్రవ్యాప్తోభవత్
కైలాసం ప్రవిహాయ యెతివసతి శ్రీ ధాన్యవాటీపురం ॥

**S. I. I. Vol VI. No. 225 (శ. స. 1283)**

## నతవాడి (పెన్నాతవాడి)

ఈ నతవాటి సీమకు ప్రాచీన శాసనములలో నత్రిపట విషయమను పేరుగలదని రెండవ విష్ణుకుండిన విక్రమేంద్రవర్మ చిక్కుళ్ళ శాసనము వ్యక్తపఱచుచున్నది. ఈ శాసన మిప్పటి పడమటి గోదావరి మండలములోని దెందులూరు గ్రామమునుండి ప్రకటింపబడినది. దానమీయబడిన గ్రామము నత్రిపటి విషయములోని కృష్ణానదీ తీరముననున్న రావిరేవుల గ్రామమున కాగ్నేయ మూలనున్న రేగొణ్ణయను గ్రామము. (1)

ఈ నతవాటి సీమనే కాకతీయులనాటి శాసనములలో శ్రీనాథవాటి సీమయని చెప్పబడినది. (2)

(1) తస్మిన్ కుర్వతి రాజ్యమిద్ధమతులం త్యాగాంకపోతాధిపే
ధనధాన్యాది సంపూర్ణే నాతవాటీ మహితలే ॥

(2) శ్రీమాన్సోత నృపాత్మజో నృపవర శ్రీనాతవాట్యాం మదో
ద్గౌరీశాంఘ్రిసరోజ్యయుగ్మ మధువిద్విశ్వేశ్వరస్యాదతాత్ ॥

(3) తత్పుత్రస్త్యాగి దోరక్షితి పతిరకరో దూర్జితం నాథవాటీ
రాజ్యం సౌరాజ్య రజ్యత్ప్రకృతి రవికృతి శ్లాఘ స్తత్ర చరిత్రః ।

(4) కోటబయ్యలుదేవి అమరావతి శాసనములో ఆమె బుద్ధదేవునికి నాథవాడి లేక నాథవాటిలోని మడపల్లిగ్రామము దానముచేసెనని గలదు.

పైని సూచింపబడిన కాకతీయులనాటి అనుమంచిపల్లిగ్రామ శాసనములో నతవాటిసీమలో తీరనది (పాలేరు) ప్రవహించుచున్నట్లు వర్ణింపబడినది.

"ధనధాన్యాది సంపూర్ణే నాతవాటి మహీతలే
శాగాబ్దేవేద లోకేశమితే శ్రీముఖవత్సరే
పరోపకార సంపత్తి సిద్ధయే పుణ్యవృద్ధయే
తుల్యాంతీరనదీ కుల్యాం కావేర్యాకృతవానసౌ
పోతపురాఖ్యాం ప్రథితాగ్రహారం...."

కృష్ణానది కుత్తరమున నీ యేఱు మధ్యమున గలియుచున్నది.

పెన్నాతవాడి మొదటి అమ్మరాజు మచిలీపట్టణశాసనములో పేర్కొనబడినది. దానిలో నతడు మొదటి చాళుక్య భీమునకు సైన్యాధిపతిగనున్న మహాకాలునకు పెన్నాతవాడి విషయములోని ద్రుజ్జూరు గ్రామమును దానముచేసెనని వక్కాణింపబడినది. ఆ గ్రామమునకు సరిహద్దు గ్రామములు గొట్టిప్రోలు, మల్కాపురము, తాళుగుమ్మి యనునవి. ఆ గ్రామములే నేటి నందిగామ తాలూకాలోని జుజ్జూరు, మలకాపురము, తాడిగుమ్మి, గొట్టుముక్కలయను గ్రామములు. (3)

అతని దేయగు పడంకలూరు తామ్రశాసనములో పెన్నాతవాడి విషయములోని పడంకలూరు గ్రామమును పండియనామధేయుడగు ద్విజోత్తమునకు దానముచేసెనని గలదు. (4)

బాపట్లలోనియొక శాసనములో శ్రీ భావనారాయణదేవరకు పెన్నాతవాడిలోని చిలుకూరి చిక్కనాయని కొడుకు భీమనాయకుండు శ్రీ భావనారాయణదేవరకు అఖండవర్తి దివియకు వెల్లెడ్లు దానముచేసెనని గలదు. ఈ చిలుకూరు బెజవాడ తాలూకాలోని గ్రామము. (5)

పైని సూచింపబడిన శాసనోద్దిష్ట గ్రామములు నందిగామ తాలూకాలోను బెజవాడ తాలూకాలో నుండుటచే, నతవాడి. పెన్నాతవాడి కృష్ణామండలము లోని కృష్ణానది కుత్తరమున, నందిగామ తాలూకా ప్రాంత భూమియై యుండవచ్చును.

1. E. I. Vol IV. No. 25.
2. (1) S. I. I. Vol X. No. 259.
   (2) ,, ,, 152.
   (3) ,, ,, 373.
   (4) E. I. Vol VI. No. 15. A-B.
3. E. I. Vol V. No. 16. D.
4. I. A. Vol VII. No. 15.
5. S. I. I. Vol VI. No. 187.

## నలవాడి (నలవాడి)

ఈ నలవాడి విషయము రెండవ పులకేశి కుమారుడగు మొదటి విక్రమాదిత్యుని శాసనములో (క్రీ. శ. 657) మొదట పేర్కొనబడినది. దానిలో నలవాడి విషయములోని రత్నగిరి గ్రామములో నొక బ్రాహ్మణునకు గొంత భూమి దానమీయబడినట్లున్నది. ఈ రత్నగిరి అనంతపుర మండలములోని మడకశిర తాలూకా యందలి రత్నగిరి యను గ్రామము. (1)

చాళుక్య వినయాదిత్య సత్యాశ్రయుని దయ్యందిన్నె శాసనములో నలవాడ విషయములోని ఉల్యాల గ్రామములోని కొంత భూమిని దూసశర్మ యను బ్రాహ్మణునకు దానమిచ్చినట్లు కలదు. ఈ ఉల్యాల గ్రామము కర్నూలు తాలూకాలోని ఉల్చాల గ్రామమే; దయ్యందిన్ని గ్రామము ఆదోని తాలూకా లోనిది. (2)

నందికొటుకూరు తాలూకాలోని సంగమేశ్వర గ్రామమునందలి యొక శాసనములో కళ్యాణి చాళుక్య ప్రభువైన త్రిభువన మల్లదేవుని సామంతుడగు బిజ్జనచోళ మహారాజు కన్నెమూనూఱు, పెడకవెంటంనూరు, నలవాడి అయ్యూరు అను మూడు నాడులేలుచుండెనని చెప్పబడినది. ఈ మూడు నాడు లొకటి కొకటి యంటియున్నవి. (3)

కర్నూలు మండలములోని పత్తికొండ తాలూకాయందలి కుఱకనూరు గ్రామములోని మూడవ సోమేశ్వరుని సామంతుడగు మహామండలేశ్వర దేవచోళ మహారాజు వ్రాయించిన శాసనములో నలవాడి అయ్యానుభీమతో నంతర్భాగమైన కొలు డెబ్బదింటిలోని కుకువమారు (కుంకనూరు) ఘటికా స్థానమునకు కొంత భూదానము చేయబడినట్లు గలదు. (4)

కర్నూలు మండలములోని శ్రీశైలములోని యొక శాసనములో నలవాడియందలి రాచవీడు పేర్కొనబడినది. కాని యీ గ్రామ మే తాలూకాలో నున్నదో తెలియదు. శిరువెళ్ళ తాలూకాలో రాచవేళి (రాజోలి) యను గ్రామము కలదు. రాచవీడే రాచవేళి కావచ్చును. (5)

నలవంశపురాజు లీ ప్రాంతము నేలియుండుటచే దీనికి నలవాడియను నామము గల్గియుండవచ్చునని శాసన పరిశోధకుల యభిప్రాయము. (6)

నలవాడి కర్నూలు, అనంతపురమండలములోని కొంతభాగమై యుండెనని యూహింపవచ్చును.

(1) J. B. B. R. A. S. Vol XVI. P. 225.
(2) E. I. Vol XXII. No. 7 (S. 614)
(3) S. I. I. Vol IX. No. 147. (A.D. 1079)
(4) Para 24 of M.E.R. 1935 36 (A.D. 1129-30)
(5) S. I. I. Vol P. No. 504. (A.D. 1313). కాకతి ప్రతాప రుద్రుని కాలము.

## నాగార్జునకొండ

నాగార్జునకొండ పల్నాటి తాలూకాలో మాచెర్లకు పదునైదుమైళ్ళ దూరమున కృష్ణానదీ తీరమున పర్వతారణ్య ప్రాంతములందున్నది. ఈ గ్రామమునకు సమీపముననే యొక గిరిదుర్గము కలదు. అమరావతి తర్వాత ప్రాచీనాంధ్ర బౌద్ధ క్షేత్రములలో వాసికెక్కిన స్థలము. అమరావతికి అరువది మైళ్ళ దూరమునగలదు. ఈ ప్రదేశమును మొట్టమొదట మార్చి 1926 సంవత్సరములో శాసనపరిశోధ వ్యవస్థకు చెందిన కీర్తిశేషులు రంగస్వామి సరస్వతి

గారు గుర్తించిరి. తర్వాత మహమ్మద్ ఖురైషీ, లాంగ్‌హార్టు. రామచంద్రన్ ప్రభృతులు అపూర్వమైన పరిశోధనలుగావించి, యిచ్చటి ఇక్ష్వాకుల కాలము నాటి ప్రాకృత శాసనములను, ప్రాచీన బౌద్ధ శిల్పములను వెలువరించిరి. వానివాని నివేదికలను ప్రచురించి, యొక వస్తు ప్రదర్శనశాల యందా శిల్ప సంపదను బదిలపఱచిరి. ఇప్పటి నాగార్జునసాగర నిర్మాణమున ఆంధ్రదేశమున ప్రాచీన శిలాయుగ, నూతన శిలాయుగ, చారిత్రక యుగములనాటి నాగరికతను సారస్వత, సాంఘిక, మత, రాజకీయ, వాణిజ్య విషయములను జూపట్టెడి సాధన సామగ్రి యెంతయో బయలుపడినది. ఈ విషయములు ఆంధ్ర ప్రదేశమునకేగాక భరతదేశమునకు నత్యంత ప్రాముఖ్యత నొసంగుచున్నవి. శాసన పరిశోధనశాఖ వారింకను ఈ ప్రాంతముల త్రవ్వి యపూర్వములగు సాధన సామగ్రి భద్రపఱచుచున్నారు.

నాగార్జునకొండకే శ్రీపర్వతమని పేరున్నట్లు ఇచ్చటి ప్రాకృతశాసనముల వల్ల దెలియుచున్నది. (చూడుడు. శ్రీపర్వతము)

M. E. R. 1925.26. Part II. Para 1.

E. I. Vol XX. No. 1. Prakrit Inscription from a Buddhist site at Nagarjunakonda.

## నాగార్జునకొండ సీమ

శ్రీకృష్ణదేవరాయల నాటి రెండు శాసనములలో నీ సీమ పేర్కొనబడినది.

శ్రీకృష్ణదేవరాయల వారివల్ల యల్లరినాయకుని కుమారుడు తిమ్మరినాయకుడు నాగార్జునకొండ సీమను నాయంకరముగాబడసి, ఆ సీమలోని రామడుకె గ్రామమును మాచెర్లలోని చెన్నకేశవస్వామికి దానముచేసెనని రామడుక గ్రామములోని కన్నడ - తెలుగు భాషా మిశ్రమములోనున్న యొక శాసనమువల్ల దెలియుచున్నది.

కోలగుట్లలోని (శ. స. 1519) యొక శాసనములో ఘంట ధర్మారాయనింగారు నాగార్జునకొండ సీమలోని కొలగుట్లలో కొంతభూమిని యొక

బ్రాహ్మణునకు దానమిచ్చెనని వ్రాయబడియున్నది. కోలగుట్ల పల్నాటి తాలూకాలోనున్నది, రామడుకె గ్రామము శాసన పరిశోధకులు పల్నాటి తాలూకా గ్రామములోనే చేర్చినారు.

నాగార్జునకొండసీమ పల్నాటి తాలూకాలో నంతర్భాగము.

M. E. R. 1929.30. Nos. 84; 88.

నాగావళి

నాగావళి పురాణ ప్రసిద్ధమైన నదులలో నొకటి. విశాఖపట్టణము మండలములోని రాయగడ తాలూకాలో విన్మోన్నతమైన కొండలలోను, ఒరిస్సామండలము లో కాలహండి సంస్థానములో పుట్టి, రాయగడ ప్రక్కనుండి పార్వతీపురమునకు తూర్పుగా వంద్రెండు మైళ్ళ దూరమున ప్రవహించి, శ్రీకాకుళమువద్ద సముద్రములో గలియుచున్నది.దీనికి జంఝావతి, వేగవతి, సువర్ణముఖి యనునవి ముఖ్య ఉపనదులు. దీని పొడవు 140 మైళ్ళు.

ఈ నాగావళీ తటము లపై, పాయకపాడులో పాతాళేశ్వరుని దేవాలయమును, గుంఫ గ్రామములో సోమేశ్వరగుడియు, సంగములో సంగమేశ్వరుని దేవాయతనము, శ్రీకాకుళములో కోటేశ్వర దేవాలయమును, సముద్రములో గలియుచోట మణినాగేశ్వరాలయమును నిర్మింపబడినవి.

ఈ నదికి పురాణములయందు లాంగుల్య, లాంగుళిని యను పేర్లుగలవు. శాసనములలో దీనికి లాంగలవేణియని పేరు. మహేంద్రపర్వతములో నుద్భవించిన నదులలో నొక్కటి.

పితృసోమర్షి కుల్యాచ ఇక్షుకో త్రిదివాచయా ।
లాంగలినీ వంశకరా మహేంద్ర ప్రభవాఃస్మృతాః ॥
మార్కండేయ పురాణము 57. 28-29

(1) Vizagapatam Dt. Gazetteer, P. 9-10.
(2) S I. I. Vol X. No. 750. S. 1512

## నాగేశ్వరనది

చాగి బేతరాజు మాచెర్ల శాసనములో (మహాదేవి తటాకము) (శ. స. 1088)

"పల్లి దేశ శతత్రయాంతర్వర్తి నాగేశ్వరనదీ ప్రాగ్భావ స్థితి సభ్యేయ పల్ల్యాం రాజమాన నివర్తన శతద్వయ పరిమితాం భూమిం ప్రాదాత్"

అని నాగేశ్వరనది పల్లిదేశము (పల్నాడు)లో ప్రవహించెడు స్రవంతిగ జెప్పబడినది దీనికే నాగులేఱని నామాంతరము. ఇయ్యది దక్షిణమునుండి ఉత్తరాభిముఖమై కృష్ణానదిలో గలియుచున్నది.

S. I. I. Vol 11. No. 66.

## నిరవద్యపురము

ఈ నిరవద్యపురము ప్రథమ చాళుక్య భీముని మచిలీపట్నము తామ్రశాసనములో పేర్కొనబడినది. ఈ చాళుక్యభీముడు క్రీ. శ. 892-921 సం॥ల మధ్య వేంగీరాజ్యమును బాలించెను. ఆ శాసనములో నితని కుమారుడు, పదునారేండ్ల బాలుడు ఇఱుమర్తి గండడనువాడు బహుపరాక్రమవంతుడై రాష్ట్రకూట సైన్యమును నిరవద్యపురముకడ నెదుర్కొని దానిని చీకాకు పఱచెననియు, పెరువంగూరుకడ ఆ సైన్యనాయకుడైన గుండయ దండనాయకుని వధించి, యుద్ధములో నభిమన్యునివలె వీరస్వర్గము నొందెనని చెప్పబడినది. ఇదియే నిరవద్యపురమును బేర్కొన్న ప్రథమశాసనమని తోచుచున్నది. (1)

అనవేమారెడ్డి శ్రీశైలశాసనములో నతడు "సంగర గౌతమీ సలిల సంగమ సకల జలదుర్గసాధన రఘురాముడనియు, రాజమహేంద్ర నిరవద్య నగరాది బహువిధ స్థలదుర్గవర్గ విదళన బలరాముడనియు" బేర్కొనబడెను. (2)

కొలని గణపతిదేవుడు రచించిన శివయోగసార పీఠికలో కృతిపతికి, ప్రపితామహుడగు బల్లప్రెగ్గడ నిరవద్యాపుర మానవనాథుల యొద్ద మంత్రిగా నుండెననియు, పితామహుడగు నాగమంత్రి నిడుదప్రోలి చక్రవర్తుల రాజ్య మహిమను దాల్చెననియు వర్ణింపబడెను.

ఆ. హారిత గోత్రజాతుడగుచు నాపస్తంబ
వితతసూత్రమునను వేగినాట
భూమిలోఁ బ్రసిద్ధి బొందెను నూకనా
ర్యుండు సుజన బంధుమండనుండు.

క. ఆ నూకన ప్రెగ్గడకును
సూనుండై బల్లప్రెగ్గడసుధి యొప్పారెన్
ధీనిధి నిరవద్యాపుర
మానవనాథులకుఁ దా నమాత్యుండగుచున్.

ఆ. అతని సుతుడు దరశివాచార సక్తుండు
జననుతుండు ధైర్య శౌర్యయుతుఁడు
జగతి నిడుదప్రోలి చక్రవర్తుల రాజ్య
మహిమ దాల్చె నాగమంత్రి యనఁగ.

చాళుక్యభీముని మచిలీపట్నము శాసనములోని నిరవద్యాపురము, అనవేమారెడ్డి శ్రీశైలము శాసనములోని నిరవద్యాపురము, శివయోగసార పీఠికలోని నిరవద్యాపురము నొక్క పట్టణమునే సూచించుచున్నవి. శివయోగ సార పీఠికలోని నిడుదప్రోలు నిరవద్యాపురము నొక్కటియేనని నా యభిప్రాయము. శ్రీ శేషయ్యగారు ఆంధ్రకవితరంగిణిలో ఐదవ సంపుటము. (పుట 238) నిరవద్యాపురము, నిడుదప్రోలు పురములు వేరని మల్లివూడి శాసనముదాహరించి యున్నారు. కాని శాసన పరిశోధకుల నివేదికలో మల్లివూడియే నిరవద్యాపురమని చెప్పలేదు. ఈ శాసనశిల నిరవద్యాపురము నుండి యెవ్వరో యచ్చటకు గొనివచ్చి యుందురని యభిప్రాయపడిరి. (3)

ఆ కాలమున సర్వలోకాశ్రయ, విష్ణువర్ధనాది బిరుదాంకితులగు చాళుక్య వంశీయులు నిడుదప్రోలు పాలించుచుండిరి. (4)

ఈ నిరవద్యపురము, లేక నిడుదప్రోలు, నేటి పడమటి గోదావరి మండలములోని విడుదవోలను గ్రామము. మచిలీపట్నము శాసనములోని పెరువంగూరు, బెజవాడ తాలూకాలోని పెనుమకూరు, వేంగీదేశములోనివి.

"నిరవద్య" యనునది పశ్చిమ చాళుక్య రెండవ విజయాదిత్యునకు (క్రీ. శ. 699-729) బిరుదనామము. ఆతని పేర నే యీ పురమున కా పేరు లభించి యుండవచ్చును.

(1) Para 6 of Madras Epigraphical Report 1913-14.
(2) S. II. Vol II No. 559.
(3) Para 71 of Annual Report of South India Epigraphy 1928-29.
(4) S. I. I. Vol V. No. 124. (శ. స. 1228)

## నెల్లూరు (సీమ; వనితము)

ప్రాచీనాంధ్ర శాసనములలో నియ్యది నెల్లూరు, నెల్లూరునాడు, నెల్లూరుసీమ, నెల్లూరువణితమనియు చెప్పబడినది. తమిళశాసనములలో జయంగొండ చోళమండలములోని చేదికులమాణిక్య వలనాటి యందలి పిడైనాటి యంతర్భాగమని చెప్పబడినది. దీనికి విక్రమసింగపురమని నామాంతరము.

(1) జయంగొండ చోళమండలములోని, చేదికుల మాణిక్క వలనాటి యందలి పిడానాటి విక్రమసింగపురమను నెల్లూరు. (శ. స. 1112) (తమిళశాసనము)

(2) జయంగొండ చోడమండలములోని, చేదికుల మాణిక్క వలనాటి యందలి, పీడానాటి విక్రమసింగపురమను నెల్లూరు. (శ. స. 1114) (తమిళశాసనము)

(3) జయంగొండ చోళమండలములోని, చేదికుల మాణిక్క వలనాటి యందలి; పిడానాటి విక్రమసింగపురమను నెల్లూరు. (శ. స. 1185) (తమిళశాసనము)

(4) జయగొండ చోళమండలములోని జయకుల మాణిక్క వలనాటి యందలి పడైనాటి నెల్లూరను విక్రమసింగపురము (శ. స. 1222) (తమిళశాసనము)

(5) మొదటి (1); (2); (3) వలనే. (శ.స. 1224) (తమిళశాసనము)

(6) నెల్లూరు సీమయ శ్రీ కల్లు గ్రామ జలసిద్ధేశ్వరగె ప్రభాకర పట్టణద (కన్నడశాసనము) కృష్ణదేవరాయలనాటిది.

(7) అదే తెలుగు శాసనము.

(8) శ్రీకృష్ణదేవరాయల తెలుగుశాసనము. నెల్లూరుసీమలోని శికల్లు గ్రామము. (శ.స. 1436)

(9) నెల్లూరు సీమలోని పెళ్లెడ్లు అనే గ్రామము. ఇది నేటి ఆత్మకూరు తాలూకాలోని పెళ్లేరను గ్రామము. (శ.స. 1544-శ్రీ వెంకటపతిరాయల నాటి శాసనము)

(10) ఉదయగిరి రాజ్యం నెల్లూరి వణితంలోను రాపూరి సీమలోను....

వెనుబరితి ప్రతినామ మనేటి క్రిష్ణరాయ సముద్రము(శ.స. 1559)

కేతన విశ్రుత దశకుమార చరిత్రములో మనుమసిద్ధి మహీవల్లభునకు రాజధానియు, తిక్కనామాత్యునకు నిజస్థానమునైన విక్రమసింహపురము నిట్లు వర్ణించియున్నాడు. ఈ పురమును వర్ణించిన ప్రథమకవి యితడె.

సీ. కరిఘటానిలయంబు తురగజన్మస్థలి
సుభటనివాసంబు సుకృతకర్మ
కర్మఠద్విజగణాకరము రాజన్యవం
శావాసమర్యవర్ణాశ్రమంబు
కర్షకాగారంబు కవిబుధసదనంబు
సుందరీశృంగార మందిరంబు
ధనధాన్య సంగ్రహస్థానంబు ధర్మద
యాచార విద్యావిహారభూమి

తే. తైలఘృతలవణాది సద్ద్రవ్యసాల
మమల బహువిధ రత్నరత్నాకరంబు
మధుర జలపూర కాసార మండలంబు
నాగ విక్రమసింహాఖ్యనగర మొప్పు.

ప్రథమాశ్వాసము. పీఠిక. ప. 11.

పై శాసనములలోని దేశనిర్దేశ నిర్ణయమునుబట్టి నెల్లూరు జయంగొండ చోళమండలములో నంతర్భాగమైన చేదికుల మణిక్క వలనాటిలోనున్న పిడైనాటి యందలి గ్రామమని తెలియుచున్నది. ఇట్టి మండల, వలనాటి విభాగము లా కాలమునాటి తమిళరాజుల పాలనములోనున్న ఆంధ్ర భూభాగ సీమానిర్ణయములవల్ల విదితమగుచున్నది.

**N.I.** (1) **N.** (40); (2) **G.** (50); (3) **G.** (15); (4) **G.** (115); (5) **N.** (60); (6) **U.** (37); (7) **U.** (38); (8) **U.** (40); (9) **A.** (48) (10) **R.** (49).

## నోలంబవాడి

ఇయ్యది రాష్ట్రకూటుల పాలనములో నొక చిన్నమండలమై నోళంబళిగెయని పిలువబడుచుండెను. తర్వాత నోలంబవాడి ముప్పది రెండువేల గ్రామ పరిమితమయ్యెను. మైసూరు రాష్ట్రములోని తుముకూరు, చిట్లదుర్గ మండల ప్రాంతమును, అనంతపురము మండలములలోని దక్షిణప్రాంతము వఱకు వ్యాపించియుండెననుటకు శాసనములు సాక్ష్యమిచ్చుచున్నవి. మడకశిరా తాలూకాలోని హెంజెరు లేక హేమావతి నోలంబులకు రాజధానిగనుండెను. అనగా ఆంధ్రప్రదేశమునకు దక్షిణప్రాంతముననున్న అనంతపూరు మండలములో కొంతభాగముకాని, పూర్తిగాకాని నోలంబవాడి, లేక నోలంబ రాష్ట్రములో తొమ్మిది, పదియవ శతాబ్దముల కాలములో గలసియుండెను.

(2) **Two Nolamba Inscriptions from Dharmapuri E. I. Vol V. No. 14.**

(2) **E. C. Vol VII. Nos. 24, 28, 35 and 36.** (హేమావతి, మడకశిర శాసనములు)

## పంచారామములు

"భీమాపురము, డాకరేమి, వాల్కొలను ద్రాక్షారామపురి శ్రీ మదమరడాలు యను నంధ్రధరణి పంచారామముల మహాదేవరలకు" (1)

"అనంతరంబా యంభికావల్లభుండు త్రిపురదైత్యేయుల కులదైవతంబైన యద్దివ్యలింగంబును బంచబ్రహ్మ. పంచాక్షరి, పంచతత్వ, పంచభూత

మయంబగుటం జేసిపంచఖండంబులుగా ఖండించి, కృష్ణవేణీ మహానదితీరంబున ధరణాలకోటయను గ్రామంబున నమరేశ్వరుని చేతం బ్రతిష్ఠితంబగుటంజేసి యమరలింగంబునా బ్రసిద్ధంబైన యమరారామంబును, గౌతమీతీరంబున దక్షిణకూలంబున గుణపూడియను గ్రామంబున సోమునిచేత బ్రతిష్ఠంబు సేయం బడుటం జేసి సోమలింగంబనఁ బ్రఖ్యాతంబైన సోమారామంబును. పాలకోటి యను గ్రామంబున శ్రీరామచంద్రునిచేఁ బ్రతిష్ఠితంబగుటం జేసి రామలింగం బునా బ్రసిద్ధంబైన క్షీరారామంబును, చాళుక్యవంశ రాజధానియైనచాళుక్య భీమవరనామ గ్రామంబునఁ గుమారరత్నంబైన కుమారస్వామి చేతం బ్రతిష్ఠితంబుగుటంజేసి కుమార భీమలింగంబన బ్రఖ్యాతంబునొందిన భీమా రామంబును, మొదలి మామయగు దక్షప్రజాపతి యునికిపట్టైన యారామం బగుట దక్షారామంబున శివసన్నిధానంబై దానుండునట్లుగా నీ ప్రకారంబున భోగమోక్ష ప్రదంబులైన పంచారామంబులను బ్రతిష్ఠనొందించి" భీమేశ్వర పురాణము-శ్రీనాథుడు. (2)

"పంచఖండాని కృత్వాథ పంచస్వారామ భూమిషు
అమరేశారామ, సోమరామ, క్షీరవనానిచ, ।
కుమారారామ విఖ్యాతా చ్చతురారామ పట్టణే
ప్రతిష్ఠాప్య స్వయంభీమో దక్షిణాబ్ధి తటస్థితే ।
దాక్షారామపురే రమ్యే దక్షిణానందకాననే
శుద్ధస్ఫటిక సంకాశం సర్వలోకమనోహరం ।

సంస్కృత భీమేశ్వర పురాణము.

పంచారామములు(1)దాక్షారామము. తూర్పుగోదావరి మండలము లోని రామచందపురము తాలూకాలోని సుప్రసిద్ధక్షేత్రము. (2)చాళుక్య భీమవరం. తూర్పుగోదావరి మండలములోని కాకినాడ తాలూకాలోని సామర్లకోట కెదురుగానున్న భీమవరగ్రామము. (3) పాలకొల్లు - క్షీరా రామము.ఇది పశ్చిమగోదావరి మండలములోనినరసాపురము తాలూకాలోని గ్రామము. (4) గుణపూడి భీమవరము. ఇదియు నామండలములోని భీమ వరము తాలూకా గుణపూడిగ్రామము. (5) అమరావతి - ధరణికోట.

గుంటూరుమండలములోని సత్తెనపల్లి తాలూకాలోని సుప్రసిద్ధ అమరావతి క్షేత్రము.

(1) S. I. I. Vol VI. Nos. 749. 1180 (శ. స. 1068)
(2) శ్రీనాథుని భీమఖండము. చతుర్థాశ్వాసము. ప. 151.

## పంప(పా)వాడి

ఈ పంపావాడి, విశాఖపట్టణము మండలములోని విశాఖపట్టణము తాలూకా అప్పికొండ గ్రామమునందలి శివాలయశాసనమునందు పేర్కొనబడినది. మాచిమయ్య నాయకుడు, దండనాయక మార్తండనాయకుడును గలసి అప్పికొండ గ్రామమును దంతివారగ్రామములోని సోమేశ్వరునకు దేవభోగముగ పూర్వదత్తమైన విషయమును స్థిరపఱచినట్లు శాసనము తెలుపుచున్నది. వీరిలో మాచిమయ్య నాయకుడు మహాప్రధాన దండనాయక అన్నరాజు ప్రధానియనియు, నతడు పంపావాడికి తూర్పుననున్న విశాఖపట్టణమునకు సమస్తాధికారి యనియు తెలుపబడినది. పంపావాడి యనగా పంపానదికి రెండు పార్శ్వములగల దేశభాగమని యూహింపవచ్చును. ఈ శాసనము పశ్చిమ చాళుక్య ప్రభువగు ఆరవ విక్రమాదిత్యుని కాలము నాటిదని తెలియుచున్నది.

No. 1 of Appendix-B. 1941-42. Page 259. Annual Report of South Indian Epigraphy 1939-40 to 1942-43. S. 1053.

## పంపానది

ఈ పంపానది తూర్పుగోదావరి మండలములోనిది. ప్రాచీన శాసనములలో పేర్కొనబడినది.

దానార్ణవుని కాండ్యము శాసనములో తాను తన సవతియన్న తర్వాత రాజ్యమునకు వచ్చుటకై మల్లియ, గొండియ సోదరులకు వారొనర్చిన సహాయమును గూర్చి కృతజ్ఞతా సూచకముగ తన రాజ్యములో నంతర్భాగమైన పొత్తపినాడు త్రిశతమును దానమిచ్చినట్లు గలదు. ఆ పొత్తపినాటి సీమలు ఇట్లు తెలుపబడినవి. (1)

అస్తువః అశ్యాధ్యాయం పూర్వతః పంపావటీనదీ
దక్షిణతః ఉత్తరవరుస పశ్చిమతః మీనుం
జాకనాండు ఉత్తరతః వెడగునడెబ్బది.

సింగయనాయకుని అక్కలపూడి శాసనములో నతని రాజధానియైన ముమ్మడివీడు పంపాతటము నందున్నట్లు వర్ణింపబడినది. (2)

ప్రగాఢ వన్యావృత పార్శ్వదేశే పంపానదీ పాథసిపావనేచ్ఛే
స్వరాజధానీ ప్రతిబింబితేవ విరాజ సౌ నగరీవిశాలా ॥
నామ్నా ముమ్మడినాయకస్య ఘటితా స........ రిణే
లక్ష్మ్యావిభ్రమ భూర్విలాస నిలయో వాహ్యాక్షార్మండనం ।
పంపా సంపదుపాశ్రితా సవిధగ శ్రీరామనాథేశ్వరా
ఖ్యాతా ముమ్మడివీడు నామనగరీ సింగక్షమా భృద్విభోః ।

ఈ పంపానది తూర్పుగోదావరి మండలములో పెద్దాపురముతాలూకా రౌతులపూడి గ్రామ సమీపమున నుద్భవించి, అన్నవరము గ్రామము మీదుగా ప్రవహించి, తునితాలూకా గుండా పోయి సముద్రగామియగు చున్నది. ఈ తాలూకాలో పంపావరమను గ్రామమును గలదు.

(1) A. H. R. S. Vol XI. Part 1-2.
(2) Akkalapudi Grant of Singayanayaka S' 1290. E. I. Vol XIII.

## పదనాడు (పిడనాడు)

ఈ క్రింది గ్రామములు పడనాటిలోనివని నెల్లూరుమండల శాసన సంపుటములందును, మరికొన్నింటి శాసనములందును బేర్కొనబడినవి.

(1) చంద్రగిర్యావ్యయోరాజ్యే పడనాడుమహీతలే
పోరూరుసీమ విఖ్యాత ప్రతిష్ఠితమనుత్తమమ్ ।
సువర్ణముఖరీ నద్యా దక్షిణాందిశి మాశ్రితం
తండంచ గ్రామసంయుక్తం లింగంపాడ్వితి నామకం ॥

(2) శ్రీ చంద్రగిరిరాజ్యస్థం పడనాడు సమన్వితం .
పేరూరుసీమ సంయుక్తం మంగలంపాడు నామకం ॥
ఇలుపుర్నామక గ్రామాన్ ప్రతీచ్యాందిశి సంస్థితం
సంతవేలూర్నామకస్య గ్రామస్యోత్తరతః స్థితం ॥
ఊగుమూడి పేరగ్రహారా త్పూర్వస్యాందిశి సంస్థితం ।
ఉచ్చూరినామక గ్రామీన్ దక్షిణస్యాందిశి స్థితం ॥

(3) శ్రీ చంద్రగిరి రాజ్యస్థం పోరూరిసీమకే స్థితం
పిడనాడితి విఖ్యాతం నిడుగంటకోటీతి విశ్రుతం ॥
బలివల పతుసంయుక్తం సర్వసస్య సమన్వితం ।
మంగనూరు పూర్వభాగేత త్రయలి గ్రామదక్షిణే ।
మోదుగల పాల్య పశ్చిమాయాం మంగలిం పాడువుత్తరం ।
వుచ్చూరుగ్రామ రత్నతంత్ ॥

(4) చంద్రగిర్యాఖ్య రాజ్యేతు పడనాడోస్తు సీమని
నద్యా సువర్ణముఖ్యాయాః స్థ పుణ్యే మనోహరే ।
కావలూరం మహాగ్రామం వాసయోగ్యం మనీషిణాం ॥

(5) జయగొండ చోళమండలములోని, చేదికుల మాణిక్య వలనాంటి పడైనాటిలోని విక్రసింహ పురమును నామాంతరముగల నెల్లూరు (తమిళ శాసనములు).

(6) చంద్రగిరిరాజ్యంలోను మాకు నాయంకరానకు శెల్లె తూర్పు పడనాంటిసీమలోని - నెల్లూరు చిరుమనంబూడి, జం కా ర అళగదేవునికి.

(7) పెడైనాటిలోని పీక్కొడు, కోలూరు, మేలప్పయూరు, యామలూరు, కుఅట్టూరు.

(8) జయంగొండ చోళమండలములోని, చేదికుల మాణిక్య వలనాటి పిడైనాటి పోయిందణపల్లి.

(9) జయంగొండ చోళమండలములోని, పై యూరిలంగొట్టములోని కిలపట్టినాటి తిరువంబూరు. (తమిళశాసనము)

(10) జయంగొండ చోళమండలములోని మెలై పట్టయగాంటి కుములూరు.

(11) మెలై పట్టియినాటి గునుపాడు.

(12) జయంగొండ చోళమండలములోని చేదికుల మాణిక్యమునాటి లోని, పడై నాటి నెల్లూరు - కురుచెర్లపాడు. (తమిళశాసనము)

(13) శ్రీకృష్ణదేవరాయల కాళహస్తి శాసనములో పడనాటిలోని కొన్ని గ్రామములు. శ్రీ కాళహస్తీశ్వరునకు దానముచేసినట్లు గలదు. (కన్నడశాసనము)

పై శాసనవివరముల ననుసరించి చాళుక్య చోళుల కాలములో పడనాడు జయగొండ చోళమండలములో నంతర్భాగమనియు, తర్వాత విజయనగరసామ్రాజ్య కాలమున చంద్రగిరి రాజ్యములో నంతర్భాగమనియు నయ్యెది, తూర్పుపడనాడు, దక్షిణపడనాడు(కీళపట్టునాడు)పడుమటిపడనాడు (మేల్పట్టినాడు)అని విభజింపబడెననియు, ఈ నాటి మధ్యమమున సువర్ణముఖి ఏది ప్రవహించుచున్నదనియు, దెలియుచున్నది. శాసనోద్దిష్ట గ్రామముల యునికినిబట్టి పడనాడు నెల్లూరుమండలములోని నెల్లూరుతాలూకా, గూడూరు తాలూకా, సూళ్ళూరుపేట తాలూకా ప్రాంతభూమియై తర్వాత, చిత్తూరు మండలములోని చంద్రగిరి, కాళహస్తి తాలూకాలవఱకు విజయనగర సామ్రాజ్య కాలమున విస్తరించియుండెను.

| తండము | తడ | సూళూరుపేట తాలూకా |
|---|---|---|
| లింగంపాడు | లింగంపాడు | ,, |
| ఇలువూరు | ఇలుపూరు | ,, |
| ఊగుమూడి | ఊడుపూడి | ,, |
| ఉచ్చూరు | ఉచ్చూరు | ,, |
| మంగలంపాడు | మంగలంపాడు | ,, |
| మోడుగులపాల్యం | మోడుగులపాలెం | ,, |
| చిరుమనబూడి | చిల్లమూరు | ,, |
| నెల్లూరు | నెల్లూరు | నెల్లూరు తాలూకా |
| కుఱుటూరు | కొరుటూరు | ,, |

| | | |
|---|---|---|
| కోలూరు | కోడూరు | ,, |
| నెల్లటూరు | నెల్లటూరు | గూడూరు తాలూకా |
| పిట్కాడు | వాకాడు | ,, |
| తిరువంలూరు | తిరుమూడు | ,, |
| కుములూరు | గూడూరు | ,, |
| గునుపాడు | గునుపాడు | ,, |
| పోయిందనపల్లె | పుచ్చలపల్లె | ,, |
| కాపలూరు | కాపలూరు | ,, |

(1) N. I C. P. No. 3 (A. D. 1429-30)
(2) ,, 6 (A. D. 1602-03)
(3) ,, 7 (A. D. 1647-48)
(4) ,, 15 (A. D. 1836-37)
(5) N. I. Gudur No. 85 (A. D. 1263-64)
(6) ,, 103 (A. D. 1530-31)
(7) N. I. Nellore No.67
(8) ,, 111 (A. D. 1204-05)
(9) N. I. Gudur No. 58
(10) ,, 20-33
(11) ,, 34
(12) ,, 50 (A. D. 1192-93)
(13) S. I. I. Vol IX. Part II. No. 489 (A. D. 1518)

## పద్మినీ పురము

ఇది పశ్చిమగోదావరి మండలములోని భీమవరము తాలూకాయందలి గణపవరగ్రామమునకు నామాంతరము.

(1) కొలని కాటమనాయకుణ్డు పద్మినీపురంబున స్వర్ణేశ్వర దేవరకు (శ. స. 1078)

(2) శ్రీ మత్పద్మినీపురవరంబున శ్రీ స్వర్ణేశ్వర మహాదేవరకు (శ. స. 1087)

S. I I. Vol X. Nos. 126; 157

## పరువివిషయము

ఈ పరువి విషయము ప్రాచీనాంధ్ర విషయములలో నొకటి. పరువి గ్రామమే ఇప్పటి పరిగిగ్రామము. హిందూపురము తాలూకా, హిందూపురము నకు ఏడుమైళ్ళ దూరముననున్నది. పశ్చిమ గాంగరాజైన మహారాజ మాధవ వర్మ తామ్రశాసనములో (క్రీ. శ. 425) పరువి విషయములోని వేల్పుత్తోరు గ్రామమును ధరశర్మయను బ్రాహ్మణునకు బ్రహ్మదేయముగ విచ్చినట్లు చెప్పబడినది. ఈ వేల్పుత్తోరె గుత్తితాలూకాలోని వేల్పుమడుగను గ్రామము.

ఈ పరువి విషయమె ప్రాచీన కన్నడశాసనములలో హరువెనాడని చెప్పబడినది. పరిగిగ్రామములోని హోయసలరాజగు రెండవ బళ్ళాలదేవుని కన్నడ శాసనములో (శ. స. 1100) గురిగంజికోల బయలులోని భీమేశ్వర స్వామి దేవాలయమున కొక ఘంట దానమొసంగబడినట్లు తెలుపబడినది. (2)

పరువి విషయము, పరిగిగ్రామ పరిసరప్రాంతమును, గుత్తితాలూకా లోని కొంత భాగమునై యుండెను.

(1) E. I. Vol XXIV. P. 234.

(2) S. I. I. Vol IX. Part I. No. 318. (రెండవ మాధవవర్మ పెనుగొండ శాసనములో ఈ పరువివిషయము పేర్కొనబడినది. E. I. Vol XIV. No. 24)

## పల్లినాడు (పల్నాడు)

ఆంధ్రచరిత్రమున, సారస్వతమున నత్యంతపురాతనమైన రాష్ట్ర విభాగములలో పల్లినాడు వేక పల్నాడొకటి.

(1) ఇది పూర్వ చాళుక్య ప్రభువైన రెండవ విష్ణువర్ధనుని కోనెకి శాసనమున (క్రీ. శ. 669) మొదట నుదాహరింపబడినట్లు తోచుచున్నది.

"శ్రీ మదింద్రవర్మ మహారాజస్యపుత్రః నానా శాస్త్రార్థాభ్యాసో పాత్తానేక విద్యావిశారదః విష్ణువర్ధన మహారాజః పల్లిరాష్ట్రే కోణెకి నామగ్రామం"

(2) చాగి బేతరాజు మాచెర్ల శాసనము.

సబేత భూపతిః శౌనకగోత్రేన మహీధర పౌత్రేణ శ్రీధరపుత్రేణ జోగమాంబికా నందనేన శ్రీమదాదిత్యేన మహాదేవి తటాకాభిధానాయాం

రాజధాన్యాం ప్రతిష్ఠితా యాదిత్యేశ్వరాయ గుణపురగంగనేందు సంఖ్యాక శకవర్ష ఖరాభిదానే కార్తిక శుద్ధ ద్వాదశ్యాం పల్లిదేశ శతత్రయా న్తర్వర్తి నాగేశ్వరనదీ ప్రాగ్భావస్థిత సబ్బేయ పల్యాం రాజమాననివర్తన శతద్వయ పరిమితాం భూమిం ప్రదాత్.

(3) కులోత్తుంగ గొంకరాజు — కొడమగూడ గ్రామము.

శ్రీ మన్మహామండలేశ్వర కులోత్తుంగ చోడ గొంకరాజు ముదిపెలి యాసనపెగ్గడ పల్లినాంటిలో నందమకు నడచెడు వడ్డరావళము పాలును.

(4) ద్రోణాదుల శాసనము.

"పల్లినాంటి వీరుండు అనుంగుందేవ మహారాజుల పలికి కమ్మనాంటి ద్రోణాదికేశవదేవుల"

(5) దుర్గి శాసనము.

"ఆంధ్రదేశాదిక శుభవిలసత్పల్లినాంటి ప్రసిద్దే ఎయ్యూరి గ్రామవర్యో మహిపపతిభిః కృష్ణవేణీ తటిన్యాః" "పల్లినాంటిలోని దుగ్యపట్టణము."

(6) మార్కాపురము తాలూకా త్రిపురాంతకములోని శాసనము.

స్వస్తిశ్రీ మన్మహామండలేశ్వర మూరురాయ జగదళ కాకతీయ గణపతిదేవ దివ్య శ్రీ పాదపద్మోప జీవియైన శ్రీ మన్మహామండలేశ్వర గండపెండారు జన్నిగదేవ మహారాజులు తమకుంబుణ్యముగాను స్వస్తిశ్రీ త్రిపురాంతకదేవర అంగరంగ భోగాలకు పలినాంటిలోని గంధ్రకోట అనుంగు రాజుపల్లి చతుస్సీమమూను"

(7) దుర్గి శాసనము. కాకతిరుద్రమదేవి.

"బ్రహ్మకులోత్తముండునుం కాశ్యపగోత్ర పవిత్రుండును నందాపుర అగ్రహార ప్రముఖుముఖ్యుండును నైన సవదరం మల్లపరాజు కొడుకు కరణము నామయ పల్లినాంటిలోని దుగ్యపట్టణమునందు గోపీనాథదేవరం బ్రతిష్ఠసేసి"

(8) భృగుబండ శాసనము. పల్లినాటిలోని బక్కబండ.

పై శాసనములలోని గ్రామములును, నేటి వాని యునికి యీ క్రింది పట్టికలో జూడనగును.

| | | |
|---|---|---|
| కోణకి | కోనంకి | పల్నాడు తాలూకా |
| దుగ్యపట్టణము | దుర్గి | |
| అనుంగురాజుపల్లి | అలుగురాజుపల్లె | పల్నాడు |
| బిక్కబండ | భృగుబండ | సత్తెనపల్లి |

వినుకొండవల్లభరాయని కృత క్రీడాభిరామములో నియ్యది పలినాడు, పల్నాడు, పల్లెనాడు, పల్లెదేశమనియు వర్ణింపబడినది.

గీ. విప్రుడీక్షించె బలినాటి వీరపురుష
పరమదైవత శివలింగ భవనధాటి.

గీ. కులముదైవతంబు గురిజాలగంగాంబ
కలనిపోతులయ్య చెలిమికాడు
పిలుకి కండలేని యలువదియేగురు
పల్లెనాటి వీరబాంధవులకు.

గీ. ఆరువల్లినాయి నారి దుర్మంత్రంబు
కోడిపోరు చాపకూటి కుడుపు
ప్రథమకారణములు పల్నాటియేకాంగ
వీరపురుష సంప్రహారమునకు

గీ. ఇచ్చోట భుజియించి రేక కార్యస్థులై
సామంత నృపతులు చాపకూడు
ఇచ్చోట జింతించె నిచ్చనుపాయంబు
నలినాక్షి యావ్వెల్లినాయురాలు
నిజమను శుద్ధికై నిప్పులయేటిలో
నోలాడె నిచ్చోట బీలసాని
ఇచ్చోట బోరిరి యిలపణంబుగ గొల్ల
పవతితల్లుల బిడ్డలవని పతులు

గీ. ధీరులగు వారలేవురు వీరపురషు
లై మతోద్ధతి నిచ్చోట నాజిబడిరి
యనుచు జెప్పుదు రైతిహ్యముచట నచట
జనపపెద్దలు పల్లెదేశమ్ములందు.

కం. నల్లంగొండయు, నాగరి
కల్లును ధరణీస్థలిం బ్రగల్భస్థలముల్
పల్లేరు నాగులేరును
బల్లెక్ష్మాకాంత యెల్ల ప్రారంభంబుల్.

శ్రీనాథ కృతమని చెప్పబడు పల్నాటి వీరచరిత్రలో దీనిని పలనాడని వ్రాసియున్నాడు.

"విలసిల్లు పలనాటి వీరులచరిత
జనులెల్ల భక్తిచేఁ జదువుటకొఱకు"

ఆ కవియె చెప్పిన చాటుపద్యములో పల్నాటి నిట్లు వర్ణించెను.

గీ. చిన్నచిన్న రాళ్ళు చిల్లరదేవుళ్ళు
నాగులేటి నీళ్ళు నాపరాళ్ళు
సజ్జజొన్నకూళ్ళు సర్పంబులును దేళ్ళు
పల్లెనాటి సీమ పల్లెటూళ్ళు.

పింగళిసూరన ప్రభావతీప్రద్యుమ్నములో నిని పలనాడనియె చెప్పినాడు.

ఉ. రంగుగ గౌతమీపరిసరంబులఁ గృష్ణకెలంకులన్ ఘనుల్
పింగళిరామయాదులు లలిం బలినాటను బాకనాటనుం
బింగళిగాద యాదులిటఁ బెంపువహించిన యన్మదాదులో
పింగళి గోకమంత్రి యిలుపేరనె చాల ప్రసిద్ధులెల్లచోన్.

అప్పకవి యీ పల్నాటిని పల్లెనాడని ప్రయోగించెను.

గీ. పల్లెనాటను నూటతొంబదియు నాల్గు
గ్రామముల నీడుగానక కాకనూరి
వెంగనార్యుఁడు వేదవేదాంగములను
బ్రస్తుతికినెక్కె మాఱట బ్రహ్మయనగ.

ఆంధ్ర చరిత్రకారుడు పల్నాటి పదవ్యుత్పత్త్యర్థమును గూర్చి యిట్లు వ్రాసియున్నాడు.

"ఆంధ్ర రాజధానీనగరమగు ధాన్యకటకమునకు దక్షిణభాగమున జైన బౌద్ధ శైవమతము లవలంబించిన పహ్లావాదులు వేనవేలు నివసించుచు క్రమముగా నాంధ్రులలోఁ గలసిపోయి యాంధ్ర పహ్లావులనంబడుచుండిరి. ఈ యాంధ్ర పహ్లావులే పల్లవులైరి. ఈ పల్లవులు నివసించుప్రదేశమే పల్లవ నాడని పేరం బిలువబడుచుండెను. ఈ పల్లవనాడే నేడు పల్నాడని పిలువ బడుచు గుంటూరు మండలములో నున్నది" (ఆంధ్రుల చరిత్రము. ప్రథమ భాగము. పు. 126.)

ఈ పల్నాడనునది "పల్లి" శబ్దముతో సంబంధముగలదనియు, పల్లి యను పదమునకు బౌద్ధ లేక జైన నివాసస్థలమని యర్థమనియు, ప్రాచీన కాలమున బౌద్ధమతవ్యాప్తికి స్థానమైన సుప్రసిద్ధ నాగార్జునాచార్య బౌద్ధ సంఘారామమునకు నిలయమై, బౌద్ధ నివాసముల కాటపట్టగుటచే నియ్యది పల్లెనాడై, తరువాత పల్నాడైనదని యూహించుటయే సమంజసము. దీనికి శాసనపద ప్రయోగములును, ఆంధ్ర కావ్యప్రయోగసరణియు ప్రమాణములు.

పల్నాడు కృష్ణకు దక్షిణతీరమున సత్తెనపల్లి తాలూకాకు పడమటయు వినుకొండ తాలూకా కుత్తరముననున్న నేటి పల్నాటి తాలూకా ప్రాంత భూమి. దీనిలోని ముఖ్యనదులు నాగులేరు (నాగేశ్వరనది) చంద్రభాగ (చంద్రవంక)యునై యున్నవి.

(1) E.I. Vol XXXI. No. 12. Koneki grant of Vishnuvardhana II (Paras 15 and 16 of M. E. R. for 1939-40 to 1942-43.

(2) S I. I. Vol X. No. 66 (శా.శ. 1033)
(3) ,, 119 (శా.శ. 1069)
(4) ,, 233
(5) ,, 334 (శా.శ. 1173)
(6) ,, 370 (శా.శ. 1181)
(7) ,, 422 (శా.శ. 1191)
(8) No. 263 Stone Inscription M E.R.1932-33(శా.శ. 1040)

## ప్రకిక్కనాడు (ప్లకిక్కనాడు) - విషయములు

ప్లక్కి విషయము విష్ణుకుండిన ఇంద్రవర్మ రామతీర్థము శాసనములోను, మొదటి చాళుక్య విష్ణువర్ధనుని తిమ్మాపురము, చీపురుపల్లి శాసనము అందును, చాళుక్య ప్రథమ జయసింహుని గుడివాడ శాసనములందును, సింహాచలములోని వీరఘట్టము బియ్యాలరాజుదేవి యైన గంగాదేవి శిలాశాసనమునందును పేర్కొనబడినది.

1. రామతీర్థము శాసనము- ప్లక్కిరాష్ట్రములోని పేరువాటకము (విజయనగరము తాలూకా)

2. తిమ్మాపుర శాసనము (సర్వసిద్ధి తాలూకా) — పళకి విషయములోని
   (1) కుములూరు
   (2) పోటునూటక

3. చీపురుపల్లి శాసనము (చీపురుపల్లి తాలూకా)? — ప్లక్కి విషయములోని చెరుపూరు

4. గుడివాడ శాసనములు (సర్వసిద్ధితాలూకా) — ప్లక్కి విషయములోని
   (1) ఆదివాస
   (2) కుళివాటక
   (3) కుందూర గ్రామము
   (4) కుడివాడ

గుడివాడ మూడవ తామ్రశాసనములో కుడివాడకు సీమానిర్ణయము చేసిన పట్టున ఈ గ్రామమునకు దక్షిణమున సముద్రమున్నదని తెలువబడినది. (దిక్షిణతః సముద్రః)

(5) సింహాచలము శాసనములో 'ప్రక్కినాంటిలోని కావొరయి' తామ్రశాసనములో పేర్కొన బడిన ప్లక్కి విషయమే, సింహాచల శాసనములో ప్రక్కివాడని వ్యవహరింపబడెను.

శాసనోద్దిష్ట గ్రామనిర్దేశమును గావించునపుడు జయసింహుని తామ్రశాసనముల పరిష్కరించిన శ్రీ సోమశేఖరశర్మగారు ప్లక్కిరాష్ట్రము అనగా

పల్లి సర్వసిద్ధితాలుకా ప్రాంతమని యభిప్రాయపడిరి. కావోర మేగ్రామమో తెలియదు. ఈ రాష్ట్రము పూర్వసముద్రము నంటి యుండిన విశాఖ పట్టణ మండలములోని అనకాపల్లి సర్వసిద్ధి తాలూకా ప్రాంతమేయై యుండె ననుట సమంజసము.

| | | |
|---|---|---|
| పెరువాటక | పరవాడ | అనకాపల్లి తాలూకా |
| కుములూరు | గుమ్మలూరు | సర్వసిద్ధి తాలూకా |
| పోటుమాంక | పూడిమడక | ,, |
| చెరువూరు | దిప్పుశుపల్లి | అనకాపల్లి తాలూకా |
| ఆదివాస | అడ్డాం | ,, |
| కుళినాటక | గుడివాడ | ,, |
| కుందూర | ,, | ,, |
| కుడివాడ | గుడివాడ | ,, |

(1) E. I. Vol XII. P. 133.
(2) ,, IX. P. 319.
(3) I. A. Vol XX. P. 16.
(4) E. I. Vol XXXI. P. 129.
(5) S. I. I. Vol VI. No. 1203 (శ. స. 1148)

## పాకనాడు

పాకనాడు లేక పాకైనాడు నెల్లూరుమండలాంతర్గత ప్రాచీన విషయములలో నొకటి. చరిత్రకును, సారస్వతమునకును ప్రసిద్ధికెక్కినది. నెల్లూరి శాసనసంపుటములలోని శాసనసంచయములో పెక్కింటియందు పేర్కొనబడినది. ఆ సంపుటములలోని శాసనస్థలముల నిందు పేర్కొనబడినవి.

వెంకటగిరి (1) చాపలపల్లి (అరవము)

జయంగొండ చోడమండలములోని పాకైనాడు (శా. శ. 1152)

(4) చాపలపల్లి (అరవము)

పాకైనాడులోని రాజమల్ల చతుర్వేదిమంగళము.

(7) చాపలపల్లి (అరవము)

పాకైకనాటిలోని పగామనాటియందలి నాగపుడోలు.

(8); (9) చాపలపల్లి (అరవము)

పాకైకనాటిలోని రాజమల్ల చతుర్వేది మంగలమనే నాగరపుడోలు.

(11) చాపలపల్లి (అరవము)

జయంగొండ చోడమండలములోని పాకైకనాటిలోని పకామనాటి యందలి నాగపుడోలు.

రాపూరు (88) లింగనపాలెము (అరవము)

జయంగొండ చోడమండలములోని పాకైనాటిలోని విక్రమసింగపురమనేటి నెల్లూరు.

ఒంగోలు (139) ఉప్పుగుండూరు (తెలుగు)

శ్రీ గౌరీశ్వర దేవర దివ్యశ్రీ పాదారాధకులైన పాకనాంట్కిఇరువైదీతువేయింటికి నెల్లూరి స్థళమునకు ప్రభుముఖ్యుండును. (శా. శ. 1140)

రాపూరు (36) కొంపేడు.

శ్రీ పాంకనాంటిలోని బొమ్మిని యిష్టకామేశ్వర దేవరాను, నాగేశ్వర దేవరాను, మర్లికేశ్వర దేవరాను ప్రతిష్ఠించి. (శా. శ. 1189)

ఆత్మకూరు (38) మహిమలూరు.

పాకనాంటిలోని తిరుపది కవలింటిలోని తోంకుకూడూరునాంటికి రాజధానియైన మహిమలూరు. (శా. శ. 1139)

కావలి (43) ముంగమూరు.

"పాకనాంటిలోని పోరితినాంటి (పుంగ) వరము శ్రీ క్షారీశ్వర దేవరకు (శా. శ. 1185)

విజయనగరరాజ ప్రతినిధియైన రెండవసంగముని బిట్రగుంటశాసనమున, పాకనాటి బిట్రగుంట నిట్లభివర్ణింపబడినది. (1)

"పాకస్యో విషయో౽స్య పారమహిమా ప్రాచః పయోధి స్తటే।
తస్మిన్ విక్రమసింహ మిత్యపిపురం ధత్తేలలలామశ్రియః ॥
తస్యాత్యుత్తరతస్త్రి యోజనమితా దేశాత్ స్ఫురత్యుజ్జ్వలో।
గ్రామోబిట్టరగుంట మిత్యనముమదా ద్రాజోగుణః ప్రీతయే ॥

కాకతిగణపతిదేవుని కాలమునాటి బాపట్ల తాలూకా పెదచెఱుకూరు లోని శాసనములలో మహామండలేశ్వర మల్లిదేవచోడుని శాసనములోనతడు కందుకూరు పురవరేశ్వరుడనియు, పాకనాటి విషయ ఏకవింశతి సహస్ర గ్రామావనీవల్లభుడనియు వర్ణితుడయ్యెను. (2)

"కావేరితీర కరికాలరత్న ప్రదీపాహిత కుమార గణాంకుశ, కందుకూరి పురవరేశ్వర, పాకనాటి విషయ ఏకవింశతి సహస్ర గ్రామాన నీవల్లభ, సత్యరత్నాకర నామాది సమస్త ప్రశస్తిసహితం శ్రీమన్మహామండలేశ్వర మల్లిదేవ చోడమహారాజు"

అన్నవేముని నడుపూరు శాసనములో బిట్రగుంట శాసనములలోవలెనే పాకనాడును, విక్రమసింహపురమును వర్ణింపబడినవి. (3)

విజయనగర సామ్రాజ్యకాలమున పాకనాడు, ఉదయగిరి రాజ్యములోని అంతర్భాగమని శాసనములు తెలుపుచున్నవి. (4)

(1) దేవరాయ వొడయలుగారు....దణం వెట్టియిచ్చినధర్మశాసనము. మాకుంజెల్లి వుదయగిరి రాజ్యాన పాంకనాండిలోను పినాకినది వుత్తర భాగాన కరకిలి చెరువులోను తిరిపీడు అను గ్రామము. (శా. శ. 1357)

(2) ఉదయాచల సంబంధే పాంగనాడాఖ్య సీమని। చిరుమన గ్రామ నామాఖ్యస్థలే సస్యోపశోభితః ॥ తద్గ్రామ ఉత్తరేభాగే యదవల్లీతి విశ్రుతం। సర్వలక్షణ సంపన్నం ప్రతినామ ప్రకల్పితం ॥

(అచ్యుతరాయల శాసనము శా. శ. 1463)

(3) ఉదయాచల రాజ్యస్థం పాంకనాడా కృతాంస్థితిం సర్వపల్యాఖ్య సీమాయాం సంప్రాప్తం।ఖ్యాతముత్తమాం॥ తాళ్ళపూడి వరగ్రామాత్ప్రాచీ మాశాముపాశ్రితం। పిడితాపోలు ముళిడికాడు గ్రామద్వయస్యచ ॥ ప్రఖ్యాతాద్యుక్త సీమాంతాద్ దక్షిణస్యాం దిశిస్థితం। నేలటూరః కృష్ణరాయ

పట్టణస్యథ్వయోరపి। గ్రామయోః యుక్త సీమాన్తాత్ పశ్చిమం దిశమాశ్రితం॥ ఘుతుక్కూరు నామకాద్గ్రామాత్ సంప్రాప్తం దిశముత్తరాం। విఖ్యాత శ్రీరంగ రాజపురమిత్య పరిమిథం। గ్రామం మామిడి పూండ్యాఖ్యం సర్వసస్య శోభితం॥

(శా. శ. 1471 సదాశివరాయలనాటి శాసనము)

(4) అచ్యుతదేవ మహారాయలు విజయనగరమందు వజ్రసింహాసనారూఢులై ఏలుచుండ........శ్రీరాజు చినతిరుమలయ్య దేవమహారాజులకుం నాయంకరానకుంజెల్లె వుదయగిరి రాజ్యాం పాంకనాండు ప్రభాకరపట్నం సీమలో వేదాద్రికి దక్షణంన....పడ్మర కొమరపూడి అనెడు పరనామము గల (శా. శ. 1448)

ఈ పాకైనాడిలోని పాకైపదము పూగశబ్దభవమనియుఁ బూంగి నాడను విషయము శ్రీశైల పూర్వపాద నికటముననుండి, గుండ్లకమ్మ యుభయ తటములను జేరి పూర్వసముద్రమువఱకు వ్యాపించియుండెననియు శ్రీరామయ్య పంతులుగారు కొండవీటి రెడ్లశాసనములు బ్రకటించుచు దమ యభిప్రాయమును దెలిపిరి. కాని యా యభిప్రాయముతో నేకీభవింపక శాసనసంపుట సంపాదకులగు శ్రీకృష్ణశాస్త్రిగారు పాకనాటిలోని యంత ర్భాగమే పూంగినాడనియు "పాక" పూగశబ్దభవమనియు, పాకనాటిలోని ఉత్తరభాగము పూంగినాడనియు బూంగినాటినిబట్టియే పాకనాటికి బేరు వచ్చియుండుననియు వారి ప్రత్యేకాభిప్రాయమును వెలిబుచ్చిరి. కాని పాక నాడు వేఱు. పూంగినాడువేఱు, రెండు వేర్వేఱు నాడులని నొకదానిలో నొకటి యంతర్భాగముకాదని పై శాసన వివరములబట్టి తెలియనగును. (4)

పాకనాడు-ఆంధ్ర సారస్వతము.

పాకనాటిని బ్రశంసించిన ప్రథమాంధ్ర కవి కవిరాజశిఖామణి నన్ని చోడుడు. ఇతడు తన కుమారసంభవకావ్య పీఠికలో దన తండ్రి పాకనాటి యిరువదియొక్క వేయిటికధీశుఁడని యీ విధముగ దెల్పియున్నాడు.

చ. అరినరపాల మౌళిదళితాంఘ్రియుగుండయి పాకనాటియం
డిరువదియొక్క వేయిటికధీశుడు నా జను చోడబల్లికిం
జిరతరకీర్తికగ్రమహిషీతిలకంబున హైహయాన్వయాం
బరశశిరేఖయైన గుణభాసిని శ్రీసతికిం దమాజుడన్.

ఎఱ్ఱాప్రెగడ రచించిన భారతారణ్య పర్వాంతమందలి యీ క్రింది పద్యమునందు దాను పాకనాటిలోని గుడ్లూరువాసినైనట్లు వ్రాసుకొనెను. గుడ్లూరు కందుకూరు తాలూకాలో గలదు.

సీ. భవ్యచారిత్రు డాపస్తంబ సూత్రుండు
శ్రీవత్స గోత్రుండు శివపదాబ్జ
సంతతధ్యాన సంసక్త చిత్తుఁడు సూర
నార్యునకును బోతమాంబికకును
నందనుండిల బాకనాటిలో నీలంక
ఠేశ్వరస్థానమై యొనక మెసఁగు
గుడ్లూరి నెలవున గుణగరిష్ఠత నొప్పు
ధన్యుడద్వైతైక తత్పరాత్ము

గీ. డెఱ్ఱనార్యుండు సకల కవీంద్రవినుతు
డైన నన్నయభట్ట మహాకవీంద్రు
సరససారస్వతాంశ ప్రశస్తి తన్ను
జెందుటయు సాధుహర్షణ సిద్ధిగోరి.

మంచెన కేయూరబాహుచరిత్రమునందు రాజేంద్రచోడుని మంత్రియైన కొమ్మనామాత్యుని వర్ణించుచు,

మ. అరుదందన్ వెలనాటి చోడమనుజేంద్రాజ్ఞాపనంబాని దు
స్తరశక్తిం జని యేకవింశతి సహస్రగ్రామ సంఖ్యాకమై
ధరణిం బేర్చిన పాకనాడు నిజదోర్దండైక లగ్నంబుగాఁ
బరిపాలించె నమాత్య కొమ్మన జగత్ప్రఖ్యాత చారిత్రుడై.

అని రాజేంద్రచోడుడను నామాంతరముగల వెలనాటి చోడ మహారాజుయొక్క యాజ్ఞానుసారముగా నిరువదియొక్కవేల గ్రామములుగల పాకనాటిని మంత్రికొమ్మన పరిపాలించినట్లు వ్రాసెను.

శ్రీనాథకవి తాను పాకనాటివాడని భీమేశ్వరపురాణములో జెప్పుకొనెను. బెండపూడి అన్నమంత్రి కవితో నన్నపలుకుల సందర్భమున—

సీ. వినిపించినాడవు వేమభూపాలున
కఖిలపురాణ విద్యాగమములు
కల్పించినాడవు గాఢపాకంబైన
హర్షనైషధకావ్య మాంధ్రభాష
భాషించినాడవు బహుదేశబుధులతో
విద్యాపరీక్షల వేళలందు
వెదచల్లినాడవు విశదకీర్తి స్ఫూర్తి
కర్పూరములు దిశాంగణములందు

గీ. బాకనాటింటివాడవు బాంధవుడవు
కమలనాభుని మనుమడ వమలమతివి
నాకు గృపసేయు మొక ప్రబంధంబు నీవు
కవిత గుణగణ్య శ్రీనాథకవివరేణ్య.

పై నుదహరించిన శాసనములవల్లను, సారస్వత పరిశీలనమువల్లను, పాకనాడనునది తూర్పున సముద్రతీరము, ఉత్తరమున కందుకూరు తాలూకా దక్షిణమున నెల్లూరు వెంకటగిరి తాలూకాలు, పశ్చిమమున ఉదయగిరి తాలూకా ప్రాంత మధ్యభూమియని యూహింపవచ్చును.

## పానారవిషయము

ఆంధ్రదేశములో నత్యంతప్రాచీనమును, ప్రసిద్ధమునునైన విషయములలో నొకటి. ఇయ్యది వేంగినాంటిలో వసిష్ఠగోదావరినంటి, ఇప్పటి పశ్చిమ గోదావరి మండలమునందలి తణుకు, భీమవరము, నరసాపురము తాలూకాల ప్రాంతము వ్యాపించియుండెనని భావింపవచ్చును.

ఏడవ శతాబ్దినాటి పృథ్వీమహారాజు తాండివాడ శాసనములో పాగువార విషయము పేర్కొనబడినది. మహారాజ రణదుర్జయుని కుమారుడును, విక్రమేంద్రుని పుత్త్రుడునగు పృథివీమహారాజు పిష్టపురము (నేటి పిఠాపురము) నండి కొండమంచి గ్రామనివాసియు, కామకాయనస గోత్రుడును, విష్ణుశర్మ పుత్త్రుడును, పృథ్వీశర్మ యొక్క కుమారుడునగు భవశర్మకు పాగుణార విషయములోని తాణ్డివాడ గ్రామము నగ్రహారముగ సర్వబాధా పరిహార మొనర్చి యిచ్చెను. (1)

'శ్రీపృథ్వీమహారాజః పాగుణార విషయే తాణ్డివాడ గ్రామ మధివతస్సర్వ సమవేతాన్ కుటింబినః సమాజ్ఞాపయతి

ప్రథమ చాళుక్య విజయాదిత్యుని యొక్క శాసనములో వియ్యాది ప్రాకునోర విషయమని వక్కాణింపబడినది. ప్రాకునోర విషయములోని దినకాడు గ్రామమునుండి, వర్జిపల్లు వాస్తవ్యుడగు నొక బ్రాహ్మణునికి కొంత భూమి దానము చేయబడినది. (2)

రెండవ అమ్మరాజవిజయాదిత్యుని వంద్రము శాసనములో 'అస్య భవ ద్విషయే(పావునవార)ప్రాందోత్తు బేటిపూండినామ సహాటక భాగమగ్రహారే కృత్య సర్వకరపరిహారేణ దత్తమితి విదితమస్తు' అని పై రెండు గ్రామములును, ఇంకొక పట్టున తాండేలు అను గ్రామమును పేర్కొనబడినది. (3)

రెండవ చాళుక్య భీమవిష్ణువర్ధనుని యొక శాసనములో పగుణవార విషయములోని దిగ్గుబల్లుగ్రామ ముదహరింపబడినది. (4)

మూడవ విజయాత్యుని సీసలి తామ్రశాసనములో పాగుణవారము లోని ఉమికిలి, అండలూరు, కొండెయపూండి, వేంద్ర, మోంగలను, కోర్కులను, ఆరుఇల్లి యను దానమిచ్చిన గ్రామము లుట్టంకింపబడినవి.(5)

ఈ క్రింది మరికొన్ని శాసనములలో నీ పానార విషయము పేర్కొన బడినది. (6)

(1) పావనవారమున తనుకున కొమ్మనపెగ్గడ్డ

(2) పావునవారములోని మెటగుములూరి మాధవనాయకుడు

(3) పానరాన విప్పఋతను

(4) పానావార విశేషధాత్రి విషయే కొండేటి వాస్తవ్యకః

(5)గూఢస్తనీ తీరగే తస్మిన్ పావనవార దేశలలి తేశీడు త్తికాఖ్యేపురే

(6) పావినవార విషయే గోధస్తనీ తీరగే గ్రామే దుత్తికనామ్నె

(7) ముమ్మడి నాయకుని శ్రీరంగము శాసనములలో వసిష్ఠగోదావరి పశ్చిమ తీరమునమున్న పానార విషయములోని కొట్టలపల్లు గ్రామము దానము చేయబడినట్లు వ్రాయబడినది. ఆ గ్రామసీమలలో నీ దిగువగ్రామము

లుదాహరింపబడినవి :— మోనంబల్లు, దేవ, వంగిపూడి, చెఱుకువాడ, విల్లూరు, తామరవాటిక, పెనుంకొండ, మారెడేఱు—

(8) అనపోతురెడ్డి కొమ్మచిక్కాలవలస శాసనము—చిక్కాల గ్రామము వానారసీమలోదని చెప్పబడినది.

| శాసన గ్రామము | నేటి పేరు | తాలూకా |
|---|---|---|
| తాండివాడ | తాడిపర్రు | తణుకు |
| వర్ధిపల్లు | వద్దిపర్రు | నరసాపురము |
| ప్రాందోఱు | పాండువ్వ | భీమవరము |
| బేటిపూండి | బేతపూడి | ,, |
| దిగుబఱు | దిగుమఱు | నరసాపురము |
| ఉమికిలి | ఉనికిలి | తణుకు |
| అండలూరు | అండలూరు | భీమవరము |
| కొండెయపూండి | కొండేపూడి | ,, |
| వేంద్ర | వేంద్రం | ,, |
| మోంగలను | మోగల్లు | ,, |
| కోర్కొలను | కోరుకొల్లు | ,, |
| ఆరువిల్లి | ఆరవిల్లి | తణుకు |
| తనుకు | తణుకు | తణుకు |
| మెటగుములూరు | గుమ్ములూరు | భీమవరము |
| విప్పఱు | విప్పర్రు | తణుకు |
| కొండేరు | కోడేరు | నరసాపురము |
| ఢుత్తిక | జుత్తిక | తణుకు |
| కొట్టలపఱు | కొఠాలపర్రు | ,, |
| మోనంబఱు | మునమర్రు | ,, |
| దేవ | దేవ | నరసాపురము |
| వంగిపూడి | వెగ్గిపూడి | తణుకు |
| చెఱుకు | చెఱుకువాడ | ,, |
| విల్లూరు | విల్లూరు | నరసాపురము |
| తామరవాటక | తామరాడ | తణుకు |

| | | |
|---|---|---|
| పెనుంకొండ | పెనుగొండ | తణుకు |
| మారెడేఱు | మారుటేరు | ,, |
| చిక్కాల | కొమ్ముచిక్కాల | నరసాపురము |

(1) భారతి - యువ సం॥ భాద్రపదమాస సంచిక

(2) విజయాదిత్యుని రెండు తామ్రశాసనములు. J. A. H. R. S. Vol V. P. 54 (క్రీ. శ. 751, 769).

(3) E. I. Vol IX Pages 131-135

(4) I. A. Vol XIII P. 213

(5) భారతి వ్యయ సం॥ చైత్రము-వైశాఖము

(6) (1) S. I. I. Vol IV. No. 1298
(2) ,, ,, V. No. 75
(3) ,, ,, ,, No. 124 (శా. శ. 1228)
(4) ,, ,, VI. No. 148 (శా. శ. 1076)
(5) ,, ,, X No. 146 (శా. శ. 1082)
(6) ,, ,, ,, No. 147 (శా. శ. 1094)
(7) E. I. Vol XIV. P. 83-96
(8) J. A. H. R. S. Vol III P. 229

## పానుగల్లు - కైవారముకోట

కాకతిగణపతిదేవ మహారాజు సామంతుడైన జన్నిగదేవ మహారాజు పానుగల్లాదిగా గైవారముకోటవఱకూ ఆంధ్రదేశమును బాలించుచుండెనని యతని సర్వాధికారియైన మైదేవరాజు వ్రాయించిన పల్నాడు తాలూకాలోని కారెంపూడి శాసనములో గలదు. పానుగల్లు నల్లగొండ మండలములోని పానుగల్లుగ్రామము. కైవారముకోట మైసూరురాష్ట్రములోని కోలారు మండలములోని చింతామణి తాలూకాలోని కైవారముకోట. పై శాసనము ననుసరించి కాకతీయసామ్రాజ్యము నేటి దత్తమండలముల నతిక్రమించి మైసూరు రాష్ట్రపు ఉత్తరపు సరిహద్దు వఱకు వ్యాపించియుండెను.

S. I. I. Vol X. No. 402. (శా. శ. 1186)

## పానుగల్లు-మార్జవాడి

గుంటూరు మండలములోని పల్నాటి తాలూకాలోని కాకతీయగణపతి మహారాజు సామంతుడగు గంగయసాహిణి దుర్గి శాసనమునందు "కాకతీయ గణపతిదేవ మహారాజులు ఒరుంగల్లు నిజరాజధానిగా సుఖసంకథా వినోదం బుల పృథివి రాజ్యము చేయుచుండగా దత్పాద పద్మోపజీవియైన శ్రీమతు గండపెండారగంగయ్య సాహిణి పానుంగల్లుమొదలుగా మార్జవాడి దాంకా.... రాజ్యంబు సేయుచుండగా"నని యతని రాజ్యపాలనములోని ఆంధ్ర భూభాగపు యెల్లలు వివరింపబడినవి. (1)

పానుగల్లు నల్లగొండజిల్లాలోని పానుగల్లను పట్టణము. మార్జవాడి సీమానిర్ణయము (చూడుము. మార్జవాడి) వేఱొకచోట నిరూపింపబడినది. (శా. శ. 1173)

అట్లే ఆ గ్రామమునందలి రుద్రమదేవి కాలమునాటి గండపెండార జన్నిగదేవరాజు శాసనములో నతడు పానుగల్లు మొదలుగాను మార్జవాడ దాంకాను రాజ్యము చేయుచుండెనని వ్రాయబడినది. (2) (శా. శ. 1191)

(1) S. I. I. Vol X. No. 334.
(2) ,, No. 422.

## పిష్ఠపురము

ఈ పిష్ఠపురము తూర్పుగోదావరి మండలములో పిఠాపురమను జమిం దారీ గ్రామము. ఆంధ్రప్రదేశములో నత్యంత ప్రాచీన గ్రామములలో నొకటి. చారిత్రక ప్రసిద్ధిని గాంచినది.

సముద్రగుప్తుని అలహాబాదు శాసనములోను, తర్వాత రెండవపులకేశి అయిహోలు శాసనములోను, విష్ణువర్ధనుని తిమ్మాపుర శాసనములోను, శక్తి వర్మ రాగోలు శాసనములోను పేర్కొనబడినది.

అలహాబాదు శాసనములో సముద్రగుప్తుడు పైష్టపురక మహేంద్రుని గెల్చినట్లు చెప్పబడినది. (1) అయిహోలు శాసనములో (2)

పిష్టిం పిష్టపురం యేనజాతం దుర్గ మదుర్గమమ్ ।
చిత్రం యస్య కలేర్వృత్తమ్ జాతం దుర్గమ దుర్గమమ్ ॥

మొదటి విష్ణువర్ధనుని తిమ్మాపుర శాసనములో (3)

"శ్రీమత్పిష్టపురవాసకాన్.......నరలోకవిక్రమః పరమభాగవతః పరమబ్రహ్మణ్యో మాతాపితృ పాదానుధ్యాతః శ్రీవిష్ణువర్ధన మహారాజః" శక్తివర్మ రాగోలు శాసనములో నతడు విజయ పిష్టపురమునుండి కళింగ విషయములోని రాగోలు (రాకలువ) గ్రామమును దానముచేసెనని చెప్ప బడినది. (4)

"స్వస్తి విజయపిష్టపురాత్కలింగాధిపతి ర్మాగధ
కులాలంకరిష్ణు ర్వాసిష్ఠీపుత్రో మహారాజ శ్రీ
శక్తివర్మా కలింగవిషయే రాకలువగ్రామే"

ఈ పిష్టపురము వాసిష్ఠకులజులకును, మాఠరవంశము వారికి రాజధానియై తర్వాత వేంగి, రెడ్డిరాజ్యములలో నంతర్భాగమై ఆయా సామంత మండలేశ్వరుల పాలనములో నుండెను.

పదునైదవశతాబ్దములోని ద్రాక్షారామ శాసనములలోనొకదానియందు ద్రాక్షారామ శ్రీభీమేశ్వరదేవరకు పిటాపురస్థళంలోని నడకుతారు గ్రామమును వాల్లెంక పోతినేనింగారు సమర్పణచేసినట్లు వ్రాయబడినది. పైని చెప్పబడిన గ్రామము నేటికిని కాకినాడ తాలూకాలో గలదు. పిటాపురస్థలము పదునైదవ శతాబ్దమున నేటి పిఠాపురము, కాకినాడ తాలూకా ప్రాంత మధ్యభాగమై యుండెనని తోచుచున్నది. (5)

(1) Allahabad Inscription of Samudragupta Dr. Fleet's Gupta Inscription.

(2) Aihole Inscription of Pulakesin E. I. Vol VI. P.11. Verse 27.

(3) Timmapuram Plates of Vishnuvardhana. E. I. Vol. IX. P. 319.

(4) Ragole Plates of Saktivarma. E. I. Vol XII. P. 1-3.

(5) S. I. I. Vol IV. No. 1344. (శ. స. 1392)

## పులినాడు

ఈ పులినాడు చిత్తూరు మండలములోని కొన్ని కన్నడ శాసనము లందు పేర్కొనబడినది. నోలంబ పల్లవ రాజుల కాలమునాటిది.

(1) పులినాట్టకెఱెయ బెలగటూరం.
(2) పులినాడ కోళతూరం.

పులినాడు గంగవాడికి తూర్పున, ఉత్తర అర్కాడు, చిత్తూరు మండలములో కొంత భాగమును, మైసూరు రాష్ట్రములో కోలారుమండముతో నెక్కువ భాగమును గలసిన భూభాగము. పై రెండు శాసనములు చిత్తూరు మండలములోని పుంగనూరు జమీందారీలోని గ్రామములు.

S. I. I. Vol IX. Part I. No. 39 and 41.
History of Pulinadu. J. M. S Vol XXXIV. No. 2 and 3.

## పులుగులనాడు

ఈ పులుగులనాటిని గూర్చి Local Recordsలో గల విషయము నిందు వ్రాయట మైనది.

(1) సిద్ధవట రాజ్యాన్కులోనయిన పులుగులనాటి శీమలోనం గులజ నదికి పశ్చిమమందు, దక్షిణమునను పూర్వము చోడరాజులు యేలుబడిన కమ్పసముద్రము అనే గ్రామము నిర్మాణం అయ్నిది.

(2) విజయనగర సింహాసనాధీశ్వరులైన హరిహర దేవరాయలు రాజ్యము యేలుచుండగా వారి కుమారుడు ప్రౌఢదేవరాయ వడయలుంగారి పేరట నాగవరం గ్రామానికి యీశాన్యభాగ మందు అరపరుగు దూరాన దేవరాయపల్లె అనే పల్లె కట్టించిరి.

(3) పూర్వం పెరియవరం అనే గ్రామం నెగడి పులుగులనాటిలో చెల్లుచుండెను.

(4) చిట్టివోలు తాలూకు చినవోరంపాడి సముతు పులుగులనాటిలోని కాకెరెడ్డి పల్లె.

(5) చిట్టివోలు తాలూకు కోడూరి సముతు పులుగులనాటిలోని బోడిమీది పల్లె.

(6) పూర్వమందు మధ్యరాష్ట్రి మండలి పులుగుల్నాటి సీమలోని గుమ్మడూరనే ప్రాచీననామం గలిగిన కోడూరికి పరుగుదూరాన.

(7) వెంకటపతిరాయల వారు చంద్రగిరిలో సింహాసనస్థులై రాజ్యాం యేలుచుండి పులుగుల్నాటి పొత్తపినాటి శీమలో ప్రభుత్వం చేస్తుండగా—

(8) శ్రీ మన్మహామండలేశ్వర మట్లకుమార అనంతరాజులు దేవచోడ మహారాజులుంగారు పులుగులనాడు, పొత్తపినాడు యేలు చుండగా శ్రీ తిరుమల తాతఅప్పలాచార్యుల వారున్ను, యల్లాదీక్షితులున్ను తమకు అగ్రహారం కావలెనని యాచించగా ప్రభువులు చిత్తానకు తెచ్చి తమ యేలుబడి పొత్తపినాడు, పులుగులనాడు నందు కటవూట్కూరు, పత్తలూరు, దేవ సముద్రము గ్రామాలు మూడింటిలోను—

(9) పూర్వమున విద్యానగర సింహాసనాధీశ్వరులైన మల్లికార్జున దేవమహారాయలు రాజ్యం యేలుచుండగా రాయరాణువకు చెల్లె చంద్రగిరి సీమలోని పులుగులనాటిలో అణుకువ అయ్ను పెనుబ్రోలు అనే గ్రామము—

పులుగులనాటికే పులుగల్ల సీమ లేక నాడని పేరు గలదు. పైని చెప్ప బడిన గ్రామములన్నియు నేటి కడపమండములోని రాజంపేట తాలూకాలో గలవు. ఈ పులుగులనాడా ప్రాంతపు భూమియై యుండును.

Local Record Vol 184.

## పూంగినాడు

అనవేమారెడ్డి మద్రాసు మ్యూజియము శాసనములో

ఆస్తే శ్రీగిరి పూర్వపాద నికటా దా పూర్వపాథోవిధేః
దేశః కుండి తరంగణీ ముభయతః శ్రీపూంగినామాంకితః
తస్మిన్ భాసుర సౌదగోపురవతో నిత్యోత్సవాలంకృతా
నందతో పౌరజనా విభాతినితరా మద్దంకి నామాపురీ॥

శ్రీ పర్వత పూర్వపాదము మొదలుకొని పూర్వసముద్రము వఱకు గుండ్లకమ్మ కిరుపార్శ్వములను గల దేశమునకు పూంగినాడని పేరు. దానికి అద్దంకి రాజధాని (1).

నెల్లూరు మండల శాసన సంపుటములలో పూంగినా డుదాహరింపబడ్డ శాసనములను, దానిలోని గ్రామనామముల పట్టికను జూడుడు.

కందుకూరు (1) పూంగినాంటిలోని అగ్రహారము శ్రీమావరము.

(23) పూంగినాటిలోని గడ్లూరు.

(27) అరుమూరుగుళ్లు పూంగినాంటిలోని ఆ గ్రామము (గుండ్లపాలెము)

(28) ఉదయగిరికి చెల్లియుండేటి పూంగినాంటి స్థలము లోని అరుమూరు గుళ్ళు భ్రమరేశ్వరలింగానకు.

నెల్లూరు (55) జయగొండ చోళమండలములోని పూంగైనాడు (తమిళ శాసనము)

నెల్లూరు (82) పూంగినాటిలోని ఎట్టంపల్లి (తమిళ శాసనము)

ఉదయగిరి (6) పూంగినాటిలోని మ్రిదికల్లు, గుడిమిట్ట, బద్దిమడువు, జోకూరు, వుప్పలపూరు, రావిపాడు, కలపాతు. జిడ్రుపడియ, పంగాను, గోనుగుంట, గుడిపాడు,

త్రిపురాంతకములోని రెండు శాసనములలో పూంగినాటిలోనిముశిక ఉత్తి కెదుతెపల్లియను గ్రామ మొక దానియందును. పూంగినాటిలోనిముశిక ఉత్తి రేడుమడపల్లె యనెడు గ్రామ మింకొకదానియందు నుద్దిష్టములైనవి. ముశి యను నొకనది. వెలిగొండలలో నుద్భవించి, పొదిలి, దర్శి, కందుకూరు, ఒంగోలు తాలూకాల గుండా ప్రవహించి, ఒంగోలు కాలూకా అనంతవరము గ్రామ సమీపమున సముద్రగామి యగుచున్నది. ఈ నది గుండ్లకమ్మకు దక్షిణముగాను పాలేటి కుత్తరముగాను ప్రవహించుచున్నది. (2)

రెండవ దేవరాయల తామ్రశాసనములలో నొకదానియందు గుండ్లకమ్మ యొద్దున పూంగినాటివిషయములోని పోలవరమనెడి గ్రామమునుచేజెర్ల

యని నామాంకితము చేరి బ్రాహ్మణోత్తముల కగ్రహార మియ్యబడెనని గలదు (3)

| | | |
|---|---|---|
| భీమావరము | భీమవరము | కందుకూరు తాలూకా |
| గుడ్లూరు | గుడ్లూరు | ,, |
| అరుమూరుగుళ్ళు | గుండ్లపాలెము | ,, |
| గుడిమిట్ట | గుడిమెట్ట | కంభము తాలూకా |
| వుప్పలపూరు | ఉప్పలపాడు | కందుకూరు తాలూకా |
| రావిపాడు | రావిపాడు | కంభము తాలూకా |
| సంగాము | సంగాపురము | దర్శి తాలూకా |
| గోనుగుంట | గోనుగుంట | ఒంగోలు తాలూకా |
| గుడిపాడు | గుడిపాడు | దర్శి తాలూకా |
| చేజెర్ల | చేజెర్ల | ఒంగోలు తాలూకా |

(1) E. 1. Vol VIII Page 15
(2) S. I. I. Vol X. No. 355
No. 371
(3) N. I. C. P. No. 18

## పూర్వ సముద్రము

ఆంధ్రప్రదేశమునకు తూర్పుఎల్లయైన సముద్రము ఇది శాసనములలో పూర్వసముద్రమని, ఆంధ్ర నరేంద్రులు పూర్వసముద్రాధీశ్వరులని పిలువబడిరి

అనవేమారెడ్డి శా.శ. 1299 శ్రీశైలము శాసనములో నతడు "మహానీయాంధ్రదేశ పట్టాభిషిక్త" యనియు, "పూర్వసముద్రాధీశ్వర" యనియు స్తుతింపబడెను. ప్రోలయ వేమారెడ్డిని గూర్చి అమరావతి శాసనములో

హేమాద్రి గురుతద్దానం కుటుంబస్య కళామహే ।
కరడస్యాగర స్తస్య సఖాగోష్ఠ్యే వేమభూపతిః॥

ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశములో ప్రోలయ వేమారెడ్డి సోదరుడు మల్లారెడ్డి బాహాదర్పమును వర్ణించు పట్టున నతడు మోటుపల్లిని సాధించిన విధము, ప్రోలయ వేముడు పూర్వసముద్రాధీశ్వరుడైన తెఱంగు వర్ణించెను.

శా॥ శాహోదర్పమునం బ్రతాప ధరణీపాలావలింద్రోలి యు
త్సాహోదగ్రుడు మోటుపల్లి గొని సప్తద్వీప సద్వస్తుసం
దోహంబున్ దనకిచ్చు నెచ్చెలి సముద్రుం బ్రీతి గావించుచున్
మాహాత్మ్యంబు వహించె మల్లరథినీనాథుండు గాఢోద్ధతిన్.

హరివంశము ఉత్తర భాగము పంచమాశ్వాసము కడపటి పద్యములో ప్రోలయవేము డీ విధమున స్తుతింపబడెను.

కం॥ రత్నాకరనాయక గుణ
రత్నోజ్వల రెడ్డి మల్లరాజిత శశ్వ
ద్యత్నార్థద్వీపాంతర
రత్నాలంకృత సమస్త రాజ్యరమాంగా.

విజయనగర సామ్రాజ్య కాలమున నాంధ్రదేశము కర్ణాటాధీశ్వరులకు లోబడుటయు, తూర్పు తీరము వారి పాలనలో బడుటయు చరిత్ర విదితము. శ్రీకృష్ణదేవరాయల దిగ్విజయ యాత్రలలో నతడు అమరావతికి విచ్చేసి యమరేశ్వరుని సన్నిధిని వ్రాయించి యిచ్చిన దాన శాసనములో నతడు పూర్వ దక్షిణ పశ్చిమ సముద్రాధీశ్వరుడనని చెప్పుకొనెను.

S. I. I. Vol X. No. 559 (శ.స. 1299)
S. I. I. Vol VI. No. 248 (శ.స. 1299)
S. I. I. Vol VI No. 226 (శ.స. 1288)

## పెడకల్లు విషయము

ఇయ్యది బాదామి చాళుక్యుల, కళ్యాణి చాళుక్యుల కాలమునాటి శాసనములందు పేర్కొనబడినది.

వినయాదిత్యుని తొగర్చేడు శాసనములో "పెడెకల్విషయే తొగర్చేడు గ్రామే" యనియు, మాయలూరుశాసనములో "పెడెకల్విషయే అలికున్దే గ్రామే" యనియు, నావిషయములోని తొగర్చేడు, ఆలికుండ గ్రామములు పేర్కొనబడినవి. మాయలూరు, తొగర్చేడు, ఆలికుండ గ్రామములు కర్నూలు మండలములోని ద్రోణాచలము తాలూకాలోను, కోయిలకుంట్ల తాలూకాలోను గలవు. (1)

కళ్యాణ చాళుక్యుడగు త్రిభువన మల్లదేవుని సామంతుడగు బిజ్జన చోళ మహారాజు వ్రాయించిన నందికొట్కూరు తాలూకా సంగమేశ్వర శాసనములో

శ్రీమతు బిజ్జన చోళమహారాజుం కన్నెమున్నూఱును, పెడకవెంటు నూఱు నంగఅవాడి అయన్నూరుమం, ఇ ద్దెమూఱునాడుమం...."

అని యతడు కన్నెమున్నూఱు, పెడకంటి యెంటునూరు (800) నఱవాడి అయన్నూరు (500) అనుమూడునాడు నేలుచుండెనని చెప్పబడినది. ఈ మూడునాడులు ఒకదానికొకటి సరిహద్దు సీమలు. పెడకల్లు గ్రామము కర్నూలుమండలములోని ద్రోణాచలముతాలుకాలోని పెడకల్లుగ్రామము.(2)

అలంపురములోని, కళ్యాణ చాళుక్య ప్రభువులు సామంతుడగు చిద్దణ చోళమహారాజు శాసనమునందాతడుకన్నెమూనూఱు, పెడకల్లుఎంటునూఱు, నఱవాడియయ్యూరు, ఆయదెమూనూఱు అను నాల్గు నాడులు పరిపాలించు చుండెనని వ్రాయబడినది. (3)

కాకతి ప్రతాపరుద్రుని సామంతుడగు జుట్టియలెంకని నంద్యాల తాలూకా పాణ్యము శాసనములో నతడు పెడకల్లు, మొదలైన దక్షిణ దేశాల నేలుచుండెనని చెప్పబడినది. ఆ శాసనములో నతడు దానమిచ్చిన మేరలు ఈ క్రింద వివరింపబడినవి. (4)

| | | |
|---|---|---|
| పానెము | పానెము | నంద్యాల తాలూకా |
| చిలుకల | చిలకల | ,, |
| బలపనూరు | బలపనూరు | ,, |
| గోరువకల | గోరకల్లు | ,, |
| గడ్డిగరేవుల | గడిగరేవుల | ,, |
| మద్దూరు | మద్దూరు | ,, |
| కాకినూరు | కాకనూరు | ,, |
| రావిపాడు | రావిపాడు | కంబము తాలూకా |
| బీరవ్రోలు | బీరవోలు | నందికొట్కూరు ,, |
| జూటూరు | జూటూరు | ,, |
| చింతకుంట | చింతకుంట | కోయిలకుంట్ల తాలూకా |
| లింగాలకంగటూరు | లింగాల | ,, |

పై గ్రామములు నంద్యాల, కోయిలకుంట్ల, నందికొట్కూరు, కంబము తాలూకాలలో గలవు. పెడకల్లు ద్రోణాచలము తాలూకాలోను, తొగర్చేడు, ఆలకుండ గ్రామములు కోయిలకుంట్ల తాలూకాలోను గలవు. అనగా పెదకల్లు ఎంటునూరు (800) విషయము. ఇప్పటి కర్నూలు మండలములోని నంద్యాల తాలూకాలో నెక్కువ భాగమును, కోయిలకుంట్ల నందికొట్కూరు, కంబము తాలూకాలలో కొంత భాగమునై యుండును. కన్నాటికి దక్షిణ ప్రాంతము. కానోపును.

(1) తొగర్చేడు శాసనము. I. A. Vol VI. P. 87. (క్రీ. శ. 689) మాయలూరు శాసనము. భారతి ధాత సం: చైత్రమాసము (క్రీ.శ. 692)

(2) S. I. I. Vol IX. No. 147. (క్రీ. శ. 1079). (కళ్యాణి చాళుక్యుల శాసనము)

(3) తెలంగాణా శాసనములు. సంపుటము 2. సంఖ్య 12. కళ్యాణి చాళుక్యుల శాసనము. (క్రీ.శ. 1078)

(4) S. I. I. Vol X. No. 528. (క్రీ.శ. 1819) కాకతీయులనాటి శాసనము.

## పెనుగొండ (దుర్గము-రాజ్యము)

నేటి అనంతపురము మండలములోని పెనుగొండ తాలూకాకు ప్రధాన నగరను. సుప్రసిద్ధమైన గిరిదుర్గము. ఆంధ్ర సంస్కృత సారస్వతము అందు పెక్కు పర్యాయము లుగ్గడింపబడినది. కర్ణాటాంధ్ర తమిళశాసనము లందుదహరింపబడినది.

విరూపాక్షరాయల శ్రీశైల తామ్రశాసనమునందు రెండవ దేవరాయలు తన జ్యేష్ఠ సోదరునివల్ల ఘనాద్రిరాజ్యమును బడసెనని చెప్పబడినది. ఏకామ్రనాథుని సత్యాపరిణయ సంస్కృతకావ్యములో జగదేకరాయలు మహమ్మదీయ సేనానుల నోడించి ఘనగిరిని సంరక్షించెనని చెప్పబడినది. రఘునాథాభ్యుదయ తెలుగుకావ్యములో రఘునాథరాయలు రామదేవ రాయలను ఘనగిరిసింహాసన మందు నిలిపెనని చెప్పబడినది. ఘనాద్రియన్నను, ఘనగిరియన్నను పెనుగొండకు సంస్కృత రూపములు. పెనుగొండను పేర్కొన్న కొన్ని శాసనముల నీ దిగువ నిచ్చుచున్నాను.

(1) ఘనాద్రిరాజ్య సంబంధ గుత్తివళిత మధ్యగం
చిమ్మన కటీతి విఖ్యాతమష్ట భోగసమన్వితం

(2) పెనుగొండ మహారాజ్యే రొదగ్రామస్య సీమని
లేపాక్షి వీరభద్రాది దేవతోత్సవసిద్ధియే।
అచ్యుతేంద్ర మహారాయేణార్పితస్య స్వనామతః
గ్రామస్యమోదయాఖ్య స్యస్థలే యత్నేననిర్మితా॥

(3) పెనుగొండరాజ్య రొదనాడ గుయ్యలూర సీమ వొళగణ
గొరవనహళ్ళి.

(4) ఘనగిర్యాహ్వయే రాజ్యే ప్రాచేవాసముపాసితం
రొద్దనాడు వరాంతస్థం ప్రాచ్యాం శ్రీతోటహళ్ళితః ః
పశ్చిమాం తేకులోడస్య మీనకుంటాగ్రహారతః॥

(5) మారటూరసీమయరొద్దనాడూళగణ ఉపుడిహళ్ళియణ శ్రీవీరకృష్ణ
మహారాయరిగె—

పైని సూచింపబడిన గ్రామములు నేటి ప్రస్తుతస్థితి నీ దిగువ సూచింప బడినది. దానివలన పెనుగొండ రాజ్య వ్యాప్తి తెలియగలదు.

| | | | |
|---|---|---|---|
| (1) | చిమ్మనకలం | తిమ్మనచెల్ల | గుత్తి తాలూకా |
| (2) | లేపాక్షి | లేపాక్షి | హిందూపురము తాలూకా |
| (3) | మోద | మోద | ,, |
| (4) | గొరవనహళ్ళి | కొడిగెనహళ్ళి | ,, |
| (5) | ఉపుడిహళ్ళి | ఉప్పారహళ్ళి | ,, |

ఈ పెనుగొండ కొండలను వసుచరిత్రకారు డీ విధమున వర్ణించెను.

చం. తిరుమలరాయ శేఖరుని ధీరచమూభటరాజి యాజి ఖీ
కరయవనేశ్వర ప్రహితఖాన బలంబుల జక్కు సేయ ని
ద్ధర పెనుగొండ కొండలు మదద్విపచర్మ కపాలమాలికా
పరికర భూషితంబులయి బల్విడిగాంచె గిరీశ భావమున్.

ఈ పెనుగొండయందుండియే తిరుమలరాయలు కర్ణాట సామ్రాజ్యమును బరిపాలించెను.

(1) S. I. I. Vol IX. Part II. 427. (రెండవ హరిహరరాయల కాలము)

(2) ,, ,, 583. (శ. స. 1460)

(3) ,, ,, 577. (శ. స. 1458)

(4) ,, ,, 585. (శ. స. 1458)

(5) ,, ,, 485. (శ. స. 1434)

## పెన్నబడి

దీనికే పెన్నపరినాడనియు, పెన్నంబడి స్థలము, పెన్ననాడనియు నామాంతరములు.

(1) తెంకణా ధారణీ యల్లి పెన్న
పరినాడు (శా. శ. 1120)

(2) శ్రీమన్మహా ప్రధాన సాళువ
తిమ్మయంగారు గుత్తి రాజ్యము
లోను పెన్నంబడి తాడిపరితి తాడిపత్తి తాడిపత్రి తాలూకా
రామేశ్వర దేవరకు దండం వెటి
మాకు నాయంకరమైన చెల్లెటి
గుత్తి రాజ్యంలోని పెన్నంబడి
స్థలంలోని నెలదలపాడు అదే నందలపాడు తాడిపత్రితాలూకా
గ్రామము. (శా. శ. 1431)

(3) కృష్ణదేవరాయల కన్నడ శాస
నము-గుత్తిసీమయూ శగణం ధంగనూరు తాడిపత్రి తాలూకా
హెంనెనాడ యూశగణం
వంగనూర గ్రామ.

పెన్నబడిలోని బడిశబ్దమునకు మార్గము, స్థలము, పదము అనియర్థము. దేశవిభాగమును సూచించును. పెన్న యను నది పినాకినీ, లేక పెన్నానది (చూడుడు-పెన్న) పెన్నబడి యనునది తెంకణ రాజ్యములో నంతర్భాగము.

విజయనగర రాజుల కాలములో గుత్తి రాజ్యములో నంతర్భాగము. తాడిపత్రి తాలూకా ప్రాంతము. పెన్నానది గుత్తి, తాడిపత్రి తాలూకాలోగుండ ప్రవహించుచుండుటచేత, తాడిపత్రి తాలూకాలో ప్రవహించు నుభయ తీర భూమికి పెన్నబడి వర్తింపవచ్చును.

(1) S. I. I. Vol VI. No. 798
(2) ,, ,, 802
(3) E. I. Vol I. Page 40

పొట్నూరు

శ్రీ కృష్ణదేవరాయల పూర్వదిగ్విజయ యాత్రయందు, రాయలు జయించిన సుప్రసిద్ధ గ్రామము. ఇచ్చట జయస్తంభమును నిర్మించినట్లురాయలే వ్రాసుకొనెను. మనుచరిత్రాది గ్రంథములందు పొట్నూరు (పొట్టునూరు) విజయము పేర్కొనబడినది.

మ॥ ఇది సింహాచల దంభకేసరి పదాభిష్టార్చనాపుణ్యా ల
బ్ధదురుట్టంకణ పొట్టునూరి విజయస్తంభోప లోట్టంకితాం
కర్ప్రశ్లేష్టాక్షర కృష్ణరాయ నృపసంజ్ఞాస్మత్కృతాముక్త మా
ల్యదనాశ్వాసవరంబు నాలవది హృద్యంబై మహిం బొల్పగున్.

ఆముక్తమాల్యద-నాల్గవ ఆశ్వాసాంతము

చం॥ అభిరతి గృష్ణరాయడు జయాంకములన్ లిఖించి తాళస
న్నిభముగ బొట్టునూరికడ నిల్పినకంబము సింహాభూధర
ప్రభృతిరునాళ్ళకున్ దిగు సురప్రకరంబు కళింగమేదినీ
విభునపకీర్తి కజ్జలము వేమఱుపెట్టి పఠించు నిచ్చలున్.

మనుచరిత్రము. పీఠిక పద్యము 39

పొట్టునూరు విజయము రాయల శాసనములందును, (1) సంస్కృత కావ్యమునందును బేర్కొనబడినది. (2)

ఈ గ్రామము నేడు విశాఖపట్టణ మండలములోని భీమునిపట్టణము తాలూకాలో చిట్టివలస నదీతీరమునను న్నది. నేడా విజయస్తంభము గాన్పించుటలేదు. (3)

(1) No. 80. Tirupathi Inscriptions Vol III. P. 178-179
(2) అచ్యుతరాయాభ్యుదయము. Sources of Vijayanagar History P. 161
(3) Vizagapatam Dt. Go. P. 280

## పొత్తపినాడు

పొత్తపి యను గ్రామము కడప మండలములో రాజంపేట తాలూకాలో చెయ్యేరు నదీతీరముననున్నది. ఆ గ్రామ నామమును బట్టియే యీ నాడునకా పేరు వచ్చెను.

కొణిదెన చోడులలో పూర్వుడైన దశవర్మ యనునాతడు పాకనాటిని జయించి పొత్తపి రాజధానిగా నొనర్చి పరిపాలనము గావించెనని నరసారావుపేట తాలూకా బొప్పుడి శాసనములో నిట్లువర్ణింపబడినది. కరికాలచోడునకు మహిమానుడను పుత్రుడు గలడు. అతనికి ముగ్గురు కుమారులు. వారిలో కడపటివాడు దశవర్మ యను నతడు కొణిదెన చోడులకు మూలపురుషుడై పాకనాటిని జయించెనని చెప్పబడినది. (1)

తేషాం త్రయాణాం దశవర్మధాత్రీపతిః స్వశౌర్యాదధపాకరాష్ట్రం
ఆక్రద్యు వీరప్రవరోరరక్ష క్షమామిమాం పొత్తపి రాజధాన్యాం॥

పైని చెప్పబడిన కరికాల వంశమున తెలుగు బిజ్జన జనించెననియు నాతని మనుమడు మల్లదేవుడు పొత్తపి రాజధానిగా పాకనాటిని పాలించుచుండెననియు నరసారావుపేటలోని కొణిదెన శాసనమునందు గలదు. (2)

చం॥ బిరుదన జిన్నయా తెలుగు బిజ్జనమన్మడు మల్లిదేవుడ
చ్చెరువగుచున్న పొత్తపియ చెన్నగు వీడుగ వాలి పాకనా
డిరువదియొక్క వేయి జనసేలుచు బల్లహుదండుగెల్చిత
త్కరివర కుంభమౌక్తికలతాతతిబూచె నిజాసిపుత్రికన్.

ఆతని కుమారుడైన మధురాంతక పొత్తపి చోళుని తిరువలంగాడుశిలా శాసనములో నతడు తనభుజపరాక్రమమున నాంధ్రదేశమున పొత్తపిపురమును గట్టి, నాటినుండియు, దాను పొత్తపి చోళుడను బిరుదమును గాంచెనని చెప్పబడినది. (3)

జిష్ణురాంధ్రదేశుయః కృత్వాపురీం పొత్తపి సంజ్ఞితో
తత స్తత్పూర్వ చోళాఖ్యః ప్రఖ్యాత భుజవిక్రమః॥

కడప మండలములోని అత్తిరాల గ్రామమందలి తమిళ శాసనములో పొత్తపినాడు అధిరాజేంద్ర మండలములో మేర్పాకనాటిలోని (పశ్చిమ పాక నాడు) పొత్తపి నాడొక యంతర్భాగమని వ్రాయబడెను. (4)

నెల్లూరిలోని రంగనాయకస్వామివారి యాలయములోని యొక తమిళ శాసనములో జయంగొండ చోడమండలములో పొత్తపి నాడొక యంతర్భాగమని తెలుపబడినది.

ధూర్జటి మహాకవి శ్రీ కాళహస్తి మాహాత్మ్యమునందు కన్నప్ప యను తిన్నని జన్మభూమి పొత్తపినాటిలోని ఉడుమూరని వ్రాసియున్నాడు.

ఉ॥ పొత్తపినాటిలో విపినభూమిఁ గిరాతులకాటపట్టు లో
కోత్తర నవ్యవస్తు వుడుమూరను పక్కణమొప్పు దద్రమో
దాత్త మహత్వమద్భుత రసావమహామూహ మొనర్పమేదినీ
భృత్తట నిర్ఝరాంబురుహ బృందసుగంధ సగంధవాహమై

పై నుదాహరించిన వుడుమూరురాజంపేట తాలూకా టంగుటూరి గ్రామమునకు సమీపమున "ఉడుములపాడ"ను గ్రామము.

విజయనగర సామ్రాజ్య కాలములో పొత్తపినాడు ఉదయగిరి రాజ్య మందలి, సిద్ధపట సీమలోని అంతర్భాగమని నాటి శాసనములందు తెలుప బడినది (5)

| | | |
|---|---|---|
| తాళ్ళపాక | యళ్ళపాక | రాజంపేట |
| తెంబాక | తేబాక | ,, |
| టంగుటూరు | టంగుటూరు | ,, |
| ప్రోలి | పోలి | ,, |
| ఒప్పిలి | ఓబిలి | ,, |
| నందలూరు | నందలూరు | ,, |
| అత్తిరాల | అత్తిరాల | ,, |
| గుండ్లూరు | గుండ్లూరు | ,, |

| | | |
|---|---|---|
| క్రొత్తపలి | క్రొత్తపలి | ప్రొద్దుటూరు |
| పరాండలూరు | పొందలూరు | రాజంపేట |
| కోడూరు | కోడూరు | ,, |
| పెరుంగండూరు | పెనగలూరు | ,, |
| ఇనుంపండోలి | ఇనుంబ్రోలు | ,, |

పొత్తపినాటికి తూర్పున పాకనాడు, ఉత్తరమున ములికినాడు, దక్షిణమున వెంగోనాడు, పడుమట రేనాడు గలవు.

(1) S. I. I. Vol VI. No. 651 (శా.శ. 1109)
(2) ,, ,, 628 (శా.శ. 1146)
(4) E. I. Vol VII. No. 17 and 21 (శా.శ. 1129)
(4) M. E. R. P. 1911-12 No. 398 అత్తిరాల తమిళ శాసనము
(5) E. I. Vol XVI. Page 241 (శా.శ. 1498)

పొత్తపినాడు-(2)

ఈ రెండవ పొత్తపినాడు గోదావరి మండలములోని ప్రోలునాటిలో నంతర్భాగమని వీరచోడుని పిఠాపుర శాసనమువల్ల విదితమగుచున్నది. ఆ శాసనములో ప్రోలునాంటిలోని మాలవెల్లి, పొన్నతొట్టు అను రెండు గ్రామములు ఉత్తర వరుస విషయములోని "ఆలమి" అను గ్రామము గలిపి వీరచోడ చతుర్వేదిమంగలమని పేరుపెట్టి అయిదువందల ముప్పదియారు బ్రాహ్మణులకగ్రహార మొసగబడినట్లుగలదు. ఆగ్రామముల సీమల వివరించు పట్టున "ఉత్తరవరుస-మల్లవ్రోలును బొన్నవాడయుం గూడినచోట ప్రోయును, దీని ఉత్తరమున కొల్లిప్రోలును బొత్తపినాంటి చేబ్రోలును గూడినచోట తంగదుల జెట్టునపుట్టయు" అని సీమానిర్ణయము చేయబడినది. పైశాసనములో వివరింపబడి యేకీకృత్యము గావింపబడిన గ్రామములు తూర్పు గోదావరిజిల్లా పిఠాపురము సమీపమున మల్లవరము, పొన్నాడ, అమరవిల్లి యను నామములతో నేడు వెలయుచున్నవి. చేబ్రోలు సహితము ఆ నామముతో నేడును మల్లవరము సమీపముననే గలదు. కావున చేబ్రోలు పొత్తపినాటిలోనిదనియు, ఆలమి (అమరవెల్లి)ఉత్తరవరుస విషయములోనిదనియు ప్రత్యేకముగా చెప్పబడినవి. పొత్తపినాడనునది ప్రోలునాటిలో నంతర్భాగముగాని లేక సరిహద్దు సీమయై యుండనోపును.

అది యట్లుండ రెండవ అమ్మరాజు పిమ్మట వేంగీరాజ్యమేలిన నతని సవతి తమ్ముడగు దానార్ణవుని కాండ్యము శాసనములో నతడు మండికొండ చాళుక్యరాజు వంశోద్భవులును కుసుమాయుధుని కుమారులునగు మల్లన గొండియ యను సోదరులను పొత్తపినాటికి సామంత ప్రభువులుగ నియమించె నని వ్రాయబడెను. ఈ కాండ్యము గ్రామము శ్రీకాకుళ మండలములోని శ్రీకాకుళమునకు ఇరువదిమైళ్ళ దూరమున నున్నది. ఆ శాసనములో నిట్లున్నది.

"తాభ్యాం మల్లియరాజ గొండియరాజభ్యాం భవద్విషయే పొత్తపి నాండుత్రిశతం శాసనీకృత్వా సర్వకరపరిహారం తత్కోశపరితుష్టై రస్మాభిర్దత్తమితి విదితమ్-

"అస్తువః అశ్యాధ్యాయః....
పూర్వతః పంపావటీనదీ
దక్షిణతః ఉత్తరవరుస
పశ్చిమతః మీనుంబాకనాండు
ఉత్తరతః వెడగున డెబ్బది.

వీరచోడుని పిఠాపుర శాసనములో చెప్పబడిన పొత్తపినాడు, ఉత్తర వరుసలు, కాండ్యము శాసనములో చెప్పబడిన పొత్తపినాడు ఉత్తరవరుసలు నొక్కటియే, కాగా కాండ్యము శాసనములోని వంపావటీనదియు, గోదావరి మండలములోనే గలదు. (పంపానది-జూచునది) కావున పొత్తపి నాడు పంపానదికి తూర్పున, ఉత్తరవరుసకు దక్షిణమున, మీనుంబాకనాటికి పశ్చిమమున, తూర్పున సముద్రముగా గోదావరి మండలములోని పిఠాపురము తాలూకా ప్రాంతమై యుండును.

(1) Pittapur Inscription of Vira Chola E. I. Vol V.No. 10 (శా. శ. 1024)

(2) Danarnava's Kandyam Inscription J. A. H. R. S. Vol XI. Parts 1-2 Pages 80. 88 (శా. శ. 892)

## పొదిలిసీమ

నెల్లూరుమండల శాసన సంపుటములో నీ సీమయందలి దిగువ గ్రామములు పేర్కొనబడినవి.

(1) పొదిలి సీమలోని గార్లపాట
(2) పొదిలిసీమలోని తూర్పు మునికి పడంగట్టు. చిలుముకూరి గ్రామము
(3) పొదిలిసీమలో మునికి దక్షిణపుగడ్డ కిరళ్ళపల్లి గ్రామము
(4) పొదిలిసీమలోని కుంచ్చేపల్లి గ్రామము
(5) ఉదయగిరి దుర్గానకు సాగివచ్చి పొదిలసీములోను పొదిల తుమ్మ లూరానను మా నాయంకరానకు నడచివచ్చిన యీాంగలపాటు పొలం.

పైగ్రామము లన్నియు నేటి నెల్లూరుమండలములోనిపొదిలితాలూకా యందే కలవు. ఈ సీమయు పూర్వము నేటి తాలూకా ప్రాంతమై యుండును.

| | | | | |
|---|---|---|---|---|
| (1) | N. I. Podili | (33) | (క్రీ. శ. | 1547-48) |
| (2) | ,, | (4) | ( ,, | 1514-15) |
| (3) | ,, | (29) | ( ,, | 1515-16) |
| (4) | ,, | (27) | ( ,, | 1575-76) |
| (5) | ,, | (19) | ( ,, | 1563-64) |

## పొలవాస దేశము

అనుమకొండ శాసనములో రుద్రదేవుని ప్రతాపవర్ణనమునందతడు పొలవాస దేశమును వశపఱచుకొనినట్లు చెప్పబడినది.

ఈడే మేడవిడంబడంబర భరక్షోదదక్షమం క్ష్మాభృతాం
దుర్వారోద్ధుర వీరమంత్ర సమయాాదానైక దీక్షాగురుం
శ్రీమన్మైళిగి దేవ సంగసమయ ప్రోద్భూత దర్పావహం
ప్రాప్తశ్రీ పొలవాస దేశవిభవం శ్రీ రుద్రదేవం సదా ॥

శ్లో. 16

ఈ పొలవాసమె పొలాస యనియు, నేకవీరకు నిలయమైన స్థానము లలో నొక్కటనియు, క్రీడాభిరామ కృతిలో వర్ణింపబడినది.

## ఏకవీర

సీ. పద్మలోచన భృగుబ్రహ్మ సంయమువంశ
 పరిపాటి కభినవాభరణమయ్యె
రమణిత్రేతా ద్వాపరముల సంధ్యావేళ
 మగనితో బెక్కేండ్లు మనువుమనియె
నెలత కానకకన్న నెయ్యంపు గొడుకుచే
 జంపించె ముయ్యేడుసార నరుల
తరుణి హైహయరాజ దంతోస్థిపటలంబు
 గవడ పేరుగజేసి కట్టె నఱుత

గీ. మండపాకను, బెనుశాక, మాహురమున
నాగవరమున, పోలాస, ననిచెనింతి,
యోరుగంట వసించె నీలోత్పలాక్షి
కాకితమ్మకు సైదోడు యేకవీర.

ఈ పొలాసగ్రామము కరీంనగర మండలములోని జగిత్యాల తాలూకా లోనిది. కావున రుద్రదేవుడు జయించిన పొలాసదేశము ఆ ప్రాంతమై యుండును.

(1) వేయి స్తంభాలగుడి శాసనము. (అనుమకొండ శాసనము)
(2) క్రీడాభిరామను-వేటూరి ప్రభాకరశాస్త్రి పరిష్కృతము. పుట 42.

## పోరిత్తినాడు

పోరిత్తినాడు పాకనాటిలోని యంతర్భాగము. పోరిత్తినాటిని బేర్కొన్న శాసనములు కావలితాలూకాలో నున్నవి.

(1) పోరిడినాంటిలోని కడువనూంతి శ్రీ మల్లికార్జునదేవరకు (శ.స. 1139)

(2) పాకనాంటిలోని పోరిఠినాంటి...... (గ్రామనామము పూర్తిగా లేదు) (శ. స. 1185). శాసనము ముంగమూరు గ్రామములోనిది.

పై శాసనములోని గ్రామములు కావలి తాలూకాలో నుండుటచేత, పోరిఠినాడు పాకనాటిలో ఉత్తరభాగమున నుండెనని తలంపవచ్చును.

N. I. Kavali Nos. (31); (43).

## ప్రోలునాడు

ప్రోలునాడు తూర్పుగోదావరి మండలములలోని ప్రాచీనమైననాడులలో నొకటి. నేటికిని వ్యాప్తిలోనున్నది. ఈనాటిని బేర్కొన్న శాసనములు. వానిలో గ్రామనామములుగల పట్టికను జూడుడు.

| | |
|---|---|
| మూడవ విష్ణువర్ధనుని ఈపూరు శాసనము (1) | "ప్రోల్నాడు విషయే జలయూరు నామగ్రామే. పశ్చిమదిశాయాం ఎరియేఱు నదీ పశ్చిమతః ప్రభాకరక్షేత్రోత్తరతః కాకంది వాదక్షేత్రి పూర్వతః" |
| వీరచోడుని పిఠాపుర శాసనము (2) | ప్రోలునాణ్డు విషయుని వాసినో .... మాలవెల్లి, పొన్నతొట్టి, అలమిపొన్నవాడ, మల్లప్రోలు, కొల్లిప్రోలు చేంబ్రోలు, పొలకుంబఱ్ఱు, డంకల పూండి, బెండపూండి, లింగమకుఱ్ఱు పులువఙ్గుఱ్ఱు, గారపఱ్ఱు, మెడపఱ్ఱు, దారెకి, జమ్మపఱ్ఱు, భీమాపుర, కప్పనిపఱ్ఱు, సింగవిక్రమ, దొణ్టెంగి. నవవాడ, దుగ్గవాడ, నాగడ, తుమ్మికి. |
| పృథ్వీశ్వరుని పిఠాపుర శాసనము (3) | "శ్రీ ధామ్నే నవఖండవాడవిదితం ప్రోల్నాంటి దేశముదా విశ్వస్యక్షితి మండలస్య తిలకం శాలేయ సంశోభితం" |
| మల్లపదేవుని పిఠాపుర శాసనము (4) | "ప్రోల్నాంటి విషయే గుడివాడ నామగ్రామః" |

| | |
|---|---|
| కాకినాడ తాలూకా సర్పవర గ్రామములోని శాసనములు (5) | 1. గంగ్గగొణ్డ చోడనలనాణ్టి ప్రోలునాణ్టి ........ శ్రీ పురుశోత్తమ పట్టణము.<br>2. ప్రోలనాంటిలోని సబ్బపురము.<br>3. గంగ్గంగొణ్డ చోడవలనాణ్టి ప్రోలునాణ్టి శ్రీ పురుషోత్తమమున వీలచోడ విన్నవరాడ్వారికి. (సర్పవరమునకే శ్రీ పురుషోత్తమ పట్టణమనియు, భావనారాయణ పెరుమాళ్ళకు పురుషోత్తమదేవరయనియు, దేవాలయమునకు విన్నచోడ విన్నవరమనియు పేర్లు. విన్నవర మనగా విష్ణు గృహము.) |
| కాకినాడ తాలూకా చాళుక్య భీమవరము లోని శాసనములు(6) | 1. ప్రోలునాంటిలోని వులిగుంట నామగ్రామస్య దేశభోగీకృత్య''<br>2. "ప్రోలెనాంటిలోని కొమ్మర పాంగుపూండి'' |
| రామచంద్రపురము తాలూకా ద్రాక్షారామ శాసనములు (7) | 1. ప్రోలునాణ్టి కుంకటూరు.<br>2. ప్రోలునాంటి బబ్బరవాడ<br>3. ప్రోలునాంటి ఆరియవట్టము. |

| శాసనములలోని గ్రామములు | వాని నేటి నామములు | ఇప్పటి తాలూకా తూర్పుగోదావరి మండలము |
|---|---|---|
| జలయూరు | జల్లూరు | పిఠాపురము |
| అలమి | ఆలవెల్లి | తుని |
| పొన్నవాడ | పొన్నాడ | పిఠాపురము |
| మల్లప్రోలు | మల్లవరము | ,, |
| కొల్లిప్రోలు | గొల్లప్రోలు | ,, |
| చేంబ్రోలు | చేబ్రోలు | ,, |
| బెండపూడి | బెండపూడి | తుని |
| భీమావురము | భీమవరము | కాకినాడ |
| సింగవిక్రమ | శృంగవృక్షము | తుని |
| దొడ్డంగి | తొండంగి | తుని |
| దుర్గవాడ | దుర్గాడ | పిఠాపురము |

| | | |
|---|---|---|
| నవఖండవాడ | నవఖండవాడ | పిఠాపురము |
| అరియవట్టము | ఆర్యవట్టము | కాకినాడ |
| సబ్బవరము | సర్పవరము | ,, |
| గుడివాడ | గుడివాడ | పెద్దాపురము |

(1) E. I. Vol XVIII. P. 58-60.
(2) ,, V. P. 70-74. (శా. శ. 1024)
(3) ,, IV. P. 32-54. (శా. శ. 1108)
(4) ,, IV. P 226-242. (శా. శ. 1124)
(5) S. I. I. Vol V Nos. 8, 9, 15. (శా. శ. 1128)
(6) S. I. I. Vol V. Nos. 82, 90. (శా. శ. 1099)
(7) S.I.I. Vol IV. Nos. 1015, 1281. (శా. శ. 1006),1364 (శా. శ. 1043)

**బారహ**

ఇదియొక మన్నెరాజ్యము. రెడ్డి రాజన్యుల విజయసంరంభములలో శ్రీనాథమహాకవి పేర్కొనిన యొక రాజ్యము. (దొంతి-చూడుడు)

పూసపాటి రాజుల పూర్వబిరుదావళిలో "బారుహ మన్నె గండపెండేర విరాజితుడు"; బారహ మన్య రాజన్య కోటీర కోటి హీరచారు శుమ్భమాణ సమాశ్రిత పాదపంకజుడను నవి గలవు. ఇవి పూసపాటి తమ్మభూపాల విరచిత కృష్ణవిజయమునందు పేర్కొనబడినవి. ఈ బిరుదునుబట్టి దొంతివలెనే బారహ సహిత మొక రాజ్యమనియు, నియ్యది ఆంధ్ర కావ్యములందు పేర్కొనబడిన దనియు దెలిసికొనుచున్నాము. తమ్మ భూపాల విరచిత కృష్ణవిజయములోని పూసపాటి రాజుల బిరుదావళి ననుసరించియు, మడికి సింగన పద్మపురాణోత్తర ఖండములోని ముప్పభూపాలుని "దొంతిమన్నె విభాళ" బిరుదును బట్టియు. నీ రెండును వేఱువేఱు మన్నెరాజ్యములనియు, నీ రెంటిని జోడించి "బారహ దొంతిమన్నె రాజన్యు"లను గూర్చి వ్రాసి యుండె ననియు స్పష్టము.

అదియునుగాక శ్రీ వేంకటపతి భూపాల కృత ఉషాభ్యుదయ కావ్యములో పూసపాటి తమ్మభూపాలుడు "బారుహా మన్నె భూపాలార్చి తార్ఘ్య పాదాబ్జాతుడని యతనిని వర్ణించు నొక సీసపద్యమున గలదు.

సీ. దుర్ధరారాతి సందోహ తమః పట
లార్కుడై తనరె నే యధికయశుడు.
జయవాటికా పురస్థాన దుర్గాలబ్ధ
వైభవుండయ్యె నే పార్థివుండు,
బారుహా మన్నె భూపాలార్చి తార్ఘ్య
పాదాగ్ర్యుడయ్యె నే పార్థివుండు
ధార్మికమతితోడ తమ్మమాంబాప్రాణ
వల్లభుండయ్యె నే బల్లిదుండు

గీ. నతడు వినుతకిదగు సమస్తానవళ
చంద్ర హృద్బల్లి విభుడు సాంద్రచతుర
సైన్య వారణ దారుణ సాహసాంక
బాహుబలహేళి తమ్మ భూపాలమౌళి.

ఈ బారహాయను మన్నె సంస్థానము మధ్యప్రదేశములోని నరసింహపురము జిల్లా గర్ద్వార తాలూకాయందలి బారహాయై యుండవచ్చును. కాని "బారహా" గంజాము మండలములోని "బారువా" కాదని తోచుచున్నది.

## బిక్కవ్రోలు స్థలము

(1) బిక్కవ్రోలు స్థలములోని అగ్రహారము అమికి. (శ.స. 1372)

(2) బిక్కవ్రోలు స్థలములోని అగ్రహారం పినవేంద్ర, (శ.స. 1380)

బిక్కవ్రోలు తూర్పుగోదావరి మండలములోని రామచంద్రపురము తాలూకా యందలి గ్రామము. వేంద్రయను గ్రామము కాకినాడ తాలూకాలోని గ్రామము బిక్కవోలునకు సమీపముననే యున్నది. కాబట్టి యీ స్థలము రామచంద్రపురము తాలూకాలో కొంతభాగమును, కాకినాడ తాలూకాలో కొంత భాగమునై యుండెను.

S. I. I. Vol V. 48; 49.

**బెజవాడ (విషయము)**

బెజవాడ కృష్ణానదీతీరమున, ఆంధ్రప్రదేశమునందలి సుప్రసిద్ధ నగరములలో నొకటి. ఈ పట్టణము క్రీ. శ. ఆరవ శతాబ్దమునుండియు వాసిగాంచినట్లు సారస్వత, శాసనాధారములు గలవు. విజయనగర రాజ్యాధిపతులైన పూసపాటి వారికి మూలపురుషుడైన మాధవవర్మయను నతడు కొందఱు రాచవారితో కృష్ణానదీతీరమున బెజవాడకు వలసవచ్చి, కాలక్రమమున రాజ్యము నొకటి స్థాపించినట్లు తెలియుచున్నది. బెజవాడ మల్లేశ్వరస్వామి వారి యాలయములో నొక శాసనమున నితనిగూర్చి యొక గాథ కలదు.

మాధవవర్మ పుత్రునొకనిచేత చింతకాయ లమ్ముకొని జీవించు స్త్రీ యొక్క కుమారుడు హతుడుకాగా నారాజు ధర్మసంరక్షణార్థము తన పుత్రుని వధింప, మల్లేశ్వరస్వామి ప్రీతుడై బంగారు వర్షమును గురిపించి, ఇద్దఱు కుమారులను బునర్జీవితుల గావించెను. ఆ శాసనములో చెప్పబడిన సంవత్సరము శ.స 5 4. ఈ మాధవవర్మయే, విష్ణుకుండిన మాధవవర్మ కావచ్చుననియు, నా సంవత్సరమునుండియు, నతడు బెజవాడనుండి రాజ్య పాలనము గావించుచుండెననియు జరిత్ర పరిశోధకుల యూహ. (1)

"శ్రీమద్విజయ వాటాఖ్యపురే కృష్ణా విభూషణే
కకా శ్రీమచ్ఛకాబ్దేబ్ధి శశిసాయకసమ్మితే
రాజా మాధవవర్మా భూద్విఖ్యాతో ధరణీతలే
తతస్వపుత్రేణ హతే తింత్రిణిజీవిని సుతే
ధర్మసంరక్షణార్థాయ స్వపుత్ర మవధీత్స్వరాట్
తతో మల్లేశ్వర ప్రీతః స్వర్ణవృష్టిం వవర్ష చ
శిశుపుత్రకయోః ప్రాణం దత్తవాం స్తస్య కీర్తయే.

ఈ మాధవవర్మనే దగ్గుపల్లి దుగ్గయ్య తన నాచికేతోపాఖ్యానములో నిట్లు కీర్తించియున్నాడు.

సీ. చతురంగబలసులు జయవాడ దుర్గాంబ
వరమునం బడసి దుర్వారలీల,

జగతీస్థలంబెల్ల సాధించి జయశాసన
ములు దిగ్దంతి దంతములనలిపి,
వేదబాలునకుగాఁ బ్రియసుతు మోహంబు
పట్టక బెజవాడ బాడినిలిపి,
కలయంగ బురమున గాంచనవర్షంబు
గురియించి దేవతా కోటిపొగడ.

గీ. ''వసుధ నెగడిన మాధవవర్మ''.

పై విషయముల ననుసరించి, బెజవాడ కొంతకాలము విష్ణుకుండినుల రాజధానిగా నుండెనని యూహింపవచ్చును.

తర్వాత దీని ప్రఖ్యాతి యుద్ధమల్లుని బెజవాడ శాసనమువల్ల దెలియుచున్నది. ఈ శాసనము బెజవాడలోని శ్రీ మల్లేశ్వరస్వామివారి యాలయములో నొక పాలఱాతిమీద చెక్కఁబడియున్నది. ఈ శాసనము తొమ్మిదవ శతాబ్దము నాటిదని యూహింపబడుచున్నది. యుద్ధమల్లుడను చాళుక్యరాజు బెజవాడలో గుమారస్వామికి గుడియు, దానికిజేర్చి యొక మఠమును గట్టించెననియు, నీ మఠములో శైవులే తాని యితర మతములవారు నివసింపరాదనియు, నట్లొనర్చిన గాశిలో హత్యచేసిన పాపమున బోవువారనియు, శైవేతరులు మఠములో ప్రవేశించిన యెడల దేవస్థానాధిపతులు, రాజులు వారల వెడలగొట్టవలయుననియు, నట్లు చేసిన యెడల అశ్వమేధయాగ మొనర్చిన ఫలము చేకూరుననియు, మొదలగు సంగతులు శాసనమునందు గలవు. (2)

స్వస్తినృపాంకుశాత్యంత వత్సల సత్యత్రినేత్ర
విస్తర శ్రీ యుద్ధమల్లు డనవద్య - విఖ్యాతకీర్తి
ప్రస్తుత రాజాశ్రయుండు త్రిభువనా - భరణుండు సకల
వస్తుసమేతుండు రాజసల్కి భూ - వల్లభుండర్థి
పరగంగ బెజవాడ గొమరసామికి - భక్తుడై గుడియు
విరుపమమతి నృపధాముడెత్తించె - నెగిదీర్చె మఠము
గొరగాల్గాకొరులిందు విడిసి బృందంబు - గొనియుండువారు
గరిగాకయవ్వారణాసిన్వచ్చిన - పాపంబుగొంద్రు.

ఈ నగరము తూర్పు చాళుక్యుల పరిపాలన కాలమున ప్రధాననగరమై యుండెననుటకు పండురంగని అద్దంకిశాసనమువల్ల తెలియనగును. పండురంగడు గుణగవిజయాదిత్యుని సేనాపతి. ఇతడు వేంగీరాజ్యమును విజృంభింపజేసి, ఇప్పటి నెల్లూరు మండలములోని బోయకొట్టముల గైవసము గావించి, కందుకూరు బెజవాడయంత నగరముగా మార్చెనని యా శాసనము వల్ల తెలియుచున్నది. (3)

పట్టంబుగట్టిన ప్రథమంబు నేడు –
బలగర్వమొప్పగ బైలేచి సేన
పట్టంబుగట్టించి ప్రభుబండరంగు –
బంచిన సామంత పదువతో బోయ
కొట్టము ల్పండ్రెండుగొని వేంగినాంటి –
గొలల్చి యత్రిభువనాంకుశ బాణనిల్పి
కట్టెపు దుర్గంబు గడుబయల్సేసి –
కందుకూర్బెజవాడ గావించె మెచ్చి ॥

బెజవాడలోని ఇంద్రకీలపర్వతము పైనున్న యొకశాసనము(తొమ్మిదవ శతాబ్దమునాటిది) ప్రకారము బెజవాడకు పెచ్చవాడయని నామము గలదని యూహింపవచ్చును. (4)

"సచయతః శాపాంతరాత్క్ కా పెచ్చవాడ కలియమబోయి పుత్రః త్రికోటిబోయి నామాధార్మికః"

శాసనములలో దీనికి బెజవాడయనియే పూర్వనామమనియు, తర్వాత విజయవాడ, విజయశ్రీవాటిక యనియు నామము లేర్పడె ననియు విశదమగుచున్నది. తొమ్మిదవ శతాబ్దములో వేంగీపాలకుడైన కలివిష్ణువర్ధనుని చెరువు మాధవరము శాసనములో నియ్యది విజయవాటీపురమని చెప్పబడినది. (5)

పండ్రెండవ శతాబ్దములోని చాగినాతవాటి ప్రభువైన చాగిపోతురాజు శాసనములో బెజవాడ విజయవాటి విషయమునకు ప్రధాన గ్రామమనియు, దానిలో జక్కమపూండి, నొంచిడ్లపూడియను గ్రామములు కలవనియు వక్కాణింపబడినది. జక్కమపూడి యిప్పటికిని బెజవాడతాలూకాలో గలదు.

అనగా బెజవాడ విషయము ఇప్పటి బెజవాడతాలూకా కొంత భాగమై యుండును. (6)

పండ్రెండవ శతాబ్దాంతమున బెజవాడ కంద్రవాడిలో గలసి, బెజవాడ కంద్రవాడయను పేర బరగుచుండెనని తెలియుచున్నది. (7)

(1) S. I. I. Vol X. No. 22 (Undated)
(2) E.I. Vol XV. No.9. ఆ.సా.ప.ప. సంపుటము 6. పుటలు 49-68.
(3) E. I. Vol XIX. No. 47.
(4) S. I. I. Vol X. No. 33. (Undated)
(5) J. O. R. S. Vol XXIII. Part I-IV. చెరువు మాధవవరము శాసనము.
(6) S. I. I. Vol IV. No. 795. (శ.స. 1119)
(7) S. I. I. Vol VI. Nos. 602; 603. (శ.స. 1176)

## బెల్లముకొండ సీమ

బెల్లముకొండ గుంటూరుమండలములోని సత్తెనపల్లి తాలూకా యందలి బలిష్ఠమైన గిరిదుర్గము. శ్రీకృష్ణదేవరాయలు పూర్వ దిగ్విజయ యాత్రలో సాధించిన కోటలలో నిది యొకటి. ఆ కాలమునాటి శాసనము లందును, సారస్వతమునందును వక్కాణింపబడినది.

ముక్కు తిమ్మన్న పారిజాతాపహరణములో రాయల దిగ్విజయముల నిట్లు వర్ణించియున్నాడు.

వే. ఉదయాద్రి వేగనత్యుద్ధతి సాధించె
వినుకొండ మాటమాత్రన హరించె
గూటము ల్వెదరంగ గొండవీ డగలించె
బెల్లముకొండ యచ్చెల్ల జెఱచె

రాయల శాసనములలో నొకదానియందు (1)

"శ్రీ వీరకృష్ణదేవరాయలు విజయనగరమునుండి పూర్వ దిగ్విజయ యాత్రకు విచ్చేసి ఉదయగిరి దుర్గమున్ను సాధించి తిరుమలరాయ మహాపాత్రుని పట్టుకొని, అద్దంకి, వినికొండ, బెల్లంకొండ, నాగార్జునికొండ, తంగెడ,

కేతవరం మొదలైన గిరిదుర్గ స్థలదుర్గాలు ఏకథాటిని గైకొని"యెనని చెప్ప బడినది.

తర్వాత నీ దుర్గము గజపతుల, చంద్రకేతనుల వశమైనట్లు చరిత్ర ప్రసిద్ధము.

ఈ గ్రామములు బెల్లముకొండ సీమలోనివని కొన్ని శాసనములందు వివరింపబడినవి. (2)

| | | |
|---|---|---|
| ధూళిపాళ్ళ | ధూళిపాళ్ళ | సత్తెనపల్లి తాలూకా |
| గుల్లపల్లి | గుండ్లపల్లె | ,, |
| క్రోసూరు | క్రోసూరు | ,, |
| ఉప్పలపాడు | ఉప్పలపాడు | ,, |

పై శాసనస్థగ్రామముల నిర్దేశవిషయము ననుసరించి బెల్లముకొండ సీమ, ఆ గిరిదుర్గ సమీపప్రాంతమగు నేటి సత్తెనపల్లి తాలూకాలోని కొంత ప్రాంతమై యుండెను.

(1) తిరుపతి దేవస్థాన సంపుటములు 3. పుట178-79.

(2) M.E R. 1932-33. Nos. 269, 277, 281, 341 (Sattenapalli Inscription)

No. 269. (శ.స. 1679)
,, 277. (శ.స. 1551)
,, 281. (శ.స. 1660)
,, 341. (శ.స. 1449)

## బెల్వొలనాడు

ద్రాక్షారామములోని యొక శాసనమునందు బెల్వొలనాటిలోని ఇట్టగెయాగ్రహారమున శ్రీ మల్లక్ష్మణ దండనాయకుల మహాప్రధాని సిద్ధిమయ్యనాయకుడు భీమేశ్వరస్వామికి శ.స. 1055న లోహదండము దానను చేసినట్లు వ్రాయబడినది. బెల్వొలనాడు కన్నడ శాసనములందు పేర్కొనబడినది. ఇది బెల్వొల మూనూఱునాడు. బెల్వొలనాడు లేక బెల్వొలదేశమనిన్ని చెప్పబడినది. ధార్వాడ జిల్లాలోని, గడగ్, అన్నిగెరె కుర్తకోటి, నర్గుండు తాలూకాలును,

బెల్గాము జిల్లాలోని హుబ్లీ తాలూకాయును, తెలంగాణములోని కుక్కనూరు ప్రాంతముల మధ్యప్రదేశమని చరిత్రకారులు నిర్ణయించియున్నారు. ఇది కర్ణాట ప్రాంతభూమి. తెలుగు భూమికి సరిహద్దు ప్రాంతము.

ఈ బెళ్వలనాటికీ పేరెట్లు వచ్చెనో యిట్లు చెప్పబడినది. బెళెయనగా కన్నడములో పంటయనియు, హొల లేక పొల యనగా భూమి యనియు, బెళెహొలము లేక బెళ్వలమనగా సస్యసమృద్ధియైన భూమి యని యర్థమనియు దెలియుచున్నది. అన్నిగెరె యీ బెళ్వలనాటికి ముఖ్యపట్టణమని చెప్పబడు చున్నది.

P. 304-05. Gazetteer of Bombay Presidency Vol I. Part II. S. I. I. Vol IV. No 1094.

## బోదన

ఇయ్యది నిజామాబాదు మండలములోని బోదన తాలూకాకుప్రధాన నగరము. పూర్వము. రాష్ట్రకూట ప్రభువగు ఇంద్రవల్లభునకు రాజధానిగ నుండెననియు, నతడు బోదన పట్టణమునందు ఇంద్రనారాయణ దేవరకు దేవళమును గట్టించెనయు, త్రైలోక్యమల్ల ప్రథమసోమేశ్వరుని బోదన శిలా శాసనమును బట్టి తెలియుచున్నది.

> "రాష్ట్ర కూటాన్వయ చక్రేశ్వరం ఇందరవల్లభం
> రాజధాని బోదన్‌దోళ్ మాడిసిద
> ఇంద్రనారాయణదేవర దేవాయతనం"

ఇప్పటి నిజామాబాదు మండలమునకు పూర్వము ఇందూరు జిల్లాయని పేరు. నిజామాబాదునకు పూర్వము ఇందూరు (ఇంద్రపురము) అనునామము గలదు. దీని కా పేరు రాష్ట్రకూట ప్రభువగు ఇంద్రవల్లభునివల్ల గల్గియుండ వచ్చును.

(1) Bodhan Stone Inscription of the reign of Trailokya Malla Someswara I (AD 1086) H. A. S. No. 7.

(2) Imperial Gazetteer-Hyderabad State.

(3) Medak-Gulshanabad D. P. 3. and 12.

## బోనగిరి (భువనగిరి)

తెలంగాణములోని నల్గొండజిల్లా భువనగిరితాలూకాకు కేంద్రము. ఇయ్యది బలిష్ఠమైన యొక గిరిదుర్గము. ఆంధ్రదేశమున కళ్యాణి చాళుక్యుల కాలమునుండియు ప్రసిద్ధికెక్కినది. చాళుక్యవిక్రమ సంవత్సరమగు 36నాటి కన్నడశాసనములో భువనగిరి దండనాయకుడైన ఇట్మిదేవయ నచ్చటి సోమేశ్వర దేవరకు నందాదీవియ ప్రసాదించినట్లు గలదు.

పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు జైమినీ భారతమునందు సాళువ నరసింహ రాయలు భువనగిరి జయించినట్లు చెప్పియుండెను.

మ. కనకాద్రి ప్రతిమానధైర్య జగదేకస్తుత్య సింహాగ్య మా
హనలీలానవపంచబాణ నిజబాహాశౌర్య వీరావిరా
జినయోపాయవిహార బోనగిరి చెంజికొండ ధారాపురీ
పెనుకొండాద్య ఖిలైకదుర్గహరణ ప్రేంఖత్ప్రతాపోదయా

అనపోతానాయని అయ్యనప్రోలి శిలాశాసనములో నతడు "ఓరుగల్లు, శ్రీభువనగిరి, రాజుకొండ, సింగపురము మొదలైన తెనుంగుదేశ మాచంద్ర తారకము త్తరోత్తరాభివృద్ధిగాను ధర్మరాజ్యము" చేయుచుండెనని చెప్ప బడినది. ఓరుగల్లు పతనానంతరము ఈ దుర్గము వెలమ ప్రభువుల పాలనమున నుండెను.

తెలంగాణ శాసనములు సంపుటము 2.
కళ్యాణి చాళుక్యుల శాసనములు సంఖ్య 30.
వెలుగోటివారి వంశచరిత్రము – అనుబంధము. పుటలు 20–25.

## బోయకొట్టములు

పండరంగని అద్దంకి శాసనములో నతడు బోయకొట్టముల పండ్రెండు జయించినట్లు చెప్పబడినది. (1)

తరువోజ.

పట్టంబు గట్టిన ప్రథమంబు నేడు-బలగర్వ మొప్పగ భైరేచినేన
పట్టంబు గట్టించి ప్రభుబండరంగు-బంచిన సామంతపదువతో బోయ
కొట్టము ల్పండ్రెడు గొని వేంగినాటి-గొఱల్చియ త్రిభువనాంకుశ బాణనిల్పి
కట్టెంపు దుర్గంబు గడు బయల్సేసి-కందుకూర్బెజవాడ గావించె మెచ్చి

ఈ బోయకొట్టములు నెల్లూరు మండల శాసనము లలో వివరింపబడినవి. (2)

(1) ఉదయగిరి రాజ్యమండల బోయవిహార దేశం లోపలను పెన్నకటక తీరమందున అనంతసాగరానకు
పడుమటను సుడకట్టు అనేటి బహదూరు పురము

(2) "బోతావీళ్ళలో విచ్చిన సుంమళ్ళపాటి పొలములోను"

(3) "ఉదయగిరి స్థళ భోయవీడ్లలో-మణువుపాడు"

(4) "ఉదయగిరి రాజ్యమందు బోయవీడి లోపలను కుచినలపాడు"

(5) బోయవిళలోని మహిమలూరు

శాసనోద్దిష్టగ్రామములగు అనంతసాగరము, మహిమలూరు, ఆత్మకూరు తాలూకాలో గలవు. గుంమ్మళ్ళపాడు, కనిగిరి తాలూకాలోని గుమ్మళ్ళ పాడనెడి గ్రామము. మణువుపాడు ఆ తాలూకాలోనిదే యగు మనమడుగు గానోపును. బోయకొట్టములు, బోయవిహార దేశము నెల్లూరు మండలము లోని పశ్చిమ ప్రాంత తాలూకాలైన కనిగిరి, దానికి దక్షిణముగానున్న ఉదయగిరి, దానికి దక్షిణముగానున్న ఆత్మకూరు తాలూకా పరిసర ప్రాంతమని చెప్పవచ్చును.

(1) E. I. Vol XIX No. 47 (క్రి. శ. 148)
(2) 1. N I Atmakur (32) (AD. 1409-10)
2 ,, Kanigiri (4) (AD. 1416-15)
3. ,, ,, (10) (AD. 1377-78)
4. ,, Udayagiri (46) (AD. 1426-27)
5. ,, Atmakur (37) (No Date)

## బ్రహ్మకుండి

ఇయ్యది గుండ్లకమ్మకు నామాంతరము. (చూడుము గుండ్లకమ్మ)

(1) 1. బ్రహ్మకుండ్యాః కృష్ణవేణ్యా గౌతమ్యా వేమభూవరః ।
ఉపకంఠ మగ్రహారై రాకీర్ణమకరో ద్విభుః ॥

2. బ్రహ్మకుండీ కృష్ణవేణ్యా గోదావరీ
మహానదీ తటద్వయ తన్మధ్యదేశ దత్తానేకాగ్రహారః।

మంచికొండనాడు (శేషభాగము)

ఈనాడు ముదిగొండ చాళుక్య ప్రభువగు కుసుమాయుధుని యనుచరుడగు నల్ల మెఱెయ కొడుకు వ్రాయించిన కొలవి శిలాశాసనమునను, నాల్గవ కుసుమాయుధుని మొగలు చెఱువులు శాసనమునందును పేర్కొనబడినది.

(1) "శ్రీ విక్రమాదిత్య నృపాగ్రతనయుం డగ్గ చాలుక్య భీమునకు శాచకందర్పునకు వేంగీశ్వరునకు రనమగ్ధాన్వయ కులతిలకుండయ్యిన కుసుమాయుధుండు గన్నర బల్లహుని కస్త్రప్రాప్తంబయ్యిన గనసుగ్ధర సీమ (?) దనభుజోపల బరాక్రమంబున నెచ్చి కణ్ణియుంగట్టి పట్టంబుగట్టి ఖడ్గసహాయుండై నేల యెల్లం గావం బూని మంచికొండ నాడాదిగ వేంగిదేశము విష్ణువర్ధనుతో నర్ధ రాజ్యంబు సేయుచున్న కుసుమాయుధు"

(2) "సకుసుమాయుధః పరమబ్రహ్మణ్యః మంచికొండ విషయ నివాసినో రాష్ట్రకూట ప్రముఖాన్ కుటుంబినః సమాహూయ ఇత్థమాజ్ఞాపయతి కుత్సితగోత్రాయ దోనేయశర్మణే నిద్వదదాగ పారగాయ ఉత్తరాయణ నిమిత్తే మొగలు చెఱువులు నామగ్రామ సర్వకరపరిహారీ కృత్య మయాదత్తం విదితమస్తువః ॥

పై గ్రామమునకు సరిహద్దు లీ విధమున వ్రాయబడెను.

తూర్పు : మున్నపాక
క్రొవ్వేలు
దక్షిణము : కొలవి
జీతైలు
పశ్చిమము : కువ్వ
పాలాండు
ఉత్తరము : కొండతివిడి
నావులమెట్ట

ఈ మంచికొండనాడు కొలవిదేశము లేక మండలములోని యంతర్భాగము గాని లేక దాని సరిహద్దు విషయముగాని కావచ్చును. మొగలి

చెరువులు (మొగలిచెర్ల) కొలవి గ్రామములు నేటి వరంగల్లు మండలము నందున్నవి.

1. కొలవిశాసనము. తెలంగాణా శాసన సంపుటము 1. ఇతర శాసనములు 12. ఈ శాసనభాగము సవరించి శ్రీ వెంకటరమణయ్య గారు భారతి-సర్వధారి-భాద్రపద సంచికలో ప్రకటించియున్నారు.

2. Ind. Ant. July 1903. Grant of Kusumay dha IV (11th century A. D.)

## మంజీర (నది)

ఇయ్యది మెదుకు జిల్లాలోని ముఖ్యమైన నది. మైసూరు రాష్ట్రములో బీదరు జిల్లాలో పుట్టి మెదుకు జిల్లాలో ప్రవేశించి, రమారమి అరువది మైళ్ళు ప్రవహించి, నిజామాబాదు జిల్లాలోని కుందుర్తివద్ద గోదావరీ నదిని గలియుచున్నది.

ఈ నది మెదుకు దుర్గమునకు సమీపముననే ప్రవహించుచున్నది.

## మంజీర (భూమి)

గోదావరికి ఉపనదియై మెదుకు, నిజామాబాదు మండలములలో ప్రవహించునది. ఈ నది పేరనే, ఆ యా ప్రాంతములకు మంజీర భూమి యని పేరు వచ్చెనని యూహింపబడుచున్నది.

## మంత్రకూటము (మంథెన)

మంథెన గ్రామము కరీంనగర మండలములోని మహాదేవపురము తాలూకాలోని గ్రామము. దీనికి మంత్రకూటమను నామాంతరము గలదు. గోదావరికి దక్షిణ తీరమున నున్నది. అనుమకొండ శాసనమున కాకతి ప్రోలుడు మంత్రకూట నాధిపతియైన గుండరాజు నవమానపఱచి, యతనిని జంపినట్లు చెప్పబడినది. (1)

(2) బ్రహ్మగుండీ నదీతీరమున శ్రీ చదలువాడ లింగోద్భవ శ్రీమహా దేవునికి అమ్మనంబ్రోలి సీమలోని పోతవరము గ్రామము.

(1) S. I. I. Vol VI. No. 225 వేమారెడ్డి అమరావతి శాసనము. (శ. స. 1283)

(2) ప్రతాప పురుషోత్తమదేవుని పోతవర తామ్రశాసనము (శ. స. 1411). E. I. Vol VIII.

## భట్టిప్రోలు

ఆంధ్రప్రదేశమున పురాతన బౌద్ధక్షేత్రములలో నొకటి. గుంటూరు మండలములో రేపల్లె తాలూకా యందు కలదు. దీనికి ప్రతిపాలపురమను నామాంతరము గలదు. ఇచ్చట బౌద్ధస్తూపమునందు లభించిన ధాతుకరండ ముల మీద వ్రాయబడిన బ్రాహ్మిలిపిలోని ప్రాకృత శాసనములు లభించినవి. ఈ భట్టిప్రోలు శాసనముల పరిష్కరించిన బూలర్ పండితుడు ఈ లిపికి ద్రావిడీ బ్రాహ్మిలిపి యని పేరిడెను. ఈ శాసనములు క్రీస్తుకు పూర్వము రెండవ శతాబ్ద కాలమునకు జెందియుండెనని యా పరిశోధకుని యభిప్రాయము. ఈ స్తూపమున్న ప్రదేశమును లంజదిబ్బ యని నేటి ప్రజలు పిలుతురు.

(1) Luder's Lists. Nos. 1329-1339 E. I. Vol X.
(2) South Indian Buddhistic Antiquities in Krishna Dt. Archaeological Survey of India Vol XV.

## భవనాశి (నది)

తంగెడలోని, కుమారగిరిరెడ్డి కాలమునాటి యొక శాసనములో పేర్కొనబడినది.

"తంగెడ ఉత్తరాన శ్రీకృష్ణవేణ్య దక్షిణానను వరాహగుండ్లము భవనాశి కూడలిని శ్రీ అనంతగిరిని శ్రీ నరసింహ్యండు చొక్కన సింగనం గారికి సన్నిధైతేను" ఇదియొక చిన్నయేరు తంగెడ కుత్తరమున నొకమైలు దూరమున నున్న యరణ్యములో బుట్టి కృష్ణలో సంగమేశ్వరమువద్ద కలియుచున్నది.

S. I. I. Vol X. No. 505. (శ. స. 1313)

## భోగాపుర విషయము:

పూర్వ చాళుక్యరాజైన మహారాజ అనివారిత కోకిలవర్మ ముంజేరు తామ్ర శాసనములలో నీ విషయము పేర్కొనబడినది. భోగాపురము విశాఖ పట్టణ మండలములోని భీమునిపట్టణము తాలూకా యందలి భోగాపురమను గ్రామము. ముంజేరు ఆ తాలూకాలోనే గలదు. బ్రాహ్మణులకు దానమీయ బడిన గ్రామములు బోడ్డేరి లేక బొట్టేరి, వెదురువాడ. దానములు ఎలమంచి వాసకమునుండి యొసంగబడినవి. ప్రతిగ్రహీతలిద్దఱును ముంజేరు వాస్తవ్యులే. భోగాపురము మధ్యమ కళింగములోనిదిగ చెప్పబడెను. ఎలమంచిలి, వెదురు వాడ గ్రామములు సర్వసిద్ధి తాలూకాలో గలవు.

ఇంకొక శాసనములో భోగాపుర విషయములోని కొండూక వెలంగవాడ గ్రామము పేర్కొనబడినది. ఈ వెలంగవాడ భీమునిపట్టణము తాలూకా యందలి వెల్లంకి గ్రామమేమో! భోగాపుర విషయము భీమునిపట్టణము తాలూకా ప్రాంతమేయై యుండుననియు, లేక దక్షిణమున సర్వసిద్ధి తాలూకా వఱకు వ్యాపించి యుండవచ్చుననియు నూహింపనగును.

Paras 55, 56 of M. E. R. 1908-09.

## భీమరథి (చూడుడు-మలాపహారి)

ఈ నది అనవేముని ఉప్పుగల్లు శాసనములో పేర్కొనబడినది. ఈ గ్రామమునకు సీమా నిర్ణయమిట్లున్నది. (1)

"తూర్పునకు కొలనుగుండు, ఆగ్నేయానకు
కనుమేడు, దక్షిణానకు భీమరథి............"

ఈ నది భీమనదియని కృష్ణామండలములో నుండెను.

రెడ్డి సంచిక అనుబంధము, శాసనము XIX శ. 1293. అనవేముని ఉప్పుగల్లు శాసనము.

మంచికొండనాడు (విషయము)

ఈనాడు ముదిగొండ చాళుక్య ప్రభువగు కుసుమాయుధుని యనుచరుడగు నల్లమెఱెయ కొడుకు వ్రాయించిన కొలవి శిలాశాసనమునను, నాల్గవ కుసుమాయుధుని మొగలు చెఱువులు శాసనమునందును పేర్కొనబడినది.

(1) "శ్రీ విక్రమాదిత్య నృపాత్మతనయుండగు చాలుక్య భీమునకు శౌచకందర్పునకు వేంగీశ్వరునకు రనమద్ధాన్వయ కులతిలకుండయ్యు కుసుమాయుధుండు గన్నర బల్లహుని కస్త్రప్రాప్తంబయ్యు రనసుగ్గక సీమ (?) దనభుజోపల బరాక్రమంబున దెచ్చి కణ్ఠిగుసుంగట్టి పట్టంబుగట్టి ఖడ్గసహాయుండై నేల యెల్లం గావం బూని మంచికొండనాడాదిగ వేంగిదేశము విష్ణువర్ధనుతో నర్ధ రాజ్యంబు సేయుచున్న కుసుమాయుధు"

(2) "సకుసుమాయుధః పరమబ్రహ్మణ్యః మంచికొండ విషయ నివాసినో రాష్ట్రకూట ప్రముఖాన్ కుటుంబినః సమాహూయ ఇత్థమాజ్ఞాపయతి కుత్సితగోత్రాయ దోనేయశర్మణే విద్వదదాగ పారగాయ ఉత్తరాయణ నిమిత్తే మొగలు చెఱువులు నామగ్రామ సర్వకరపరిహారీ కృత్యమయాదత్తం విదితవస్తువః ॥

పై గ్రామమునకు సరిహద్దు లీ విధమున వ్రాయబడెను.

తూర్పు : మున్నపాక
క్రొవ్వేలు
దక్షిణము : కొలవి
జీతైలు
పశ్చిమము : ఉవ్వ
పాలాండు
ఉత్తరము : కొండతివిడి
చావులమెట్ట

ఈ మంచికొండనాడు కొలవిదేశము లేక మండలములోని యంతర్భాగము గాని లేక దాని సరిహద్దు విషయముగాని కావచ్చును. మొగలి

చెరువులు (మొగలిచెర్ల) కొలవిగ్రామములు నేటి వరంగల్లు మండలము నందున్నవి.

1. కొలవిశాసనము. తెలంగాణా శాసన సంపుటము 1. ఇతర శాసనములు 12. ఈ శాసనభాగము సవరించి శ్రీ వెంకటరమణయ్య గారు భారతి-సర్వధారి-భాద్రపదమాస సంచికలో ప్రకటించియున్నారు.

2. Ind. Ant. July 1903. Grant of Kusumayudha IV (11th century A. D.)

## మంజీర (నది)

ఇయ్యది మెదుకు జిల్లాలోని ముఖ్యమైన నది. మైసూరు రాష్ట్రములో బీదరు జిల్లాలో పుట్టి మెదుకు జిల్లాలో ప్రవేశించి, రమారమి అరువది మైళ్ళు ప్రవహించి, నిజామాబాదు జిల్లాలోని కుందుర్తివద్ద గోదావరి నదిని గలియుచున్నది.

ఈ నది మెదుకు దుర్గమునకు సమీపముననే ప్రవహించుచున్నది.

## మంజీర (భూమి)

గోదావరికి ఉపనదియై మెదుకు, నిజామాబాదు మండలములలో ప్రవహించునది. ఈ నది పేరనే, ఆ యా ప్రాంతములకు మంజీర భూమి యని పేరు వచ్చెనని యూహింపబడుచున్నది.

## మంత్రకూటము (మంథెన)

మంథెన గ్రామము కరీంనగర మండలములోని మహాదేవపురము తాలూకాలోని గ్రామము. దీనికి మంత్రకూటమను నామాంతరము గలదు. గోదావరికి దక్షిణ తీరమున నున్నది. అనుమకొండ శాసనమున కాకతి ప్రోలుడు మంత్రకూట నగరాధిపతియైన గుండరాజు నవమానపఱచి, యతనిని జంపినట్లు చెప్పబడినది. (1)

"కృద్దేనోద్ధుర మంత్రకూటనగరీ నాథః ... యోనిస్త్రపో
గుండః ఖండిత ఏవముండితశిరాః క్రోడాంకవక్షస్థలః
ఏడో డింభకవత్పలాయనపరో జాతో గత స్స్వాంపురీ
నూపుర తోఽపిన్నపేశ్వరస్య పురతః ప్రోలేనయుద్ధాయయత్"

మొదటి ప్రతాపరుద్రుని గయాశాసనములో మంత్రకూటమిట్లు వర్ణింపబడినది. (2)

వింధ్యాద్రి దక్షిణప్రాంతే విలసద్గౌతమీతటే
మంత్రకూటం సహస్రాణాం లింగానాం స్థానముత్తమం.

(1) H. A. S No. 13 Inscription No. 3

(2) Inscription from Gaya E. I. Vol XXXIII No. 20. Inscription of the two of Kakatiya Prataparudra I.

## మగతల (స్థలము; విషయము)

మహబూబునగరము జిల్లా మక్తల తాలూకాకు ప్రధాన నగరము. ఈ తాలూకా కృష్ణానది కుత్తరమున నున్నది. ఈ మగతల రాజ్యము (తెలంగాణా శాసన సంపుటము-2.) మక్తల శాసనములలో పేర్కొనబడినది. ముఖ్యముగా ఈ శాసనములు కాకతీయ యుగమునకు చెందినవి.

(1) హేవలంబి సంపత్సర మాఘ శు॥ ౧౫-గు॥ మగతల శ్రీస్వయంభు మల్లినాథదేవర గుడి యిట్టుక వదలితేని స్వస్తి శ్రీమన్మహా రాయ గజసాహిణి స్వామిద్రోహరగండ గుడ్డయ... అమల్లి నాథదేవర కారుణ్య ప్రసాదము వడసిరి.

(2) శ్రీమన్మహామండలేశ్వర కాకతీయ్య ప్రతాపరుద్రదేవ మహా రాజులు ఓరుగంటను రాజ్యంబు సేయుచుండగాను శకవరుషం బులు ౧౨౧౬ అగునేటి హేమళంబి సంవత్సరాన శ్రీగజసాహిణి స్వామి ద్రోహరగండ గుండయ నాయనింగాను మగతలను రాజ్యంబు సేయుచు....

(3) శ్రీమన్మహామండలేశ్వర కాకతీయ ప్రతాపరుద్రదేవ మహా రాజులు ఓరుగంటను ప్రిథువి రాజ్యంబు సేయుచుండగాను శక

వరుశంబులు ౧౨౭౦ అగు హేవళంబి సంవత్సరానను స్వస్తి శ్రీమతు స్వామిద్రోహరగండ రాయగజసాహిణి మాదయరెడ్డి వారు మగతలను రాజ్యంబు సేయుచుండగాను.

(4) శ్రీమన్మహామండలేశ్వర కాకతియ్య ప్రతాపరుద్రదేవ మహారాజులు ఓరుగంటనుం పృథ్వి రాజ్యంబు సేయుచుండంగాను మగతల స్థలమందు గుండాయనాయనింగారు.

(5) శ్రీ మత్ స్థాణు నామకేన మగతల విషయాంతర్వర్తి గిన్నె నాయకపల్లీతి ప్రసిద్ధః పుణ్యాత్మనా కేవచితు భూషావేనదత్తః॥

(6) స్వస్తిశ్రీ మన్మగతల పురవరాధీశ్వర స్వయంభు మల్లినాథాయ మగతలనగరే మగతల ప్రవిష్టగ్రామేషుచ....శైస్సైత్త శ్యాలీ నైర్మగితల స్వామిభి స్తల్ల బ్ధానుమతిభి రధికారిభిశ్చదత్తం....

(1) తేకుంపల్లి తడాగమధ్యే త్రింశన్నివర్తన పరిమితం కృష్ణక్షేత్రం ....

(2) ఊటుకూరమార్గే దశనివర్త పరిమితం కృష్ణక్షేత్రం ..

(3) పులిమామింద్రవస్థా....శావిక్షేత్ర మేక నివర్తనం....

(4) అనుపూరగ్రామే కృష్ణక్షేత్రం చతుర్నివర్తన పరిమితం.

పై శాసనములలో పేర్కొనబడిన తేకుంపల్లి, ఊటుకూరు, పులిమామింద్ర, అనుపూరర గ్రామములు నేటి మక్తల తాలూకాలోని తేకులపల్లి ఊటుకూరు, పులిమామిడి, అయినపూరు గ్రామములే. కాబట్టి మగతలస్థలము లేక విషయము నేటి మక్తల తాలూకా ప్రాంతమైయుండెనని చెప్పవచ్చును.

శ్రీశైల శాసనములో "మగతల భూమిలోన-కొండపల్లి" యని పేర్కొనబడినది.

తెలంగాణ శాసనములు. సంపుటము 2.

(1) కాకతీయ శాసనములు 8, 9, 10, 22. సంఖ్యలు.

(3) S. I. I. Vol X. No. 504.

(4) H. A. S. No. 19. MN 21, 24.

## మధ్యదేశము (మధ్యాంధ్రదేశము)

అనవేమారెడ్డి అమరావతీ శాసనములో నతని బిరుదావళిలో "బ్రహ్మకుండీ కృష్ణవేణ్ణ గోదావరీ మహానదీ తటద్వయ మధ్యదేశ దత్తానేకాగ్రహార" యని బ్రహ్మకుండి (గుండ్లకమ్మ) మొదలుకొని గోదావరినదీతీరము వరకు గల మధ్యదేశములో ననేకాగ్రహారములు దానము చేసెనని చెప్పబడినది.

ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశము - ఉత్తరభాగము నాలుగవ ఆశ్వాసము మొదటిపద్యములో ప్రోలయవేమని యీవిధముగ సంబోధించియున్నాడు.

కం. శ్రీమధ్యాంధ్రసుదేశ
క్షేమదకరవాల సుగుణకీర్తితగుణలో
లామంజుల వాగ్జాలా
వేమక్షితిపాల నిత్యవిజయసుశీలా.

శ్రీనాథుడు కాశీఖండములో వీరభద్రారెడ్డిని యీవిధముగ సంబోధించినాడు.

శా॥ కర్ణాటోత్కల పారశీక నృపసఖ్య ప్రాభవశ్రీనిధీ
యర్ణోరాశి పరీత భూభువన మధ్యాంధ్రధరాధీశ్వరా
కర్ణాభ్యర్ణవిశాలనేత్ర జగదేక ప్రాజ్యసామ్రాజ్యదృ
క్కర్ణాధీశ్వరహార భక్తినిరత క్ష్మాపాల చూడామణీ.

తృతీయాశ్వాసాంత పద్యము-247.

ఎఱ్ఱాప్రెగ్గడయు, శ్రీనాథుడును వర్ణించిన మధ్యాంధ్రదేశము, అమరావతి శాసనములోని మధ్యదేశసీమా పరిమితియు నొక్కటియే.

S. I. I. Vol VI. No. 226 అమరావతి శాసనము (శ స 1283)

## మన్నేరు (మణిక)

నెల్లూరు మండలములో కందుకూరు తాలూకా గుండా ప్రవహించునది. సింగరాయకొండలోని యొక శాసనములో దీనికి మణికయని సంస్కృత నామము గలదు. సింగరాయకొండ సమీపమున నుండి ప్రవహించుచున్నది.

రాజరాజ చోడగంగు శ. స. 1103. నాటి చేకి శాసనము నతడు మహేంద్రగిరి మన్నేరుల మధ్య నివసించియుండిన ప్రజల సంబోధించి యిచ్చెను. అనగా నతవి కాలమున వేంగిరాజ్యము ఉత్తరమున కళింగములోని మహేంద్రగిరి మొదలు దక్షిణమున నెల్లూరుమండలములోని మన్నేరు వఱకు వ్యాపించియుండెనని యూహింపవచ్చును.

"శ్రీ చోడగంగదేవ...... సకలసామంత చక్ర
ప్రముఖేణ పరివారేణ పరితస్సేవ్యమానః
మన్నేటి మహేంద్ర మధ్యవర్తినో రాష్ట్ర
కూట ప్రముఖాన్ కుటుంబినస్సర్వాన్
సమాహ్వాయ .... ఇత్థమాజ్ఞాపయతి"

(1) N. I. Kandukur (77) (శ. స 1450) సింగరాయకొండలోని శాసనము.

(2) E. I. Vol VI. P. 334-347.

**మర్జవాడ (మహారాజపాడి-రాజ్యము. నాడు)**

ఇయ్యది తమిళ కర్ణాటాంధ్ర శాసనములలో పేర్కొనబడినది.

(1) ప్రథమ రాజేంద్రచోళుని కాలమునాటి తిరువల్లము గ్రామములో బిల్వనాథేశ్వరస్వామి యాలయమునందున్న తమిళ శాసనము. "మహారాజపాడిలోని ఇనల్లూరునాడు."

(2) రాజాధిరాజచోడుని మిండిగల్లు కర్ణాట శాసనము. రాజాధిరాజచోడని దండనాయకుడైన రాజేంద్ర చోళ బ్రహ్మమారాయుడు వల్లూరు రాజధానిగ మారాజవాడి నేలుచుండెను. "చోళనసింగమ్. రాజేంద్రచోళ బ్రహ్మమారాయన్ మారాజవాడి ఏళుసాసిరమ్ (యేడువేలు) ఆళుత్తవల్లూర బిడిదల్ సుఖసంకథూత వినోదిమ్."

(3) అతని కాలమునాటిదేయగు మైసూరు రాష్ట్రములోని కోలారు మండలములోని చాకడపల్లి శిలాశాసనములో నిట్లు వ్రాయబడినది.

"చోళసింగమ్ రాజరాజ బ్రహ్మాదిరాజన్ మహారాజవాడి ఏళుసాసిరమం పులినాడు ఎళువత్తురి, ముటికినాడు మున్నూఱుం ఆఱుత్తం బల్లూర బిడిదల్"

(4) ఇమ్మడి నరసింహదేవరాయల దేవులపల్లి శాసనము.
"పెనుకొండ మహారాజ్యే మార్జవాడస్య సీమని గుండ్లూరు నామ గ్రామస్యస్థలే విఖ్యాత నామకం దేవులపల్యాఖ్యం"

(5) దేవరాయల నాటి తంబల్లపల్లి శాసనములో
"మార్జవాడయ నాడవూళగె యిహ చంద్రగిరియ మల్లిఖార్జున దేవరిగె" అని మార్జవాడ నాటిలోని చంద్రగిరి గ్రామము పేర్కొనబడినది.

(6) అమరావతిలోని కృష్ణదేవరాయల కాలమునాటి శాసనము.
"అవుభళయ్యగారి కార్యకర్తలైన పెనుగొండ మర్జవాడ సీమలోని వావిలిపాటి దేవళరాజు నాగయ దండముపెట్టి యిచ్చిన శాసనము. దేవునికి దధ్యన్నానకు పరిమి గ్రామమున క్షేత్రము రెండు కుచ్చెళ్ళు సోమగ్రహణ పుణ్యకాలమందు సలువ(సాళువ)తిమ్మరుసువారికిన్ని, అమ్మవారికిన్ని అవుభళయ్య వారికిన్ని పుణ్యముగాను ఇస్తిమి"

పై శాసనోద్దిష్ట గ్రామనామములు, నేటి కాలమున వాని యునికి నీ క్రింద చూపబడినవి.

| | | | |
|---|---|---|---|
| (1) ఇన్గల్లూరు | ఇనగలూరు | కాళహస్తి డివిజన్ | |
| (2) వల్లూరు | వల్లూరు | కడప తాలూకా | |
| (3) గుండ్లూరు | గుండ్లూరు | రాయచోటి తాలూకా | |
| (4) దేవులపల్లి | దేవులపల్లి | ,, | ,, |
| (5) చంద్రగిరి | చంద్రగిరి | చంద్రగిరి | ,, |
| (6) పరిమి | పరిగి | హిందుపురము | ,, |
| (7) తంబలపల్లి | తంబలపల్లి | మదనపల్లి | ,, |
| (8) మిండిగల్లు | మిండిగల్లు | చింతామణి | ,, |

కోలారుమండలము (మైసూరు)

పై పట్టిక ననుసరించి మార్జవాడ రాజ్యము నేటి కడప, చిత్తూరు మండలము దాటి మైసూరు రాష్ట్రములోని కోలారు మండలమువఱకు వ్యాపించియుండెనని యూహింపవచ్చును.

(1) S. I. I. Vol III Page 106.
(2) E. I. Vol V. No. 23 (శ. 930)
(3) Mysore Arch. Department Report. 1928. No. 31
(4) E. I. Vol VIII. Pages 74-75.
(5) S. I. I. Vol IX Part 2. No. 429. (శ. 1327)
(6) S. I. I. Vol VI. No. 232

## మలయపర్వతములు

ఇవి కులాచల పర్వతములోనివి (చూడుడు - మహేంద్రపర్వతము). భరతఖండమునకు పడమట దిశను వ్యాపించియున్న పడమటికనుమలనబడు (Western Ghats)పర్వతశ్రేణిలో నీలగిరికొండలనుండి, దక్షిణమునకుమారి కాగ్రము వఱకు (Cape Camorin) వ్యాపించిన కొండలకు మలయపర్వతములని పేరు, ఇది ముఖ్యముగా పాండ్యదేశములతో సంబంధించి యున్నవి.

మలయపర్వతముల నుండిన నదులు—

కృతమాలో తామ్రపర్ణీ పుష్పజాసూత్పలావతీ
మలయాద్రి సముద్భూతా నద్య శీతజలా స్త్విమాః।

మార్కండేయ పురాణము. అధ్యాయము 57. శ్లో. 27-28.

## మలయము (మండలము)

మలయ మండలము వేంగినాటిలోని యంతర్భాగము.

(1) "ఉత్తరాయన నిమిత్తమున మలయమున క్రొవ్విణ్డి మేడయగారి కొడుకు మాంకనప్రెగ్గడ"

"మలయ భూపాలాస్య మంత్రిసుధీ" (శా. శ. 1050)

(2) "స్వస్తిసర్వలోకాశ్రయ శ్రీవిష్ణువర్ధన మహారాజుల ప్రవర్ధమాన విజయరాజ్యసం॥ 4 శ్రావణ వేంగినాంటి మలయ మండలమున చాళుక్య సముద్ధరుండైన సూరపరాజు" (శా. శ. 1051)

(3) శ్రీమన్మహామండలేశ్వర చాళుక్య రాజ్య సముద్ధరనుండు మలయమున బంటరాజు. (శా. శ. 1065)

(4) రాజమహేంద్రవరములోని యొక శాసనములో "శకవర్షంబులు 1100 యుత్తరాయణ సంక్రాంతి కాలమున మలయమండలాధిపతియైన గణపతి దేవరాజు తమతండ్రి మహాదేవరాజు చెప్పి "గజ్జరస మహాదేవేశ్వర శ్రీమహాదేవరను ప్రతిష్ఠచేసి యాదవుని అంగరంగభోగాలకు 'నందమూరు' అంగడి సుంకము ఆచంద్రార్కస్థాయిగా నిచ్చెనని" గలదు (శా. శ. 1170).

(5) ఈ మలయ మండలమునకు మద్దూరు రాజధాని. పూర్వచాళుక్య ప్రభువగు మూడవ మల్లదేవుని సామంతుడైన మహాదేవరాజు చెంగూరివాటి విషయములోని "చంద్రాపూరు" అను గ్రామమును నూటముప్పది బ్రాహ్మణులకు దానము చేసెననియు, మలయానది గోదావరితో యములచేస్నిగ్ధము గావింపబడుచున్నదనియు, శా. శ. 1127 సం॥ నాటి యొక తామ్రశాసనము నందు గలదు (5).

మలయ మండలము ఇప్పటి పడుమటి గోదావరి జిల్లా కోవ్వూరు, నిడుదవోలు తాలూకాలలో గోదావరి తీరమునంటియున్న కొంతభాగము. శాసనములలో నుదాహరింపబడిన గజ్జరము, నందమూరు, మద్దూరు, నిడుదవోలు తాలూకాలో గలవు.

(1) S. I. I. Vol IV. No. 1193
(2) ,, ,, 1177
(3) ,, ,, 1167
(4) ,, V. No. 116
(5) No. 10 of 1916-17. M. E. R. 1916-17. Page 121 and Page 97 of M.E.R. 1921-22.

## మలాపహారి

ఈనది ప్రాచీనాంధ్ర కావ్యమైన అనంతమాత్యుని భోజరాజీయమున పేర్కొనబడినది. దానిలో నతని తండ్రి తిక్కన కృష్ణవేణీ మలాపహారిణి భీమరథి నదీత్రయాంతర్వేది యగు క్షేత్రము నందలి పెరమగూరి నివాసి యని చెప్పబడినాడు.

సీ. విలసితంబగు కృష్ణవేణీ మలాప హా
రిణి భీమరథినా ధరిత్రియందు
దనరు నదీత్రయాంతర్వేది యగు పావ
నక్షేత్రమున శోభనములకెల్ల
ధరనివాసంబగు పెరమగూరి పురంబు
నందు విద్వజ్జనానందమైన
జీవనస్థితి చేత జెన్నొంది వంశ క
ర్తృత్వసంపత్తి ప్రభుత్వమొంది



గీ. నెమ్మి బ్రత్యక్షపరమ పదమ్మనంగ
నొప్పు శ్రీకాకుళంబున కొడయడైన
యంధ్రవల్లభ హరిసేవ నలరుచుండు
బెక్కుభంగుల ముమ్మడి తిక్కవిభుడు.

భోజరాజీయము నందేగాక పదునైదవ శతాబ్దము నాటి ఆంధ్రశాసనములందు నుదాహృతమైనది.

కొప్పుల కాపనాయకుని ప్రోలవరము శాసనములో నాగ్రామము మలఘ్ని తీరమున నున్నదని చెప్పబడినది. (1)

గ్రామం ప్రోలవరాహ్వయం స్వయమదా తస్మై మలఘ్నీతటే॥

అనపోతారెడ్డి కోడూరు శాసనములో నతడు కోడూరునకు అన్నపోత పురమని పేరుపెట్టి బ్రాహ్మణులకు దానము చేసెనని గలదు. ఆ కోడూరు మలాపహానదీ తీరమున నున్నట్లు వ్రాయబడినది. (2)

మలాపహానదీతీరే విప్రేభ్యః ప్రతిపాదితమ్
అన్నపోతపురంనామ్నా జయత్వాచంద్రతారకమ్

పెదకోమటి వేమారెడ్డి తమ్ముడు మాచారెడ్డి కుమారుని తిప్పారెడ్డి ఏకమూరు శాసనములో ఆ గ్రామము మలాపహారిణీ భీమరథ్యంతర్వేది సంస్థితమని చెప్పబడినది. ఈ ఏకమూరు కృష్ణాజిల్లా గన్నవరము తాలూకాలోనిది (8).

అనవేముని దృజ్జవరము శాసనములో ఆ గ్రామము మలాపహారితటమునందు కలదని చెప్పబడినది. ఆ గ్రామము సరిహద్దు గ్రామములు పెరిశపల్లి, కాపవరము, దగ్గుంబల్లియు గుడివాడ తాలూకాలో గలవు.

కోడూరు శాసనములో చెప్పబడ్డ యీ క్రింది గ్రామములు విన్నకోట, కనుమెర్ల, పొట్టిపాడు, గురుజ, పొలపర్తి మొదలైన గ్రామములు గుడివాడ తాలూకాలోనే కలవు.

భోజరాజీయములో చెప్పబడిన పెరమగూరు బెజవాడ తాలూకాలోని పనకమూరు గ్రామము.

పై గ్రామనిర్దేశస్థలముల బట్టి మలాపహారి నేటి గన్నవరము, బెజవాడ, గుడివాడ తాలూకాలలో ప్రవహించుచుండెననియు యూహింపవచ్చును. ఇదియే నేటి పుల్లేరు కావచ్చును.

దీనికి డాంకేరు, వన్నేరు అను రెండు ఉపనదులు గలవు.

(1) J. B. O. R. S. Vol XX. Parts III-IV. శ్రీసోమశేఖర శర్మగారు ప్రకటించిన శాసనము (S 1267.)
(2) E. I. Vol XXV. P 137. 146. (S 1280)
(3) రెడ్డి సంచిక, అనుబంధము. శాసనము XX (S 1293)

**మహాబాహు**

ఇది పెన్నానదికి ఉపనదులలో నొకటి. దీనికి బాహుదా, చెయ్యేరులను పేర్లుగలవు. చిత్తూరుమండలములో ప్రభవించి కడపమండలములో రాయచోటి, పుల్లంపేట, సిద్ధవటము తాలూకాలగుండా ప్రవహించి చిన్నచిన్న యేరులతో గూడుకొని పెన్నానదిలో గలియుచున్నది. సిద్ధవటసీమలోని పొత్తపినాటి యందలి నదులలో నొకటి. దీనికి "మహాబాహు" అని పేరు గలదని తిరుమల

దేవరాయని పెనుగులూరు శాసనమునుబట్టి తెలియుచున్నది. ఈ గ్రామము మహేంద్రతనయానదికి పూర్వతటమున నున్నదని ఆ శాసనములో వక్కాణింప బడినది. (1)

శ్రీ సిద్ధవరసీమాయాంచిత పొత్తపినాడుకే
మహేంద్రతనయాతరంగిణ్యాః ప్రాచీమాశా ముపాశ్రితం.

(1) E. I. Vol XVI. No. 18. S' 1493.
Penuguluru Inscription of Tirumala 1.

## మహేంద్రగిరి

భారత వర్షములోని సప్తకులాచలములలో నిది యొకటి.

మహేంద్రో మలయః సహ్యం శుక్తిమాన్ ఋక్షపర్వతః
వింధ్యశ్చ పారియాత్రశ్చ సప్తైవాత్ర కులాచలాః ।

మార్కండేయ పురాణము. అధ్యాయము 57. శ్లో. 10.

ఈగిరి, రాజశేఖరుడు కావ్యమీమాంసలో భరతఖండములోని కుమారి ద్వీపము (వింధ్యపర్వత దక్షిణదిగ్భాగము)లో నున్నట్లు వ్రాసియున్నాడు. ఇదియే సరియైన భూగోళ స్థలనిర్ణయము.

కుమారి ద్వీపే - వింధ్యశ్చపారి యాత్రశ్చ శుక్తిమాన్ ఋక్షపర్వతః
మహేంద్ర సహ్య మలయాః సప్తైతే కులపర్వతాః ।
(కావ్యమీమాంస-పదియేడవ అధ్యాయము)

అతడే దక్షిణాపథమునందలి పర్వతశ్రేణుల నిట్లు వివరించెను.

వింధ్య దక్షిణపాద మహేంద్రమలయ మేకల పాలమంజరీ సహ్య శ్రీ పర్వతాదయః పర్వతాః । (పదియేడవ యధ్యాయము)

కాళిదాసు రఘువంశము చతుర్థ, షష్టసర్గలలో మహేంద్రపర్వతముల వర్ణించియున్నాడు.

సప్రతాపం మహేంద్రస్య మూర్ధ్ని తీక్ష్ణం న్యవేశయత్ ।
అంకుశం ద్విరదస్యేవ యన్తా గంభీరవేదినః । (39)
ప్రతి జగ్రాహ కాళింగస్తమస్త్రైర్గజసాధనః ।
పక్షచ్ఛేదోద్యతం శక్రం శిలావర్షీవ పర్వతః ॥ (40)
గృహీత ప్రతిముక్తస్య సధర్మవిజయీనృపః ।
శ్రియం మహేంద్రనాథస్య జహారనతుమేదినీమ్ ॥ (43)

చతుర్థస్సర్గము.

అసౌ మహేంద్రాది సమానసారః
పతిర్మహేంద్రస్య మహోదధేశ్చ.
యస్యక్షరత్సైన్య గజచ్ఛలేన
యాత్రాసు యాతీవపురో మహేంద్రః । (54)

షష్ఠస్సర్గము.

మహేంద్రపర్వతములు కళింగదేశముతో సంబంధించినవి. కళింగ నరపతులు మహేంద్రనాథులు. ఈ పర్వతములు, భాగవతపురాణములో గంగా సాగరసంగమము నుండి గోదావరీతీరముపఱకు వ్యాపించియున్నట్లు తెలుపబడినది. బలరాముని తీర్థయాత్రా సందర్భమున

"గయాంగత్వా పితౄనిష్ట్వా గంగాసాగర సంగమే
ఉపస్పృశ్య మహేంద్రా ద్రౌరామం దృష్ట్వాభివాద్యచ
సప్తగోదావరిం వేణ్యాం పంపాం భీమరథీం తతః ।

పదియవ అధ్యాయము. శ్లో. 79.

వెలనాటి రాజేంద్రచోడుని నందూరు శాసనములో ఆంధ్రవిషయ సరిహద్దులు పేర్కొనబడిన సందర్భములో నతడు మహేంద్రాంచలం, కాళహస్తి శిఖరి. శ్రీశైలపర్వత మధ్య ఆంధ్రవిషయము నేలుచుండెనని కలదు. (1)

శ్లో. పూర్వాంభోనిధి కాళహస్తి శిఖరీ
శ్రీ మన్మహేంద్రాచల శ్రీశైలైర్వల యీ
కృతాంధ్ర విషయాం శ్రీ రాజరాజస్స్వయం ॥

అల్లే రాజరాజచోడగంగు శేకిశాసనములో నుత్తరమున మహేంద్రగిరి దక్షిణమున మన్నేరు మధ్యగల రాష్ట్రకూట కుటంబికుల సమాహ్వాయించినట్లు తెలుపబడినది. (మన్నేటి మహేంద్రవర్తినః రాష్ట్రకూట ప్రముఖాన్.) (2)

నేడు మహేంద్రపర్వతములు తూర్పుకనుమలను బేర బఱగుచున్నవి. మహేంద్రగిరి గంజాము మండలములోనున్నది. ఈ కొండలు ఉత్కలరాష్ట్రము నుండి (Orissa) తూర్పు సముద్రతీరమునకు నూరు నూటయేబది మైళ్ళ దూరమున శ్రీకాకుళము, విశాఖపట్నము, తూర్పు పడమటి గోదావరి మండలములు, కృష్ణా, కర్నూలు, నెల్లూరు, కడప మండలములలోను-డి, దక్షిణమున మధురామండలము వఱకు ప్రాకియున్నవి. ఇవి నిమ్నోన్నతములు గాక, దాదాపు రెండువేల యడుగుల ఎత్తును మించిలేవు. విశాఖపట్నము మండలములో పాలకొండలనియు, గోదావరీ మండలములో మలయములు పాపికొండలనియు, నెల్లూరు, కడప మండలములలో పాలకొండలు, వెలికొండ లనియు కర్నూలు మండలములో ఎఱ్రమలలు నల్లమల లనియు, చిత్తూరు మండలములో శేషశైలము, కాళహస్తిగిరులనియు, నీకొండలకు వివిధ నామములు.

ఆంధ్రదేశములోని సుప్రసిద్ధనదులగు గోదావరీ, కృష్ణ, పినాకినీనదులు పడమటి దిశనుండి ప్రవహించి, మహేంద్రగిరులను జీల్చి సముద్రగాములవు చున్నవి.

విశాఖపట్టణ మండలములో సింహగిరిపై వరాహనృసింహస్వామి, ఖమ్మము మండలములో భద్రాద్రిపై శ్రీరామచంద్రమూర్తి, కృష్ణామండల ములో ఇంద్రకీలాద్రిపై కనకదుర్గ, కర్నూలుమండలములో నల్లమలలపై, శ్రీగిరి మల్లికార్జునుడు, గరుడాద్రిపై అహోబిలనారసింహుడు, చిత్తూరు మండలములోని శేషాచలముపై శ్రీవెంకటేశ్వరస్వామియు ఆంధ్రప్రదేశము నకు అరిగాపులై, యావదాంధ్ర ప్రదేశమును పరిరక్షించుచున్న దైవశిఖా మణులు.

(1) E. I. Vol XXIX. Part VII. (శ. స. 1091)
(2) E. I. Vol VI. No. 35. (శ. స. 1006)

## మహేంద్రభోగము

ఉమావర్మ ధవళపేట శాసనములో నతడు మహేంద్రభోగములోని కొత్తూరు గ్రామమును అగ్రహారముగ నొనర్చి యొక బ్రాహ్మణునకు దానము చేసెనని గలదు.

"మహేంద్రభోగ కొత్తూరుగ్రామే" కొత్తూరు శ్రీకాకుళంజిల్లాలోని శ్రీకాకుళంతాలూకాలోని గ్రామము. మహేంద్రభోగము నా ప్రాంతమె కానోపును.

**Dhavalapeta Copper Plate Grant of Umavarman A.H. R. S. Vol X.P. 143-144.**

## మాకేఱు (మణిక)

(1) "శ్రీ కూడలి సంగమేశ్వర మహాదేవుని అమృత పడ్డకు-ఒడ్డుం గట్టు చెన్నుపాడ గ్రామద్వయం ఆచంద్రార్కస్థాయిగా తీరనది మాకేటి కూడలి సంగమంలో ధారాదత్తము చేసి సమర్పిస్తిమి"

(2) సముద్రపశ్చిమతటే నారదేన ప్రతిష్ఠితం ।
శ్రీ నృసింహాలయం దృష్ట్వాపునర్జన్మ నవిద్యతే ॥
మణికా త్రికూట మధ్యే రామచంద్రేణ నిర్మితం ।
పర్ణశాల ఇతిఖ్యాతా నరసింహస్య శాసనం ॥

ఈ మాకేఱు (మన్నేఱు) ఉదయగిరి తాలూకాలోని వెలగొండలలో చంద్రశేఖరపురము సమీపమున పుట్టి కనిగిరి, ఉదయగిరి, కావలితాలూకాలలో నుండి ప్రవహించి, ఈశాన్యమూలగా కందుకూరు తాలూకాగుండా పోయి, ఆ తాలూకాలో బింగినిపల్లె సమీపమున తూర్పు సముద్రముతో గలియుచున్నది.

**N. I. Kandukur (10), (77)**

## మానవదుర్గము

నందితిమ్మన పారిజాతాపహరణ కావ్యములోను, తిరుమలాంబ సంస్కృత వరదాంబికా పరిణయ కావ్యములోను తుళువ ఈశ్వర నరసింహరాయలు మానవదుర్గసీమను గెల్చినట్లు వర్ణింపబడినవి.

పారిజాతాపహరణ కావ్యములో నరసింహరాయలు దిగ్విజయము లిట్లు వర్ణింపబడినవి.

సీ. కుంతలేశ్వరుడు సిక్కువడంగ విద్యాపు
రంబుగైకొని నిజప్రౌఢి నెరపె,
పారసీకునకు దుర్భరమానవత్వంబు
దొలగించె మానవదుర్గసీమ
చోళవల్లభులకు సురవధూ మధురాధ
రములిచ్చి మధురాపురంబుగొనియె
శ్రీరంగపట్టణసీమ ఖడ్గనటీ వి
నోదంబు హేయసేంద్రునకుజూపె

గీ. నతడు నుతికెక్కె రామసేత్వంతరాళ
కలిత షోడశ దాన విఖ్యాతయశుడు
మండలీకర మేఘ మార్తాండ బిరుదు
డీశ్వరాధిపు నరస పృథ్వీశ్వరుండు.

తిరుమలాంబ వరదాంబికా పరిణయములో నరసరాయలు మానవదుర్గమును బట్టుకొని అ దుర్గాధిపతి యగు సుల్తాను శరణాగతుడు కాగా దుర్గము నతనికి వదలిపెట్టబడెనని వర్ణింపబడినది.

"కాంభోజ బహ్లీక మఖ్ఖా తుఖ్ఖార ఖంఖాణ తురగరింఖా సంవృతస్థపుటిత ధరణీతలో పిసురత్రాణః ప్రాణత్రాణపరాయణో దుర్గమం మానవదుర్గం తత్క్షణమధ్యరుహత్॥

ఇయ్యది రాయచూరు మండలములోని మాన్వీ తాలూకాకు ప్రధాన నగరము.

**Imperial Gazetteer - Hyderabad. Gulbarga Division - Raichur Dt. Manvi Town. P. 39.**

### మారటనాడు

పదమూడవ శతాబ్దము నాటి శ్రీశైలశాసనములో నుదాహరింపబడిన నాడులలో నొకటి.

మారటనాంటిలోన-గోణంగనూరు ౧, ఇందుల వాయస్థలాన మహాదేవపురంబు, బడిసెపల్లి. ఈ గోణంగనూరు, మహాదేవపురములు కర్నూలు మండలములోని గొడిగనూరు, సిరివెళ్ళ తాలూకా యందలి మహాదేవపురమను గ్రామములు కావున మారటనాడా గ్రామప్రాంతభూమి యని చెప్పవచ్చును.

S. I. I. Vol X. No 504.

### మింగలనాడు

శ్రీశైలములోని శాసనములలో నొకదానియందు పేర్కొనబడినది. ఆ శాసనములో నుదాహరింపబడిన పెక్కునాడులలో నిది యొకటి.

మింగలనాంటిలోన గూడూరు మామిడి దరిపల్లి వెర్కి-8

గూడూరు, మామిడి గ్రామము నెల్లూరు మండలములో గూడూరు తాలూకాయందు గలవు. దరిపల్లి యా తాలూకా గ్రామనామముల పట్టిక యందు గానరాదు.

| | | |
|---|---|---|
| గూడూరు | గూడూరు | గూడూరుతాలూకా |
| మామిడి | మోమిడి | ,, |

S. I. I. Vol X. No. 504 (శక. 1285)

### ముండరాష్ట్రము

ముండనాడు, లేక ముండరాష్ట్రము నెల్లూరు మండలము నుత్తర భాగమునమున్న ప్రాచీనదేశ విభాగములలో నొకటి.

ముండరాష్ట్రము పల్లవరాజుల సంస్కృత శాసనములలోని నెల్లూరు, కోవూరు, ఆత్మకూరు తాలూకాలలోని కొన్ని తమిళ శాసనములలోను పేర్కొనబడినది.

(1) సింహవర్మ పికిర శాసనము—పికిర.

(2) విష్ణుగోపుని ఉరువపల్లి శాసనము.

ఉరువపల్లి, కెందుకూర, కరుపూర, కొండమురువుడు.

(3) రెండవ సింహవర్మ బుచ్చిరెడ్డిపాలెము శాసనము

విడువట్టి గ్రామము.

(4) నరసింహవర్మ తామ్రశాసనము.

పరమమహేశ్వర పరమబ్రహ్మణ్య బప్పభట్టారక పాదభక్త శ్రీనరసింహ వర్మాణః బేల్మణ్ణరాష్ట్రే అసిధారా పుర స్యోత్తరే రేయూరు నామగ్రామమ్॥

(5) నెల్లూరు మండలములోని తమిళ శాసనములు

నెల్లూరు (6) ముండైనాటిలోని మావండికుండై.

(19) కంఠనారాయణ పురమను కుళోత్తుంగ చోళపురము.

(31) ముండనాటిలోని కొడవలూరు.

(72) ముండునాటిలోని తామరైమడువు.

(121) నెల్లూరినాటిలోని వేలూరు.

(6) గుంటూరు మండలములోని బాపట్లలోని భావనారాయణస్వామి దేవాలయములోని శాసనములో ముణ్డనాణ్టిలోని వెలకలూరి బాదిరెడ్డి కొడుకు కేతమరెడ్డి యని వెలకలూరను గ్రామము పేర్కొనబడినది.

| | | | |
|---|---|---|---|
| పికిర | పికిర | వెంకటగిరి | తాలూకా |
| ఉరువపల్లి | ఉలపాళ్ళ | ఆత్మకూరు | ,, |
| కెందుకూర | గొల్లికందుకూరు | నెల్లూరు | ,, |
| కరుపూర | కనుపూరు | ,, | ,, |
| కొండమురువుడు | కొండమీది కొండూరు | ఆత్మకూరు | ,, |
| విడువట్టుగ్రామము | విడవలూరు | కోవూరు | ,, |
| రేయూరు | రేవూరు | ఆత్మకూరు | ,, |
| మావండికుండై | మేడికుంట | కోవూరు | ,, |

| | | | |
|---|---|---|---|
| కంఠనారాయణ పురము | గండవరము | కోవూరు తాలూకా | |
| కొండవలూరు | కొండవలూరు | ,, | ,, |
| తామరైమడువు | దామరమడుగు | కొవ్వూరు | ,, |
| వేలూరు | వేగూరు | ,, | ,, |

ఉరువుపల్లి శాసనములో ఆ గ్రామ సరిహద్దులు పేర్కొనబడి నపుడు "ఏతస్మిన్ గ్రామసీమే ద్విశతం సీమవర్తనాని ఏతేషాం నివర్తనానాం అవధయః దక్షిణాందిశి సుప్రయోగనదీ అవధిః" అని ఉరువుపల్లెకు దక్షిణమున సుప్రయోగనది కలదని చెప్పబడినది. ఈ సుప్రయోగయే పెన్నానది యని చరిత్ర పరిశోధకుల నిశ్చయము (చూడుడు-సుప్రయోగ)

ఈ ముండ రాష్ట్రము రెండు భాగములుగ విభజింపబడినట్లు పై శాసనములే ప్రమాణము. అందొకటి ముండరాష్ట్రము. రెండవది మేల్ముండ రాష్ట్రము. ముండరాష్ట్రము పెన్ననది కుత్తరమున కోవూరు తాలూకా ప్రాంతమును, మేల్ముండ రాష్ట్రము దానికి పశ్చిమముననున్న ఆత్మకూరు తాలూకా ప్రాంతమునునై యుండెను.

శ్రీ సోమశేఖరశర్మగారు ముండరాష్ట్రమున కా పేరు ప్రాచీన కాలమున ముండులను జాతివారి కావాసమైనందున, ఈ దేశవిభాగమున కా నామము సిద్ధించి యుండెనని వ్రాసియున్నారు.

(1) పికిర శాసనము E. I. Vol VIII. P. 159.

(2) బుచ్చిరెడ్డిపాలెము శాసనము. (శ్రీ సోమశేఖరశర్మగారు ప్రచురించినది) J.N.M.U. Vol XII. అదియే విలవట్టి శాసనమని E I. Vol XXIV No. 48.లో ప్రకటించబడినది.

(3) ఉరువుపల్లి శాసనము I. A. Vol V. Feb. 1876.

(4) శ్రీ ప్రభాకరశాస్త్రిగారు ప్రచురించినది. Journal of Sri Venkateshwara Oriental Institute Vol VIII. No. 2.

(5) బాపట్ల శాసనము. S. I. I. Vol VI. No. 173.

(6) Ancient Political Geography of South India by Venkatramiah. Journal of Oriental Research Vol XII Xart IV.

## ముదిగొండ

ఈ గ్రామము కాజీపేటకు పడమరదిశను మైలున్నర దూరమున నున్నది. ఇక్కడ కాకతీయుల కాలమునాటి దేవాలయములు గలవు. ఈ యూరికి ఉత్తరమున మెట్టుగుట్టగలదు. దానినే హిడింబాశ్రమమనిపిలిచెదరు. ఈ ముదిగొండ గ్రామ నామముతో నొకశాఖ చాళుక్యులు మంచికొండ విషయము నేలిరి. వీరి వంశములోని నాల్గవ కుసుమాయుధుని శాసనములో వీరిట్లు పేర్కొనబడిరి.

"స్వస్తిశ్రీమతాం సకలభువన సంస్తూయమానవ్యాస గోత్రాణామ్ హారితి పుత్రాణామ్ కౌశికవరప్రసాద లబ్ధ రాజ్యానాం మాతృగణ పరిపాలితానం స్వామిమహాసేన పాదానుధ్యాతానాం భగవన్నారాయణ ప్రసాద సమాపాదిత వర వరాహలాంఛనేక్షణ దశీకృతారాతి మండలానాం అశ్వమేధావభృత పవిత్రకృతవపుషాం మదుగొణ్డ చాలుక్యానాం, కులాలంకరిష్ణు మదుగొణ్డ చాలూక్యానాం, కులాలంకరిష్ణు ముదుగొణ్డరు వాస్తవ్యః కోకిరాజానుజః........

ఈ వంశమువారు తెలంగాణము రాష్ట్రకూటుల వశముననున్నపుడు వర్ధిల్లిన సామంతమండలేశ్వరులు. వీరిలో కడపటివాడు నాల్గవ కుసుమాయుధుడు.

Indian Antiquary July 1903. Grant of Kusumayudha IV. (11th century A. D.)

## ములికినాడు

గౌతమీపుత్ర శాతకర్ణి నాశిక శాసనములో నతడు జయించిన దేశములలో ములకదేశము పేర్కొనబడినది. ఈ ములకదేశమే క్రమక్రమముగా చిన్నదై, ఇప్పటి ములకనాడైనదని కొందఱు చరిత్రకారు లభిప్రాయపడిరి. కాని నాశిక శాసనములో పేర్కొనబడిన ములకదేశము వేరు. ఈ ములకనాడు వేరు.

రాష్ట్రకూట రాజైన మూడవ కన్నరదేవుని కడపమండలములోని పుష్పగిరిలోని యొక కన్నడశాసనములో నతడు పాన్నవాడిలోని ములుకినాడు ఏలుచున్నట్లు వ్రాయబడినది. (1)

అదే మండలములోని కామలాపురము తాలూకాలోని చిలంకూరులోని మహామండలేశ్వర త్రైలోక్య మల్లిదేవుని కన్నడశాసనములో నతడు ములుకి మూనూఱు ఏలుచున్నట్లు చెప్పబడినది. (2)

అదే మండలములోని కడపతాలూకా చింతల పుట్టూరులోని సిద్ధనదేవ మహారాజు యొక్క కన్నడశాసనములో ములుకినాటిలోని కోడూరు గ్రామము పేర్కొనబడినది. (3)

రాజంపేటతాలూకా అత్తణలలోని యొక తెలుగు శాసనములో అంदేవమహారాజు వల్లూరి పట్టణము రాజధానిగా ఖండిక్కోట, ములికినాడు, రేనాండు, పెండెకల్లు, సకలి, యొఱువ పొత్తపినాడులోను గల సకలదేశముల పాలించుచుండెనని వ్రాయబడినది. (4)

విజయనగర రాజప్రతినిధియైన రెండవసంగముని బిట్రగుంట శాసనములో ములికిదేశము యొక్క ఎల్లలు వివరింపబడినవి. ములికిదేశములో పుష్పాచలమను దేవళమున్నదనియు, దాని కుత్తరదిశనున్న పెన్నానది కుత్తరతటమున సింకేసరియను గ్రామమున్నదనియు లిఖింపబడెను. (5)

దేశోభూన్మ్ములికి ప్రథామధిగతః స్తత్రాస్తి పుష్పాచలో
నామస్థాన మనుత్తమం పురరిపో స్త స్యోత్తరస్యాందిశి
పెన్నాయాః స్ఫుట ఉత్తరత్రచ తటేసిం కేసరీ తిశ్రుతం గ్రామః।

శ్రీశైల శాసనములో ముల్కినాటిలోని రాజవోలు, మల్లయవేములు, పెరశాపాడు అను మూడు గ్రామము లుదాహరింపబడెను. (6)

శ్రీకృష్ణదేవరాయల పుష్పగిరిలోని యొక కన్నడశాసనములోనతడు ములుకినాటి సీమలోని చెన్నూరి సీమ గ్రామములలోని చికమాంచుపల్లి గ్రామమును పుష్పగిరి చెన్నకేశవదేవరకు దానమిచ్చెనని గలదు. (7)

ప్రొద్దుటూరు తాలూకా ఉప్పరపల్లి శాసనములో కాకతీయ ప్రతాప రుద్ర రాజు గండికోట సీమకును, ములికినాటి దేశమునకును దనకుమారుని జుట్టయలెంక గొంక రెడ్డిని నధిపతిని గావించెనని వ్రాయబడియున్నది. (8)

క్రీడాభిరామ కృతికర్త వినుకొండ వల్లభామాత్యుడు ముల్కినాటి లోని మోపూరు పాలించినట్లు చెప్పుకొన్నాడు. ఆ మోపూరులోని భైరవ స్వామిని ప్రశంసించెను.

సీ. మూడుగ్రామ గ్రాసములతోడ గూడంగ
మోపూరు పాలించె ముల్కినాట.

ప్రబంధ రత్నావళిలో వల్లభరాయని వీథినాటకములోనిదని యొక చాటుపద్యములో ములికినాటి మోపూర భైరవుని వర్తనము గలదు.

గీ. సిగ్గుమాలిన మొలవాని జిఱుతవాని
నెల్లకాలంబు ములికినాడేలువాని
నర్థి మోపూర నవతార మైన వాని
భైరవుని గొల్వవచ్చిరి భక్తవరులు.

| | | |
|---|---|---|
| కోడూరు | కోడూరు | కడప తాలూకా |
| చెనూరు | చెన్నూరు | ,, |
| వల్లూరు | వల్లూరు | ,, |
| చికమంచుపల్లి | చివమాచుపల్లె | ,, |
| పుష్పగిరి | పుష్పగిరి | ,, |
| మోపూరు | మోపూరు | పులివెండ్ల తాలూకా |
| సింకేసరి | సుంకేశుల | ,, |

ములికినాడు కడపమండలములో నంతర్భాగము.

(1) S. I. Vol IX. Part I. No. 69. (పదునొకండవ శతాబ్దము)
(2) ,, No. 227. (క్రీ. శ. 1132)
(3) ,, No. 275. (క్రీ. శ. 1182)
(4) S I. I. Vol X. No. 448. (క్రీ. శ. 1279)
(5) E. I. Vol III. P. 24.
(6) S. I. I. Vol X. No. 504. (క్రీ. శ. .313)
(7) S. I. I. Vol IX. Part II No. 494-495. (క్రీ. శ. 1514)
(8) S. I. I. Vol X. No. 536.

## ముశి

నెల్లూరు మండలములో నొక యేరు. వెలిగొండలలో డొక్కలశాల సమీపమున పుట్టి తూర్పు దిక్కుగాను, దక్షిణ దిక్కుగాను ప్రవహించి పొదిలి, దర్శి తాలూకా. కందుకూరు తాలూకాల గుండా పారి, ఒంగోలు తాలూకా నుండి అనంతవరము గ్రామము వద్ద తూర్పు సముద్రమును గలియుచున్నది. దీనికే మూషకనది యని శాసనములందు సంస్కృత నామము గల్పింప బడినది. (మాడుడు-మూషక నది)

## మూడనాడు

ఈ మూడనాడు నేటి కర్నూలు, అనంతపురము మండలముల పశ్చిమ ప్రాంతము. ఇయ్యది పదునారవ శతాబ్దము నాటి కన్నడశాసనములలో పేర్కొనబడినది.

(1) మూడనాటిలోని ఆదవానివశితము నందలి హాస్తినావతి.

(2) మూడనాటిలోలి హాస్తినావతివశిత మందలి రాయదుర్గ వెంఠలోని ఉరవకొండ సీమ.

ఆదవాని కర్నూలు మండలములోనిది. రాయదుర్గము, ఉరవకొండ అనంతపురము మండలము లోనివి.

(1) S. I. I. Vol IX. Part II. No. 604 (S 1465)
(2) ,, ,, ,, No. 652 (S 1476)

## మూసి (నది)

ఇది అనంతగిరి కొండలలో శివారెడ్డిపేట దగ్గఱ పుట్టి తూర్పుగా 112 మైళ్ళు ప్రవహించి, హైదరాబాదు పట్టణ మధ్యమున సాగి, నల్గొండజిల్లాలో వాయవ్య దిశనుండి ప్రవేశించి, తూర్పున 40' మైళ్ళు ప్రవహించిన తర్వాత ఆలేరు నదిని కలుపుకొని ఆగ్నేయ దిశగా పారి వాడపల్లి దగ్గఱ కృష్ణానదిలో గలియుచున్నది.

కృష్ణా మూసీనదుల సంగమస్థల స్కంధావారమునుండి రెండవ గోవింద రాజు వ్రాయించిన తామ్రశాసనములో మూసినది పేర్కొనబడినది.

"ప్రభూతవర్ష విక్రమావలోక శ్రీగోవిందరాజో
యువరాజః వేంగీమండలోపర్యాయాత
విజయస్కంధావారే.... వేంగీశే కృష్ణవేణ్ణ
మునీ సంగమే...సర్వానామ స్త్రయతిస్మ"

Alas Plates of Govinda II.
E. I. Vol VI. No. 18 (శస. 692)
(మూసీనదిని పేర్కొన్న అత్యంత ప్రాచీనమైన శాసనము)

## మూషకనది

ఉదయగిరి రాజ్యమునకుం జెల్లివచ్చి కందుకూరు సీమలోని మూషకనదీ తీరమందును చాంగొల్లు అని యట్టి గ్రామము. (చూడుడు-ముశి) ముశి యను తెలుగు పదమునకు సంస్కృతరూపము.

N. I. Kandukur (78) AD 1535-36. (అచ్యుతదేవరాయల కాలము)

## మెదుకు (దుర్గము-సీమ)

ఇయ్యది మెదుకు జిల్లాలోని ప్రసిద్ధమైన గిరిదుర్గము. ఈ ప్రాంతమునకే మెదుకు సీమ యని పేరు వచ్చెను.

అద్దంకి గంగాధరకవి తపతీసంవరణోపాఖ్యానములో కుతుపనమలక (Kutb Mulk) బరీదు నోడించి మెతుకు దుర్గమాక్రమించినట్లు వర్ణించి యున్నాడు.

సీ. ఉత్తరంబున బరిదోడి పారంగదోలి
మెతుకు దుర్గం బాక్రమించి మించె
.... .... .... ....

గీ. అతని బొగడంగదగదె యా చతురశీతి
రూఢి గిరి దుర్గలుంతన ప్రౌఢతేజు
వాహశిఖరాధి రోహాకేవంతమూర్తి
కుతుపషాహి నిజామపాలు గుణవిశాలు.

తపతీ సంవరణోపాఖ్యానము.

## మొట్టవాడి

మొట్టవాడి లేక మట్టెవాడలోనివని యీ క్రింది గ్రామములు ప్రాచీనాంధ్ర కన్నడశాసనములందు పేర్కొనబడినవి.

| | | | |
|---|---|---|---|
| (1) | కవలకుంట్ట | కవులకుంట్ల | మార్కాపురము తాలూకా |
| (2) | రాచకొండ | రాచకొండ | ,, |
| (3) | శతకోటిచిన్నానిపల్లి | శతకోడు జమ్మనపల్లి | ,, |
| (4) | ముట్టువలు | ముటుకుల | ,, |
| (5) | కంభముపాడు | కంభంపాడు | ,, |
| (6) | మ్రానపల్లి | మాదేపల్లి | ,, |
| (7) | నడివాలమేడపి | మేడపి | ,, |
| (8) | మరియంపాడు | మరియంపల్లె | ,, |
| (9) | పుత్తిలపటు | పుర్ల లచెరువు | ,, |
| (10) | దువ్వలి | దువ్వలి | ,, |
| (11) | త్రిపురాంతకము | త్రిపురాంతము | ,, |
| (12) | పల్కూరు | పల్కూరు | బనగానిపల్లె ,, |
| (13) | పులచెఱ్వు | పుల్ల లచెఱువు | మార్కాపురము తాలూకా |
| (14) | చాపలమడుగె | చాపలమడుగు | ,, |

కొణిదెన గ్రామములోని చెన్నకేశవస్వామి యాలయములో నొక ఱాతిమీద చెక్కబడియున్న పద్యశాసనములో మొట్టవాడి పేర్కొనబడినది 15.

సీ. దినకరకులుడైన త్రిభువన మల్లండు
కమ్మనాండును గుండికఱ్ఱ మొట్ట
వాడియుం జేకొని రూఢిగానేలంగ
గొట్టియదొన యను పట్టణమున

పై గ్రామముల యునికిని బట్టి మొట్టవాడి నేటి మార్కాపురం తాలూకాలో గొంత భాగమునై యుండెనని తలంపవచ్చును.

S I. I. Vol IX. Part No. 204 (AD 1122) 1 to 10
,, VI No. 128 (AD 1159) (11)
,, X. No. 62 (AD 1106) (12)
,, X. No. 346 (AD 1177) (13)
,, IX. No. 212 (AD 1126) (14)
,, VI. No. 644 (AD 1150) (15)

## మొరసునాడు (రాజ్యము)

మొరసునాడు మైసూరు రాష్ట్రములోని కోలారు మండలమునందలి ముల్బగల్, కోలారు తాలూకా ప్రాంతము. మద్రాసు రాష్ట్రములోని ఉత్తర ఆర్కాటుమండలమున కుత్తరమున మైసూరు రాష్ట్రమునంటుకొని యున్న భూభాగమని చరిత్రకారుల నిర్ణయము (1)

మొరసునాడు శ్రీనాథుని చాటువులలో నొక పద్యమందు వర్ణింప బడినది. (2)

ఉ. వంకరపాగలున్ నడుమువంగిన కత్తులు మైలకోకలున్
సంకటిముద్దలున్ జనుపశాకములున్ బలుపచ్చడంబులున్
తెంకగు నోరచూపులును తేకువ దప్పిన యేసబాసలున్
రంకుల బ్రహ్మ యీ మొరసరాజ్యము నెట్లు సృజించెనక్కటా॥

(1) Further Sources of Vijayanagar History P. 319.
(2) చాటుపద్యమణి మంజరి.

## మోటుపల్లి

రెడ్డి, కాకతీయ, విజయనగర సామ్రాజ్యాధీశుల కాలమున విఖ్యాతి గాంచిన నేటి గుంటూరుమండలములోని బాపట్ల తాలూకా యందలి సముద్ర తీరముననున్న రేవు స్థలము. దీనికి వేలానగరమనియు దేశ్యాయ కొండపట్టణ మనియు నామాంతరములు. ఇచ్చట అనపోతారెడ్డి, గణపతిదేవుడు, దేవరాజ యొడయలు వ్రాయించిన తెలుగు, అరవశాసనములు గలవు. కాకతిరుద్రాంబ కాలమున మార్కోపోలోయను విదేశ యాత్రికుడు ఆంధ్రప్రదేశమును పర్యటించి యీ రేవును ప్రశంసించియున్నాడు.

ఎఱ్ఱాప్రెగడ హరివంశ కావ్యములో రెడ్డిరాజ్య స్థాపకుడగు ప్రోలయ వేమారెడ్డి సోదరుడగు మల్లారెడ్డి యీ రేవుపట్టణమును స్వాధీనపఱచుకొనెనని యీ విధమున వర్ణించియున్నాడు.

> శా బాహాదర్పమునం బ్రతిపధరణీ పాలావళిం ద్రోలి యు
> త్సాహోదగ్రుడు మోటుపల్లి గొని సప్తద్వీప సద్వస్తుసం
> దోహంబున్ దనకిచ్చు నెచ్చెలి సముద్రుం బ్రీతి గావించుచున్.
> మాహాత్మ్యంబు వహించె మల్లరథినీ నాథుండు గాఢోద్ధతిన్.

(1) అనపోతారెడ్డి తెలుగు తమిళ శాసనములు. (శ. స. 1280)
(2) కాకతి గణపతిదేవుని తెలుగుశాసనము. (శ. స. 1166)
(3) దేవరాజ యొడయల తెలుగుశాసనము. (శ. స. 1312)

(1) Paras 45 and 61 of M. E. R. 1909-1910. Commercial Charters of Kakatiyas and Reddis

(2) భావరాజు వెంకటకృష్ణారావు - ప్రాచీనాంధ్ర నౌకా జీవనము.

(3) ఆంధ్రుల చరిత్రము-ఐదవ సంపుటము-చిలుకూరి వీరభద్రరావు పుట 437.

## రంభ

ఇది రంప యనెడి తూర్పుగోదావరి మండలమునందలి చోడవరము తాలూకాలోని మన్య ప్రాంతమునందలి యొక ప్రాచీన గిరిదుర్గము. అల్లాడ

రెడ్డి విజయములు వర్ణించుపట్టున శ్రీనాథుడు దీనికి రంభయని పేరిడెను. నాగవంశపు రాజులకు రాజధాని.

సీ. ...... ...... ...... ...... ...... ......

...... ...... ...... ...... ...... ......

దండకారణ్య మధ్య పుళిందరాజ రం

భాహివంశజులకు నభయమొసగి——

శ్రీనాథుని భీమేశ్వరపురాణము ప్ర. ఆ. ప 68.

శివలీలా విలాసములో నిశ్శంక కొమ్మన దీనిని రంప యనియే పేర్కొనెను.

సీ. రంప యిమ్మడిరాజు సొంపు మానెన్నిక ........

ఇప్పటికిని చోడవరమును రంపచోడవరమని వ్యవహరింతురు.

**రమణా (రామన్న దేశము)**

శ్రీనాథుని హరవిలాసములోని అవచి తిప్పయశెట్టి వర్తక వ్యాపార వర్ణనములోగల ఈ పద్యము ప్రసిద్ధము.

మ. తరుణాసీరి, తవాయి, గోవ, రమణా,

స్థానంబులం జందనా

గరు కర్పూర హిమాంబు కుంకుమ రజః

కస్తూరికా ద్రవ్యముల్

శరధిన్ గప్పలి జోగువల్లి వలికా

సమ్మానల్ దెప్పించు నే

ర్పరియై వైశ్యకులో త్తముండవచి తి

ప్పం డల్పుడే యిమ్మహిన్.

ఇందు పేర్కొనబడిన రమణాదేశము నేటి బర్మాదేశములోని సాల్వీన్ సిట్టాంగునదుల మధ్యనున్న భూభాగమని చరిత్రపరిశోధకులయభిప్రాయము(1)

(1) Indian Antiquary Vol XXI. Notes on the Archaeological tour through Ramannadesa (Talaing Country of Burma)

(2) Indian Antiquary Vol XXIII. P. 100 Some remarks on Kalyani Inscriptions-Ramannadesa.

## రాచకొండ

ఈ రాచకొండ ఆంధ్రప్రదేశములోని నల్లగొండమండలములోని హైదరాబాదునకు తూర్పుగా ముప్పదిరెండుమైళ్ళ దూరముననూ, భువనగిరికి దక్షిణమున ముప్పదిమైళ్ళ దూరముననూ, దేవరకొండకు వాయవ్యదిక్కున ముప్పదిమైళ్ళ దూరమున నున్నది. దీనికి చుట్టును చక్రవాళపర్వతమువలె బర్వత దుర్గము కలదు. దీనికి మొదటి దుర్గమైన పర్వతము ప్రవేశించుటకు నసాధ్యము గావున అచ్చటచ్చట ప్రవేశోచితములగు ద్వారములు గట్టబడినవి. తూర్పు ద్వారమునకు మట్టిపాషదర్వాజా యనియు, దక్షిణద్వారమునకు భైరవునిగండి యనియు, పడమటిద్వారమున కేనుగులదర్వాజా యనియు, నుత్తరద్వారమునకు భువనగిరిగండి యనియు పేర్లు. ఆ పత్తనమధ్యభాగమున నెత్తైన రెండు కొండలు గలవు. ఒకదానికి రాచకొండ యనియు, రెండవ దానికి నాగాయనికొండ యనియు పేర్లు.

దీనికి రాజాచలమనియు రాజగిరియనియు పేర్లు. వెలుగోటి వెలమ రాజన్యులకు కులక్రమాగత రాజధాని. తెనుగుదేశమునందలి సుప్రసిద్ధగిరి దుర్గములలో నిది యొకటి.

వెలుగోటివారి వంశ చరిత్రము. పుట 41.

## రాజమహేంద్రవరము (దుర్గము, పురము)

రాజమహేంద్రవరము ఆంధ్రదేశములోని ప్రాచీన స్థలదుర్గములలో నొకటి. ఈ స్థలదుర్గము పూర్వ చాళుక్యులలో రాజమహేంద్ర బిరుదాంచితు లగు మొదటి అమ్మరాజు (క్రి. శ. 921-946) లేక రెండవ అమ్మరాజు (క్రి. శ. 945-970) కాలములోగాని నిర్మింపబడి యుండవచ్చునని చరిత్ర పరిశోధకుల యభిప్రాయము.

రాజమహేంద్రవరము తూర్పుగోదావరి మండలములో గోదావరి కుత్తరతీరముననున్న నగరము. తూర్పు చాళుక్య ప్రభులకు రాజధాని. రాజ రాజిచ్చటనే పట్టాభిషిక్తుడై తన కులబ్రాహ్మణుడైన నన్నయభట్టును నియోగించెను.

నన్నయ శ్రీమదాంధ్రభారతము ఆదిపర్వము ప్రథమాశ్వాసములో రాజమహేంద్రపురమును గూర్చి యిట్లు వర్ణించెను

"అఖిల జలధివేలావలయ వలయిత వసుమతీ వనితా విభూషణంబైన వేంగీదేశంబునకు నాయకరత్నంబునుం బోని రాజమహేంద్రపురంబునందు"

శ్రీనాథుడు భీమేశ్వరపురాణములో రాజమహేంద్రవర రెడ్డిరాజులకు రాజధానియైన రాజమహేంద్రవరమును గూర్చి యిటు వర్ణించెను.

"అల్లాడ భూవల్లభుండు రాజమహేంద్రంబు రాజధానిగా సింహాద్రి పర్యంతం బుత్కళ, కళింగ, యవన, కర్ణాట, లాటాంతర్ద్వీపంబైన.... విశ్వ విశ్వంభరా భువనమండలంబు"....

భీమేశ్వరపురాణము ఆ. 1. ప. 32.

సీ. కమలా చలాగ్ర మార్కండేయ శివశిర
స్శశిచంద్రికా ధౌతసౌధవీథి
గోదావరీపుణ్య కూలంకషా జల
స్ఫాలిత శ్రీరుద్రపాదయుగళి
బలవదభ్యున్నత ప్రాకార పరివేశ
గండూషితా జాండమండలంబు
గంధ దంతావళ గ్రైవేయఘంటికా
ఠంకార ముఖరఘంటాపథంబు

తే. రాజబింబాననా మాత్న రత్న పేటి
వీరరావుత్త సుభట కంఠీరవాద్రి
వేమభూపాల రాజ్యాభివృద్ధికరము
సాంద్రవిభవంబు రాజమహేంద్రవరము.

భీమేశ్వర పురాణము. ఆ. 1. ప. 43.

భీమేశ్వరపురాణములో ప్రథమాశ్వాసము నందె రాజమహేంద్రవరమును "రాజమహేంద్ర దుర్గము"గా జెప్పియున్నాడు.

విన్నకోట పెద్దన్న కావ్యాలంకార చూడామణిలో బురవర్ణనమున కుదాహరణముగ రాజమహేంద్రవరము నీ క్రింది పద్యములో వర్ణించి యున్నాడు.

సీ. గంభీర పరిఖ నాగస్త్రీల కశ్రాంత
కేళీ విహారదీర్ఘిక యనంగ
నుత్తాలసాల మన్మ్యులకువ్వి దివి ప్రాక
జేసిన దీర్ఘనిశ్రేణి యనగ
జతురచాతుర్వర్ణ్య సంఘమర్థులపాలి
రాజిత కల్పకా రామమనగ
బ్రాంత సుస్థితమైన భవజూట వాహిని
భుక్తి ముక్తి ప్రదసూత్రియనగ
గీ. నెప్పుడును నొప్పు రాజమహేంద్రవరము
ధరణి గల్పించె నేరాజు తనదుపేర
నట్టి రాజమహేంద్రుని యనుగు మనుమ
డెనగు జాళుక్య విశ్వనరేశ్వరుండు.

నిశ్శంక కొమ్మనయు శివలీలావిలాసములో రాజమహేంద్రవరమును వర్ణించియున్నాడు. అనవేమారెడ్డి శ్రీశైలశాసనములో నతడు రాజమహేంద్ర నిరవద్యనగరాది బహువిధ స్థలదుర్గవర్గ విదళన బలరాముడని ప్రశంసింపబడినాడు. (1)

కాకతీయుల కాలమున ఓరుగంటి తూర్పుగవని మొదలుగా సింహాద్రి సీమ మధ్య భూమిలో రాజమహేంద్రవర దుర్గము ఇందులూరి అన్నయ్య మేనమరదియైన పర్వతమల్లు నధీనమున నుండెనని శివయోగ సారపీఠికలోని యీ క్రింది పద్యమువల్ల వ్యక్తమగుచున్నది. (2)

సీ. వేగిధరిత్రిలో విలసిల్లు నెడ తూర
వరమునా దనపురముజేసి
కొలనిపీడాదిగాగల నిజభూముల
భద్రుని గన్నయ రుద్రునునిచి
రాజమహేంద్ర దుర్గమ్మున దన మేన
మరదియౌ పర్వతమల్లు నునిచి
మనుమగన్నయ్య జామాత యాతేవన
చిరతరంబుగ నోలచెర్ల నిలిపి

గీ. మరియు నూజెర్ల కంచెర్ల మంగిరాజు
జ్ఞాతినా నుంగిరాజును సరసగూర్చి
రాజునట గన్న దేవ భూరమణచంద్రుదు
నా పునిగ నిల్పె నిందులూ రన్నవిభుడు.

గజపతుల కాలమున నియ్యది రాజమహేంద్రవర దండపాట 21 స్థలాలు గల సీమయయ్యెను. (3)

"శ్రీ వీరముకుంద్ద దేవు మహారాజులుంగారు గౌడసాధించ్చి గౌడేశ్వరునికి అభయహస్త మిచ్చి.... కటకసింహాసనాశీనులై విజయ శుభ రాజ్యము చేయుచునుండ్డి రాజమహేంద్రవరపు దండ్డపాట ౨౧ స్థలాల బలింజపెక్కండ్రు మొదలైన నానాపాటకాల ప్రజలకున్ను........"

కపిలేశ్వర గజపతి సామంతుడగు రఘుదేవుని రాజమహేంద్రవర తామ్రశాసనములో నతడు రాజమహేంద్రవరము రాజధానిగ సింహాచల గిరివ్రజ మధ్యదేశమును పాలించుచుండెనని గలదు. (4)

తిష్ఠన్ రాజమహేంద్ర నామనగరే సమ్యక్ప్రజాః ప్పాలయన్
ఆ సింహాచలమాగిరి వ్రజమిమాం భూమింతథాకంటకాం ॥
వీర శ్రీ కపిలేశ్వరస్య కృపయా కుర్వన్ కుమారాగ్రణీః
ధర శ్రీ రఘుదేవరాజ తనయః శ్రీ శ్రప్రియోవర్ధతే ॥

(1) S. I. I. Vol X. No. 559. (శ. స. 1299)
(2) శివయోగసార పీఠిక. (కాకతీయ సంచికానుబంధము)
(3) S. I. I. Vol X. No. 739. (శ. స. 1488)
(4) E.I. Vol XXXIII. No. 1. Two grants of Raghudeva (శ. స. 1378)

History of Rajahmundry by Chilukuri Veerabhadra Rao and by Bh.. V. Krishna Rao A. H. R. S. Journal Vol III. Part 2, 3, 4 and Vol IV. Part 1-2.

**రాపూరిసీమ**

నెల్లూరిమండలములో రాపూరు తాలూకాకు ప్రధాననగరము. నెల్లూరుమండల శాసన సంపుటములలో పేర్కొనబడినది.

(1) కొండమరుసయ్య వారు ఉదయగిరిం బాలించ్చిన రాపూరి సీమలోని నిఅయనిడి మానపొలము. (నెర్నూరు)

(2) ఉదయగిరి రాజ్యం, నెల్లూరివణితంలోను రాపూరి సీమలోను పెనుబఋతి ప్రతి నామమ నేటి కృష్ణరాయ సముద్రమనే సర్వ మాన్య అగ్రహారము. (పెనుబర్తి)

పై రెండు గ్రామములు రాపూరుతాలూకాలో గలవు. రాపూరుసీమ నేటి రాపూరు తాలూకా ప్రాంతము.

**N. I. Rapur** (46); (49)

**రాయచూరు**

పూర్వము తెలంగాణాలోని రాయచూరు జిల్లాకు ముఖ్య పట్టణము. ఇప్పుడీ ప్రాంతము మైసూరు రాష్ట్రములో కలసిపోయినది. శ్రీకృష్ణదేవ రాయలు జయించిన సుప్రసిద్ధ దుర్గములలో నొకటి. కృష్ణరాయ విజయము, రాయవాచకములందు పేర్కొనబడినది.

అలంపురములోని రెండు కన్నడ శాసనములందును, తంజావూరు మండలములోని తిరుక్కడియూరు గ్రామములోని అమృతఘటేశ్వర దేవాల యములోని రెండు తమిళ పద్యములలోను రాయచూరు రాయలు సాధించె నని చెప్పబడినది. ఈ మూడు శాసనములు శా.శ. 1448 వృష సంవత్సరము నకు చెందినవి. (1)

కన్నడ శాసనములలోని కొంత భాగ మీ దిగువ నుదాహరింపబడినది.

స్వస్తి శ్రీ జయాభ్యుదయ శాలివాహన శక వర్షంగళు 1448 నేయ వృష సంవత్సరద ఆషాఢ సు 12లు స్వస్తి అలంపుర వర... శ్రీ వీరప్రతాప శ్రీవీరకృష్ణరాయ మహారాయరు.... ఉత్తరాది దాచకార్యద దిగ్విజయదింద రాచూరను సాధిశి...."

ఈ రాయచూరు యుద్ధము క్రీ. శ. 17-5-1520 తేదిని జరిగినట్లు స్యూయెల్ (sewell) చరిత్రకారుడు నిర్ణయించి యుండెను. (2)

ఈ రాయచూరు యుద్ధమే రాయలు ఆముక్తమాల్యద ఆఱవ ఆశ్వాసాంత పద్యములో వర్ణించి యుండెనని, యూహింప వచ్చును. ఈ పద్యములోని "నైరామనము" (నిరుమానూరు)రాయచూరునకు సమీపమున మాన్వీనగరమున కీశాన్యమున నేడుమైళ్ళ దూరమున నున్నది.

మ, ఇది నైరామన యావనావనిధవాహీ నాభ్రచుంబిస్ఫుర
ద్విదితాఖిలమణీ గృహాళిదళనోద్వేలోగ్రహస్తివ్రజో
ద్యదనీకాగ్రగ కృష్ణరాయ మహిభృత్సంజ్ఞా స్మదాముక్తమా
ల్యద నాశ్వాసవరేణ్య మాఱవది హృద్యంబైన పద్యంబులన్.

(1) తెలంగాణా శాసనములు రెండవ సంపుటము విజయనగర శాసనములు 2-3. Para 59 of Epigraphical Report 1906-07.

(2) Forgotten Empire.

## రాయదుర్గము (సీమ)

విజయనగర సామ్రాజ్యాధీశులగు తుళువ ఆర్వీటి నరపాలకుల కన్నడాంధ్ర శాసనములం దీ రాయదుర్గసీమ పేర్కొనబడినది.

(1) రామదుర్గ సీమలోని కణియకల్లు

(2) హస్తినావతి వళితములోని, మూడవనాటిలోని రాయదుర్గ వెంతెయందలి, ఉరవకొండ సీమ యందలి రాగవహాళు

(3) రాయదుర్గ నాటిలోని ఉరవకొండ యందలి తావెరగొళ

(4) రాయదుర్గ వెంతెలోని ఉరవకొండ సీమయందలి,
ఆనదలె, నింబగలు, రాయనహాళ్ళి, కవిదేవనహాళ్ళి, సిరివర, దేవినాయకనహాళ్ళి, యరగుడి, తుంబెగనూరు, రాగనహాళు, తావరెగొళ, చికపేపలి, తిమ్మాపుర, హాటూరు, బెనకానహాళ్ళి, అంతరసనహాలు, కమళహాళు....

(5) రాయదుర్గ రాజ్యములోని వేపరాల వెంతె యందలి యెఱగుడి

(6) రాయదుర్గ సీమలోని పెట్టూరు.

పై గ్రామము లన్నియు నేటి అనంతపురము మండల మందలి పశ్చిమ ప్రాంతమైన రాయదుర్గ, గుత్తి, కళ్యాణ దుర్గము తాలూకాలయందు గలవు. విజయనగర సామ్రాజ్య కాలమున నిదియొక పెద్దసీమలలో నొకటి

(1) S. I. I. Vol IX. Part II. No. 506 (శ. స. 1438)
(2) ,, ,, ,, 652 (శ. స. 1476)
(3) ,, ,, ,, 662 (శ. స. 1478)
(4) ,, ,, ,, 663 (శ. స. 1478)
(5) ,, ,, ,, 688 (శ. స. 1505)
(6) Para 69 South India Epigraphical Report 1937-38. (శ. స. 1349)

**రాయలసీమ**

నడికింటి వేంకటపతిచే రచింపబడి, సిద్ధవటు సీమ పరిపాలకుడైన మట్ల వెంకటరామ భూపాలున కంకిత మీయబడిన అభిషిక్త రాఘవమను ప్రబంధ ములో నతని పూర్వులలో నొక్కడైన మట్ల అనంతరాజు పౌరుషవర్ణన సందర్భ మున నీ సీమ పేర్కొనబడినది

ఉ. గాయకు లశ్వరాయ బలఖానులు మట్ల యనంతరాజుకో
ఱేయకధార ద్రెవ్వరని చెప్పెడి వింతియకాక పేలుపున్
**రాయలసీమలోన** జతురంగ బలంబులతోడ వైరముల్
పాయకయున్నవారు సరిపాళెము పై చిన యట్లుజ్రమ్ముగా

నేటి దత్తమండలము లనబడు, దక్షిణాంధ్ర ప్రదేశములోని కర్నూలు, కడప, అనంతపురము, ప్రాంతములకు రాయలసీమ యను పేరు వాడుకలో నున్నది. కన్నడరాయంద్రుడు పాలించిన దేశముగావున దీనికి రాయలసీమ యని పేరు వచ్చియుండెను.

**A Catalogue of Telugu Manuscripts Vol II. No. 380. (G. O. M. L. Madras)**

**రూపవర్తనీ విషయము**

దీనికే రూప్యవతీ విషయమని నామాంతరము. దానార్ణవుని కుమారు డైన ఇంద్రవర్మ చెక్కలి శాసనములో నితడు తనతల్లి అచ్చిపోతి పుణ్యార్థ

ముగా రూప్యవతీ విషయములోని తుంగన గ్రామమును స్కందశర్మకు దానము చేసినట్లు చెప్పబడినది. ఇతనిదే యగు మరియొక శాసనములో టెక్కలి తాలూకాలోని పెల్లాడ (పైలాడ) గ్రామము రూపవర్తనీ విషయములోనిదని తెలియుచున్నది. ఈ విషయము వరహావర్తనీ విషయమున కుత్తరభాగమున నుండెనని చెప్పవచ్చును.

E. I. Vol XVIII. No. 31

## రేనాడు

నేటి రాయలసీమలోని ప్రాచీనమైన యంతర్భాగములో నెన్నిక గాంచిన నాడులలో నొకటి. ఈ రేనాటిని సూచించిన శాసనములు కర్నూలు, కడప, అనంతపురము, చిత్తూరు మండలములలో గలవు.

ఈ రేనాడు ఏఱువేల సీమగా శాసనములందు పేర్కొనబడినది.

(1) "శ్రీమత్ చోడమహారాజులు రేనాణ్డు ఏఱువేలనేల"

(2) "కరికాలాన్వయ మహారాజు ఱేనాణ్డేఱువేల"

(3) "కరికాలాన్వయ శ్రీమత్ చోడమహారాజు రేనాణ్డు ఏఱువేఱనే ఱంగా"

(4) ధనంజయుణ్డు రేనాణ్డు ఏళన

(5) "శ్రీ బైయ్యమ్బ మహారాజు రేనాణ్డు ఏళువేళు ఏళుచుణ్డి"

(6) "స్వస్తిశ్రీ చోళమహారాజాధిరాజ పరమేశ్వర విక్రమాదిత్య శక్తి కొమార విక్రమాదిత్యుల కొడుకు కాశ్యప గోత్రుణ్డు సత్యాదిత్యుణ్డు సిద్ధి వేయు రేనాండు ఏళువేల ఏలుచున్ని"

(7) రేనాటి తెలుగు చోడుల శాసనములు, వైదుంబ బాణరాజుల శాసనములనుండి ఈ క్రింది మండలముల, తాలూకాలలోగల గ్రామములు సేకరింపబడినవి.

**కడప మండలము.**

**కామలాపురము తాలూకా**

(1) చిలమకూరు
(2) ఎఱ్ఱగుడిపాలెము
(3) ఉరటూరు
(4) ఇందుకూరు
(5) వెల్లుర్తి
(6) తిప్పలూరు

**ప్రొద్దుటూరు తాలూకా**

(1) రామేశ్వరము
(2) ప్రొద్దుటూరు
(3) నల్లచెఱువుపల్లి

**పులివెండ్ల తాలూకా**

మూటుకూరు

**జమ్మలమడుగు తాలూకా**

(1) చామలూరు
(2) కోసిదెపల్లి
(3) పెద్దముడియము

**చిత్తూరు మండలము**

**మదనపల్లి తాలూకా**

చెన్నరాయనిపల్లె

**అనంతపురము మండలము**

**హిందూపురము తాలూకా**

బూడిదగెడ్డపల్లి

(8) శాసనములలో పేర్కొనబడిన గ్రామములు.

| | | తాలూకా | మండలము |
|---|---|---|---|
| (1) ఆఱులూరు | అల్లూరు | కోవిలకుంట్ల | కర్నూలు |
| గోవిలకుంట్ల | కోవిలకుంట్ల | ,, | ,, |
| (2) చిర్పల్లి | చిప్పిలి | మదనపల్లి | చిత్తూరు |
| (3) తర్కవులోలు | తక్కవోలు | సిద్ధవటము | కడప |
| (4) వేంద్రంబులు | వెల్దుర్తి | కామలాపురము | కడప |
| (5) పుదిలి | బుదిలి | హిందూపురము | అనంతపురము |
| (6) రాజోలి | రాజోలి | సిరివెల | కర్నూలు |

పై శాసనస్థల గ్రామముల యునికి ననుసరించి, రేనాడొకప్పుడు కర్నూలు మండలములోని దక్షిణభాగమైన కోయిలకుంట్ల సిరివేలు తాలూకాలును, కడపజిల్లాలోని జమ్మలమడుగు, ప్రొద్దుటూరు, పులివెండ్ల, కామలాపురము తాలూకాలును, అనంతపురము మండలములోని దక్షిణ ప్రాంతమైన హిందూపుర తాలూకా ప్రాంతమును, చిత్తూరు మండలమున కుత్తర దిక్కున కడప మండలమును చేర్చియున్న మదనపల్లి తాలూకాయును గల భూభాగమునకు సరిపోయి యుండవచ్చును.

(1) S. I. I. Vol X. No. 594
(2) ,, ,, 595
(3) ,, ,, 598
(4) ,, ,, 609
(5) ,, ,, 689
(6) E. I. Vol XI. P. 337-346 (పుణ్యకుమారుని మాలెపాడు శాసనము)

(7) E. I. Vol XXVI. No 42. (అనంతపురము కడపమండలములలోని చోళుల తెలుగు శాసనములు)

(8) (i) S. I. I. Vol X. No. 504 (శా. శ. 1235)
(ii) (iii) (iv) (v) E. I. Vol XXVI. No. 42.

## రొద్దనాడు

రొద్దమను గ్రామము అనంతపుర మండలములో పెనుగొండ తాలూకాలో పినాకినీనదీ తీరమందున్నది ఈ రొద్దము ప్రధాన గ్రామమగు ప్రదేశమునకే రొద్దనాడని పేరు.

ఈరోడ్డనాటి వ్యాప్తినిగూర్చి విశదీకరించు శాసనముల పట్టిక ఈ దిగువ నియ్యబడినది.

(1) ఘనాద్రిరాజ్య సంబంధ గుత్తివళిత మధ్యగం చింమ్మనకలిని విఖ్యాత మష్టభోగసమన్వితం.

(2) పెనుగొండ మహారాజ్యే రోద గ్రామస్యసీమని లేపాక్షి వీరభద్రాది దేవతోత్సవసిద్ధయే అచ్యుతేంద్ర మహారాయేణార్పితస్య స్వనామతః గ్రామస్య మోదయాఖ్యస్య స్థలేయత్నేన నిర్మితా.

(3) పెనుగొండ రాజ్య రోదనాడ గుయ్యలూర సీమవూళగణ గొరవనహళ్ళి.

(4) ఘనగిర్యాహ్వయే రాజ్యే ప్రాచ్యే వానసుపాసితం రోడ్డనాడు వరాంతస్థం ప్రాచ్యాం శ్రీతోటహళ్ళితః పశ్చిమాంతే కులోడస్య మీనకుంటాగ్రహారతః చలివింద్ల.

(5) "మారటూరు సీమయ రోడ్డనోడూళగణ ఉపుడిహాళియణ శ్రీవీర కృష్ణమహారాయతె"

(6) "శ్రీమన్మహామండలేశ్వర మంగరసరు రోడ్డమూనూఱు, కణియ కల్లుమూనూఱుం, అన్తు ఎరడఱునూఱుం సుఖసంకథా వినోదం.

(7) పెనుగొండరాజ్య రోడనాడ కలనూరిగె.

(8) పెనుగొండరాజ్య రోడనాడు తుంబెవల్ల స్థలద నగరగెరె.

ఈనాడు మొదట మూనూరు గ్రామములు కలదై, విజయనగర సామ్రాజ్య కాలమున పెనుగొండ రాజ్యములో నంతర్భాగమై యుండెను.

| | | | |
|---|---|---|---|
| చింమ్మనకఱు | తిమ్మన చెఱువు | గుత్తి తాలూకా | |
| లేపాక్షి | లేపాక్షి | హిందూపురము | తాలూకా |
| గొరవనహళ్ళి | కొడిగెనహళ్ళి | ,, | ,, |
| ఉపుడిహాళ్ళి | ఉప్పారహళ్ళి | ,, | ,, |
| చలవింద్ల | చలివెందల | ,, | ,, |

శాసనోద్దిష్ట గ్రామముల యునికిని బట్టి రొడ్డనాడు హిందూపురము తాలూకా, గుత్తి తాలూకాలో కొంత భాగము నై యుండెనవి యూహింప నగును.

(1) No. 427 Part II. S. I. I. Vol IX. Part II. (క్రీ.శ. 1401)
(2) ,, 583 Part II. S. I. I. Vol IX. (క్రీ. శ. 1538)
(3) ,, 577 ,, ,, ,, (క్రీ. శ. 1537)
(4) ,, 535 ,, ,, ,, (క్రీ. శ. 1531)
(5) ,, 485 ,, ,, ,, (క్రీ. శ. 1512)
(6) ,, 146 Part I. ,, ,, (క్రీ. శ. 1157)
(7) ,, 582 Part II. ,, ,, (క్రీ. శ. 1537)
(8) ,, 590 ,, ,, ,, (క్రీ. శ. 1538)

వంగనూరు విషయము

తాడిపత్రి తాలూకాలోని కొట్టూరు(?)గ్రామములో పశ్చిమ చాళుక్య మహారాజైన విజయాదిత్యుని యొక్క ప్రాచీనాంధ్ర శాసనములో బాణరాజు వంగనూరు విషయము పాలించు కాలమున పెనుకపఱ్ఱుగ్రామము భారద్వాజ గోత్రుడైన కుమారశర్మకు దానముచేసెనని వ్రాయబడియున్నది. వంగనూరు గ్రామము తాడిపత్రి తాలూకాలోని గ్రామము, పెనుకపఱ్ఱు గుత్తితాలూకా లోని పెనుకులపాడు కావచ్చును. వంగనూరు విషయము తాడిపత్రి తాలూకాలోని ప్రాచీన విషయములలో నొక్కటి యని తలంపవచ్చును.

(1) Annual Report on Indian Epigraphy 1847-48-No 14.

(2) E. I. Vol XXX. Part II. విజయాదిత్యుని కొట్టూరు శాసనము. (క్రీ. శ. 699)

వంగూరునాడు విషయము

క్రీ. శ. 659-660 నాటి విక్రమాదిత్య సత్యాశ్రయ శ్రీపృథివీవల్లభ మహారాజు ఆమిదేలపాడు శాసనములో నతడు వంగూరునాటి విషయము లోని మఱ్ఱూరు గ్రామవాస్తవ్యుడగు సుదర్శనాచార్యునకు గురుదక్షిణార్థము పఱుంకల్లు గ్రామమును సర్వకర పరిహారముగ దానము చేసెనని చెప్పబడినది.

ఈ వంగూరు మహాబూబునగరము మండలములో అలంపూర తాలూకాలో గలదు. ఆమిదేలపాడు నా తాలూకాలోనే గలదు. వంగనూరు విషయము మహాబూబునగర జిల్లాలోని వంగూరు గ్రామ పరిసరములై యుండెనని మాత్రము ఊహింపవచ్చును.

(1) తెలంగాణా శాసన సంపుటము-2. బాదామి చాళుక్యుల శాసనములు-సంఖ్య-1.

(2) E. I. Vol XXXII. ఆముదేలపాడు శాసనము. వంగూర వాడి విషయము.

## వంశధార

ఇయ్యది ఒరిస్సా రాష్ట్రములోని ఖిస్సంకటక్ తాలూకా యందలి కొండలలో నుద్భవించి శ్రీకాకుళము గంజాము జిల్లాలగుండ ప్రవహించి ఆగ్నేయ దిక్కుగా పోయి కళింగపట్టణము వద్ద తూర్పు సముద్రమును గలియుచున్నది.

ఇది పురాణ ప్రసిద్ధమైన నదులలో నొక్కటి. వాయుపురాణములో నియ్యది మహేంద్ర పర్వతములలో పుట్టినట్లు చెప్పబడినది. దీనికి వంశధారా యను నామముండెను.

త్రిసామా ఋతుకుల్యాచ ఇక్షులా త్రిదివాచయా
లాంగూలినీ **వంశధారా** మహేంద్రతనయాః స్మృతాః॥

వాయుపురాణము. అధ్యాయము 45. శ్లో. 106.

దీని యొడ్డుననే ప్రసిద్ధ బౌద్ధ చైత్యాగారముగల శాలిహుండము గలదు. శ్రీకాకుళము జిల్లా శ్రీకాకుళము తాలూకాలో నేడీ గ్రామమున్నది.
Geographical Essays-Vol I.P.100.E.I.VolXXVIII.Part III.

## వడుగావళి

తమిళ కన్నడ శాసనములలో ఆంధ్రదేశమునకు వడుగావళి, వడుకావళి యను పేర్లుగలవు, ద్రవిడదేశమున కుత్తర ప్రాంతమునకు వడుగుభూమి యనియు, వడుకావళి యనియు బేర్లు. కన్నడ శాసనములలో వడుగావళి

పన్నిసాశిరమని (వడుగావళి పంన్రెండువేలు) పాకనాటిరువదివేలు, వేంగీ సహస్రగ్రామము అని ప్రాచీన దేశ విభాగములు పేర్కొనబడినట్లే యియ్యది సంఖ్యాపరిమిత వ్యాప్తి చెప్పబడినది.

గుడిమల్లము బాణరాజుల శాసనములలో నైదింటియందు గొన్నిటిలో వడుగావళి యుదాహరింపబడినది. చిత్తూరు మండలములో పుంగనూరు గ్రామమందలి బాణరాజు కన్నడ శాసనములో వడుగావళి పన్నిసాశిఅమని గలదు. విజయనంది విక్రమవర్మ తిరువళ్ళము తమిళ శాసనములో బాణరాజు వేలు రాజ్యభాగమునకు వడుగావళి పంన్రెండు వేలనియే తెలుపబడినది.

ఆంధ్ర సాహిత్య పరిషత్తు రజతోత్సవ సంచికలో శ్రీమాన్ కృష్ణస్వామి అయ్యంగారు ఆంగ్లభాషలో "వడుకు-వడుక" అను విషయమును గూర్చి వ్రాసిన వ్యాసములో "వడుకావళి" ని గూర్చి యిట్లు వ్రాసియున్నారు.

"శాసనములో తమిళాంధ్రదేశ సరిహద్దులను గూర్చి వడుకావళి మెఱ్కు (పడమట) వడుకావళికిళక్కు (తూర్పు) అను రెండు పథములు చెప్పబడినవి. పెరియపురాణములో మధురపై దండెత్తివచ్చిన యొకరాజును గూర్చి వడుకకర్ణాటరాజని వ్రాయబడినది. అదే విధమున హోయిసల రాజుల శాసనములలో దక్షిణదేశపు దాడికి పెరియవడుగ కలవామని కలదు. కావున తమిళులకు వడుకలనిన కన్నడు లనియే భావము. తర్వాత నేటి కాలమున వడుక వారనగా తెలుగు వారనియు వారి భాషకు వడుకభాష యనియు వ్యవహార సిద్ధమయ్యెను.

ఇప్పటి ఆంధ్రప్రదేశములోని కృష్ణానదికి దక్షిణ ప్రాంతమైన ఆంధ్ర భూభాగమునకు సరివచ్చు ప్రాంతమునకే వడుగావళి యను పేరు.

(1) బాణరాజుల గుడిమల్ల శాసనము E I. Vol XI. Page 230. 231.

(2) విజయనంది విక్రమవర్మ తమిళశాసనము. S I.I. Vol III. P.90.

(3) పుంగనూరు శాసనము. S. I. I. Vol IX. Part I No. 5.

(4) ముడియానూరు తామ్రశాసనము (క్రీ. శ. 338) ఈ వడుగావళి పంన్రెండువేలు. ఆంధ్ర మండల ద్వాదశ సహస్రగ్రామ కలితమని చెప్పబడినది. I. A. Vol XV. P. 75.

## వర్ధమానపురము - 1. (కళింగాంధ్రము)

కళింగాంధ్రదేశము వివిధ ప్రాంతముల నేలిన రాజన్యుల కొకప్పుడు వర్ధమానపురము ప్రధాననగరముగ నుండెను. మహారాజు ఉమావర్మ టెక్కలి తామ్రశాసనములో నతడు వర్ధమానపురమునుండి అస్తివేర గ్రామమును బ్రాహ్మణు నొకనికి దానమొసంగెనని చెప్పబడినది. (1)

"స్వస్తి విజయ వర్ధమానపురాత్ పితృపాదానుధ్యాతః శ్రీమహారాజో మవర్మా అస్తివతేర గ్రామే సర్వసమవేతాన్ కుటుంబినః సమాజ్ఞాపయతి"

ఈ వర్ధమానపురము నేటి విశాఖపట్టణ మండలములోని పాలకొండ తాలూకాకు జెందిన వడమగ్రామము. ఉమావర్మయు వర్ధమానపురమురాజధానిగ కొంత కళింగ భూభాగ మేలుచుండెనని యూహింపవచ్చును.

(1) Tekkali Plates Maharaja Umavarma. E. I. Vol XXVIII. No. 47.

## వర్ధమానపురము - 2 (తెలంగాణము)

ఇది నేడు మహబూబునగర మండలములోని నాగర్కర్నూలు తాలూకాకు జెందిన వడ్డమానను గ్రామము. పూర్వము ప్రాచీనాంధ్ర చోడులలో నొక శాఖ వారీ పురమునుండి పరిపాలనము సాగించుచుండిరి. వర్ధమానపురాధీశుడైన తెలుగు చోడరాజులలో నొకడగు గోకర్ణుని శాసనమొకటి ఏలేశ్వరమునందు కలదు. (1). వేయి స్తంభాలగుడి శాసనములో రుద్రదేవుడు గొప్ప పరాక్రమము గల భీమరాజుపై దండెత్తిపోయి, యతని రాజధానియైన వర్ధమాననగరమును కాల్చివేసెనని వర్ణింపబడినది. (2)

"గత్వాజవాత్త్రి చతురాణిపదాని రాజా
సస్యస్యఖండనమివ ప్రథమాహుతిం వా
భ్రూభంగ వీక్షణ వివర్ధితకోపవహ్నౌ
యద్వర్ధమాననగరిం ప్రథమం జుహోవ.
యస్యాభివీక్షణ భయాచ్చకితస్య భీమో

దరోర్ధ్యధనస్య నృపతేరివ విహాల్యాంగః
స్వభ్రాతృమాతృ వనితా సహితస్య మగ్రలక్ష్మిం
విహాయవనమేవ యయావిలజ్జః.

మల్యాలగుండయ యిచ్చట నాగేశ్వరాలయము గట్టించెను. (3)

గోన గన్నయరెడ్డి వర్ధమానపురమునందు సుఖసంకథా వినోదంబు (న) ప్రిథువి రాజ్యం చేయుచుండంగాను" అని రాయచూరు శాసనమునందు గలదు. (4)

(1) భారతి సంపుటము 5. Part 1. Pages 143.
(2) Anamakonda Inscription. H. A. S. No. 13. Inscription No. 3.
(3) తెలింగాణా శాసనములు-2. కాకతీయ శాసనములు-6 (శ. 1167).
(4) ఆంధ్ర కవి తరంగిణి. గోనబుద్ధ భూపతి. పుట. 20. సం.4. (శ.1216).

## వరాహవర్తనీ విషయము

ప్రాచీన శాసనములలో దీనికి వరాహవర్తని, వరాహవర్తని, కోలువర్తని పేర్లు. వరాహా, కోలుపదములు సమానార్థకములు.

కోలువర్తని. (1) "కోలువర్తన్యాం కన్దలివాడ గ్రామ నివాసినః కుటుంబినః"

(2) కోలువర్తనివిషయే అవరంగాఖ్య గ్రామః.

(3) కోలువర్తని విషయే కోకుద్దమాఖ్య గ్రామః.

వరాహవర్తని (5) శ్రీమహారాజేంద్రవర్మా వరాహవర్తన్యాం సిద్ధార్థకగ్రామే సర్వసమవేతాన్కుటుంబినః.

(6) "వరాహవర్తన్యామ్ నవ గ్రామాశ్చతుస్సీమా"

(7) కలుంగమండలాంతర్గతమైన....... వరాహావర్తనియ సింహాపురమున

(8) వరాహవర్తన్యాం తామరచెరు గ్రామో దాను....

(9) "శ్రీచోడగంగదేవః వరాహవర్తని విషయే వాసినో రాష్ట్రకూట ప్రముఖాన్ భవ ద్విషయే ఖోన్న గ్రామః, ముణ్డపఱునామ గ్రామం గ్రాసీ కృత్వా....తత్రగార గ్రామ గ్రసీత ముణ్డపఱు గ్రామస్య ప్రతిక్షేత్ర త్వేన తూలువు గ్రామాదాహృత్యాష్టోత్తరా శీతిపరిమితం క్షేత్రం తేభ్యం: ఖోన్న గ్రామ నివాసి బ్రాహ్మణేభ్యః....ధారా పూర్వక మస్మాభిః దత్తమితి. పూర్వతః ఖోన్న, జీనబరవెల్లి, తోనేంగి గ్రామాణాం త్రికూటే

(10) "ఈ అఖండదీపానకు వరాహవర్తని విష యము లోని తులగామ బెట్టిన భూమిపుట్ల"

(11) శ్రీమహారాజో హస్తివర్మా వరాహవర్తని విషయే గోవాణక్యాం సర్వసమవేతాన్ కుటుంబినస్సమాజ్ఞాపయతి.

| శాసనములోని గ్రామనామము | నేటి గ్రామనామము | తాలూకా |
|---|---|---|
| కోకుడ్డ | కుద్దాము | శ్రీకాకుళము |
| ఉరామల్ల | ఉర్లాం | ,, |
| సిద్ధార్థక | సిద్ధాంతము | ,, |
| సింహాపురము | సింగపురము | ,, |
| తామరచెఱువు | తామరపల్లి | ,, |
| ఖోన్న | కొర్ని | ,, |
| జీంబరవెల్లి | వమరవెల్లి | ,, |
| తోనెంగి | తోనంగి | ,, |

| | | |
|---|---|---|
| ఖోల్లిర | కొర్లాము | ,, |
| తూలువు | తూలుగు | ,, |
| నవగ్రామ | నౌగాము | టెక్కలి |
| తులగామ | తలగామ | ,, |
| అవరంగె | అవలింగి | పర్లాకిమిడి |
| పొప్పంగిక | పొప్పంగి | ,, |
| కురుడింబి | కురుడింగి | ,, |

పై పట్టిక ననుసరించి వరాహావర్తని విషయము కళింగదేశములోని నేటి శ్రీకాకుళము తాలూకా, టెక్కలి, పర్లాకిమిడి తాలూకాలలో కొంత భాగమునైన ప్రదేశమని నిర్ణయించవచ్చును.

(1) దేవేంద్రవర్మ చీడివలస శాసనము A.H.R.S. Vol II. Part II.

(2) మూడవ వజ్రహస్తుని బొడ్డుపాడు శాసనము. భారతి, అక్షయ సం॥ వైశాఖము.

(3) మూడవ వజ్రహస్తుని చిక్కాల శాసనము భారతి సంపుటము 2. సంచిక 2.

(4) శక్తివర్మ ఉర్లాము శాసనము E. I. Vol 17. No. 19.

(5) ఇంద్రవర్మ అచ్యుతాపురశాసనము I. A. Vol 8. Page 120.

(6) మూడవ వజ్రహస్తుని గంజాము శాసనము భారతి. భావ సం॥ మాఘమాసము.

(7) శ్రీకూర్మము శాసనము. S. I. I. Vol V. No 1190.

(8) మూడవ వజ్రహస్తుని మద్రాసు మ్యూజియము శాసనము E. I. Vol IX. Page 98.

(9) అనంతవర్మ చోడగంగదేవుని కొర్ని శాసనము. A. H R. S. Vol I. P. 40.

(10) ముఖలింగము శాసనము S. I. Vol V. No. 1064.

(11) హస్తివర్మ నరిసింగపల్లి శాసనము భారతి భావ సం॥ భాద్రపద మాస సంచిక.

**విజయనగరము**

ఈ పట్టణరాజము విజయనగర సామ్రాజ్య లక్ష్మీ నివాసస్థానము. దక్షిణాపథమును ఇంద్రధ్వజుల పాలబడకుండ రెండువందల యేబది యేండ్లు చెక్కుచెదరక యడ్డుపడిన పట్టణము. వైశాల్యమునందును, వైభవమునందు నా కాలమునాటి రాజధానీనగరము లేవియు సాటిలేని మహానగరము.

ఇప్పుడీ నగరము నామ మాత్రావశిష్టమై మైసూరు రాష్ట్రములో బళ్ళారిమండలమున తుంగభద్రానది దక్షిణతీరమున నున్నది.

మహమ్మద్ బిన్ తుగ్లక్ రాజప్రతినిధులుగ కంపిలిరాజ్యమును పాలించు చుండిన హరిహర బుక్కరాయ సోదరులు, స్వాతంత్ర్యము వహించి, తుఘ్లక్ పై తిరుగుబాటుచేసి, కంపిలిరాజ్యమును విడి, శ్రీ విద్యారణ్య యతీంద్రుల ప్రోత్సాహముతో తుంగభద్రానదీ దక్షిణతీరమున నా మునీంద్రుని పేరిట విద్యానగరమనియు, విజయమున కాకరమగుటచే విజయనగర మనియు నీ నగరమును నిర్మించి విజయనగర సామ్రాజ్య స్థాపకులైరి.

హరిహరరాయల కాలమున విద్యానగరము నిర్మింపబడి, యతని సోదరుడనన్య సామాన్య పరాక్రమమంతుడై, రాజ్యమును విస్తరింపజేసిన కతమున, నీ పట్టణము సకల విజయార్జిత వైభవ సమన్వితమగుటచే, నితని కాలముననే విద్యానగరము విజయనగరమైనదని శాసన సారస్వత ప్రామాణికముల వల్ల నూహింపబడుచున్నది.

బుక్కరాయల శాసనములో నొక దానియందు విజయనగర నామ మేల కల్గెనో చెప్పబడినది. (1)

> విజిత్య విశ్వాం విజయాభిధానాం
> విశ్వోత్తరాం యోనగరీంవ్యధత్త
> యాహేమకూటాం విజసాలబాహు
> లతోచ్ఛ్రితేన పరిష్వజంతి ।

బుక్కరాయల కుమారుడగు కంపభూపతి భార్య గంగాదేవి రచించిన మధురావిజయమను గ్రంథమున బుక్కరాయలు విజయార్జిత సంపదకునిలయ

మైన విజయనగరమను నామముగల నగరమును రాజధానిగా నేలుచుండెనని వర్ణింపబడెను. (2)

ఆసీత్యమస్త సామంత మస్తకన్యస్త శాసనః
బుక్కరాజ ఇతి ఖ్యాతో రాజా హరిహరానుజః
తస్యాసీద్విజయా నామ విజయార్జిత సంపదః
రాజధానీబుధైః శ్లాఘ్యా శక్రస్యేవామరావతీ
సురలోకాంత సంక్రాంత స్వర్ణదీమత్సరాదివ
పరిఘాకారతాం యస్యాపరితా తుంగభద్రయా.

విజయనగర ప్రాంతమునందే పూర్వము రామాయణము నందలి కిష్కింధా కాండమునందు వర్ణింపబడిన రంగములన్నియు ప్రదర్శింపబడెనని పండితుల యభిప్రాయము. తుంగభద్రయే పంపానది. ఇచ్చటనే రామాయణములో నభివర్ణింపబడిన అంజనపర్వతము, మాల్యవంతము, మతంగపర్వతము, ఋశ్యమూకము అనుపర్వతముల నంటుకొని తుంగభద్రప్రవహించుచున్నది. రామాయణములో కిష్కింధాకాండమునందు వర్ణింపబడిన ప్రదేశములు విద్యానగరము నిర్మింపబడిన పరిసరముల నుండుటచే నీ పట్టణము కిష్కింధ యను స్థలముననే నిర్మింపబడెననుటకు సందేహము లేదు.

ముక్కుతిమ్మన పారిజాతాపహరణ కావ్యములో ఈశ్వర నరసింహ రాయల ప్రతాపవర్ణనములో విజయనగరను, విద్యానగరమను రెండు పేర్లను వాడి యుండెను.

సీ. ఎవ్వాని విజయంబు లెఱిగించు శాసన
స్తంభంబు లాశాంత శైలవితతు
లెవ్వాని యరిగాపులేపారు కాళింగ
యవనాది వివిధదేశాధి నాథు
లెవ్వాని నిత్యదానైక విలాసంబు
లారూఢ తరతులా పూరుషంబు
లెవ్వాని చిరకీర్తి యింద్రలోకాంగనా
భోగినీగీతికా భోగపదము.

గీ. వాడువోగడొందు సర్వసర్వం సహోధి
దేవతాముఖ దర్పణ ద్విజయనగర
భద్రసింహాసనస్థుడున్నిద్ర తేజు
డీశ్వరాధిపు నరసభూమీశ్వరుండు.

సీ. కుంతలేశ్వరుడు చిక్కుపడంగ విద్యాపు
రంబు గైకొని నిజప్రౌఢి నెరపె
పారసీకునకు దుర్భరమానవత్వంబు
దొలగించె మానవదుర్గసీమ
చోళవల్లభునకు సురవధూమధురాధ
రములిచ్చి మధురాపురంబుగొనియె
శ్రీరంగపట్టణ సీమఖడ్గనటీ వి
నోదంబు హేయదేంద్రునకు జూపె

గీ. నతడు నుతికెక్కె రామసేత్వంతరాళ
కలిత షోడశదాన విఖ్యాతయశుడు
మండలీకర మేఘ మార్తాండబిరుదు
డీశ్వరాధిపు నరసపృథ్వీశ్వరుండు.

పూర్వ మొకప్పుడు హరిహరరాయలు వేటకై బయలుదేరి తుంగభద్రను దాటి నదికి దక్షిణమునయున్న యొక యరణ్యమున ప్రవేశింపగా నచ్చట నొక కుందేలు వేటకుక్కను మార్కొనుటనుజూచి, విద్యారణ్యస్వామియాశ్రమమునకు జని యావింత వృత్తాంతమును స్వామికి నివేదింపగా నతడు మహారాజులకు నియతముగా నుండదగిన స్థలమని తెల్పెనట. అంత హరిహరరాయలు విద్యారణ్యునిపేరిట విద్యానగరమును నిర్మించెనని యొక గాథకలదు. (3)

(1) E. I. Vol V. No. 256.

(2) Sources of Vijayanagar History Page 24.

(3) Nellore Inscription. Kapaluru Grant P. 109-125. కుమారధూర్జటి కృష్ణరాయ విజయము.

## వినుకొండ (దుర్గము, సీమ)

వినుకొండ గుంటూరు మండలములలో వినుకొండ తాలూకాలోని గిరి దుర్గము. క్రీడాభిరామములో నియ్యది శ్రుతపర్వత దుర్గమని వల్లభా మాత్యుడు వర్ణించియున్నాడు. విజయనగర సామ్రాజ్య కాలమున వాసి గాంచిన దుర్గరాజములలో నొకటి. నాటి కావ్యములలో పేర్కొనబడినది. కృష్ణదేవరాయలు పూర్వ దిగ్విజయ యాత్రలలో దీనిని సాధించెను. కొంత కాలము గజపతుల వశమునను, తర్వాత విజయనగర రాజుల స్వాధీనము లోను, పిమ్మట గోలకొండ రాజ్యాంతర్భాగము నందుండెను.

(1) శా. స. 1406 నాటి పురుషోత్తమ గజపతి మటుకుంపలి శిలా శాసనము. ఈ గ్రామము వినుకొండసీమలోనిదని చెప్పబడెను.

(2) శా. స. 1619 నాటి శ్రీరంగదేవరాయల వనికుంట శిలా శాసనము. ఈ గ్రామము వినికొండసీమలోనిదని చెప్పబడెను.

పై రెండు గ్రామములు వినుకొండ తాలూకాలో గలవు.

ఉ. గంధవతీ ప్రతీరపుర ఘస్మర పాదభిస ప్రసూన పు
ష్పంధయ చక్రవర్తి శ్రుతపర్వత దుర్గ మహాప్రధాన రా
డ్గంధగజంబు తిప్పన యఖండిత ధీనిధి గాంచె బుత్త్రులన్
బాంధవ కల్పవృక్షముల బైచన వల్లభ తిప్పమంత్రులన్.

వల్లభామాత్యుని క్రీడాభిరామము. పుట 8.

సీ. ఉదయాద్రి వేగ నత్యుద్ధతి సాధించె
వినుకొండ మాట మాత్రన హరించె.

తిమ్మన పారిజాతాపహరణము పీఠిక.

(1) A. R. E. 1935-36. Vinukonda Guntur Taluk Nos. 226, 241.

(2) Sources of Vijayanagar History. P. 140.

(3) కృష్ణదేవరాయల శాసనము. తిరుపతి శాసనము సంపుటము 3. సంఖ్యలు 68, 76, 80.

(4) A. R. E. 1943-44; 1944-45. గోలకొండ రాజ్యములోని సీమలు. Nos. 55, 56. (S. 1528. 1530)

**విహారణగిరి**

ఇది సింహాచలమునకు నామాంతరము. "విహారణగిరేః పురస్తాద జయద్యః ప్రాంశుగజపతేః సైన్యం ।
S. I. I. Vol V. No. 1. (శ. స. 1321)

**వీరకూటము**

విశాఖపట్టణ మండలములోని పాలకొండ తాలూకా యందలి వీరఘట్ట మను గ్రామము. సింహాచలము లోని శాసనములందు పేర్కొనబడినది. రెడ్డి రాజులు జయించిన విఖ్యాత దుర్గములలో నొకటి.

(1) సర్వలోకాశ్రయ విష్ణువర్ధన మహారాజు వీరగొట్ట లకుమరాజు (శ. స. 1268)

(2) భారద్వాజ కులోద్భూత వీరకూటక్షితీశ్వర పురుషోత్తమ దేవరాజు కొడుకు నరసింహారాజు తనదేశ రాజ్య తనయఖ్యాతి .. అభివృద్ధి గాను (శ. స. 1270)

(3) వీరకూటము పురుషోత్తమరాజు కొడుకు నరసింహారాజు (శ. స. 1274)

(4) పల్లవకుల జాతుడగు వీరగోటపు పురుషోత్తమ రాజుల కొడుకు సౌభాగ్య దేవరాజులు. (శ. స. 1342)

(5) కాటయవేముని తూర్పునాటి దండయాత్రను వర్ణించు పట్టున నతడే దుర్గముల నాక్రమించెనో కుమారగిరి రాజీయ వ్యాఖ్యా నావతారికలో చెప్పబడినది.

ఘాటీ ఘోటీ ఖురాగ్రత్రుటిత గిరితటేయత్ర ముల్లేటిదుర్గం
దుర్భేదం వజ్రకూటం జితవతిరభసా రామకిర్యాఖ్యదుర్గం
విఖ్యాతం వీరఘోటం గలితమస్పృహాలుదాం వీరసన్నాహ ధార్ష్ట్యం
దుర్గం కిమ్మూరు సంజ్ఞం దలితరిపుబలే దుర్గమం బెండపూండిమ్॥

(1) S. I. I. Vol VI. No. 989
(2) ,, ,, 988
(3) ,, ,, 994
(4) ,, ,, 1101
(5) రెడ్డి సంచిక పుట 366

**వేంగిమండలము (పూర్వచాళుక్యులు)**

పూర్వచాళుక్య ప్రథమ ప్రభువగు కుబ్జవిష్ణువర్ధనుడు, తనసోదరుడగు సత్యాశ్రయ పులకేశి వల్లభునిచే కళింగ వేంగి రాజ్యములకు రాజప్రతినిధిగా నియమింపబడి, రణదుర్జయ వంశజుడైన పృథ్వీమహారాజును జయించి,స్వతంత్రుడై, వేంగిరాష్ట్రమును బాలించి పూర్వ చాళుక్య వంశస్థాపకు డయ్యెను. ఇతని తిమ్మాపురము, చీపురుపల్లి శాసనముల ననుసరించి. యితని రాజ్యము ఉత్తరమున విశాఖపట్టణ మండలమున చీపురుపల్లి తాలూకా మొదలు, తూర్పుసముద్రతీరము నంటియుండి. గుంటూరు మండలములోని యొకశాసన మనుసరించి, దక్షిణమున గుంటూరు మండలము వఱకు వ్యాపించియుండెను.

ఈ వేంగిమండలము క్రమక్రమముగా వృద్ధియై నాలుగవ విష్ణువర్ధనుని కాలము నాటికి (క్రీ. శ. 771-806) ద్వాదశ సహస్ర ప్రమాణమై(12000) యొప్పెను. అతని కుమారుడైన నరేంద్ర మృగరాజును ఒక ప్రక్క రాష్ట్రకూటులతోను, వేరొక ప్రక్కను సోదరుడగు భీమసల్కితోడను పండ్రెండు సంవత్సరములు యుద్ధముచేసి వేంగిమండలమును స్వాధీనము గావించుకొని, యద్దానిని నలుబదియేండ్లు పాలించెను.

"తస్యాత్మజః విజయాదిత్య మహారాజః అష్టాదశవర్షాణి, తస్యతనయః విష్ణువర్ధనః పంచత్రింశద్వర్షాణి ద్వాదశ సహస్రమాణి వేంగిమణ్డల మన్వపాలయన్ "....

అతని జ్యేష్ఠ కుమారుడైన నరేంద్ర మృగరాజు:-

అష్టోత్తరశత నరేంద్రేశ్వర దేవాలాయానాం కర్తా ద్వాదశవర్ష యుద్ధం వల్లభేంద్రదండ నాయకైః సహ భీమసలుకేనామన స్వానుజం విజిత్యగృహీత వేంగీమండలం చత్వారింశ ద్వర్షాణి.

పై విషయములు గుణగ విజయాదిత్యుని సాతులూరు శాసనమున వర్ణింపబడినవి. గుణగ విజయాదిత్యుడు బహుపరాక్రమశాలి ఇతడు తన కాలమున వేంగిరాజ్యము దక్షిణమున తొండమండలము వఱకును, ఉత్తరమున మహేంద్ర పర్వతము వఱకును, తూర్పు తీరము నంటి వ్యాపించి యుండెను.

వేంగి విషయమునకు మొదట పిష్టపురము, తర్వాత బెజవాజ రాజధానులుగ నుండెను.

రాజరాజ చోడ గంగుని చేకి శాసనములో వేంగి దేశము చాళుక్య ప్రభువులకు జన్మభూమి యని చెప్పబడినది.

అస్తి ప్రశస్తజాతీనాం రత్నానామివ వారిధిః
జన్మభూమిశ్చలుక్యానాం దేశో వే. గీతి విశ్రుతః
శ్లో॥ 28

## వేంగిరాజ్యము (చాళుక్య చోడులు)

రాజరాజనరేంద్రుని కుమారుడు రాజేంద్రచోడుడు కులోత్తుంగబిరుదాంచితుడై మాతృమాతామహ రాజ్యమైన చోళరాజ్యమున కధిపతియై గంగైకొండ చోళాపురము రాజధానిగ పాలించుచుండగ పితృపైతామహమైన వేంగిరాజ్యము తన పాలనమునకు రాగా, రెండింటిని చోళదేశమునుండియే పాలించుచు, దన కుమారులను వేంగిరాజ్యమునకు పరిపాలకులుగ నియమించెను. అంతటి నుండియు, వేంగిరాజ్యము కులోత్తుంగచోడ రాజ్యములో లీనమైపోయెను ఇతని జ్యేష్ఠ కుమారుడైన రాజరాజ చోడగంగు శకవర్షము 1006 లో జననాథపురమున పట్టాభిషిక్తుడై, తాను దానమిచ్చిన చేకి శాసనములో

"శ్రీచోడగంగదేవః సకలధరాతల సామ్రాజ్య లీలాసుఖ మనుభవన్ కదాచిత్ కులరాజాధాన్యాం జననాథనామనగర్యా మశేషభువనాభ్యంతరాపూరణాతిరిక్త నిజయశోరాశి శంకాజనయతః కైలాసశైల విలాసినస్యముత్తంగ శిఖరస్య సౌధస్యాస్థాన భూమౌ సకలసామంత చక్రప్రముఖేణ పరిచారేణ పరితస్సేవ్యమానః మన్నేటి మహేంద్రమధ్యవర్తినో రాష్ట్రకూటప్రముఖాన్ కుటింబినః సమాహూయ.... ఇత్థమాజ్ఞాపయతి"

అని మన్నేటి మహేంద్ర పర్వతముల మధ్యభూమిలోని గ్రామపెద్దల నాహ్వానించి తెలికిదేవురకు కొన్ని ప్రత్యేకాధికారముల నొసంగెను. శాసనోదిష్టములైన మన్నేరు, నెల్లూరు మండలములోని యొకనది. మహేంద్రగిరి గంజాము మండలములోని సుప్రసిద్ధపర్వతము. (చూడుడు-మన్నేరు, మహేంద్రగిరి). కావున చాళుక్య చోడుల పరిపాలనారంభమున వేంగిరాజ్యము తూర్పుతీరమున మహేంద్రగిరినుండి, మన్నేటి వఱకు వ్యాపించియుండెను.

## వేంగివిషయము (శాలంకాయనులు)

సముద్రగుప్తుని అలహాబాదు శిలాశాసనములో ప్రప్రథమమున వేంగి పేర్కొనబడినది. అతడు దక్షిణ హిందూదేశముపై దండువెడలి కళింగము మీదుగా కాంచీపురమువఱకు దిగ్విజయయాత్ర సాగించెను. ఆదండయాత్రలో నతడు జయించిన దేశము వేంగియొకటి దానినిపాలించిన ప్రభువు హస్తివర్మ.

"కౌసలిక మహేన్ద్ర, మహాకాన్తారిక వ్యాఘ్రరాజ, కౌరాళకమన్తరాజ పైష్టపురక మహేన్ద్రగిరి కౌట్టూరకస్వామిదత్త, ఎరణ్డపల్లకదమన, కాఞ్చేయక విష్ణుగోప, అవిముక్తక నీలరాజ, వైంగేయక హస్తివర్మ, పాలిక్కడ ఉగ్రసేన దైవరాష్ట్రిక కుబేర" ...

ఈ హస్తివర్మ సముద్రగుప్తుని సమకాలికుడు. కాబట్టి యితడు క్రీ.శ. 350 నాటివాడు. వేంగిపురము రాజధానిగా పరిపాలించిన ప్రభువులు సాలంకాయనసగోత్రులు.

వేంగిపురము ఇప్పుడు పడుమటి గోదావరి మండలమున నేలూరు పట్టనమునకు ఎనిమిది మైళ్ళ దూరముననున్నది. ఆ ప్రదేశమిప్పుడు శిథిలమై, అచ్చట పెదవేగి, చినవేగి యను రెండు కుగ్రామములు గలవు. శాలంకాయనుల శాసనములలో వారు చిత్రరథస్వామి పాదానుధ్యాతులు. ఆ దేవాలయ మిప్పటికి నా ప్రాంతముల గలదందురు.

శాలంకాయనులలో మొదటివాడుగా పరిగణింపబడుచున్న దేవవర్మ ఏలూరు ప్రాకృత శాసనములో నిట్లు వ్రాయబడెను.

"సిరివిజయ వెంగిపురాభగవతో చిత్తరథస్వామిపాదానుజాతస్య బప్పభట్టారకపాద బట్టస్యసాలంకానస్య అస్స వెధయాజినో మహారాజ సిరివిజయ దేవ వమ్మస్సవయణేన ఎలూరె ముళుదపముఖేగావో భాణితవ్వో.

"శ్రీ విజయ వేంగీపురమునుండి చిత్రరథస్వామి పాదాను రక్తుడును, బప్పభట్టారక పాదసేవకుడును సాలంకాయనుడును, అశ్వమేధయాజియు, మహారాజ శ్రీ విజయదేవవర్మ పెలూరు గ్రామ నాయకుల పురస్సరముగా పెలూరు గ్రామ నివాసుల కీ విధమున నాజ్ఞాపించుచున్నాను."

శాలంకాయన రెండవ నందివర్మ కంతేరు శాసనములో విజయ వేంగీపురము నుండి కుద్రాహార విషయములోని కుతువాడ గ్రామములోని పండ్రెండు నివర్తనముల భూమిని స్వామిచంద్రుడను బ్రాహ్మణునకు దానము చేసెనని గలదు.

అతనిదే యగు కొల్లేరు శాసనములో వేంగీపురమునుండి కుడూహార విషయములోని విడెనూరుపల్లిక గ్రామమును కురువక శ్రీవరాగ్రహారములోని నూటయేబదియేడు బ్రాహ్మణులకు దానము చేసెనని గలదు.

అతనిదే యగు పెదవేగి శాసనములో వేంగీపురమునుండి ప్రాలూరు గ్రామనివాసుల నాజ్ఞాపించుచు, నా గ్రామములోని విష్ణుగృహస్వామి వ్రజ పాలకులకు పది నివర్తనముల భూమిని, చెంచెటవు గ్రామములోని ఆరు నివర్తనముల భూమిని, కంబురాన్చెరువు గ్రామములోని ఆరు నివర్తనముల భూమిని దానము చేసినట్లు వ్రాయబడినది.

శాలంకాయనులలో కడపటివాడగు స్కంధవర్మ కంతేరు శాసనములో నతడు విజయ వేంగీపురమునుండి కూడూహార విషయములోని చిన్నపుర గ్రామమును లేకుమరి గ్రామ వాస్తవ్యుడైన శివార్యునకు దానము చేసెనని గలదు.

పై శాసనములో నుదాహృతమైన కూడూహార విషయము, వేంగీ విషయములో నంతర్భాగమని తెలియుచున్నది.

శాసన గ్రామముల పట్టిక

| | | | |
|---|---|---|---|
| పెలూరె | పెలూరు | పెలూరు తాలూకా | పశ్చిమ గోదావరిజిల్లా |
| కురువాడ | కురువాడ | ,, | ,, |
| పాలూర | పాటూరు | బందరు తాలూకా | కృష్ణాజిల్లా |

| | | | |
|---|---|---|---|
| విడెనూరు | వడ్డిగూడెము | ఏలూరుతాలూకా | పశ్చిమగోదావరిజిల్లా |
| చిన్నపుర | చింతలపూడి | ,, | ,, |
| లేకుమూరి | లోకమూడి | కైకలూరు తాలూకా | ,, |
| ముండురు | మండూరు | ఏలూరు తాలూకా | ,, |
| కంబురాచెరువు | కొమ్మర | ,, | ,, |

పై పట్టిక ననుసరించి శాలంకాయనుల కాలములో వేంగి పశ్చిమగోదావరి జిల్లాలోని ఏలూరు, కైకలూరు తాలూకాలును, కృష్ణామండలములోని గుడివాడ, బందరు తాలూకాలు గల మధ్యప్రదేశమని యూహింపనగును.

సముద్రగుప్తుని అలహాబాదు శాసనము.
దేవవర్మ ఏలూరు E. I. Vol IX. P. 57.
నందివర్మ కంతేరు A. H. R. S. Vol V. P. 21-32.
నందివర్మ పెదవేగి A. H. R. S. Vol I. P. 92-102.
స్కంధవర్మ కంతేరు A. H. R. S. Vol V. P. 21-32.

## వేంగి విషయము (విష్ణుకుండినులు)

శాలంకాయనుల తరువాత వేంగిదేశము నాక్రమించిన వారు విష్ణుకుండినులు. వీరిచ్చిన దానశాసనములు వేంగిపురమునుండి యివ్వబడలేదు. కాని శాసనములలో వారు దశశత సకలధరణీతల నరపతులమని చెప్పుకొనిరి.

విష్ణుకుండిన ప్రథమ మాధవవర్మ పొలమూరు శాసనములో.

"విక్రమాశ్రయస్య గోవిందవర్మణః ప్రియతనయః అతుల బల పరాక్రమ యశోదాన వినయ సంపన్నః, దశశత సకల ధరణీతల నరపతిర్వ్యవసిత వివిధ దివ్య స్త్రీవర నగర భవనగత యువతీ జనవిహారణ రతిరనన్య నృపతి సాధారణ దానమాన దయా దమధృతి మతి క్షాంతి కాంతి శౌర్యౌదార్య గాంభీర్య ప్రభృత్యనేక గుణసంపజ్జనిత రయసముద్ధిత భూమండల వ్యాపి విపులయశః.... మహారాజః శ్రీమాధవవర్మః"

అని యతడు దశశత సకల ధరణీతల నరపతియని చెప్పుకొన్నాడు. "దశశత సకలధరణి" వేంగివేయి విషయములు.

(1) పొలమూరు శాసనము-అనుబంధము 4 The Successors of Satavahanas in Lower Deccan. D. C Sirkar.

(2) J O. R. Vol XI. Part iii. శ్రీసోమశేఖరశర్మగారి వ్యాసము.

## వేంగివిషయము (రాజరాజు కాలము)

వేంగీ విషయమునకు రాజమహేంద్రవరము రాజమహేంద్ర బిరుదాంకితులగు మొదటి అమ్మరాజు (క్రీ. శ 918-925) లేక రెండవ అమ్మరాజు (క్రీ. శ. 945-970) కాలములో రాజధానియైనట్లు చరిత్ర పరిశోధకుల నిర్ణయము. రాజరాజు (క్రీ. శ. 1019-1061) కాలమున వేంగీరాజ్యము, దానికి ప్రధాననగరమైన రాజమహేంద్రవరము చరిత్రకును, సారస్వతమునకును వన్నెదెచ్చినది.

రాజరాజు కొలువుకూటమును వర్ణించుచు "అఖిల జలధి వేలావలయవలయిత వసుమతీ వనితా భూషణంబైన వేంగీదేశమునకు నాయకరత్నంబునుంబోలి రాజమహేంద్రపురంబునందు" అని నన్నయ రాజమహేంద్రవరము వేంగి దేశములోని పురవరముగా బేర్కొని యున్నాడు. తదుపరి, ఆదిపర్వములో నర్జునుని తీర్థయాత్రా వర్ణనసందర్భమున మూలములో లేని వేంగిదేశవిభవమును గూర్చి, తన దేశభక్తియు, స్వామిభక్తియు, భాషాకృతిని వెలయింపజేసెను.

సీ. దక్షిణ గంగనా దగ్గయు నొప్పిన
గోదావరియు జగదాదియైన
భీమేశ్వరంబును బెడగగు చున్న శ్రీ
పర్వతంబును జూచి యుర్విలోన
ననఘమై శిష్టాగ్రహార భూయిష్ఠమై
ధరణీ సురోత్త మాధ్వరవిధాన
పుణ్య సమృద్ధమై పొలుచు వేగీదేశ
విభవంబు జూచుచు విభుడు దక్షి

గీ. తాంబురాశి తీరంబున కరిగి దురిత
హారియైన కావేరీ మహాసముద్ర
సంగమంబున భూసురేశ్వరుల కభిమ
తార్థ దానంబులిచ్చి కృతార్థుడగుచు.

వేగి దేశమును వర్ణించిన ప్రథమాంధ్రకవి నన్నయభట్టు. దశకుమార చరిత్రము వ్రాసిన కేతనయు, నృసింహపురాణములో శంభుదాసుడును, తాము వేగి విషయము లేక వేగినాటిలోని గ్రామముల పేర్కొనిరి.

నన్నయభట్టు రాజరాజును "వేగి విషయాధీశ", "వేగినాథ", "వేగి భూవల్లభ" యనియు సంబోధించెను.

## వెంగోరాష్ట్రము

వేంగివిషయము వేఱు, వెంగో రాష్ట్రము వేఱు. రెండు నొకటియేయని చరిత్ర పరిశోధకు లభిప్రాయపడుచున్నారు. ఈ వెంగోరాష్ట్రము, వెంగనాడు, పల్లవరాజైన రెండవ సింహవర్మ మాంగడూరు శాసనములో పేర్కొనబడినది. (1)

ఈ శాసనము విజయ దశవపురమునుండి యొసగబడినది. ఈ దశవపురము నెల్లూరిమండలములోని దర్శిగ్రామముగా పరిశోధకుల నిర్ణయము. ఈ వెంగోనాడు పల్లవుల పరిపాలనమున నుండెను. ఇదియె వెంగనాడుగ నెల్లూరిమండలములో సూళూరుపేటలోని తురంగీశ్వరస్వామి యాలయములోని యొక తమిళ శాసనములో పైయూరిలం కొట్టములోని, వెంగనాటిలోని సురలూరని యెడి సింగలంతపురమని సూళ్లూరుపేట పేర్కొనబడుటవల్ల యా ప్రాంతము వెంగనాడులోనిదని స్పష్టము. (2)

నెల్లూరిమండలములోని ఉదయగిరి శాసనములలో నొకదానియందు తిరుపతి వేంకటేశ్వరస్వామి వెంగడనాథుడని చెప్పబడెను. (3)

అరవములో తిరుపతికి వెంగడమనిపేరు. కాబట్టి వెంగరాష్ట్రము లేక వెంగనాడు నెల్లూరిమండలములోని దక్షిణతాలూకాలు, చెంగల్పట్టు, ఉత్తరార్కాటు, ఉత్తరమున తిరుపతి వఱకు తొండమండలములో నంతర్భాగమై యుండవచ్చును. (4)

పై యూరిలంకోట్టము పల్లవులనాటి చెంగల్పట్టు మండలములోని పొన్నేరి, పైదాపేటతాలూకాలలో తమిళశాసనములందు పేర్కొనబడినది.(5)

(1) I. A. Vol V. P. 154.
(2) N. I. Sulurpet (4)
(3) ,, Udayagiri (6)
(4) History of Tirupathi P. 1-29.
(5) S. I. I. Vol XII. Nos. 86, 89 and Page 176.

## వెలనాడు

వెలనాటి పేర్కొనిన ప్రథమశాసనము క్రీ. శ. 763 నాటిది పూర్వ చాళుక్య ప్రభువైన ప్రథమ విజయాదిత్యుని పరిపాలన కాలములోనిదై యున్నది. దీనికి విళనాండని పేరు చెప్పబడినది. ఆ దానశాసనములో విళనాంటిలోని శాకరంబు అను గ్రామమును కారంచేడు వాస్తవ్యుడైన దేవశర్మ యను బ్రాహ్మణునికి దానమిచ్చెనని గలదు.

ద్రాక్షారామములోని వెలనాటి రెండవ గొంకరాజు శాసనములో నతని మూలపురుషుడైన మొదటి మల్లవర్మ త్రిలోచనపల్లవునికి యుద్ధములో సహాయుడై వెలనాటిని సామంత చిహ్నములతో బడసెనని వక్కాణింపబడినది.

"శ్రీమాన్ వీరరసాశ్రయో గుణనిధిః శ్రీ మల్లభూపోఽజని
యేన త్ర్యంబకపల్లవాద్రణశిర స్సాహాయ్య కారాచిరాన్
ప్రాప్తోయం వెలనాణ్డు నామవిషయస్సామంత చిహ్నైస్సహ ॥

వెలనాడు ఆఱువేల గ్రామపరిమితిగల ప్రదేశమని యొక శాసనమునను ఇంకొక శాసనములో త్రిశతోత్తరషట్సహస్రావని(6300)యనియు పరిగణింప బడినది.

(1) "స్వస్తిశ్రీ సర్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ధన మహారాజుల ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరంబులు 41-శక వర్షంబులు 938 నేంటి ప్లవ సంవత్సరంబున బేరేటి దక్షిణంబున యాఱువేల వెలనంటి........ అగ్రహారంబు వలివేరి త్రైపురుష స్థానమున...."

(2) స్వస్తి సమధిగత పంచమహాశబ్ద మండలేశ్వర.... త్రిశతోత్తర షట్సహస్రావనీవల్లభ ....... వెలనాంటి గొంకయ.......

కులోత్తుంగ చోడగొంకరాజు పాదారాధకుడైన కొమ్మనాయకుని శాసనములో వెలనా డీ విధమున వర్ణింపబడినది.

అస్తి స్వస్తి మదగ్రహారనగర గ్రామైః సమగ్రశ్రియా
జుష్టః పుష్టజనో మహీగతమివ స్వర్గ్యైండఖండలం
ఆరామైరభిరామ భూమి రభితశ్శాలేయ కేదారజః
శ్రీశాలీ వెలనాండు నామవిషయో భూమండలీమండనః ॥

వెలనాటి మండలేశ్వరులకు రేపల్లెతాలూకాలోని చందవోలు రాజధాని. దీనికే సనదవ్రోలు, ధనదుపురము అను నామాంతరములు గలవు. వెలనాటి గొంకరాజు ద్రాక్షారామ శాసనములో నతడు వెలనాటిలో ధనదేశ్వరనగరమునకు (అలకాపురి) సాటివచ్చు సనదవ్రోలు పట్టణము నేలుచుండెనని చెప్పబడినది.

స్వస్తిశ్రీ వెలనాండు నామవిషయే తస్మిన్మహాద్భూతలే
ప్రఖ్యాతో ధనదేశ్వరస్య పురసద్వృత్తోన్నతో శ్రీ....
..........సహకార వల్లభ ఇతిశ్రీ గొంకభూపాలక
స్తస్యాజ్ఞా పరిపాలితా సనదవ్రోలు నామాతిరమ్యాపురీ॥

మంచనకవి కేయూరబాహు చరిత్రములో గొంకరాజునకు ధనదుపురమే రాజధానియని చెప్పుచు నాపట్టణము నీక్రిందిపద్యములో వర్ణించియున్నాడు.

సీ. పుష్పక నివహంబు భూమిపై నిలిచిన
యట్లందమైన దేవాలయముల
రూప్యాచలము బహురూపంబుల నటించు
రమణఁ బొల్చు సౌధములవెల్లు
అలకాధిపతి నిధులన్నియు వెలిపీట
విడిసిన క్రియ బణ్యవీథికలును
ధాతమేదిని మిన్నుదఁగిపైచిన మాడ్కి
గనుపట్టు బహుతటాకముల నొంపు

గీ. నుపవనంబులు సరసులు నొప్పుచేయు
చెఱకుదోటలు బ్రాసంగుచేలు మెరయ
నఖిల విభవంబులకు నెలవగుచు వెలయు
ధనదుపురమున కెనయన ధనదుపురము.

గీ. మంటికడప నులకమంచంబు పూరిల్లు
నూలిచీర రత్నకీలితంబు
గాని పైడి తొడవు గలుగు ఱుంగరు
ధనదుపురములోని జనములెల్ల.

కృతిక ర్తవంశములోని వాడగు గోవిందప్రెగ్గడ కుమారుడైన కొమ్మన తన ప్రభువగు గొంకధారుణీశ్వరుని ధనదుపురము రాజధానిగా నెల్లూరు వఱకు గల రాజ్యము నేలించెనని బాపట్లలోని యొక శాసనమునగలదు.

కం. రమణీయ ధనదుపురవర
మమరగ నిజరాజధాని యయ్యుండగ నక
రము నెల్లూరును లోపుగ
గ్రమమొనరగ నేలె బాహుగర్వము వెలయన్.

కం. వననిధి పరివృత మహిగల
యనఘ శివాలయములెన్ని...... కాం
చన కలశంబులు వెట్టిన
యినవిభుడగు గొంక ధారుణీశ్వరుచేతన్.

వెలనాడు నేటి తెనాలి, రేపల్లె తాలూకా ప్రాంతము. కొంత గుంటూరు తాలూకా భాగము సహితము కలసియుండెను. కృష్ణానది దక్షిణ తీరమునగల సుప్రసిద్ధమైన నాడులలోనిది యొకటి.

## శాసనోద్దిష్ట వెలనాటి గ్రామ పట్టిక

| | | | |
|---|---|---|---|
| 1. ప్రోంతుకూరు | మోతుకూరు | బాపట్ల | తాలూకా |
| 2. వలివేరు | వలివేరు | తెనాలి | ,, |
| 3. నిడుంబ్రోలు | నిడుబ్రోలు | బాపట్ల | ,, |
| 4. పెరుంబఱ్ఱుారు | పెనుమఱ్ఱు | తెనాలి | ,, |

| | | | | |
|---|---|---|---|---|
| 5. | డావులూరు | దావులూరు | తెనాలి | ,, |
| 6. | ఎలవట్టి | ఎలవర్రు | రేపల్లె | ,, |
| 7. | పెదదేవిపురము | పెదదేవిపురము | దివి | ,, |

(1) E. I. I. Vol VI. Page 38-40.
(2) S. I. I. Vol X. No. 8.
(3) ,, IV. No. 1114.
(4) ,, IV. No. 1295.
(5) ,, X. No. 91.
(6) I. A. Vol XII. Page 91.
(7) S. I. I. Vol IV. No. 952.

**వేనాడు**

చిత్తూరు మండలములోని వాయల్పాడు తాలూకా యందలి కలకడ గ్రామమునగల వైదుంబుల కాలమునాటి తెలుగు శాసనములో చెప్పబడినది.

"స్వస్తి అనేక సమరసమరసంఘట్టనోపలబ్ధ విజయలక్ష్మీ సమాలింగిత విశాలవక్షస్థల భువనత్రినేత్ర ఇరుగెయ మహారాజు దన పట్టంబు గట్టిన సంతోషంబున వేనాటి కాపులకు దయచేసిన స్థితి....

ఈ శాసనములో పేర్కొనబడిన కొన్ని గ్రామములు వేంబల్లి, అకుంట, మేళికుర్తి: పిచ్చలి, మొదలైన గ్రామములు వాయల్పాడు, మదనపల్లి తాలూకాలలో గలవు. ఈ యాధారము ననుసరించి, వేనా డనునది యా తాలూకాల ప్రాంతమని శాసన పరిశోధకుల యభిప్రాయము. వేనాడనునది వేయినాడు గావచ్చుననియు వారి యూహ. (1)

ప్రథమ రాజాధిరాజు తమిళ శాసనములో నొకదానియందతనితండ్రి రాజేంద్రచోళుడు వేనాటి రాజును సేనాటి వఱకు పారదోలెనని చెప్పబడెననియు, నిందలి వేనాడు తిరువనంతపురము (Travancore) నిర్దేశించుననియు శాసనపరిశోధికుల నివేదిక యందొక దానియందు గలదు. కాని రెండు వేనాడు లొక్కటియే యని యూహింప వచ్చును. (2)

(1) E. I. Vol. VXX. No. 46. (Three Vaidumba Inscription from Kalakada.

(2) Para 26 of M. S. R. 1912-13.

## వేములవాడ

వేములవాడ తెలంగాణములోని కరీంనగరము మండలమునందలి సిరిసిల్ల తాలూకాలోనున్న సుప్రసిద్ధమైన చారిత్రాత్మకస్థలము. రాష్ట్రకూటుల పరిపాలన కాలమున వర్ధిల్లిన చాళుక్య సంస్థానము మూడు వందల సంవత్సరములు ఈ వేములవాడలో చాళుక్యులు పరిపాలనము సాగించిరి. వీరికి కొంత కాలము నిజామాబాదు మండలములోని బోదన్ పట్టణము రాజధానిగ నుండెను. తర్వాత వేములవాడ ఆరవ విక్రమాదిత్యుని సామంత మండలేశ్వరుడగు రాజాదిత్యుని రాజధానిగ నున్నట్లును, అతడు వేములవాడ (లేంబులవాడ) రాజధానిగ సపాదలక్ష మండలములోని కొంత భాగమును సబ్బిఇరువత్తొందు సాయిర మండలమును పాలించుచున్నట్లును, అతని లేములవాడ కన్నడ శాసనమునుబట్టి తెలియుచున్నది.(1)

"సపాదలక్ష్కెయ భాగముమంచబ్బి ఇరువత్తొందు సాసిరముమం దుష్టనిగ్రహ శిష్టప్రతిపాలనదిం పరిపాళసుత్తుం రాజధాని లేంబులవాడెయ నెలవీడనోళ్ సుఖసంపి థావినోదదిం రాజ్యంగేయుత్తుం ఇద్దు"

ఇమ్మడి అరికేసరి వేములవాడ సంస్కృత శాసనములో వేములవాడ లేంబులవాటక పట్టణమని పేర్కొనబడినది. (2)

"తేనాశ్వర్ధితో దేవతాం వందన నిమిత్త మాగత స్వనిర్మాపితాదిత్య గృహోమాగతాభ్యాగత జనసత్ర నిమిత్తముత్తరాయణ పుణ్యసంక్రాంతి దివసే శతనివర్తన సంఖ్యాత భూమిక్షేత్ర మష్టనివర్తన సంఖ్యాతదానీయ భూమి క్షేత్రం లేంబులవాటకపత్త నేలానకేన శ్రీమదరికేసరి క్షితిపతిరదాన్"

(1) J. O. R. Madras Vol. XVIII. Part I.

(2) ఇమ్మడి అరికేసరి భూపాలుని వే(లే)ములవాడ శాసనము. భావరాజు వేంకటకృష్ణరావు భారతి ప్రజోత్పత్తి శ్రావణమాస సంచిక.

శ్రీ వేంకటరమణయ్యగారు రచించిన వేములవాడ చాళుక్యులను వ్యాసములు భారతి పరీధావి జ్యేష్ఠ, ఆషాఢ, భాద్రపద, కార్తీకమాస సంచికల జూడనగును.

## వేలుపుగొండ

వేలుపుగొండ తెలంగాణములోని వరంగల్లు మండలములోని బలిష్ఠమగు గిరిదుర్గము. దీనినే నేడు జఫర్ ఘడ్ అని పిలుతురు. చుట్టును ఎత్తైన కొండలచే నావరింపబడి శత్రువుల కభేద్యమైనది. రాష్ట్రకూటుల నాటి శాసనమును బట్టి యీ దుర్గము క్రీస్తు శకము ఎనిమిదవ శతాబ్దమునాటికే ప్రసిద్ధమైనట్లు తోచుచున్నది తర్వాత కాకతీయుల కాలమున నిది వారికొకప్పుడు రాజధానియైనట్లు మిరియాల కామసాని క్రీ. శ. 1000 నాటి శిలాశాసనమును బట్టి విదితమగుచున్నది.

చం. అరుదగునట్టి యెఱ్ఱ నృపునంగన కామవసాని యొక్క మే
ల్గరుదని బేత భూనిభునిగాకతి వల్లభు బిన్నవాని దా
బరగగ జేతబట్టి ఘనుబల్లవరాయని యోగిజొచ్చి భా
స్కర విభుచక్రవర్తిగని కాకతి నిల్పుటగోటి సేయదే ॥

ఉ. కారక కాలుడై పడసె గాడయనాయకు జంపినూర డ
వ్వేలుపుగొండ రవ్వ నృపు వేలుపుగొండన నిల్పి వానిచే
మేలుగ మూడ ముప్పంయని మేలుగనేరెడు బోటిపాడునుం
మేలుగ చేకు మావిడులు మేలుగ రెండయరాజు సంగడుల్.

మొదటి పద్యములోని సుదాహృతుడైన కాకతి బేతరాజె, రెండవ పద్యములోని రవ్వనృపుడని యన్వయించిన యెడల, కాకతీయ రాజులకు మొదటి రాజధాని వేలుపుగొండయని చెప్పనగును.

(1) Imperial Gazetteer _ Hyderabad State. Warangal Division P.4. "The fort of Zafargarh, ancient Valabgonda in the Vardannapet Taluk, has two stone walls and seven bastions, containing 16 guns"

(2) కుమార సోమేశ్వరుని గూడూరు శాసనము - హర్షవర్ధనశర్మ గారు. ఆ. సా. ప. పత్రిక. సంపుటము 50. సంచికలు 5-6. (1961 62)

## వేల్పూర విషయము

మూడవ వజ్రహస్తుని నడగాం శాసనములో "ఎరదవిషయే వేల్పూర గ్రామమ్ త్రుమ్మకా వప్పుడాం వల్లూరమ కోమూరన పోడూరు వాడం

మూరింగాం కనమరంవ దేవరమచికిడమ గుద్రపీ పతన్ ద్వాదశ గ్రామాన్ వేల్పూరవిషయేతి నామమేకీకృత్య—" అని ఎరద విషయములోని పై పండ్రెండు గ్రామములు ఏకముగా జేసి, వేల్పూరు విషయమని నామకరణము చేయబడినట్లు తెలుపబడినది. ఎరదవిషయము విజయనగర చీపురుపల్లి తాలూకా ప్రాంతమని యూహింపబడెను. శాసనములోని కొన్ని గ్రామములా తాలూకాలలోని గ్రామములేయని యీ క్రింది పట్టిక వలన నెంచవచ్చును. వేల్పూర విషయము, ఎరదవిషయములోని యంతర్భాగము.

| | | | |
|---|---|---|---|
| వల్లూరమ | వల్లూరు | విజయనగరం | తాలూకా |
| వప్పుడాం | బొప్పడం | ,, | ,, |
| పోడూరు | పొందూరు | చీపురుపల్లి | ,, |
| కోనూరన | కోనూరు | ,, | ,, |

E. I. Vol VI. No. 24. (శకము 979)

## వేళానగరము

"శ్రీ మద్వేళానగరమైన శ్రీమతు మోటుపల్లి శ్రీ గణపతి ప్రసన్న కేశవదేవరకు కాకతి గణపతిదేవ మహారాజు ధర్మువుగా హావిర్బలి యర్చనలకు, అంగరంగభోగాలకు నిచ్చిన ఆదూరు" వేళానగరము మోటుపల్లికి నామాంతరము (చూడుడు-మోటుపల్లి)

S. I. I. Vol X. No. 273. (శ. 1153)

## శ్రీపర్వతము

నాగార్జునకొండలో దొరికిన ప్రాకృతశాసనములలో నొకదానియందు "సిరిపవత"ము పేర్కొనబడినది.

"సిరిపవతె విజయపురి యపువదిసాభాగె విహారెచుల దమ్మగిరియమ్ చెతియఘరమ్" "విజయపురమున శ్రీ పర్వతమునకు దూర్పు విభాగమున చిన దమ్మగిరిలోని చైత్యాగారము"

పై శాసనములోని విషయమునననుసరించి నాగార్జునకొండకే శ్రీపర్వత మను నామము గల్గియుండవచ్చునని శాసనపరిశోధకులభిప్రాయపడుచున్నారు.
E. I. Vol XX. No. 1. Siripavata. (Geographical Names)

## సంబవిషయము

అనంతవర్మ చోడగంగుని శ. స. 1040 నాటి పలంగర శాసనములో నతడు సంబవిషయములోని పలంగర గ్రామమును రట్ట మండలములోని ఉరత్తూరు గ్రామవాసియగు ఉలగియగొండ పెరుమాళ్ళు అనునతనికి దానము చేసినట్లు చెప్పబడినది. పలంగర గ్రామము విశాఖపట్టణమండలములోని బొబ్బిలి తాలూకా యందలి పలగర గ్రామమే.

అనంతవర్మ చోడగంగుని విశాఖపట్టణము తామ్ర శాసనములలో సమ్మగవిషయము సమ్వావిషయములు పేర్కొనబడినవి.

సమ్వా విషయే చాకివాడాఖ్య గ్రామః
సమ్వా విషయే తామరఖణ్డి నామగ్రామః
సమ్మగ విషయే సుముదా నామగ్రామః
త్రిల్లింగి నామవాటకం
దొమ్మికొండ గ్రామః



పై విశాఖపట్నము తామ్ర శాసనములలో నుదాహరింపబడిన తామర ఖణ్డి, యా పేరుతో బొబ్బిలి తాలూకాలో గలదు. సుముద, దొమ్మికొండ, చాకివాడ గ్రామము లెచ్చట నుండెనో చెప్పుటకు వీలు కలుగుటలేదు. సంబ విషయము బొబ్బిలి తాలూకా ప్రాంతమని చెప్పవచ్చును. శాసనపరిశోధకులు చీపురుపల్లి తాలూకాలో శంభాము పరగణాలో రామచంద్రపురాగ్రహారము కలదని తెలియవచ్చుటచే సంబవిషయము బొబ్బిలి, చీపురుపల్లి తాలూకా మధ్యభాగమని నిర్ణయించినారు.

(1) Para 15 of M. E. R. 1935-36.

(2) I. A. Vol XVIII. Nos. 178, 179, 180. Vizagapatnam Copper-Plate Grants of Ananta Varma Choda Ganga.

**సకటమంతినవాడు**

సకటమంతినవాటిని పేర్కొన్న శాసనములు కాకినాడ తాలూకా సామర్లకోట సమీపమున నున్న చాళుక్య భీమవరములో గలవు.

(1) సకటమంతని నాణ్టి చాళుక్య భీమాపురమున మణ్డయగుడి

(2) రాజేంద్ర చోడమణ్డలమైన గోదావరి వడగర సకటమన్తని నాణ్టి చాలుక్య భీమేశ్వర దేవరకు

(3) సకట మన్తనినాణ్టి రాజనారయ భీమవరమున

(4) స్వస్తి సర్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ధన మహారాజులు కులోత్తుంగ చోడమండలమున గంగయ గొణ్డ చోడవలనాంట్టి సకట మంతనాంట్టి రాజనారాయణ పురమున.

(5) ద్రాక్షారామ శాసనములో నొకదానియందు చోడదేశవాసుడైన మార్తాండ వేలారు గావించిన దాన శాసనములలో సకట మంతనినాటి రాజేంద్రచోడ చతుర్వేది మండలమున నేనూట ఇద్దరి మహాజనులు చింతపల్లి పొలమున నిరువది పుట్లు నేల కృషి చేసి యిరువది బ్రాహ్మణులకు భోజనము పెట్టుటకు నిబంధనము గావించినట్లు వ్రాయబడినది.

(6) బిక్కవోలు (రామచంద్రపురము తాలూకా) మశీదులోని శాసనము - సకట మంతనినాడు.

పై శాసనోద్దిష్టములైన గ్రామములు కాకినాడ తాలూకాలోనె గలవు. బిక్కవోలు గ్రామము కాకినాడ తాలూకా నంటియున్న రామచంద్రపురము తాలూకా యందున్నది. కావున సకటమంతనినాడు నేటి కాకినాడ తాలూకాలోని కొంత భాగముగా పరిగణింపవచ్చును.

E. I. Vol VI. No. 20. (శా. శ. 1037)
(2) S. I. I. Vol V. No. 42..........
(3) ,, 62(శా. శ. 1036)
(4) ,, 66..........
(5) S. I. I. Vol IV. No. 1187........
(6) M. E. R. 1929-30. B. No. 13.

## సకలినాడు

శ్రీ మన్మహామండలేశ్వర అంబదేవ మహారాజులకు పుణ్యమునకుగాను చేసిన రాజంపేట తాలూకాలోని అత్తిరాలలోని దానశాసనములో నతడు వల్లూరి పట్టణము రాజధానిగ ఖండికోట, ములికినాడు, రేనాడు, సకలి, ఏఱువ మొదలైన సకల దేశముల నేలుచుండెనని చెప్పబడినది. (1)

బద్వేలు తాలూకాలోని కొన్ని గ్రామము లందలి శాసనములలో సాకలిసీమ గండికోటసీమలో నంతర్భాగమనియు, సకలి పెద్ద కోడూరనియు వ్రాయబడియున్నది. (2)

| | | |
|---|---|---|
| కట్రగండ్ల | కత్తెరగండ్ల | బద్వేలు తాలూకా |
| పెద్దకోడూరు | కోడూరు | ,, |
| పలుగురాళ్ళపల్లి | పలుగురాళ్ళపల్లి | ,, |

ఈ గండికోట, ములికినాడు, రేనాడు, సకలి, ఏఱువనాడులు ఒకటి నొకటి జేరి కడపమండలములో నంతర్భాగములై యుండెనని యూహింప వచ్చును. ఈ సకలిసీమ బద్వేలు తాలూకాలో గొంత భాగమై యుండును.

(1) S. I. I. Vol X. No. 448 (శ. స. 1201)
(2) M. E. R. 1928-29 No. 401 and 401.

## నగరపురము

కృష్ణదేవరాయలు ఆముక్తమాల్యద కావ్యములో దాను కల్బగిరి నగరపురములను జయించినట్లీ విధముగ వర్ణించియున్నాడు.

సీ. సనకాది దివిజమస్కరిఫాల గోపిచం
దనపుంద్రవల్లి కల్మాకినాకి
నెలసి హాహాహూహూవుల దండియల తంత్రి
ద్రెవ్వ సింగిణులుగా దివిచితివిచి
నప్తకృత వియద్ఘుర వాలుకాలింగ
సమితి ముచ్చెళ్ళగాళ్ళ జమిరిచమిరి
రంభాప్రధానాప్సరః పృథూరోజ కుం
భంబు లెచ్చటగన్న బట్టిపట్టి

గీ. తిరుగు హారిపురిసురతరు సురలమరిగి
బహుళ హాళహాళి భరిత కల్బరినగర
సగరిపురవర పరిబ్బాధ జవనయవన
వృతనభరదసినని దెగి కృష్ణరాయ.

ఆముక్తమాల్యద ఆ. ౧.

ఈ సాగరకోట గుల్బర్గ జిల్లాలో గుల్బర్గ కోటకు దాదాపు 50 మైళ్ళ దూరమున నైర్భతి దిశ నున్నది.

Imperial Gazetteer, Hyderabad. Gulbarga Division Sagar P. 12.

## సగరవిషయము

ఇది పశ్చిమ గోదావరి మండలములోని కొలను (కొల్లేరు) ప్రాంతము. తెలుంగు భీముడను కొలను భీమరాజు నగర విషయాధిపతి యని శాసనము లందు పేర్కొనబడెను (చూడుడు-కొలనువీడు)

S. I. I. Vol II No. 61. S. I I. Vol III. No. 79.

## సపాదలక్ష (మండలము)

ఈ సపాదలక్ష మండలము. నేటి తెలంగాణములోని తూర్పు, మధ్య ప్రాంతములైన నైజామాబాదు, కరీంనగర్ జిల్లాలకు సరివచ్చు భూభాగమని చరిత్ర పరిశోధకుల నిర్ణయము. ఆరవ విక్రమాదిత్యుడైన రాజాదిత్యుని వేములవాడ కన్నడ శాసనములో నతడు సపాదలక్కె (సపాదలక్ష) విషయములోని కొంత భాగమును, చబ్బి (సబ్బి) ఇరుపత్తొండుసాసిరము (ఇరువది యొక్క వేయి) లేంబులవాడ (వేములవాడ) నెలవీడుగ నేలుచుండెనని వ్రాయబడినది. వేములవాడ కరీంనగర మండలములోనిది. ఇమ్మడి అరికేసరి వేములవాడ సంస్కృత శాసనములో పరమండలైక రాముడు చాళుక్యకుల తిలకుడునైన వినయాదిత్యుడను రాజొకడుండెననియు, అతడు అనన్యశాస్య మగు సపాదలక్ష దేశమును శాసించెననియు, పోదనమున తైలపూరమగు చెఱువులో వేనుగులను తానమాడించెననియు వర్ణింపబడినది. ఈ శాసనములో

చెప్పబడిన పోదన నైజామాబాదుమండలములోని బోదననగరము. అనగా బోదననగరము యుద్ధమల్లుని రాజ్యములో గలిసియుండెనని దెలియగలదు.

"పరమండలైకరామ శ్చాళుక్యకులతిలకః
శ్రీ యుద్ధమల్లోనామ రాజా బభూవ॥
సోయంకిలా శాసదనన్యశాస్య సపాదలక్షం క్షితి మక్షతాజ్ఞః
సమస్త రాజేంద్ర కిరీటకోటి మాణిక్యరశ్మిః ప్రకరోర్చితాంఘ్రిః
యః పాధనే సౌధమయీ గజానాం విధాయ వాపీనుపితైలపూర్ణై
స్యసర్వలోకం సతతం వితేనేళాసైః కూచానామరి సుందరీణాం॥

పైని చెప్పబడిన కరీంనగర మండలము, నైజామాబాదు మండలములు సరిహద్దు మండలములనితెలియనగును. సపాదలక్ష దేశము ఈ రెండు మండలముల ప్రాంతమైయుండెనని యూహింపనగును.

(1) The Country of Sapada Laksha J. O. R. Madras. Vol XVIII. Part I.

(2) ఇమ్మడి అరికేసరి వేములవాడ శాసనము భారతి ప్రజోత్పత్తి శ్రావణమాస సంచిక.

## సప్తగోదావరి

సప్తగోదావరి భాగవత పురాణములో చెప్పబడినది.

గయాంగత్వా పితౄనిష్ట్వ గంగాసాగర సంగమే
ఉపసర్స్య మహేంద్రా ద్రౌ రామం దృష్ట్వాభివాద్యచ
సప్తగోదావరింవెణ్ణాం పంపాం భీమరథీంతతః॥

మురారి అనర్ఘరాఘవములో నేడవ యంకమునందు ఆంధ్రదేశమందలి సప్తగోదావరిని, భీమనాయకుని యిట్లు వర్ణించియున్నాడు.

విభీషణుడు రామునితో,

విభీషణః (దక్షిణతో దర్శయన్) దేవ : ప్రణమ్యతోమయి మన్ధ్రవిషయలక్ష్మ్యా సప్తగోదావరీ హారకలాపైక నాయకో భగవాన్భీమేశ్వరః.

గౌతమీ మాహాత్మ్యములోని సప్తసాగర మాహాత్మ్య కథనములో సప్తగోదావరులు చెప్పబడినవి.

గాతమ్యాస్స ప్తథా ప్రోక్త స్సంగమ స్సరితాంపతౌ
తుల్యాత్రేయీ భరద్వాజీ గౌతమీ వృద్ధగౌతమీ
కౌశికే వసిష్ఠాచ స ప్తభాగా ప్రకీర్తితాః

స ప్తగోదావరు లేవియనిన (1) తుల్య (2) అత్రేయి (3) భరద్వాజ (4) గౌతమి (5) వృద్ధగౌతమి (6) కౌశిక (7) వసిష్ఠ.

## స ప్తమాడెములు

అల్లయ వేమారెడ్డి వేమవరము శాసనములో నతడు స ప్తమాడియ రాజులను గెల్చి, కళింగముపై దండె త్తి సింహాచల, పురుషో త్తములందు జయ స్తంభముల నిర్మించెనని వర్ణింపబడినది.

జిత్వాయః పటు స ప్తమాడియన్నృపాణ్ క్రాంత్వాకళింగక్షితిం సింహాద్రౌ పురుషో త్తమే పటురాజ్య స్తంభాన్ సజృంభ న్వ్యధాత్ః

శ్రీనాథుడు కాశీఖండ కృతిలో అల్లాడ వేమారెడ్డి విజయముల నిట్లు వర్ణించియున్నాడు.

సీ. స ప్తమాడియధాయ చంద్రబింబాననా
చికురవల్లరులపై జిన్నిపువ్వు

ఈ స ప్తమాడియములు విశాఖపట్టణ మండలములోని కళింగారణ్యము లోని మన్నెకొట్టములై యుండెనని తోచుచున్నది. మాడుగోలను గ్రామము వీరవిల్లి తాలూకాలో నున్నది. ఆ పరిసర ప్రాంతములనున్న పర్వతశ్రేణికి మాడుగోలు కొండలని పేరు.

(1) E. I. Vol XIII. No. 23 అల్లయ వేమారెడ్డి వేమవరం శాసనము.
(2) Vizagapatam Dt. Gazetteer Pages 8, 105, 120, 319.

## సబ్బినాడు

కాకతీయ రెండవ ప్రోలరాజు అనుమకొండ కన్నడ శాసనములో సబ్బి నాడు సబ్బిసాయిర మండలమని పేర్కొనబడినది. ఈ మండలమును చాళుక్య త్రిభువన మల్లుని పాదపద్మోపజీవి శ్రీ మన్మహామండలేశ్వర కాకతి బేత

భూపాలుని మంత్రియైన వైజనదండనాథుడు తన ప్రభువును (సబ్బిసాయిర మండలములను) లోకాభిరామముగా పాలించునట్లొనర్చెనని యందు వ్రాయబడినది. సబ్బిసాయిరమనగా సబ్బివేయుంటి దేశమని యర్థము. (1)

రెండవ కాకతి రుద్రదేవుని కరీంనగరములోని యొక శాసనములో సబ్బినాటిలోని నగరూరు పేర్కొనబడినది. (2)

శ్రీశైలశాసనములో సబ్బినాటిలోన చల్లగరగ, గుడ్లకోటయను రెండు గ్రామములు గలవని చెప్పబడినది. (3)

ఆంధ్ర సారస్వతములో సబ్బినాటిని పేర్కొనిన కవి మడికి సింగన. ఈ కవి తానురచించిన పద్మపురాణోత్తర ఖండమున దత్కృతిపతియగు కందనామాత్యుని గూర్చి యిట్లు వ్రాసియున్నాడు.

"తత్కవితా వధూముఖ తిలకంబగు వెలిగందల కందనామాత్యుండను నుత్తమ రత్నంబున కుపాశ్రయంబగు రామగిరి పట్టణాధీశ్వరుడైన ముప్పడి క్షోణిపాలుని యన్వయ గుణవిశేషంబు లెట్టివన."

"అని ప్రశంసింపదగి విభవవిలాస విక్రమవిజయ విఖ్యాతులం బ్రసిద్ధుడైన ముత్తభూపాలుండు తనకు సహాయుండుగా గౌతమీ దక్షిణంబునబరమ పావనమగు సబ్బినాటి రాష్ట్రమున రామగిరిపట్టణంబు రాజధానిగాబురందర విభవుండై రాజ్యంబు చేయుచు, నిరువెత్తుగుండ, గండగోపాల, కాంచిరక్షపాలక, చోడరాజ్యస్థాపనాచార్య, దొంతివన్నియు విభాళన, చలమర్తిగండ, గజగండవారణ, రాయగజకేసరి, మూరురాయరగండ, ఆది నానా బిరుద విఖ్యాతుండును, అనవరత దానశీలుండునగు ముప్పభూపాల చంద్రునకు....విశేషవస్తువాహన ఛత్రచామరాందోళికాది చిహ్నంబులం బెంపొందు కందనామాత్య వంశావతారం బెట్టిదనిన"

కందనామాత్యునక గ్రజుడు కేసనమంత్రి ముప్పడి భూపతి యొద్ద దండనాయకుడుగా నుండెను. ధర్మపురియందు దన్నసత్రము నెలకొల్పినట్లును, ఆ యూరనున్న శ్రీనరసింహస్వామి యుత్సవములు చేయించినట్లును, రామగిరి యందు విష్ణ్వాలయమును గట్టించినట్లును నీక్రింది పద్యమువల్ల దెలియనగును.

చ. అతులితలీల గేసనచివాగ్రణి ధర్మపురంబునందు నం
చితముగ నన్నసత్రమిడి శ్రీనరసింహుని కుత్సవంబులన్
సతత మహోపహారములు సల్పుచు రామగిరీంద్రమందు సు
స్థితిగుడికట్టి విష్ణుని బ్రతిష్ఠ యొనర్చె నుదాత్త సంపదన్.

కృతిపతి వెలిగందలామాత్యుఁడౌటయు నచటి నృసింహదేవుని భక్తుడగుటయు జూడగా నతడు వెలిగందల వాసుడై యుండెననుట స్పష్టము.

శాసనములలోని కరింనగరము, నగరూరు, సారస్వతోదాహరణములోని ధర్మపురి, వెలిగందల, రామదుర్గము కరీంనగరము జిల్లాలోనివి. కన్నడ శాసనములో ఓరుగల్లు సహితము సబ్బినాటిలోదని చెప్పబడుటచేత ఈ సబ్బినాడు గోదావరికి దక్షిణ తీరముననున్న కరీంనగరము జిల్లాయును, కొంతవఱకు వరంగలు జిల్లా అనుమకొండ ప్రాంతమునునై యుండవచ్చును.

(1) E. I. Vol IX. P. 256-257.
(2) H. A. S. No. 13 Inscription No. 56. (శా. శ. 1092)
(3) S. I. I. Vol X. No. 504 (శా. శ. 1235)

## సవరదేశము

ఇది దక్షిణాపథములోని దేశవిభాగము మత్స్య, వాయుపురాణములందును, మహాభారతమునందును పేర్కొనబడినది. శబర లేక సవరులకు నివాసభూమి యాటచేత దీనికి సవరదేశమని పేరు వచ్చియుండును. ఈ సవరులు తూర్పుతీరాంధ్రమున విశాఖపట్నము, గోదావరి, కృష్ణా, నెల్లూరు మండలము లో నివసించుచున్నారు. టోలమీ (Ptolemy) తన ప్రాచీన భూగోళమునందు "సవరై" జాతివారు మహానదికుత్తరమున నివసించుచున్నట్లు వ్రాసియున్నాడు.

## సాతవాహని హారము

ఇయ్యది సాతవాహన రాజైన రెండవపులమావి ఆదోని తాలూకాలోని ప్రాకృతశాసనములో పేర్కొనబడినది. హీరహడగల్లి శాసనములోని రట్టమనినను. ఈ శాసనములోని హారమనిన నొకటియే. రాష్ట్రపదమునకు

పర్యాయ పదములు. ఈ రాష్ట్ర విభాగము నేటి కర్నూలుమండలము, బళ్లారి మండలములలో నెక్కువ భూభాగమై యుండును.

(1) E. I. Vol. No. 9. P. 153-155. (క్రీ. శ. రెండవ శతాబ్దము నాటి శాసనము)

(2) E.I.Vol.X. Lnder's Lists. (ఆహార, అహార, హార, హార. (Nos 988, 1105, 1124, 1133, 1124, 1328).

## సాతవాహనిరట్ఠము

పల్లవరాజైన శివస్కంధవర్మ కాంచీపురమునుండి ప్రకటించిన హెరాహడగల్లి తామ్రశాసనమునందు పేర్కొనబడినది. శాసనము ప్రాచీన ప్రాకృత భాషలో వ్రాయబడినది. ఆతనికి పూర్వముండిన బప్పాయను మహారాజు ఆపిట్టి గ్రామవాసులును భోజకులునగు కొందఱు బ్రాహ్మణులకు శాతవాహని రట్ఠములోని బిల్లరెక కొడుంక గ్రామ దానమును స్థిరపఱచెను. శాతవాహని రట్ఠము నేటి బళ్ళారి మండలము, కర్నూలు మండలములోని పశ్చిమ ప్రాంతము. హెరాహడగల్లి బళ్లారి మండలములో హూర్వనహల్లి తాలూకాలో నున్నది.

E. I. Vol. I. P. 1-5.

## సారకినాడు

విశాఖపట్టణ మండలములోని విజయనగరము తాలూకాలో శా. శ. 1061 నాటి అనంతవర్మ దేవుని రెండు శాసనములు సారకినాటిని పేర్కొనుచున్నవి. రెండును సారకినాటి మఱుచెఱువు గ్రామములోని సోమేశ్వరదేవర కిచ్చిన దాన శాసనములు. ఆ తాలూకాలో సారికయగు గ్రామము కలదు. దీనినిబట్టియే సారకినాడని పేరు వెలసియుండును. మరువాడ, మలిచెర్ల గ్రామములందే కలవు. మఱుచెఱువు గ్రామ మారెంటిలో నేదైన కావచ్చును.

S. I. I. Vol. X. No. 690-691.

## సాలిహుండము

శ్రీకాకుళము మండలములోని శ్రీకాకుళము తాలూకా యందలి వంశధారానది యొడ్డున నున్న కొండ. బంగాళాఖాతమునకు మూడు

మైళ్ళ దూరమునను, కళింగ పట్టణమునకు మూడు మైళ్ళ దూరమున నున్నది. ఇక్కడ బౌద్ధ స్తూపము, చైత్యములు గలవు. క్రీ. శ. రెండవ శతాబ్దము నాటి బ్రాహ్మీలిపిలోని ప్రాకృతశాసన మొకటి (కుండపై చెక్కబడినది) యిచ్చట లభించెను. కొండపై కట్టహారామమను బౌద్ధ సంఘారామము కలదు ఈ కొండకు ఏటవాలుగనున్న భాగమున మ్రొక్కుబడి స్తూప మొకటి గలదు. ఆంధ్రదేశమునందలి ప్రాచీన బౌద్ధ సంస్కృతికి నెలవు.

E. I. Vol. XXVIII. Part III.

## సింగట్టైనాడు

నెల్లూరు మండలమందలి రాపూరు తాలూకాలోని ఊటుకూరు గ్రామమున గల యొక తమిళశాసనములో సింగట్టైనాటి ఉట్టకూరు పేర్కొనబడినది. ఇది కుళోత్తుంగ చోళదేవుని ముప్పదియేడవ ప్రభుత్వ సంవత్సరము. ఉట్టకూరు గ్రామమె ఊటుకూరు సింగట్టైనా డా ప్రాంత మేమైయుండవచ్చును.

N I Rapur (66)

## సిందవాడి

సిందవాడిని పేర్కొన్న శాసనముల పట్టిక నీ దిగువ పొందుపఱుప బడినది. ఆ శాసనములలోని గ్రామనామము లుదాహరింపబడినవి.

(1) శ్రీ మన్మహామండలేశ్వరం గణ రాదిత్యరసర్ సిన్దవాడి సాసిరముం........కంచగాఱ బెజ్జలియ ...... (శ. క. 969)

(2) శ్రీ మదీరనోలంబ పల్లవ పెర్మానడిగళ్ సిందవాడి సాసిరము మం...... కవతాళు పన్నెరడఱ బళియ నేఱుల బదళపాళ . (శ. క. 976)

(3) శ్రీ మద్వీరనోళంబ గట్టి దేవ సిందవాడి సాయిరము మం.......

(4) శ్రీ మన్మహామండలేశ్వరం చిద్దన్న చోళమహారాజర్ సిన్ద వాడ సాసిరము మం

(5) శ్రీ త్రైలోక్య నోలంబ పల్లవ పెర్మాడి జయసింఘ దేవన్ .... సిందవాడి పాసిరముమం తుంబళి శ్రీ స్వయంభు దక్షిణ సోమేశ్వర దేవరగె....... (శ. క. 990)

(6) శ్రీ మన్మహామండలేశ్వరం జోయిమయ్యరసర్ సిందవాడి సాసిరము మం.

(7) శ్రీ మన్మహామండలేశ్వరం మల్లరసర్ సిందవాడి నాడూళ గణాదవని 500. అఱ కమ్పణం తుంబళ........

(8) శ్రీ మతుకుమారం తైలపదేవరు సిన్దవాడి సాసిర మనాళుత్త మిరతత్పాద పద్మోపజీవి........

(9) శ్రీ మన్మహామండలేశ్వరం సింగరసరు సిందవాడి సాసి రమ.. .శ్రీస్వయంభు దక్షిణ సోమేశ్వర దేవర్గె (తుంబళము)

(10) శ్రీ మన్మహామండలేశ్వరం బాచరసరు శ్రీమద్రాజధాని తుంబళ శ్రీ స్వయంభు కలకంఠ దేవర్గె సిందవాడి సాసిర దాదవని యయ్న్నూఱఱ బళియగరుజె యెర్పత్త ఊళయ గణ ఇట్టిగెయెంబూరం.......

(సిందవాడిలోని ఆదవాని యయ్న్నూఱు భాగములోని గరుజె యెర్పత్తూఱులలోని ఇట్టిగె)

(11) శ్రీ మద్దణనాయకం రేచరసకు సన్దవాడి సాయిరమం....... కవతాల హన్నెరకఱ బళియతోహియం.......

(12) శ్రీ మత్కళిచుర్య చక్రవర్తి భుజబల మల్లిదేవ.......కందు కూరిప్పర్త నాల్కయాళగణ కోసగెయహోళం.......

(13) పద్మిదేవరసరుం మహాప్రధానం వత్సరాజ దండనాయకరుం సిందవాడి సాసిరం మొదలాగి పూర్వదిశా భాగమెల్లమం సిందవాడి నాసిరద రాజధాని పట్టణం కీర్తినారాయణ పురద....కంపణంభాగి 12 ఱ బళియ బాడం కంతరికెయంబ గ్రామం....

(14) శ్రీ మన్మహాప్రధానం మాళపరస దండనాయకుడు సింద వాడి సాసిరమనాళుత్త విద్దు........ శ్రీమదగ్రహారం నందా పురత....

(15) శ్రీ మత్కుంతల సింధువాడి విషయే శ్రీ తుంగభద్రానదీ। తస్యాదతుతస్తు యోజనమితః శ్రీ తుంబళ గ్రామసం ॥

(16) భీమదేవరాణెయ్యం సిందవాడియలు ఆదవాని ముఖ్యవాగి కొట్టనాయక వళిత దోళగె....—బసురుకోడను.

(17) సిందవాడి నాడ సంబంధ దల్లి గ్రామగళు నేరళికె, బెంబు గుడి, అరకెఱె, హోలుగుండ.

రాష్ట్రకూట రాజగు రెండవ కృష్ణుని మహాసామంత కణ్ణదేవుని శాసనములో నతడు సిందవాడిలోని మంచాలలో నొక స్థితి సివెనాయకుని కిచ్చినట్లు తెలుపబడినది. ఇదియె సిందవాడిని పేర్కొన్న ప్రాచీన శాసనము (శక. 815)

## శాసనోద్దిష్ట గ్రామ పట్టిక

| | | |
|---|---|---|
| కవతాళు | కౌతాలము | ఆదోని తాలూకా |
| తుంబలి | తుంబలము | ,, |
| ఆదవని | ఆదవాని | ,, |
| గరుజె | గురుజాల | ,, |
| ఇట్టిగె | ఇసివి | ,, |
| కందుకూరు | కందుకూరు | ,, |
| నందాపురము | నందవరము | ,, |
| నేరళికె | నెరణికి | ఆలూరు తాలూకా |
| బెంబుగుడి | బోళగోటి | ,, |
| అరకెఱె | అరికెరె | ,, |
| హోలుగుండ | హోళలగొండి | ,, |
| మంచాల | మంచాల | ఆదోని తాలూకా |
| కోసగెయహాళు | కోసిగి | ,, |
| తోషి | తోవి | ,, |

శాసన వివరముల ననుసరించి, కుంతలదేశములలో సిందవాడి యంతర్భాగమనియు, నియ్యది నేటి కర్నూలుమండలములోని ఆలూరు, ఆదవాని తాలూకాలలో తుంగభద్రానదికి దక్షిణ ప్రాంతమని యూహింపవచ్చును. ఈ సిందవాడిలో ఆదవాని యయ్యూరు గరుజె యెర్బత్తూరు మొదలగు నంతర్భాగములు కలవు. సిందవాడి సాసిరమనగా సిందవాడి వేయియని యర్థము. దీనికి తుంబళము రాజధాని. సిందవాడియను నామము సిందకుల రాజులు పరిపాలించుటచేత దీనికి సిందవాడియను పేరు వచ్చెనని చరిత్రకారుల యభిప్రాయము.

(1) **S. I. I. Vol IX. Part I. Nos** 55, 114. 115, 116, 133, 142, 172, 202, 218, 227, 277, 279, 294, 367, 377, 384, (ఇవి యన్నియు కన్నడ శాసనములు. రాష్ట్రకూట, కళ్యాణి చాళుక్యుల, కాలచుర్యుల, యాదవ రాజుల కాలమునాటివి.)

(2) **I. A. Vol XXX. July 1901.**

## సిరెనాడు

సిరెనాడు అనంతపురము మండలములోని కళ్యాణదుర్గ, మడకశిర తాలూకాలో కొన్ని గ్రామముల యందలి కన్నడ శాసనములం దిష్టిమైనది.

(1) చాళుక్య ప్రభువైన జగదేకమల్లదేవుని సామంతుడగు ఇరుగోళం చోళమహారాజు. గోయడవాడినుండి యేలుచుండగా, ఇరుంగోళ చోళుని సేనాధిపతి యగు కేతన ప్రెగ్గడ సిరెనాటిలోని సుళియ నూరప్పత్తర (70)ము లోని ఎరడుకెఱ గ్రామములోని శంకర స్వామికి కొన్ని పన్నుల మీది ఆదాయము ధారవోసి యిచ్చెను.

(2) మడకశిర తాలూకాలోని హేమావతి గ్రామము నందలి యొక శాసనములో చాళుక్య చక్రవర్తి యగు మూడవ తైలపదేవుని మహాసామంతుడైన త్రిభువన మల్ల మల్లిదేవ చోళ మహారాజు హెంజేరు (హేమావతి) రాజధానిగా అసిరెనా డేలుచుండెనని చెప్పబడెను.

(3) కళ్యాణ దుర్గము తాలూకా మలయాదూరు శాసనములో హేమావతి శాసనమునందు పేర్కొనబడిన పై మల్లిదేవ చోళ మహారాజు హేమావతినుండి రాజ్యపాలనము చేయుచుండగా సిరెనాటిలోని మలెయమూరులో నైదుదేవాలయముల నిర్మించె నని వ్రాయబడెను.

పై విషయములను బట్టి సిరెనాడు ఆంధ్రప్రదేశములోని కళ్యాణ దుర్గ, మడకశిర ప్రాంతము లనియు, దానికి హేమావతి రాజధాని యనియు తెలియుచున్నది. ఈ సిరెనాడె మైసూరు రాష్ట్రములోని మరి కొన్ని శాసనములందును దెలుపబడినది.

(1) S. I. I. Vol IX. No. 233 (శ. క. 1060)
(2) ,, No. 268 (శ. క. 1084)
(3) ,, No. 273 (శ. క. 1101)

## సుప్రయోగ

సుప్రయోగ వాయుపురాణములో సహ్యాపర్వతములనుండి పుట్టిన నదులలో నొక్కటిగా జెప్పబడినది.

గోదావరీ భీమరథీ కృష్ణవేణ్యాంచ వంజులా
తుంగభద్రా సుప్రయోగా కావేరీచ తధాపగా
దక్షిణాపథ నద్యాస్తు సహ్యాపాదాద్వినిఃసృతాః
(వాయుపురాణము, అధ్యాయము 45. శ్లో. 104)

మార్కండేయ పురాణములో సహితము పై విషయమే వక్కాణింప బడినది.

గోదావరీ భీమరథీ కృష్ణావేణ్యా తథాపరా
తుంగభద్రా సుప్రయోగా వాహ్యాకవేర్యధాపగా
సహ్యాపాదాద్వి నిష్క్రాంతా ఇత్యేతాః సరిదుత్తమా॥
(మార్కండేయ పురాణము, అధ్యాయము 54, శ్లో. 26)

మారన తెలుగు మార్కండేయ పురాణములో "గోదావరి, భీమరథి, కృష్ణవేణి, తుంగభద్ర, సుప్రయోగ, కావేరియను నదులు సహ్యాపర్వతము నుండి నుద్భవించె" అని పై శ్లోకమునే భాషాంతరీకరించి యున్నాడు.

మహాభారతము భీష్మపర్వము, అరణ్యపర్వము లందును సుప్రయోగ పేర్కొనబడినది.

వేణోపవేణాభీమాచ బడబాచైవ భారత।
భారతీ సుప్రయోగాచ కావేరీ ముమ్మరాతథా॥
అరణ్యపర్వము. అధ్యాయ 222. శ్లో. 24.

కావేరీం చులకాంచాపి వీణాం శతబలామపి
నీవారాం మహితాంచాపి సుప్రయోగాం జనాధిప॥
భీష్మపర్వము. అధ్యాయము 9 శ్లో. 19.

తిక్కన సోమయాజి యీ భాగముల ననువదించుపట్టున సుప్రయోగకు బదులుగ పెన్నయనియే వ్రాసియున్నాడు పెన్నానదీ తీరభూమి వాస్తవ్యుడైన సోమయాజి, యా కాలమున జనసామాన్యముగా వాడుకయందుండిన "పెన్న" పదమే ప్రయోగించి, వాడుకలో లేని "సుప్రయోగ" పదమును ప్రయోగింపక పోవచ్చును. కావున "సుప్రయోగ" యన్నను, పెన్న యన్న నొక్క నదికే పేరని యూహింప నవకాశము గలదు.

ఆంధ్ర భారతము-(1) భీష్మపర్వము ప్రథమాశ్వాసము-33.

వ॥ "గంగయు తుంగభద్రయు వేత్రవతియు, వేదవతియు, కృష్ణవేణియు బెన్నయు. యమునయు, తమసము, శరావతియు కావేరియు గోదావరియు"

(2) అరణ్యపర్వము. ద్వితీయాశ్వాసము-278

వ॥ పెన్న యను మహానది నాడిన మయూరహంస విమానగతు లగుదురు. గోదావరీ స్నానంబు నేసిన దశాశ్వమేధ ఫలంబు వడయుదురు.

సుప్రయోగ పల్లవ యువరాజు విష్ణుగోపుని ఉరువుపల్లి శాసనమును. తెలుగు చోడుడగు పుణ్యకుమారుని మాలెపాడు శాసనమునందును జెప్ప బడినది.

ఉరువుపల్లి శాసనములో

ఏతస్మిన్ గ్రామసీమేద్విశతం సీమనివర్తనాని
ఏతేషాంనివర్తనానాం అవధయః
దక్షిణాందిశి సుప్రయోగనదీ అవధిః

మాలెపాడు శాసనములో

ఆత్రేయగోత్రాయ చిరువనహాళ కేశవశర్మణే
హిరణ్యరాష్ట్రే సుప్రయోగనద్యా దక్షిణతీరే
బీరపాఱు నామగ్రామిః

అని హిరణ్యరాష్ట్రములో సుప్రయోగ ప్రవహించుచున్నదని వ్రాయ బడినది.

(1) ఉరువుపల్లి శాసనము I. A. Vol V. P. 50.
(2) మాలెపాడు శాసనము E. I. Vol. XI.
(3) బుచ్చిరెడ్డి పాలెము శాసనము. (శ్రీ సోమశేఖరశర్మగారిచే పరిష్కృతను) T. M. U. Vol. XII.
(4) T. O. R. Vol. XII. part IV.

## సువర్ణముఖి

ఉత్తరార్కాడు మండలములో చంద్రగిరి కొండలలో అగస్త్యాచల సమీపమున నుద్భవించి, చంద్రగిరి తాలూకాలో ఆగ్నేయ మూలముగా ప్రవహించి, తూర్పుముఖమై పెన్నానదికి సమదూరముగా కాళహస్తి, వెంకటగిరి తాలూకాల మధ్యనుండి పారి, రేణిగుంట సమీపమున రాళ్ళ కాల్వతో గలుసుకొని, సూళూరుపేట తాలూకాలో ఈశాన్యమూలగా పోయి, గూడూరు తాలూకాలో తూర్పుగా ప్రవహించి, సిద్ధవరము సమీపమున పూర్వసముద్రములో గలియుచున్నది.

శ్రీ కాళహస్తి మహాత్మ్యములో ధూర్జటికవి యీ సువర్ణముఖ నదీ జనన ప్రకారము వర్ణించియున్నాడు. అగస్త్యమహర్షి దక్షిణ తీర్థాయాత్రకు భార్యాసమేతుడై వెడలి సిద్ధవటనాథుని గూర్చి, యీ ప్రాంత భూముల పుణ్యనదీ ప్రవాహములేని కతమున నచ్చటి మునులచే నొకనది ప్రవహింప

వేడుకొనబడి, సిద్ధవటక్షేత్రమునకు జతుర్యోజన మాత్రమున నొక్క కొండచెంత ఘోర తపస్సుచేయగా పరమేశ్వరుని యాజ్ఞ చొప్పున బ్రహ్మ నతని యెదుట ప్రత్యక్షమై వరమేదియేని వేడుకొమ్మనెనట.

ఉ. ఏనజుడన్ మునీంద్ర! వరమేశుడునీకు నభీప్సితంబున
న్నీనియమించి పంచె, వరమెయ్యది వేడుమటన్న నభ్రగం
గానదితెచ్చి యిచ్చట నఖండగతిం బ్రవహింపజేయవే!
దానమనోరథంబు ఫలితంబగు నాకు బయోజసంభవా

ఉ. నావుడుదమ్మిచూలి గగనంబుగనుంగొనగా సువర్ణశో
భావిభవంబుతో బహుళభంగ మహోముఖరత్వ సంపదన్
దేవనదీ ఝరంబు సనుదెంచినగాంచి విరించి తద్గుణ
శ్రీవెలయన్ సువర్ణముఖరిప్రథ దానికి గల్గజేయుచున్.

శా. అంతర్ధానముసేసె, సంయమికులాధ్యక్షుండు సంతోషిత
స్వాంతుడయ్యె; వహించెనగ్గిరి యగస్త్యగ్రావ విఖ్యాతి; నా
శాంతంబుల్ పగులంగ మ్రోయుచు నభంబాద్యంతమున్ శీకరా
క్రాంతంబై మెఱయున్ సువర్ణముఖరి గంగానదీ రత్నమున్.

శ్రీ కాళహస్తి మహాత్మ్యము.
ప్రథమాశ్వాసము పద్యములు 139; 140; 141.

ఆకాశమునుండి గంగ సువర్ణశోభతో భూమికి డిగ్గినందున, ఈ నదికి సువర్ణముఖి యని పేరు వచ్చెననియు, నా నది పుట్టిన కొండ ప్రాంతమునకు అగస్త్యాచలమని పేరు వచ్చెననియు పై వర్ణనములోని భావము. ఈ నది నెల్లూరుమండలములలో దక్షిణప్రాంతమున ప్రాచీనదేశ విభాగమగు పడ నాటి మధ్య ప్రవహించుచున్నది.

## హరుహనాడు

పరిగి, పరువి విషయమునకే హరుహనాడని పేరు. అనంతపురము మండలములో హిందూపురము తాలూకాలోని పరిగి గ్రామములోని యొక కన్నడశాసనములో (శ. స. 1100) హోయిసల రెండవ వీరబల్లాలదేవుడు హరువె (పరిగి) తటాక సమీపముననున్న గురుగుంజి కోలబయలులోని భీమే శ్వర స్వామికి యొక ఘంట దానము చేసెనని గలదు.

S. I. Vol IX. Part I. No. 318. (క్రీ. శ. 1178)

హిరణ్యరాష్ట్రము

ఇయ్యది పుణ్యకుమారుని మాలెపాడు తామ్రశాసనమునందు పేర్కొనబడినది.

"తస్య ప్రియోభ్రాతా పౌరుషరామ పురుషశార్దూల మార్దవచిత్త మదన విలాసాద్యనేక నామధేయః శ్రీమాన్ పుణ్యకుమారా నామ నృపతి రభవత్ । అసౌహిరణ్య రాష్ట్ర సహితాన్ స్వరాష్ట్ర నివాసినస్సర్వాన్ ఇత్థమాజ్ఞాపయతి । అత్రేయ గోత్రాయ చిరువనహాళ కేళవశర్మణే హిరణ్య రాష్ట్రే సుప్రయోగ నద్యా దక్షిణతీరే బీరపాఱు నామగ్రామః ॥ (1)

పై నుదాహరింపబడిన సుప్రయోగ పినాకినీనది (పెన్న) యేయని శాసన పరిశోధకుల నిర్ణయము (చూడుడు-సుప్రయోగ) చిరువనహాళమే ఆత్మకూరు (నెల్లూరు జిల్లా)లోని చిరుమనగ్రామము. బీరపాఱు ఆ తాలూకాలోని బిల్లుపాడు గ్రామము. కావున నీ రాష్ట్రము నెల్లూరు మండలములోని ఉత్తర పశ్చిమ భాగములని పరిశోధకుల సిద్ధాంతము.

ఈ హిరణ్య రాష్ట్రమె, రాష్ట్రకూట రాజన్యుల పుష్పగిరిలోని యొక కన్నడ శాసనములో హొన్నమాడి యనియు, ఈ హొన్నమాడిలో ముదికినాడు గలదనియు జెప్పబడినది. కన్నడములో హోన్నమనగా సువర్ణము. మాడిపదము పాడి, లేక రాష్ట్రమునకు దేశ్యపదము, రాష్ట్రకూట రాజగు కృష్ణ కన్నిహదేవుడు జోతియాత్రకు వెడలి వచ్చుచు హొన్నమాడిలోని ముదికినాటి యందలి పుష్పగిరిలోని నాగేశ్వర, సర్వేశ్వర దేవాలయములకు కొంత భూమిని దానముచేసెనని యా శాసనమునందు వ్రాయబడినది. (2)

హిరణ్య రాష్ట్రమున కా నామము, హైరణ్యాకులను తెగవారి ప్రాంతమున నివసించియుండుటచే గల్గియుండవచ్చునని యూహింపబడుచున్నది. (3)

(1) Mallepadu Inscription E. I. Vol XI. No. 35.
(2) S. I. I. Vol IX. No. 69.
(3) Para 7 of M. E. R. 1935-36.



**అనంతగిరి (దుర్గము-సీమ)**

ఇయ్యది తెలుంగాణములోని గిరిదుర్గములలో నొకటి. నల్గొండ జిల్లాలో హుజూరు నగర తాలూకాలో నున్నది.

శ్రీకృష్ణదేవరాయలు పూర్వదిగ్విజయ యాత్రకు వెడలినపుడు వశపఱచు కొనిన దుర్గము పదునేడవ శతాబ్ద ప్రారంభము నాటి గోలకొండ నవాబుల శాసనములో పేర్కొనబడిన ఆంధ్రప్రదేశములో వారి యాధిపత్యముననున్న సీమలలో నొకటి. ఆ శాసనములో నల్లగొండ, కొండపల్లి, ఓరుగల్లు, అనంతగిరి మొదలగు సీమలు పేర్కొనబడినవి.

(1) కృష్ణరాయల తిరుపతి శాసనము. No.80. Vol III. (శ.స.1434)
(2) A.R.E. 1943-44; 1944-45. P.93. Hyderabad Wazriabad Dt. Vadapalli. No. 55. (శ.స. 1528); No. 56. (శ.స. 1530)

**ఉంద్రకొండ**

కృష్ణదేవరాయలు సాధించిన తెలుంగాణ్య దుర్గములలో నొకటి. నల్గొండ జిల్లాలో నున్నది

గోలకొండ సుల్తానుల రాజ్యకాలమున వారి పాలనములోనున్న ఆంధ్ర దేశపు సీమలలో నొకటి.

A.R.E. 1943-44; 1944-45; No. 55-56. (శ.స. 1528; 1530)

**ఉజ్జలి**

తెలుగాణములోని మహబూబునగర జిల్లా మక్తల తాలూకాలోని పురాతన గ్రామము. ఇచ్చట నొక కోట యుండెననియు, నియ్యది కల్లకెళగు నాడుకు రాజధాని యని కళ్యాణి చాళుక్యుల నాటి కన్నడ శాసనముల బట్టి తెలియుచున్నది.

తెలుంగాణ శాసనములు. సంపుటము 2.
కళ్యాణి చాళుక్య శాసనములు. సంఖ్య 34, 35.
(భూలోకమల్ల, వీరసోమేశ్వర దేవుని కాలము)

## కొయ్యలకొండ

తెలుగాణములోని మహబూబునగరము జిల్లాలోని గిరిదుర్గము. పదునారవ శతాబ్ద మధ్యమమున గోల్కొండనేలిన కులీకుతుబ్‌షాహా దీని నాక్రమించుకొనెను. ఈ విషయము అద్దంకి గంగాధరకవి తన తపతీసంవరణో పాఖ్యానములో నిట్లు వర్ణించి యున్నాడు.

"పడమటసవాయి బసవనిగా జేపి
యచట గొయ్యలకొండ నావరించె"

ఇబ్రహీం కుతుబుషాహి కాలమున నీకోట పునర్నిర్మితమైనది.

## చరిగొండసీమ

తెలుగాణములోని సీమలలో నొకటి. అప్పకవీయమను లక్షణ గ్రంథములో కాకునూరి అప్పకవి తన తాతకు తాతయైన సోమయ్య చరిగొండ సీమలోని కాకునూరు అగ్రహారమును, నిడుదవెల్లి, బొద్దినేపల్లి నవదళవురి అను గ్రామములో మాన్యక్షేత్రముల సంపాదించెననియు దద్గ్రంథ పీఠికలోని సీసపద్యములో వర్ణించెను.

సీ. బాలుడై కాశికా పట్టణంబునకేగి
బ్రహ్మేంద్రు నొద్ద శాస్త్రములు చదివె
బ్రహ్మరాక్షసుతోడు గ్రమము చెప్పంబడి
కట్టిన గండభాగంబు నొందె
చరికొండసీమలో సంతరించెను కాకు
నూరన సర్వాగ్రహార మొకటి
నిడుదవెల్లిని బొద్దినేపల్లిని వరద
వురిలి మాన్యక్షేత్రముల గడించె

తే. నవని సర్వజ్ఞుడగుట గంగాంబికాభి
రాముడగుటను నిక్కంబు సోముడనగ
మనియె నిల గాకునూరి తిమ్మయసుతుండు
సోముడభినవచూత సద్గ్రామమునకు.

పైని సూచింపబడిన గ్రామములు కాకునూరు, నిడుదవెల్లి, బొద్దినేపల్లి, అభినవచూత గ్రామము (లేమావడి) నేటి మహబూబునగరము జిల్లా నగరము తాలూకాలో గలవు. చరిగొండ కల్వకుర్తి తాలూకాలో నున్నది. ఈ చరిగొండసీమ హైదరాబాదు జిల్లాను జేరియున్న మహబూబునగర జిల్లా ఉత్తర ప్రాంతము.

సారస్వత వ్యాస ముక్తావళి శ్రీ మూర్గుల రామకృష్ణరావు.

## చిలుక సముద్రము

ఇయ్యది నేటి ఒరిస్సా రాష్ట్రములోని గంజాము మండలములో నున్నది. కాశీఖండ పీఠికలో దీనిని కీరాంభోనిధి యనియు, చిల్కాసముద్ర మనియు రెడ్డిరాజుల దిగ్విజయ వర్ణమునందు శ్రీనాథమహాకవి చెప్పియున్నాడు.

శా. ఔరా! యల్లయరెడ్డి దొడ్డవసుధాధ్యక్షుండు ధాటీచమూ
భేరీభాంకృతి ఘోరఘోషమున నిర్భేదించె నొడ్డాది శృం
గారంకోటయు లోతుగడ్డయును నుద్ఘాటించె నత్యుద్ధతిన్.
**కీరాంభోనిధి** దిక్తటంబునన్నిలిపె దిక్సీమా జయస్తంభమున్.

ఉ. ప్రాకట విక్రమస్ఫురణ రాజమహేంద్రము రాజధానిగా
నేక సితాతపత్త్రమున నేలెను వీరనృపాలుడుత్తమ
శ్లోకుడు వేమశౌరియనుజుండు సమున్నత వైభవాఢ్యుడై
చీకటియున్ గళింగయును **జిల్కాసముద్రము** సింహశైలమున్.

## చీరమాగాణి

అనంతపుర మండలములోని ధర్మవరము తాలూకాలో నున్న కొన్ని గ్రామములందలి విజయనగర రాజ్య కాలమునాటి తెలుగు శాసనములలో పేర్కొనబడినది. ఇది గుత్తి రాజ్యములోని యంతర్భాగము. ధర్మవరము తాలూకా ప్రాంతము.

(1) గుత్తి రాజ్యములోని చీరమాగాణి యందలి చిగులరేవు.

(2) గుత్తి రాజ్యములోని చీరామాగాణి యందలి విజయభూపతి పురమనే సగలగ్రామము,

(3) గుత్తి రాజ్యములోని చిరమాగాణి.

(1) A. R. E. 1925-26. No. 309. (శ. స, 1451)
(2) ,, ,, ,, 295. ,,
(3) ,, ,, ,, 305. (శ. స. 1551)

## జగ్గయ్యపేట

కృష్ణా జిల్లా నందిగామ తాలూకాలో నున్న ప్రాచీన బౌద్ధనిలయము. ఇచ్చటి ప్రాచీన బౌద్ధస్తూపములు, సంఘారామములు చైత్యములు మొదలగునవి గ్రామసమీపముననున్న యొక కొండపై గలవు. స్తూపపురాతిపై చెక్కిన ప్రాకృత శాసనముల బట్టి యీస్తూపము అమరావతి భట్టిప్రోలు స్తూపముల వలె మౌర్యుల కాలము నాటిదని యూహింపబడినది. ఇయ్యది ఇక్ష్వాకు రాజన్యుల కాలమున వృద్ధిచేయబడి నట్లిచ్చటి శాసనమువల్ల తెలియనగును.

**Burges – Stupas at Amaravati and Jaggayapet.**

## దేవరకొండ (రాజ్యము - సీమ)

దేవరకొండ తెలుగాణములోని సుప్రసిద్ధమైన గిరిదుర్గములలో నొకటి. నల్గొండ జిల్లాలో దేవరకొండ తాలూకాకు నేటి ప్రధాననగరము రేచెర్ల వెలమప్రభువుల కాలములో నధిక ప్రాభవము గాంచిన చిన్నరాజ్యము. అనపోతానేడు, మాదానేడు సోదరులలో అనపోతానేడు రాచకొండ ప్రాంతమను, మాదానేడు దేవరకొండ ప్రాంతమును నేలుచు, వారి సంతతుల వారు సహితము అట్లే పరిపాలనము సాగించుచుండిరి. "ఈ దేవరకొండ యత్యున్నతమగు నేడు పర్వతముల జుట్టిన మహోన్నత శిలాప్రాకారత్రయముచే బరివృతమై, యతిదుర్గమమై మిగుల శత్రురాజ భయంకరమై యున్నది."

ఇయ్యది గోలకొండ రాజ్యాంతర్భాగమై, తద్రాజ్యమందలి సీమలలో నొకటిగ పదినేడవ శతాబ్దారంభము నందున్నట్లు వాడపల్లి శిలాశాసనమును బట్టి తెలియుచున్నది.

(1) వెలుగోటివారి వంశ చరిత్రము పుట 48.
(2) A.R.E.1943-44; 1944-45 (శ.స.1528-1530) Nos. 55,56.

## ధనదుపురము (ప్రోలు)

ఇయ్యది గుంటూరుమండములలోని రేపల్లెతాలూకా యందలి చందవోలను గ్రామమునకు ప్రాచీననామము. శాసనములలో ధనదప్రోలు, ధనదపురము, సనదవ్రోలు అని వ్రాయబడినది. మంచెనకవి కేయూరబాహు చరిత్రములో దీనిని వర్ణించియుండెను.

(1) "ధనదపుర మధిష్ఠాయ పండేశనామ్నె"
(2) "ధనదప్రోలి పండీశ్వర దేవరకు"
(3) "ధనవ్రోలి శ్రీ పండీశ్వర దేవరకు"
(4) "ధనదేశ్వరస్య పుర సద్వృత్తోన్నతో ... సనదవ్రోలు నామాతి రమ్యాపురి"

కేయూరబాహు చరిత్రములో ధనదపుర వైభవము నిట్లభివర్ణింపబడినది

సీ. పుష్పకనివహంబు భూమిపైనిలచిన
యట్లుంద మైన దేవాలయములు
రూప్యాచలము బహురూపంబునటించు
రమణశోభిల్లు సౌధములపెల్లు
అలకాధిపతి నిధులన్నియు వెలివీట
విడిసినక్రియ బణ్యవీథికలును
ధాత మేదిని మిన్నుదఱిగి వైచిన మాడ్కి
గనుపట్టు బహుతటాకముల సొంపు

గీ. నుపవనంబులు సరసులు నొప్పచేయు
చెఱకుదోటలు ప్రాసంగుచేలు మెఱయ
నఖిల విభవంబులకు నెలవగుచు వెలయు
ధనదుపురమున కెనయన దనదుపురము.

గీ. మంటికడవ నులకమంచంబు పూరిల్లు
నూలిచీర రత్నకీలితంబు
గాని పైడి తొడవు గలుగుటెఱుంగరు
ధనదుపురములోని జనము లెల్ల

(1) E. I. Vol VI. బుద్ధరాజు చందవోలు శాసనము. పుటలు 268 278 (శ.స. 1098)

(2) S. I. I. Vol IV. No. 1130 (శ.స. 1079)

(3) S. I. I. Vol VI. No. 210. (శ.స. 1090)

## ధరణికోట (చూడుడు-అమరావతి) ధాన్యవాటి

ఆంధ్ర దేశముకందలి పురాతన పట్టణములలో నత్యంత ప్రఖ్యాతిగాంచిన నగరములలో నొకటి దీనికి ప్రాచీన ప్రాకృత శాసనములలో ధమ్ణకడ, ధమ్ణకట, ధమ్ణకటకమని పేర్లు గలవు. చైనా యాత్రికుడగు హౌనుత్సాంగు దీనిని సందర్శించి యీ ప్రదేశమును వర్ణించి యున్నాడు. అతడు ఆంధ్ర దేశమును వీడి యడవులగుండా దక్షిణపు దిక్కునకు ప్రయాణమై తే-న-క-చె-క దేశమును బ్రవేశించెను. ఇయ్యది సారవంతమైన ప్రదేశము. పంటలు సమృద్ధిగ పండును. పట్టణములు స్వల్పముగనున్నవి. జనులు నల్లటి వారు ఇక్కడ బౌద్ధమఠములు పెక్కులుగలవు గాని, వానిలో నిరువదిమాత్రమే మహాసంఘిక శాఖకు జెందిన బౌద్ధ బిక్షుకులు వేయిమంది కలరు. ఇక్కడ ఇతర మతములకు జెందిన వారును, వారి దేవాలయములు గలవు. ఈ ప్రదేశమునకు తూర్పున బూర్వశైల సంఘారామమును, పశ్చిమమున నపరశైల సంఘారామమును గలవు. ఈ దేశమునకు మహాంధ్రమను పేరు గలదు. దీనికి ధనకటకమె రాజధాని.

ఇయ్యది నాగరాజులకును, శాలివాహనులకు రాజధాని. దీనికి తర్వాతి కాలము నాటి తెలుగు శాసనములలో ధాన్యవతీపురమనియు, ధాన్యకటకమనియు, ధాన్యాంకపురమనియు నామాంతరములు గలవు. షట్సహస్రావనీ నాథులమని చెప్పుకొన్న కోట (ధరణికోట) మండలేశ్వరులకు రాజధాని.

పదునాల్గవ శతాబ్దములోని యొక శాసనములో దీనికి దంన్నాలకోట స్థలమనియు దీనిలో నమిలికల్లు కలదనియు జెప్పబడినది. కేతన దశకుమార చరిత్ర ద్వాదశాశ్వాసము చివర భాగమున రాజవాహన నృపతి రాజ్యపాలనమున నతని రాజ్యమంతయు ధాన్యకటకమయ్యెనని చమత్కరించియున్నాడు.

తే. రాజవాహన నృపతి ధర్మమున రాజ్య
పాలనము చేయునెడ బ్రజ పరమసుఖము
గదిరి ధరయెల్ల శ్రీ ధాన్యకటకమయ్యె
నతని కీర్తులు పాల్పొంగినట్లు వెలసె.

ధాన్యకటకమును బేర్కొన్న ప్రథమాంధ్రకవి కేతన.

(1) E. I. Vol X. Luder's list Nos. 1205, 1225, 1271.
(2) Thomas Watters on Yuan Chwang Vol II. P. 214.
(3) 'శ్రీధాన్యవాటీకటక', S. I. I. Vol IV. No. 939.
'శ్రీ ధాన్యకటకపురవర', ,, No. 976.
(4) S. I. I. Vol X. No. 533. (శ. స. 1275)

## నల్గొండ (సీమ)

తెలుగాణములోని నల్గొండమండలము నందలి నల్గొండ తాలూకా కేంద్ర స్థానము. ఇక్కడ ప్రఖ్యాతిగాంచిన గిరిదుర్గములలో నొకటి నల్గొండ గ్రామము రెండుకొండల మధ్యనున్నది. దీనికి ప్రాచీన నామము నీలగిరి. అల్లాయుద్దీన్ బహమన్‌షా దీనిని స్వాధీనపఱచుకొనిన తర్వాత నల్గొండయను నామమె పరిఢవిల్లెను. బహమనీరాజ్య పతనానంతరమిది యొక సీమకు ప్రధానస్థానమై, గోలకొండ కుతుబ్‌షాహీల పాలనమునం దుండెను.

A.R.E. 1943-44; 1944-45 వాడపల్లి శాసనములు.
Nos. 55-S' 1528, గోల్కొండ సుల్తానుల శాసనములు.
No. 56-S' 1530.

# నాల్గవ ప్రకరణమునకు
# అనుక్రమణిక